# బాల ప్రౌఢవ్యాకరణ దిగ్దర్శిని



– డా|| అంబడిపూడి నాగభూషణం

# కా ను క

మాట అందని, మనసు నిండిన,

మంచిఅనుచరుల్, చిరంజీవులు

కళ్లేపల్లి శ్రీరామమూర్తి
చల్లా రాజారాం
వేదాంతం నరసింహమూర్తి

ఆత్మీయతకు

# కృతజ్ఞతలు

జననీజనకు లాదిలక్ష్మీప్రసాదులకు సాష్టాంగప్రణతులు.

లక్షణానురక్తిఁ గొలిపిన పూజ్యగురువర్యులు,

శ్రీ కోశవోలు రామబ్రహ్మంగారికి పాదాభివందనములు.

ఈ గ్రంథముకూర్పులో సహకరించిన

తత్తద్గ్రంథములకు, తత్కర్తలకును,

ఈ వ్యాసంగమునఁ బ్రోత్సహించు పెద్దలకు,

సహకరించుమిత్రులకు,

ముద్రించిన శ్రీ లక్ష్మీగణపతి ప్రెస్సువారికి.

కృతజ్ఞతలు.

బాలప్రౌఢవ్యాకరణములందలి విద్యార్థులకు మాత్రము, అత్యవసరమని యుక్తము తోఁచినవ్యాసములు, అందలిముఖ్యపదములవివరణము నిందు కూర్పఁబడినది. రూపప్రక్రియాభాగ మతివిస్తృతమై గ్రంథ విస్తృతిహేతు వగుటఁ దన్మార్గము, పరీక్షల నుద్దేశించి కాక యథార్థము తెలియుటకు మాత్ర మించుక చేర్పఁబడినది.

# బాలప్రౌఢవ్యాకరణ విమర్శిని విషయసూచిక

# బాలప్రౌఢ వ్యాకరణ దర్శిని

## 1. వ్యాకరణము - ప్రయోజనములు

**వ్యాకరణము :**

'వ్యాక్రియన్తే శబ్దా అనేన ఇతి వ్యాకరణమ్'. శబ్దములను వ్యాకరించునది వ్యాకరణము. వ్యాకరణము అనగా విభజించి చూపుట. ప్రకృతి, ప్రత్యయములు మొదలగు అనువిధముగా విభాగము చేసి శబ్ద (భాషా) స్వరూపమును నిరూపించునది వ్యాకరణము.

లక్షణము వ్యాకరణము. లక్ష్యములును, వ్యాఖ్యానమును కూడ వ్యాకరణముగా గ్రహింపవచ్చును. (శబ్ద) అనుశాసనము, లక్షణము మొదలగు పేర్లతో ఈ వ్యాకరణము వ్యవహరింపబడును.

**వ్యాకరణప్రయోజనము :**

రక్షా మొదలగువానిని వ్యాకరణమునకు ప్రయోజనములుగా పతంజలిమహర్షి చెప్పెను. అందు కొన్ని సంస్కృతమునకే చెందును. ఆంధ్రవ్యాకరణప్రయోజనములు కొన్నిటిని ఆంధ్ర లాక్షణికులును చెప్పిరి. అన్నింటిని సమన్వయించుకొని ఆంధ్ర వ్యాకరణమునకు ప్రయోజనము ఇట్లు గ్రహింపవచ్చు.

**భాషను సులువుగా నేర్చుట :**

వ్యాకరణము భాషయొక్క స్వరూపమును నిరూపించును. కావున భాష స్వరూపము తెలుపుట వ్యాకరణమునకు మొదటి ప్రయోజనము. కావ్యాదులగు లక్ష్యగ్రంథములనుండియు భాషను తెలియవచ్చును. కాని విస్తారమగు లక్ష్యప్రపంచము నెల్ల పరిశీలించి భాషను తెలిసికొనుట మిక్కిలి కష్టము. వ్యాకరణ మంత శ్రమ లేకుండ తెలుపును. ఇది ఇప్పు అనుభవముగా లోకమునందలి ఆవుల

నెల్ల వేర్వేరుగా చూసి తెలిసికొనుటకంటె ఈలక్షణములు గలది **ఆవు** అని తెలిసిన గోజాతి యంతయు సులువుగా తెలియబడును గదా.

చిన్నయసూరి బాలవ్యాకరణపీఠికలో "భాషాసమష్టికి లక్షణ గ్రంథము కుదిరినపక్షమం దంత శ్రమపడఁ బనిలేదు. తుదముట్ట సర్వలక్షణపరిజ్ఞానము లక్ష్యపరిజ్ఞానముచేతనె సాధించుట మిక్కిలి దుష్కరము". అని పేర్కొనుట గమనింపవచ్చును.

అనగా భాషను సులువుగా నేర్పుట వ్యాకరణమునకు ప్రయోజనము. అందుకే నేడు సైతము ఆంగ్లము మొదలగుభాషలను నేర్పునపుడు వ్యాకరణమును గూడఁ గలిసి చెప్పుట గమనింపవచ్చును.

**సందేహనివారణము :**

శబ్దస్వరూపాదులనుగూర్చిన సందేహములను నివారించుట వ్యాకరణమువలనిమఱొక ప్రయోజనము. కొన్ని చిన్న **విషయ** ములందు సయితము సామాన్యులవలన పెద్దలు సైతము భ్రమ ప్రమాదములకు లోనగుట సంభవింపవచ్చును. పోయెన్, **యవత** అనుకీతి ప్రయోగము లిట్టివే. యేమి, వ్రుండదు మొదలగురీతిని తెలుగుపదములమొదట **యకారము** వృప్రాపోనో ఉచ్చరింపఁబడు చున్నవి. 'యకారంబును వృప్రావోలును దెలుఁగుమాటలకు మొదట లేవు' అనులక్షణ మాదోషమును వారించును. ఇట్లె 'కృష్ణ శనగ' అని వ్రాయుట గలదు. ఋ, శ మొద లగు అసాధారణవర్ణములు అచ్చ తెలుఁగులో లే వని వ్యాకరణమువలన తెలిసి కొని 'క్రిష్ణ సెనగ' అనుకీతిని సాధురూపములుగా నిశ్చయించు కొనవచ్చును. ఇట్లుచ్చారణము, కావ్యవ్యవహారము మొద లగు వానింట భిన్నరూపదర్శనముచే నేర్పడినసందేహమును వ్యాకరణము వారించును.

**కావ్యభాషావగతి :**

వ్యాకరణము ప్రయోగశరణము. కవిప్రయుక్తము లగుశబ్దములకే వ్యాకరణము లక్షణము చేయును. చిన్నయసూరి బాలవ్యాకరణ పీఠికలో 'పెక్కులక్ష్యములు సావధానముగా పరిశీలించి సూత్రగ్రంథము వ్రాసి'నట్లు పేర్కొనెను. ప్రౌఢవ్యాకర్తయు కవిప్రయోగములలోనే లక్షణ మేర్పఱచుట స్పష్టము.

వ్యవహారమునం దున్న భాష జనుల నోళ్ళలో పెక్కులు మార్పులకు లోనగుచు క్రమముగా ప్రాచీనరూపముకంటె వింతగా మారును. కొన్నియెడల వ్యవహారము తీరె మారవచ్చును. అట్టియెడల కావ్యభాష భిన్నమైయుండగా దానిని వ్యాకరణమువలననె తెలియవలసియుండును. ఉదాహరణమునకు రామున్ని, వస్తాడు మొదలగునవి వ్యవహారమునం దుండగా రామునిని వచ్చువాండు (లేదా రాఁగలఁడు) అనునవి కావ్యములం దుండు.

ఇట్లు శబ్దస్వరూపమునకే కాక అర్థస్వరూపమున నైనను భేదము గల్గుచో ప్రాచీన (కావ్య) రూపమును (దిద్దివేయకుండ) సముచితముగా గ్రహించుటకు వ్యాకరణమే ఆధారము.

ఉదాహరణకు 'ద్రోణుండు ధనుర్వేద మగ్నివేశులతోడ నర్థిఁ గఱచి' అని ప్రయోగము. నేటివ్యవహారము ననుసరించి దీనికి ద్రోణుడు, అగ్నివేశుడు సహాధ్యాయు లని అర్థ మగును. 'ఉపయోగంబునం దాఖ్యాతకుం దోఁడవర్ణకం బగు' అనులక్షణము ననుసరించి అగ్నివేశుడు ద్రోణునకు గురువు అనుయథార్థము లభించి ప్రయోగమునందలి ఔచిత్యము తెలియనగును.

ఇట్లు ప్రాచీనరూపములను చెఱుపకుండ రక్షించుట వ్యాకరణమువలని ప్రయోజనము.

**సాధుశబ్దవివేకము :**

తెలుగునకు వ్యాకరణము రచింప వలసినఅవసరమును పేర్కొ-

నుచు చింతామణి 'సంస్కారార్థో నియమః' అనెను. శబ్దసంస్కారము వ్యాకరణమునకు ప్రయోజనము. వ్యాకరణముచే సాధు-అసాధు శబ్ద వివేకము గలుగును. వ్యవహారమునం దున్న భాషలకు దీనియవసర మింకను నధిక మనిపించెడి.

కూంతురులు కూంతుళ్లు కూంతురిని నిత్యాది రూపంబులు గ్రామ్యంబులు. చేతుదు కోతు రిత్యాదు లసాధువులు. ఉంచి-సాధుకవిప్రయోగార్హంబు కాదు. ఇత్యాదిగా చిన్నయసూరి లోకవ్యవహారమునం దున్నవి. కొన్నియెడల కావ్యముల కెక్కినవి కూడ ప్రామాణికప్రయోగములనుబట్టి అసాధువులుగా పేర్కొ-నెను. అన్నకో-మున్నగువాని విషయమున ప్రౌఢవ్యాకర్తయు నామోదము తెలుపలేదు.

ఇట్లు కావ్యప్రయుక్తమయినను గ్రహింపరానిదగుట, వ్యవహారమునం దుండియు కావ్యమున ప్రయోగింపరానిదగుట మొదలుగా సాధు-అసాధుశబ్దవివేకము వ్యాకరణసిద్ధము. దీనివలన అసాధుశబ్ద ప్రయోగము చేసి అవమానముపాలు గాకుండుట, పండితసభలలో ప్రవేశార్హత సంపాదించుట మొదలగు ప్రయోజనములు వ్యాకరణమువలన సిద్ధించెడిని.

**కృత్తద్ధితాదిజ్ఞానము :**

కృత్తులు- తద్ధితములు- వానియర్థములు అట్లే విభక్తులు వాని యర్థములు మొదలగుభాషావిషయములు కేవలము వ్యాకరణము వలననె తెలియు ననుటలో సందేహము లేదు.

ఇట్లు వ్యాకరణము భాషయొక్క లక్షణస్వరూపము నావిష్క-రించుచు. అజ్ఞేతను సంస్కారవంతుని చేయుచు భాషపై అధికారమును, తద్వ్యాలమున గౌరవమును కలిగించుచు మిక్కిలి ప్రయోజనవంత మైయున్నది.

## 2. ప్రయోగశరణం వ్యాకరణమ్

వ్యాకరణము ప్రయోగమును ఆశ్రయించియే యుండును. అనగా కవిప్రయోగమున కనుగుణముగనె వ్యాకరణము చెప్పబడు నని యర్థము.

లక్ష్యము లేకుండ లక్షణము ఏది అయినను పుట్టుట అసంభవము. 'ఆవు' అను జంతు వొకటి ఉన్నపుడు 'నాలుగుకాళ్లు కలిగియుండుట' మొదలుగా దానిలక్షణమును ఏర్పరచుటకు వీలు కలుగును. అసలు ఆవే లేనిచో 'ఈలక్షణములు కలది ఆవు' అని లక్షణము చేయుట ఎట్లు సంభవించును ?

అట్లే భాషకు కూడ లక్ష్యము లేనిదే లక్షణము ఏర్పడదు. ఆలక్ష్యము కవిప్రయోగము. రాముడు+అతడు=రాముడతడు. అనువిధముగా సంధి జరుగుట కవిప్రయోగములం దున్నది. కావునని 'ఉత్తున కచ్చు పరం బగునపుడు సంధి యగు' అని లక్షణము చేయబడినది. వచ్చియిచ్చెను అనువిధముగా కవిప్రయోగములలో సంధి లేదు గావుననే 'క్త్వార్థంబైన యిత్తునకు సంధి లేదు' అని లక్షణము చేయబడినది. అట్లే కానిచో ఒకచోట సంధి అగు ననియు వేరొకచోట సంధి లే దనియు, మరియొకచోట మరియొక కార్యమును చెప్పుట ఎట్లు ? చెప్పిన నది స్వీకరించుట యెట్లు ?

**ప్రయోగమూలకత్వము :**

బాలవ్యాకరణమున పీఠికలో చిన్నయసూరి స్వయముగా 'పెక్కులక్ష్యములు సావధానముగా పరిశీలించి రచనాప్రణాళిక నిర్ణయించికొని' తా నొకలక్షణగ్రంథమును రచించినట్లు పేర్కొనెను. దీనినిబట్టి లక్షణమునకు కవిప్రయోగమె మూలముగా సూరియు స్పష్టము చేసిన ట్లయినది. 'ఒకానొకచో ననుటచే ప్రయోగవైరళ్యంబు సూచింపబడియె'. మొదలగు వివరణము లిట్టివె.

శబ్దరత్నాకరము నిర్మించుటకై సంపాదించిన కవిప్రయోగము

లందలివి శేషములు సింహావలోకనమునకై త్రిలింగలక్షణ శేషము రచించుచున్నట్లు ప్రౌఢవ్యాకర్తయు నిట్లే స్పష్టము చేసెను.

కావున కవిప్రయోగములం దాయాశబ్దము లేయేతీరుగ ఉన్నవో చూచి అవి ఆతీరుగ ఉండు నని వ్యాకరణము పేర్కొనును. కావున ప్రయోగమునందు లేని దానికి లక్షణ మేర్పడుటయె యుండదు.

**ప్రయోగప్రదర్శనము :**

కొందరు లాక్షణికులు తాము చేసిన లక్షణమున కుదాహరణములుగా కవిప్రయోగములనే చూపిరి. అప్పకవి తాను చెప్పినయతి ప్రాసాదులకు ఆయాకవుల ప్రయోగములు అనేక ముదాహరించుట ప్రసిద్ధమె. స్పష్టముగా చెప్పియును, చెప్పకయును, చిన్నయసూరి కూడ తనలక్షణములకు పెక్కు కవిప్రయోగములను ఉదాహరించెను.

వ్యతిరేక మధ్యమపురుషైకవచనమునకు లోపము వచ్చుట కుదాహరించిన 'నమ్మకిట' అనునది ఉత్తరహరివంశమునందలి (సోమన) ప్రయోగము. సంబంధార్థమునందు కువిభక్తి యగుట కుదాహరించిన నాకుందమ్ముండు వినాకునెచ్చెలి యన్నది (పోతన) భాగవతములోనిది. స్థలాంతరమందలి- 'అబుమీశ్వరుండు వచ్చెనా ఫలించుం గార్యముల్' అనునది రామాభ్యుదయములోనిది. ఇట్లు పెక్కుచోట్ల ఉదాహరణములు కవిప్రయోగములె అగుట గుర్తింపవచ్చును.

ప్రౌఢవ్యాకర్త కవిప్రయోగముల నెల్లయెడలం జూపుట ప్రసిద్ధమె.

ఇట్లు లక్షణమునకు కవిప్రయోగములను ఉదాహరణములుగా ఇచ్చుట లక్షణము ప్రయోగముల ననుసరించి యుండుటను, అందువలన ప్రయోగశరణ మగుటను సూచించును.

**ప్రయోగప్రామాణ్యవర్ణనము :**

జవ్వని+ఆలు- జవరాలు అనుచోట జవ్వనిశబ్దమునకు జవ

ఆదేశ మగు నని చెప్పిన చిన్నయసూరి 'ఏకాంతమునందు నున్న జవరాండ్ర నని కవిప్రయోగము' అని వివరించెను.

జవ్వని అనుదానికిచట జవ అనునది ఆదేశ మగు నని తాను చేసిన లక్షణమునకు జవరాండ్ర అనుకవి (పెద్దన మనుచరిత్ర) ప్రయోగము ప్రమాణము అని సూరి చెప్పుచున్నాడు. ఇట్లు లక్షణము చెప్పుటకు కవిప్రయోగము మూలముగా స్పష్టముగా చెప్పిన యిట్టిస్థలము వ్యాకరణము ప్రయోగశరణ మని నిరూపించుచున్నది.

విశేషముగా కన్పించు ప్రయోగములను నిరూపించుటకె వ్రాయబడిన ప్రౌఢవ్యాకరణమునందు అట్టిస్థితి ప్రచురమె.

**భిన్నలక్షణతిరస్కారము :**

'అనుకృతిని నిమిదకుం గుఱుచ యగు నని యొకండు పలికె నది నిరాకరంబు' అని సూరి ఒకచోట చెప్పెను. అట్లు పలికిన అప్పకవి అట్టిప్రయోగమును చేసి చూపెను. అనగా కవిప్రయోగములందు ఇచట దీర్ఘమునకు హ్రస్వము వచ్చుట లేదు. కావున హ్రస్వము వచ్చు నని చెప్పినఅప్పకవిలక్షణము అంగీకరింపరానిదన్నమాట. ఇట్లు ప్రయోగములకు విరుద్ధముగా ఉన్నచో లక్షణమె తిరస్కరింపవలె ననియు, కాగా లక్షణము ప్రయోగ శరణమై ఉండవలెననియు లక్షణకర్తయే స్పష్టము చేసెను. "ఇట్టి ప్రయోగములచేత అన్యస్యాః క్వచిద్భవేచ్చాన్యా అనుశబ్దశాసనులసూత్రము సార్థకమగుచున్నది" అని ప్రౌఢవ్యాకర్త వివరణము దీని నింకను స్పష్టముచేయుచున్నది.

**ప్రయోగవర్ణనము :**

ప్రయోగసామాన్యమును అనుసరించి లక్షణము చేసినను, ఆలక్షణమునకు భిన్నముగా నున్న ప్రయోగములను ప్రత్యేకముగా వర్ణించుట గలదు. నమశ్శబ్దమున మాత్రమె ఓత్వమును చెప్పిన

సూరి 'ఈకావ్యము లాఁతిచే సహితము కానంబడియెడి' అని వివరించి 'గతానుగతికో లోకో యటంచు' అను కళాపూర్ణోదయప్రయోగము నిచ్చెను. కెంధూళి కెంజడ లనియు ప్రయోగంబులు గానంబడియెడి, ఇచట మఱియుం బ్రయోగవైచిత్ర్యంబు గల దది ప్రయోగంబుల నెఱుంగునది మున్నగు అనేక స్థలము లిట్టివి.

కొన్నియెడల ద్రుతంబుమీఁద సకారంబు గానంబడియెడి, స్త్రీసమఘటితంబ మొకానొకండు బహుప్రతిహా చూపట్టెడి మొద లగు విధముగా లక్షణములందలి 'కానంబడియెడి' మున్నగుశబ్దములు ప్రయోగములను వర్ణించునవి.

ఇట్టిలక్షణములు ప్రౌఢవ్యాకరణమునందు తెలుచు.

**ప్రయోగప్రాశస్త్యప్రకటనము :**

"ఆర్యవ్యవహారంబుల దృష్టంబు గ్రాహ్యంబు" అని సూరి మహాకవుల ప్రయోగములలో లక్షణమునకు విరుద్ధము లైన శబ్దము లున్నను అవి యట్లు గ్రహింపఁదగినవే అని పేర్కొనెను. ఇట్టి లక్షణములు (లక్షణముకంటెను) ప్రయోగములబలీయతను నిరూపించును. వ్యాకరణము ఏదో ఒకమార్గమున ప్రయోగములను ఆశ్రయింపవలె నని సూచించును.

**ప్రయోగలక్షణము :**

భాషాస్వరూపము తెలియుటలో లక్షణముకంటె లక్ష్యము లందె లాఘవ మున్నప్పుడు ఆయావానిని నిపాతలుగా పేర్కొను టయు, ప్రయోగములనుబట్టి లక్షణము తెలియజెప్పుటయు తెలుగు వ్యాకరణమునను గలదు. కద్రువ నాగమాత, అందదుకు ప్రభృతులు యథాప్రయోగంబుగ గ్రాహ్యంబులు మొదలగు లక్షణము లిట్టివి. ఇట్లే తద్ధితములు, కృత్తులు మొ॥

**అనేకవ్యాకరణోత్పత్తి :**

లక్షణము ప్రయోగశరణ మగుటచేతనె, ఏభాష కయినను

వ్యాకరణగ్రంథము లనేకము లేర్పడుచున్నవి. పూర్వలాక్షణికులు చెప్పకవిడిచిన దానిని, తరువాతి తరువాతి కవుల ప్రయోగములలో కనిపించువిశేషములను లక్షణబద్ధము చేయుటకయి వ్యాకరణములు వ్రాయుచుండుట జరుగుచున్నది. బాలవ్యాకరణమునకు పిదప ప్రౌఢ వ్యాకరణ మేర్పడుట కవిప్రయోగములకు లక్షణము చేయుటకే కదా.

లక్షణము ప్రయోగముల నాశ్రయించి దాని కనుగుణముగనె చెప్పబడును. కాని కవులు స్వతంత్రులై ప్రయోగించుటయు గలదు. అందువలననె నన్నయ కున్న ప్రామాణ్య మాధునికకవులు మొదలగు వారి యెడ నుండదు గదా. "వనమునుంచి, ధనమునుంచి యని యుంచిశబ్దప్రయోగముతో కొందఱు వ్యవహరింతురు. కాని యది సాధుకవిప్రయోగార్హంబు కా" దని సూరి తిరస్కరించెను. ఇట్లె ప్రౌఢవ్యాకర్తయును 'ఒకానొకయాధునిక గ్రంథమునందు అన్నకో విననుంగుకో అని ప్రయోగములు కానంబడుచున్నవి. వానికిఁ బ్రామాణికప్రయోగంబులు కానంబడవు' అని తిమ్మకవిప్రయోగములను నిరసించెను.

వ్యాకరణము (సాధుకవి) ప్రయోగశరణమై యుండుట యన్నది యితరభాషలకువలె నాంధ్రభాషకును చెల్లుటను పెక్కు ఆధారములతో గుర్తింపవచ్చును.

## 3. తెలుగునకు వ్యాకరణదీపము చిన్నది

చిన్న దయినదీపమువలన కాంతి సన్నముగనె కలుగును. అంతయును ప్రత్యక్షము కాదు. కొంత అసలె తెలియకుండ, కొంత అస్పష్టముగా తెలియుచుండ, మఱి కొంతయె తెలియును. భాషా స్వరూపమును ప్రత్యక్షము చేయునట్టిదీపము వ్యాకరణము. తెలుగునకు అట్టి వ్యాకరణదీపము చిన్నది. అనగా తెలుగువ్యాకరణముచే తెలుగు భాషాస్వరూప మంతయును తెలియదు. అనగా తెలుగు

భాషను సమగ్రముగా తెలుగువ్యాకరణము నిరూపించుట లేదు. అందుచే తెలుగునకు వ్యాకరణదీపము చిన్నది అనగా తెనుగు వ్యాకరణ మసమగ్ర మనియు లక్షణబద్ధము కాని తెలుగుభాష ఇంకను గల దనియు అభిప్రాయము.

**కారణములు :**

బాలవ్యాకరణమునకు గల్గిన ప్రాశస్త్యమువలన గావచ్చును, తెలుగునకు వ్యాకరణ మనగా బాలవ్యాకరణ మొక్కటియె యను అభిప్రాయము గలదు. (అదియె పైయూహకు కారణ మనిపించెడిని) కొందఱు ప్రౌఢవ్యాకరణమును గూడ గలిపినను ప్రాముఖ్యము బాల వ్యాకరణమునకే.

బాలవ్యాకరణశిష్టలక్షణ మెల్ల ప్రౌఢవ్యాకరణమున లేదు. అట దానిరచనాలక్ష్యమును అది కాదు.

బాలవ్యాకరణము సమగ్రము గా దని తత్కర్తయే స్పష్టముగా చెప్పెను. ఇంకను తెలుగులక్షణమె మొత్తముపై సమగ్రము గా దనుటకును హేతువులను చిన్నయసూరి బాలవ్యాకరణమున చెప్పెను.

**అలభ్యవ్యాకరణములు :**

బాలవ్యాకరణపీఠికలో సూరి తెలుగునకు వ్యాకరణములు చాల యున్నను అందు కొన్నింటికి పేర్లుమాత్రమె వినబడుచున్నట్లు స్పష్టము చేసెను. తెలుగువ్యాకరణములు కొన్ని దొరకుట లేదు. పేర్లును వినిపింపనిగ్రంథము లుండవచ్చును. దొరకనిగ్రంథముల వలన తెలియగలిగిన దేమియుండును?

**సంస్కృతసమలక్షణము :**

అచటనే సూరి లభ్య మగుచున్నగ్రంథములందు సయితము సంస్కృతసమములలక్షణమె అధికముగా చెప్పబడినది కాని అచ్చిక ముల కంతగా చెప్పబడలే దనె.

ఇట్లు బాలవ్యాకరణమునకు పూర్వ మున్న తెలుగువ్యాకరణము లన్నియును ఆంధ్రభాషలో ఏకదేశ మయినసంస్కృతసమముల లక్షణము చెప్పుటకె ప్రాధాన్యము నిచ్చినవి. కావున అవి యసమగ్రము లని సూరి స్పష్టము చేసినట్లయినది గదా !

**బాలవ్యాకరణము-సమగ్రమా ?**

సూత్రాంధ్ర మనిసంస్కృతమున ఒకవ్యాకరణము వ్రాసి బాలురకై అందలికొన్నిసూత్రములను తెనిఁగించి బాలవ్యాకరణము వ్రాసినట్లు సూరి అచ్చటనే పేర్కొనె. ఇట్లు సూరి తాను గుర్తించిన లక్షణమునె అంతటిని బాలవ్యాకరణమున చెప్పలేదు. 'శేషంబులు లఘ్వలఘువులు తక్కుంగలవి శేషంబు లార్యవ్యవహారంబుల దెలియుట శ్రేయంబు' అని బాలవ్యాకరణము చివర జెప్పెను. మిగిలిన లక్షణమును సూత్రాంధ్రవ్యాకరణమునుండి తెలిసికొమ్మనెను. ఇట్లు బాలవ్యాకరణము సైతము సమగ్రము గా దని తత్కర్తయె స్పష్టముగా జెప్పెను.

**సూత్రాంధ్రాదులు ?**

సూత్రాంధ్రవ్యాకరణమున గూడ 'శాసన మిదం దిక్ప్రదర్శకమ్' అని అది దిక్ప్రదర్శకముగనె చెప్పినట్లు పేర్కొనె. తరువాతి దగు బాలవ్యాకరణమున నిట్లె 'దిక్ప్రదర్శకముగఁ దెలిపెద నిందు లక్షణము' అనియె చెప్పి పూర్వకవులలక్ష్యములను, లాఁతిలక్ష్మములఁ గాంచి తక్కులక్షణ మెఱిగికొనుఁడు అని పేర్కొనెను. ఇతర వ్యాకరణములతో పాటు లక్ష్యగ్రంథములను గూడ జూచి మిగిలిన భాషాలక్షణము తెలియవలె నన్నమాట. సూత్రాంధ్రము రచింపఁ బడినభాగమును సమగ్రముగా లభ్య మగుట లేదు.

**త్రిలింగలక్షణశేషము :**

పయి సూరిసూచన ననుసరించియె కాబోలును బహుజనపల్లి వారు ఇతరవ్యాకరణములను కవిప్రయోగవిశేషములనుగూర్చి

'త్రిలింగలక్షణశేషము' అను పేరుతో ఒకవ్యాకరణము రచించెను. తనయీగ్రంథములో తెలుగువ్యాకరణము సమగ్రమైనట్లు ప్రౌఢవ్యాకర్త తలంచెనో లేదో స్పష్టము గాదు.

**సమగ్రత సంభవమా ?**

ఏ భాషకైనను నొకవ్యాకరణము సమగ్రమగుట సంభవము కాదు. పాణినీయము మసాధువు లన్నవి యితరసంస్కృతవ్యాకరణములు ప్రస్తావించును. అందును వ్యవహారమునం దున్నభాషకు వ్యాకరణము సమగ్రమగుట యింకను అసాధ్యమనియె చెప్పవలెను. ఎంత లక్షణ మున్నను కవులు కొంత తేని, కొంత లేని స్వతంత్రింపక మానరు. వ్యవహారమున మార్పును బొందినశబ్దము వెంటనె ప్రమాణీకరింపబడుటయు కష్టమె.

తెలుగున నన్నయప్రయోగించినది తప్ప వేరొకపదము గ్రహింపరా దని కవిరాక్షసుడు నియమించెను. ఈయభిప్రాయము తరువాత మారినను కవిత్రయము వెనుక లనుకొందఱిపై గల ప్రామాణ్యబుద్ధి 15వశతాబ్ది, ఆతరువాతికవులపై దృఢముగా నేర్పడ లేదు. బాలవ్యాకర్తవలె ప్రౌఢవ్యాకర్తయు అన్యదేశ్యములను ప్రస్తావింపలేదు.

బాలవ్యాకరణమునందే ప్రస్తావింపబడనిశబ్ద మసాధువే యను విశ్వాసమును దీని కొకకారణము. బాలవ్యాకరణముపై నున్న ప్రామాణ్యబుద్ధి ప్రౌఢవ్యాకరణముపై కూడ లే దనుట తప్పు గాదు. ఇతరము లైన ఆంధ్రవ్యాకరణములందు చెప్పబడినలక్షణములకు గుర్తింపు లభించుటయు లేదు.

లాక్షణికులదృష్టి సంస్కృతసమములపైడనె ప్రముఖముగా వర్తించుటచే సంస్కృతభవము, ప్రాకృతసమభవములను గుర్తించుటయందు గాని వానిలక్షణములు నిరూపించుటయందు గాని తగువిధముగా ప్రసరింపలేదు. ఇట్టి కృత్తులు తద్ధితములు వానిఅర్థములు

అన్యదేశ్యములు మున్నగుఅంశములు ఇంకను పరిశీలించి నిర్ణయింప వలసినస్థితియందే యున్నవి.

**తెలుగువ్యాకరణప్రశస్తి :**

తెలుగునకు లక్షణము సమగ్రము అనరాకున్నను తెలుగు వ్యాకరణదీపము చిన్నదె అన్నను. ఉన్నది ఆంధ్రభాషయొక్క సామాన్యమును, ప్రధానమును ఆయినస్వరూపమును ప్రత్యక్షము చేయజాలియున్న దనుట మాత్ర మంగీకరింపవలసినదే. అల్పప్రయోగములు మొదలగుకొన్నియీతెలుగులోనికి రాకపోవుట పరిగణింప దగినలోటు గాదు, తెలుగువ్యాకరణము గౌరవము ప్రశంసార్హము.

## 4. పేరునకు బాలవ్యాకరణము అయ్యును విషయవివేచనమున సాటి లేనియుద్గ్రంథము

సూరి ఆంధ్రవ్యాకరణమును, విస్తరించి మొదట సంస్కృత భాషలో సూత్రములతో సూత్రాంధ్రవ్యాకరణమును వ్రాసెను. బాలురకు సులువుగా తెలియుటకై అందలిసూత్రములు కొన్ని ఏని గించి తుదకు బాలవ్యాకరణము రచించెను.

**బాలవ్యాకరణము :**

బాలవ్యాకరణటీకలో సూరి పేర్కొనినదాని ననుసరించి ఇది బాలురకు సులువుగా తెలియుటకై వ్రాయబడినవ్యాకరణము. ఇట్లు బాలురకొఱకయినవ్యాకరణము కావున ఇది బాలవ్యాకరణము. బాలు రనగా విషయమును గ్రహించుటయందును, గ్రహించిన దానిని ధరించుటయందును సమర్థులయినవారు. పేరునుబట్టి పైకి ఇది యేదో పిల్లలవ్యాకరణ మనిపించినను ప్రాథమికాంశములను మాత్రమె తెలుపున దనరాదు. విషయ మెల్ల సులువుగా తెలియ జెప్పినదె కాని విషయమును మిక్కిలి సంగ్రహించి సులువు చేసినది మాత్రము కాదు.

**వైశిష్ట్యము :**

బాలవ్యాకరణమునకు పూర్వము, తరువాత గూడ తెలుగు వ్యాకరణములు పెక్కు లున్నను తెలుగునకు వ్యాకరణ మనగా బాలవ్యాకరణమె అనియు బాలవ్యాకరణముచే సాధింపబడనిరూపము సాధువే కా దనియు విశ్వసించునంతగా బాలవ్యాకరణము ప్రసిద్ధ మైనది. ఇందు చెప్పబడినవిషయమునుబట్టియు చెప్పినవిధానమును బట్టియు దీని కిట్టికీర్తి కలిగిన దని తెలియదగును.

**విషయ వివేచనము :**

ఇందు ఆంధ్రభాషావిషయము విస్తృతపరిశీలనములో నిరూపించబడినతీరు మఱియొకఆంధ్రవ్యాకరణమున గానరాదు. దానిని ఇట్లు గుర్తింపవచ్చును.

**i. లక్ష్యవిస్తృతి:**

కవిత్రయము, శ్రీనాథుడు, సోమన మొదలగుప్రాచీనుల గ్రంథములతో పాటు పెద్దన, సూరనాదు లగుఆధునికుల గ్రంథముల నుండియు సూరి లక్ష్యములు ప్రదర్శించెను. అప్రామాణికుడని పెక్కురు లాక్షణికులు తిరస్కరించినపోతనప్రయోగములను గూడ సూరి యుద్ధరించెను. అనగా సూరిలక్షణమునకు లక్ష్యముగు భాష పరిధి విస్తృతము. కవిరాక్షసాదులవలె నన్నయప్రయోగములు మాత్రమె గ్రాహ్యమని కాని మొదలుగా లక్ష్యప్రపంచమును, సూరి సంకుచితము చేసికొనలేదు. దీనివలన బాలవ్యాకరణలక్షణ మింత రాంధ్రవ్యాకరణములకంటె నధికముగ భాషాస్వరూపము నావిష్కరింప గల్గుచున్నది.

• **ii. విషయవిభాగము**

సంస్కృతవ్యాకరణప్రభావముతోనె అయినను సూరి సంజ్ఞ సంధి అని మొద లగుపరిచ్ఛేదములుగా ఆయావిషయములను గూర్చి చేసినవిభాగమె భాషనుగూర్చి స్థూలముగా ఒక అభి ప్రాయమును గల్గించుచు దృఢ మైనరచనాప్రణాళికతో నున్నది.

### iii. అచ్ఛికనిరూపణము :

సూరి పీఠికలో పేర్కొనినదాని కనుగుణముగ సంస్కృతసమములతో సమముగా ఇందు అచ్ఛికపదస్వరూపనిరూపణము విస్తరించియున్నది. అచ్ఛికముల కొకపరిచ్ఛేదము ప్రత్యేకముగా ఏర్పఱుపబడినది. క్రియాపరిచ్ఛేదమున దేశ్యక్రియాపదనిరూపణము ప్రముఖముగా విస్తరించి చెప్పబడినది. ఇది ఇతరాంధ్రవ్యాకరణములకంటె మిక్కిలిఅధికమును సమగ్రము సగ్రహణాళికతో ఉండుట గమనింపదగును.

సర్వనామములపట్టిక, కృత్తద్ధితప్రకీర్ణపరిచ్ఛేదములందును ఔపవిభక్తికప్రకరణమునను అచ్ఛికపదనిరూపణము సూరిలక్ష్యమును సాధించుచున్నది.

### iv. కారకసమాసవివరణము :

ఇందు తెలుగువిభక్తులఅర్థము విస్తరించి చెప్పబడినది. కర్త్రాది సంజ్ఞలయర్థము సంస్కృతవ్యాకరణము ననుసరించి తెలుగుచేయబడె. దీనివలన కొన్ని ఇతరాంధ్రవ్యాకరణములవలె సంస్కృతవ్యాకరణము నాశ్రయింపవలసినఅవసరము తగ్గి తెలుగులక్షణమునకు స్వయంసంపూర్ణతయు స్పష్టతయు గల్గినది. ఇట్లే ఆయాసమాసములలక్షణమును బాలవ్యాకరణములో ఇతరవ్యాకరణములకంటె విస్తరించి చెప్పబడినది.

### v. కృత్తద్ధితనిరూపణము :

కృత్తులను, తద్ధితములను ప్రత్యేకపరిచ్ఛేదములలో నిరూపించుట యిందలిమఱియొకవిశేషము.

### రచనావిధానము :

చెప్పబడినవిషయముతోపాటు చెప్పినపద్ధతి గూడ బాలవ్యాకరణమునకు ప్రశస్తిని తెచ్చినది.

i స్పష్టత :

'లలితోక్తులలో లక్ష్యయోజన మొప్పంగ సూరి బాలవ్యాకరణము రచించె. స్వీయోదాహృతులు, కవిప్రయోగములు, చమత్కారయుక్తముగా కూర్చి లక్షణమును సూరి బాలామోదము చేసెను.

ii. సంస్కృతసంప్రదాయానుసరణము :

సంజ్ఞాపరిభాషాదులలో సంస్కృతవ్యాకరణమార్గమును అవలంబించుటచే సూరిలక్షణము అల్పాక్షరముతో అనల్పార్థము సాధించినది. దీనివలన ప్రామాణికత్వమును, తెలుగువ్యాకరణమునకు శాస్త్రగౌరవమును గల్గుటతోపాటు భాషాస్వరూపమునువిశేషముగా నిరూపించుట సాధ్యమైనది. అంతకు పూర్వము పఠనపాఠనములందున్న తెలుగువ్యాకరణములను బాలవ్యాకరణము త్రోసిరాజనగల్గినది.

iii. బహులక్ష్యసంగ్రహణము :

లక్ష్యగ్రంథములను బహుధా పరిశీలించినచిన్నయ లక్షణము ఆంధ్రభాషాసామాన్యలక్షణమును ప్రతిబింబించును. 'ద్విరుక్తం బగుహల్లు పరం బగునపు డాచ్ఛికం బగుదీర్ఘంబునకు హ్రస్వం బగు', 'ఇకారంబు మీఁదికనువుప్రత్యయవిభక్తులయుత్వంబున కిత్వం బగు', 'ఇత్వంబు గాని యుత్వంబు గాని కూడుచో సనాద్యం బయినయుత్వంబున కిత్వం బగు' మున్నగుసూరిసూత్రము లిట్టివి. ఇట్టివి చారిత్రక వ్యాకర్తలమన్ననలు గూడ అందినవి. తెలుగువిభక్తులనిరూపణము మొదలగుఅంశములలో సూరి లక్ష్యసంగ్రహణదృష్టి స్పష్టము. ఉదాహరణమునకు 'ల' ద్వితీయావిభక్తిగా పూర్వలాక్షణికులు చెప్పగా తృతీయాదులందువలె ద్వితీయలోను 'విభక్తి' కాగమముగా సూరి సంగ్రహించెను. 'ను,కు' విభక్తులనుండి 'ని,కి' సాధించెను.

వ్యాకరణముల నెల్ల సూత్రములుగనె చెప్పెను. అట్లు బాలవ్యాకరణమును సూత్రాత్మకముగ రచింపబడినది.

### సంస్కృతసంప్రదాయము :

తెలుగువ్యాకరణము లొకటి రెండు స్వతంత్రమార్గమున రచింపబడినను పెక్కు సంస్కృతసంప్రదాయానుసారముగ కూర్పబడినవి. సూరి బాలవ్యాకరణముతో గూడ తనవ్యాకరణము లెల్ల ఆమార్గముననె రచించె. అట్టి సూత్రములను.

### సూత్రలక్షణము :

సూత్రయతి అర్థం గృహ్ణాతి ఇతి సూత్రమ్. ఇట్టిసూత్రమునకు కొన్ని ప్రత్యేకలక్షణము లుండుట సంస్కృతసంప్రదాయము.

"అల్పాక్షర మసందిగ్ధం సారవ ద్విశ్వతోముఖమ్
అస్తోభ మనవద్యం చ సూత్రం సూత్రవిదో విదుః"

(ముగ్ధబోధవ్యాకరణము సంజ్ఞాపాదాంతసూత్ర దుర్గాదాసవ్యాఖ్య)

అని సంస్కృతమున సూత్రమునకు ఆరులక్షణములు చెప్పబడినవి, సూరిసూత్రము లెల్ల ఈలక్షణము లన్నియు గల్గియున్నవి. ఇంక ఆయాసూత్రములందీలక్షణము లేయవి విశేషముగ గోచరించును.

### i. అల్పాక్షరము :

సూత్రము తక్కువఅక్షరములతో స్వల్పపరిమాణమున ఉండవలెను. అనగా చెప్పదలచినఅర్థ మెల్ల సాధ్యమైనంత తక్కువ అక్షరములతో చెప్పవలెను.

కొన్నిచోట్ల వివరణరూపమున చెప్పుటచేతను, కొన్నియెడల విస్తృతవిషయము నొక్కచో గూర్పదలచుటచేతను ప్రౌఢవ్యాకరణసూత్రము లధికాక్షరములతో వ్యాఖ్యానప్రాయము లగుట గుర్తింపగలము. సూరిసూత్రము లట్లు గావు.

సూత్రము నిస్సారము కారాదు. అనగా సూత్రమునందలిపదము లెల్ల మార్పరాని వై సార్థకము లైయుండవలె. ఊరుచోటుమేన్వాదు లున్నగ్విషయంబు లను ప్రౌఢ. సూత్రమున ఆదిశబ్ద మవసరము గాగా చోటుమేనులను గూడ ఉచ్చరించుటలో ప్రయోజనము లేదు. సూరి సూత్రము లిట్లు గాక దళసార్థక్యముతో నుండుట సామాన్యము. పైని 'రుములు బహువచనంబు లను చో రువర్ణ మొక్కటె ప్రథమ మధ్యమపురుషలు రెంటిని బోధించుచు సారవల్లక్షణముతో నుండుట గమనింపవచ్చును.

**iv. విశ్వతోముఖము :**

సూత్రము సకలమున అనగా అత్యధికలక్ష్యములందు వర్తించునది కావలెను. ద్విరుక్తం బగు వాల్లు పరం బగునపు డాచ్ఛికం బగు దీర్ఘంబునకు హ్రస్వం బగు, ఇత్వంబు గాని యెత్వంబు గాని కూడుచో నద్యం బయినయిత్వంబున కిత్వం బగు మొ॥ రీతిగా సూరిసూత్రములు భాషాసామాన్యలక్షణమును చేర్కొనుచు అత్యధికలక్ష్యములందు వర్తించుచున్నవి.

ని,కి. మొ॥ వానిని విభక్తులుగా చెప్పక నుకులనుండియే సాధించుట, మొ॥వానిలో భాషాలక్షణమును బహులక్ష్యములందు సారభూతమైనదానిని గుర్తించి పేర్కొనుట సూరి సూత్రరచనలోని ప్రత్యేకత.

అందుకు మొ॥చోట్ల ఒక్కొక్కరూపమున మార్పులు పెక్కుతీరు లైయున్నవి. వానిని సాధింపవలె నన్న నొక్కొక్క రూపమునకు పెక్కుసూత్రములు చెప్పవలసియుండు. అది సూత్ర లక్షణము గాదు. అందుకే సూరి సంస్కృతమార్గములో అందుకు, ప్రభృతులు, నికట్లాదులు యథాప్రయోగంబుగ గ్రాహ్యంబులు- మొ॥రీతిని సూత్రించె. కర్మున నాగమాత మొ॥ నిపాతస్థలములు, మొ॥ ఇట్టివి.

### v. అస్తోభము :

స్తోభ మనగా అవరోధము. అనగా ఇచట అర్థము తెలియుటలో క్లేశము. అర్థము విశ్వతోముఖము గావలెనని లాఘవాపేక్షతో అన్వయాదులచే సూత్రము క్లిష్ట మైయుండరాదు. అపుడే ఆలక్షణము సమాన్యస్య మై గ్రాహ్య మగును.

సూరి బాలవ్యాకరణమును బాలావబోధ మగునట్లు వ్రాయుచున్నట్లు పేర్కొనెను. అందుకై సూరి తనయితర (సూత్రాంధ్రాది) వ్యాకరణములకంటె కూడ బాలవ్యాకరణసూత్రములలో, అనువృత్తి అపకర్ష వంటివానిఅవసరమును మిక్కిలిగా తగ్గించెను. బాలవ్యాకరణ సూత్రము లెల్ల ప్రధాన మైనఅర్థమును స్పష్టముగా సమగ్రముగా చెప్పెను. సంధిపరిచ్ఛేదమున 'అచ్చు పరం బగునప్పుడు,' క్రియాపరిచ్ఛేదమున 'ముత్తు పరం బగునప్పుడు' మొ॥ బహులక్షణములందు చేరుచు ఎల్లెడల ప్రయోగింపబడుచున్న సూత్రములు అర్థావగతిలో అవరోధము లేని వైయుండుట గమనింపవచ్చును.

### vi. అనవద్యము :

అవద్య మనగా చెప్పదగనిది. అనవద్య మనగా చెప్పదగినది. లక్ష్యములు ఎల్ల సాధింపవలె నని విశ్వతోముఖత్వమునకై గ్రహింపదగనిశబ్దములను కూడ లక్షణబద్ధము చేయరాదు. కూతురిని, చేతురు, మొ॥అసాధువులుగా సూరి పేర్కొనెను. ప్రౌఢవ్యాకర్త సైతము అన్నరో, ఇత్యాదిప్రయోగములను అంగీకరింపకుండుట గమనింపవచ్చును. అనగా కవిప్రయోగములం దున్న వని యెల్ల వానినిగాక సాధుకవిప్రయోగానుషక్తము లైనయోగ్యశబ్దములను మాత్రమె సూత్రము సాధింపవలెను. ఇట్లు అతివ్యాప్తి అవ్యాప్తి మొ॥దోషములచే సూత్రము నింద్యము గాకుండవలెను.

### సూరిసూత్రవైశిష్ట్యము :

ఈలక్షణములతోపాటు సూరి సూత్రరచనలో ఇంకను ప్రత్యేకత చూపెను.

**గ్రహణధారణయోగ్యత :**

అనల్పార్థమును స్వల్పాక్షరములతోనె చెప్పుటతోపాటు, ఉపయోగించినపదములలోను, వానిని కూర్చుటలోను సూరి లాలిత్యమును సంపాదించెను. గద్యము లయ్యు ఛందోబద్ధములవలె 'లలితోక్తులతో నొనరుపడంగూర్చె'నది బాలవ్యాకరణము. ఇట్టిశైలివలన (అర్థము) సులభముగా గ్రహించుటకే కాక శబ్దము సులువుగా ధారణచేయుటకును సూరిసూత్రములు అనువై ఉన్నవి.

**లక్షణక్రమము :**

పరిచ్ఛేదములే కాక అందలివిషయమును ఒకక్రమములో పూర్వోత్తరసంబంధముతో కూర్చుటవలన ఏసూత్రమున కాసూత్రము మాత్రమె కాక మొత్తము లక్షణము బుద్ధిని స్థిరముగ నిలుచుటకు వీలైనది.

'కచటతపలు పరుషంబులు, గజడదబలు సరళంబు' లనుచో ఉచ్చరింపబడనిదంత్యచజలు 'ఇతరము లగుహల్లులు స్థిరము' లనుచో చూపలేదు. అవి యే మగు నని సందేహము గల్గ పిదప 'దంత్యతాలవ్యంబు లయినచజలు సవర్ణంబు' లనుసూత్రము వ్రాయబడె. అట తాలవ్యము లేవి దంత్యము లేవి యనుసందేహము గల్గ ఇకఉపలం గూడిన- మున్నగుసూత్రములు చెప్పబడె. ఇట్లు సూరిసూత్రము లొకక్రమములో ఆకాంక్షతో కూర్పబడుట విశేషము.

ఈక్రమమువలన ఇకారవక్రంబు లుక్తంబులందలివి- ఇత్యాదులలో లాఘవము సంపాదింపబడినది.

పూర్వవ్యాకరణములకంటె లక్షణమునందు పరిణతి, సమాసంబునయందు, అడంగ్వాదులదాక- మొ॥తీరుగా సూత్రములందు విశేషలక్షణము- మొ॥ సూరిసూత్రరచనయం దింకను పెక్కు ప్రత్యేకతలు గమనింపనవును.

**సూత్రభేదములు :**

సంజ్ఞా చ పరిభాషా చైవ విధి ర్నియమ ఏవ చ
అతిదేశో೭ధికారశ్చ షడ్విధం సూత్రలక్షణమ్
అర్థము చెప్పుతీరుబట్టి సూత్రము ఆరువిధములు.

1. సంజ్ఞాసూత్రము : విధిఘటకసంకేతపదీయశక్తిగ్రాహకం సంజ్ఞా. లక్షణమునందు కూర్చబడినపదముయొక్క అర్థమును తెలుపునది సంజ్ఞ. నకారంబు ద్రుతంబు. స్త్రీతిర్యగ్జడభిన్నంబులును వాని విశేషణంబులును మహత్తు లనంబడు. మొ॥.

2. పరిభాష: లింగవత్త్వే సతి సందిగ్ధార్థనిశ్చాయకా పరిభాషా స్వప్రమాణముగా సందేహమును నివారించి అర్థమును సంక్షిప్తముగా నిశ్చయించునట్టిది పరిభాష. ఇట విశేషం బుత్సర్గంబునకు విభాషను బాధకం బగు మొ॥.

3. విధి: అప్రాప్తప్రాపకో విధిః. అప్పటివరకు లేని(వివక్షింపని) కార్యమును కలుగజేయునది విధి.
ఉత్తున కచ్చు పరం బగునపుడు సంధి యగు,
క్త్వార్థంబైన యిత్తునకు సంధి లేదు మొ॥

4. నియమము: సామాన్యప్రాప్తస్య విశేషావధారణం నియమః. సామాన్యముగ (ఎల్లెడల) ప్రాప్తించుచున్నదానిని విశేషముగ కొన్నిప్రత్యేకస్థలములనె నిశ్చయించునది నియమము.
ఉదంతస్త్రీసమంబులకుం బుంప్రులకు నదంతగుణవాచకంబులకుం దనంబు పరం బగునపుడు నుగాగమం బగు. ఇట ఉదంత స్త్రీసమాసములకు చెప్పినను నుగాగమవిధి 'తన'కంటె ఇతర మగు (పరుషసరళాది)తద్ధితము పర మగునపుడు నుగాగమము లే దని నియమము చేయును. సొగసుకాండు మొ॥.

5. అతిదేశము: అవిద్యమానధర్మప్రాపకశాస్త్ర మతిదేశః. లేనిధర్మమును ప్రాప్తింపజేయునట్టిశాస్త్రము అతిదేశము. విశ్వకర్మను

లకు స్త్రీత్వం బగు. కంధరాదులు క్లీబతుల్యంబులు, మిత్రాదులు- - పుంలింగతుల్యంబులు మొ॥.

6. అధికారము: స్వదేశే ఫలశూన్యత్వే సతి విధిశాస్త్రేణ సాకమేకవాక్యతయా అర్థబోధకః అధికారః. స్వయముగా వాక్యార్థమును సంపూర్ణముగ తెలుపక తరువాతివిధివాక్యములతో గలిసి ఆవాక్యములఅర్థమును బోధించునది అధికారము.

ధాతువునకు (క్రి.1).

ఇట్లు సంస్కృతసంప్రదాయానుగుణముగను, స్వీయ మగు ప్రత్యేకతలతోను ఉన్న బాలవ్యాకరణసూత్రములుసూరిసూత్రరచనాప్రావీణ్యమును స్పష్టముచేయుచున్నవి.

## 6. బాలవ్యాకరణరచనాప్రణాళిక

పెక్కులక్ష్యములు పలుమారు సావధానముగా పరిశీలించి రచనాప్రణాళికను నిర్ణయించుకొని సంస్కృతభాషలో సూత్రవ్యాకరణమును రచించి బాలురకు సుబోధ మగుటకై అందలిసూత్రములు కొన్ని తెనిగించి పిదప బాలవ్యాకరణమును రచించినట్లు సూరి పేర్కొనెను. లక్ష్యలక్షణపరిశీలనముతో పాటు ప్రత్యేకముగా సూరి పేర్కొన్నరచనాప్రణాళికలోని వైశిష్ట్యము గమనింపవలసియున్నది.

**బాలవ్యాకరణరచనాలక్ష్యము :**

లభ్యమగుచున్న పూర్వాంధ్రవ్యాకరణములు సంస్కృతసమేతరభాషకు లక్షణము నధికముగా పేర్కొనకుండుటయు ఈవ్యాకరణరచనమున కొకకారణముగా సూరి పేర్కొనెను. అనగా సంస్కృతసమము, ఆచ్ఛికము నైనఆంధ్రభాషకు మొత్తమునకు విపులముగా లక్షణము చెప్పదలచె. ఆచ్ఛికక్రియాప్రకీర్ణాదిపరిచ్ఛేదములను పరిశీలించిన సూరి సంస్కృతసమాచ్ఛికములకు సమప్రాధాన్యముతో లక్షణముచేయుట గుర్తింపవచ్చును.

**రచనా ప్రణాళిక :**

'లలితోక్తులతో నొనరుపడ, లక్ష్యయోజన మొప్పంగను బాలావబోధ మగుభంగి' నిర్మించుట బాలవ్యాకరణరచనా విధానము.

సూరి వ్యాకరణరచనలో సంస్కృతవ్యాకరణసంప్రదాయాను సరణము ప్రాముఖ్యము వహించినది.

**i. విషయవిభాగము :**

భాషావిషయము సంస్కృతపద్ధతిలో సంజ్ఞా, సంధి, తత్సమాచ్ఛిక (సుబంత) కారక,సమాస,తద్ధిత,క్రియా,కృత్,ప్రకీర్ణములుగా పదిభాగములుగా సూరి విభాగించెను. ఈవిభాగమువలన భాషాస్వరూపము నొకక్రమములో నిరూపించుటకు వీ లయినది.

**ii. విషయక్రమము :**

పరిచ్ఛేదములందలిఅంశములు సయితము ఒకప్రత్యేక మగు క్రమములో నిరూపింపబడినవి. ఉదాహరణకు సంజ్ఞాపరిచ్ఛేదములో మొదట సంస్కృతప్రాకృతాంధ్రవర్ణనిరూపణము, పరుషాదిసంజ్ఞలు మొద లగునవి యెల్ల ఒకక్రమములో చెప్పబడినవి. వర్ణక్రమము ననుసరించి పరుషసరళములకు పిదప స్థిరములకు పూర్వము నకారము యొక్క ద్రుతసంజ్ఞను చెప్పవలసియున్నను, నట్లు చెప్పిన చింతామణి యందు నకారమునకు స్థిరత్వము వివాదాస్పద మయినది. తన్నివార ణార్థము సూరి యాసంజ్ఞను పిదప పేర్కొనెను. ఇ ట్లన్నిపరిచ్ఛేదము లందు లక్షణము ప్రయోజనవిశేషముతో నొకక్రమము ననుసరించి చెప్పబడినది. ఈక్రమము స్పష్టతకును ధారణకును సాధక మై యున్నది.

**iii. సంజ్ఞాదులు-స్వాతంత్ర్యము :**

ఉపధ, ఆమ్రేడితము మొద లగుసంజ్ఞలను సంస్కృతవ్యాకర ణమునుండియు,పరుషము,సరళము మొద లగుసంజ్ఞలను పూర్వాంధ్ర

వ్యాకరణములనుండియు సూరి స్వీకరించెను. ప్రయోజనాభావమును బట్టి సమాసకము, తిఙ్మధ్యము మొద లగుసంజ్ఞలను విడచిపుచ్చెను. ఆమార్గమునసె శాస్త్రప్రయోజనము ననుసరించి సంజ్ఞాదులలో సూరి స్వీయమార్గము నేర్పఱచెను.

మంజ్వర్ణకంబునకుం బ్రకృతి యయినది మమంతం బనంబడు. ఆ ఈ ఏ అనుసర్వనామంబులు త్రికంబు నాఁబడు. ఇట్లు మమంతము, త్రికము మొద లగుసంజ్ఞలను సూరి క్రొత్తగా ఏర్పఱచెను.

'లకారంబునకు మ్రుంవురునుము ఙాగు' అనుచో ఙాకారమును చేర్చి ముఙు రుఙు వుఙు మున్నగుప్రత్యాహారములను సాధించెను.

తెలుగునందు విశేషము లై యున్న వ్యతిరేకతద్ధర్మాద్యర్థకములను నిరూపించుటకు లజ్, లాట్టు అనులకారములను కల్పించెను.

కిత్తులు మొద లగువానిని సంస్కృతోక్తప్రయోజనములో గ్రహించినసూరి తెలుగున స్వీయముగా జిత్తులను కల్పించెను.

ఇట్లు సూరి వ్యాకరణరచనమునకు సంస్కృతవ్యాకరణములను పూర్వాంధ్రవ్యాకరణములను యథావసరముగ అనుసరించుచు ప్రయోజనవిశేషమునుబట్టి స్వతంత్ర మగుమార్గము నేర్పఱచుకొని ప్రత్యేక మగుప్రణాళిక ననుసరించెను.

### iv. సూత్రనిర్మాణము :

వ్యాకరణము సూత్రాత్మకముగ రచించుటలోనే శాస్త్రలక్షణము చక్కఁగా కుదురును. కాననె సూరి సూత్రాంధ్రవ్యాకరణాదులను సూత్రములనె రచించెను.

'అల్పాక్షర మసందిగ్ధం సారవ ద్విశ్వతోముఖమ్ అస్తోభ మనవద్యం చ సూత్రం సూత్రవిదో విదుః' అని సంస్కృతమున సూత్రమునకు చెప్పబడినలక్షణములు సూరిసూత్రములందు గమనింపవచ్చును.

ఇగ్లారాయుగంతంబుల ప్రథమైకవచనంబునకు లోపం బగు,

ఇకారంబునిరాఁదికునుప్రక్రియావిభక్తులయుత్వంబున కిత్వం బగు అనురీతిగా ఒకేలక్షణము గలభిన్నభిన్నస్థలముల నొకచోటికి దెచ్చి సాధించినసూత్రములు సారవంతము లై సూరిసూత్రరచనాపాటవమును దెల్పును.

ద్విరుక్తం బగుహల్లు పరం బగునపు డాచ్ఛికం బగుదీర్ఘంబునకు హ్రస్వం బగు అనురీతిసూత్రములు భాషాసామాన్యలక్షణమును నిరూపించుచు విశ్వతోముఖము లై చారిత్రకవ్యాకర్తల ప్రశంసలు సైత మందినవి.

సూత్రాంధ్రాదులవలె -అనువృత్తు లధికము గాకుండ స్వయం సంపూర్ణార్థకములుగా చాల సూత్రములను నిర్మించెను.

**v. వార్తికములు :**

సూత్రములందు చెప్పబడనివిశేషలక్షణము వార్తికములుగా వృత్తియందు పేర్కొనెను. మఱియు రాజుశబ్దం బొక్కటి దంత్యయుక్తంబు గానంబడియెడి' పత్వంబు హెచ్చునకుం గలుగదు. మొ॥ ఇట్టివి సూత్రములుగా చెప్పదగినవి స్వతంత్రప్రయోజనము గలవి కావు గావున వార్తికములుగా చెప్పుటవలన సూత్రముల సూత్రలక్షణములు సమగ్రముగ నున్నవి.

**vi. సంగ్రహావివరణము :**

కొన్ని యెడల సూత్రమందలిపదమునర్థమునో సూత్రార్థమునో స్పష్టతకై సంగ్రహముగ సూరియె వివరించెను.

'వికృతియం దకారాంతములయుపోత్తమేత్వంబునకు' అను సూత్రమునందలివికృతిపదమునుగూర్చి ఇచ్చట వికృతిశబ్దముచే సంస్కృతసమేతరంబు గ్రహింపవలయు' అనె

అంతట ననుట ప్రథమైకవచనలోపబాధనార్థము.

సర్వత్ర యనుట నగాగమబాధనార్థము. మొదలగుచోట్ల సూత్రగతవిశేషపదార్థవివరణము గానవచ్చును.

ఉన్నకలశీనవర్ణకంబు,... గురువిరహితంబు లయి. మొదలగు కొన్ని సూత్రములకు మొత్తమునకు తాత్పర్యమును సంగ్రహాముగా వివరించెను.

vii. **సంస్కృతలక్షణానువాదము :**

కారకాదివిషయములయెడ సూరి సంస్కృతవ్యాకరణమందు చెప్పబడినఅంశములను అనువదించెను. నియతోపస్థితికము ప్రాతిపదికార్థము మొ॥ దీనివలన కొన్నియితరాంధ్రవ్యాకరణములవలె అనుక్తన్యాయములో సంస్కృతవ్యాకరణమునాశ్రయింపవలసిన అవసరము కొంతమేర తగ్గి సమగ్రత చేకూరినది.

viii. **పూర్వగ్రంథపరామర్శనము :**

తనకు పూర్వమున్నఆంధ్రలక్షణగ్రంథములను పరిశీలించి కవిప్రయోగములతో సమన్వయించుచు బాలవ్యాకరణమున లక్షణము చేసెను.

కొన్నియెడల పూర్వలాక్షణికులయభిప్రాయము పరస్పర భిన్నముగా నున్నపుడు అందుచిత మగుపక్షమును ప్రమాణీకరించెను 'యకారంబును వృప్పావోవోలును దెలుగుమాటలకు మొదట లేవు' మొ॥.

పూర్వులఅభిప్రాయమును కవిప్రయోగానుసారముగా సంగ్రహించెను. తద్వత్తదాదిజస్య ప్రాయ స్తు స్యా త్కమాది స్యేతః. ఇత్యాదిగా చింతామణి పేర్కొనగా సూరి 'ఏమ్యాదులయిత్తునకు సంధి వైకల్పికముగా నగు'అని పేర్కొనెను. అనుకరణమున అహామాదులమకారమునకు ద్విరుక్తి విభాష యని సవరించెను.

పూర్వులఅభిప్రాయము సరి గానిచో తిరస్కరించెను. అనుకృతిని నిడుదకుంగు ఋచ యగు నని యొకండు వలికె నది నిరాక

రంబు. ద్వితీయైకవచనంబు పరం బగునపు డౌపవిభక్తికంబులు రా వని కొందఱు వక్కాణించిరి. అయ్యది లక్ష్యలక్షణవిరుద్ధం బగుటం జేసి యనాదరణీయంబు. ఉదా.

ఇంతే కాక సూరి తానే వ్రాసినపూర్వవ్యాకరణములనుగూడ పరిశీలించి అందలి అనవసరములు, అనౌచిత్యములు పరిహరించి బాల.లో లక్షణము చేసెను. తెలుగువిభక్తులు సంస్కృతవిభక్తుల స్థానమున నాదేశముగా చెప్పకుండుట ఉదా.

ix. **ప్రక్రియానిర్వహణము :**

వ్యాకరణప్రయోజనము ననుసరించి సూరి భాషాస్వరూపము సులువుగా తెలియుటకై ప్రక్రియానిర్వహణమున మిక్కిలి మెలకువతో లాఘవమును చూపెను. కఱు+ఉసురు- కుట్టుసురు మొదలగురీతిప్రక్రియ చారిత్రవ్యాకర్తలప్రశంసలు సైత మందినది.

ఆయాస్థలములలో పదములలోనివర్ణవికారాదులు సమగ్రముగా సూత్రించిన గౌరవమె గాని ప్రయోజనము లే దనదగినస్థలములలో నిపతించుట మొదలగుమార్గములలో సంస్కృతసంప్రదాయము ననుసరించియె లాఘవము సంపాదించెను. కద్రువ నాగమాత వేధ పురోధ పురోధసుడు ఉదా.

అందమునకు ప్రభృతులు యథాప్రయోగంబుగ గ్రాహ్యంబులు నిక్కలాదులు యథాప్రయోగంబుగ గ్రాహ్యంబులు మున్నగునవి ప్రయోగానుసారముగా గ్రహింపజెప్పెను. ఆచ్ఛికసర్వనామములను పట్టికగా చూపెను. అచ్చటచ్చట కవిప్రయోగములను విశేషముగా ప్రదర్శించెను. నెలఁ తిచ్చెను, కెంధూళి ఉదా.

ఇట్లు భాషాలక్షణమును ఏ తైనంతసమగ్రముగా సాధ్యమైనంత లాఘవమగుమార్గములో సూరి నిరూపించెను.

x. **లక్ష్యయోజనము :**

లలితోక్తులతో చెప్పుటతోపాటు లక్ష్యయోజనమును గూడ

సూరి తనరచనావిధానములో ప్రత్యేకముగా పేర్కొనెను. లక్షణాష గతికి ఇది మిక్కిలి యుపకరించును.

ఉదా.లను చూపుటలోను సూరి కొన్నిప్రత్యేకతలను ప్రదర్శించెను.

ఉదా.లు సూత్రాభిప్రాయమును విశేషముగా ప్రతిపాదించుట గలదు.

ఇఁకారాదులకుఁ దప్ప ద్రుతప్రకృతికములకు సంధిలేదు. అనుచో వచ్చెన్+ఇప్డు, చూడన్+అయితి, పాడెడిన్+అతఁడు అనుఉదా.లు క్రమముగా ఉత్వఅత్వఇత్వసంధులు చెప్పఁఆయాలు ద్రుతపూర్వ సూత్రముస్వరమునకు సంధిని జెప్పునప్డై యీనిషేధముప్రాప్తిపూర్వకమగుటను నిరూపించుచున్నవి.

డిద్ధ, రామ, భార్గవ, రాజపురుష ఇట్టివి ప్రాతిపదికములు. ప్రాతిపదికోదాహరణములు అర్థవదధాతురప్రత్యయః ప్రాతిపదికమ్, కృత్తద్ధితసమాసాశ్చ అనుసంస్కృతలక్షణముల తాత్పర్యమును ప్రతిపాదించును.

పెక్కు ఉదా.లు ప్రదర్శించుచో సూరి వానిని అకారాది క్రమములో చూపెను. అక్కటాదులు మొ॥

ఉదా.లతో పెక్కెడల చమత్కారావహ మగుదృశ్యములు కల్పించెను.

మేనల్లుఁడు పుట్టినిల్లు చూడకుండెను.
వాఁడు పూవులు దెచ్చె, ఆమె సొమ్ములు దాల్చె,
వాఁ డిల్లు వెడలె. మొ॥

ఉదా.లలో రామాయణాదులనుండి కథాభాగములనుస్ఫురింప జేయుట గలదు.

కొన్ని యెడల ప్రత్యేకముగా పేర్కొనకయె కవిప్రయోగముల నుద్ధరించెను. నమ్మ కిట, నాకుం దమ్ముఁడు మొ॥

కొన్ని యెడల కవిప్రయోగములుగా చెప్పి చూపెను. ఏకాంతమునందు మన్నజనరాంధ్ర నని ప్రయోగము. మొ॥

ఇంకను బహువిధము లగుప్రత్యేకతలు సూరిలక్ష్యములందు గమనింపనవును.

ఇట్లు సూరి లక్ష్యలక్షగ్రంథములందు బహుముఖముగా బహుకాలము శ్రమించి చేసినపరిశోధనకు ఫల మై కట్టుదిట్ట మైనప్రణాళికతో రచింపబడుటవలన బాలవ్యాకరణము ఆంధ్రవ్యాకరణవాఙ్మయమున పరమప్రమాణగ్రంథ మైనది.

## 7. ప్రౌఢవ్యాకరణము - రచనాప్రణాళిక

ఆధునికాంధ్రవ్యాకరణములలో బాలవ్యాకరణమునకు తర్వాత ప్రౌఢవ్యాకరణము పేరు ప్రసిద్ధము. బాలవ్యాకరణముతోడిసంబంధమును, ప్రౌఢవ్యాకరణ మనుపేరును దీనిప్రసిద్ధికి కారణము గావచ్చును. త్రిలింగలక్షణశేష మనుదానికంటె ప్రౌఢవ్యాకరణ మనుపేరె వ్యాప్తిలోనికి వచ్చుటయు అందుకె కావచ్చు.

**త్రిలింగలక్షణశేషము :**

సీతారామాచార్యులుగారు తమయీలక్షణగ్రంథముపేరు గ్రంథపీఠికలోను, పరిచ్ఛేదాంతగద్యలలోను త్రిలింగలక్షణశేష మని మాత్రమే పేర్కొనుట గానవచ్చును. త్రిలింగలక్షణ మనగా తెలుగువ్యాకరణము. కాన త్రిలింగలక్షణశేష మనగా తెలుగువ్యాకరణమున మిగిలినది. ఈపేరునుబట్టి తనకు పూర్వమునందలి తెలుగువ్యాకరణములందు చెప్పగా మిగిలినలక్షణ మిందు గ్రంథకర్త చెప్పదలచె ననవలె.

**రచనాలక్ష్యము :**

'భారతాదిగ్రంథపరిశోధనంబుచే దొరకినవి శేషలక్షణప్రయోగముల నేర్చి కూర్చి త్రిలింగలక్షణశేషం బనునొకయపూర్వవ్యాక

రణము దీని వ్రాసితిని' అని గ్రంథకర్త పీఠికలో చెప్పెను. కాగా కవిప్రయోగములందలివిశేషములను లక్షణబద్ధము చేయుట ఈగ్రంథ రచనాలక్ష్యము.

**అసాధారణలక్షణము :**

'ఇందలిలక్షణము లసాధారణము' లని ప్రౌఢవ్యాకర్త పేర్కొనెను. బాలవ్యాకరణము భాషాసామాన్యలక్షణము తెలుపుచు సాధారణలక్షణము కాగా కవిప్రయోగములందలి అరుదగువిశేషములు అనగా అసాధారణలక్షణములు ప్రౌఢవ్యాకరణము తెలుపును. అందుకే ఇందలిలక్షణములు అసాధారణము లయినవి. ఈఅసాధారణత కవిప్రయోగములమూలమున లక్షణములకు గల్గిన దని తెలియవలెను.

**రచనాప్రణాళిక :**

సంస్కృతసంప్రదాయానుసరణము, సంజ్ఞాదు లగుఅంశములలో చింతామణి, బాలవ్యాకరణములమార్గములో వానికి శేషగ్రంథముగా ఇది రచింపబడినది.

**చింతామణిశేషము :**

చింతామణి అభిప్రాయములను వివరించుసందర్భములను పరిశీలించిన ఇది చింతామణి ననుసరించిన గ్రంథముగా తెలియవచ్చును.

'ఊరువోలుమేన్వాదు లున్లుగ్విషయంబులు' ఇచట 'ఉన్లుక్' అనునంశము 'కేషాంచిదుదంతానామ్' అనుచింతామణిలక్షణము లేక అర్థమె కాదు. ఇట్టిలక్షణములు చింతామణికి వ్యాఖ్యలవలె నుండును.

'ఇట్టిప్రయోగములచేత 'అన్యస్యాః క్వచి ద్భవే చ్చాన్యా' అనుశబ్దశాసనులసూత్రము సార్థక మగుచున్నది.'

ఆంధ్రశబ్దచింతామణియందు గలఇదమదసీత్యాదిసూత్రమందలి

యదః ప్రభృతులు వ్యర్థము లగుచు స్వేతరంబులకును నకార్యం బగు నని తెలుపుచున్నవి.

మున్నగు ప్రౌఢవ్యాకరణవివరణములు ఆ గ్రంథము చింతామణిని ఎంతగానో వివరణాత్మకముగా అనుసరించుటను స్పష్టము చేయును.

బాలవ్యాకర్త కిత్తుగా జెప్పినఆగమము నొక్కచో చింతామణి మిత్తుగా జెప్పెను. 'షష్ఠ్యా ఉతోఽంచి నుమ్మే' ప్రౌఢవ్యాకర్త 'షోడశి పరం బగుచో నెల్లెడల ను మ్మగు' అని మిత్తుగా చెప్పుటలో చింతామణ్యనుసరణము గమనింపవచ్చు.

'గోకుల మిల్లిలు' ఇత్యాదిసందర్భముల నేకారణమునఁ గాని చింతామణియభిప్రాయమునకు భిన్నముగా జెప్పుట గానవచ్చును. విశేషప్రయోగముల ననుసరించిన యీలక్షణము గ్రంథరచనలో కవిప్రయోగప్రాముఖ్యమును దెలుపును.

**బాలవ్యాకరణానుసరణము :**

ప్రౌఢవ్యాకరణము కేవలము బాలవ్యాకరణమునకు శేషము గాదు. సూరి బాలవ్యాకరణములో సర్వనామములప్రక్రియ చెప్ప లేదు. ప్రౌఢవ్యాకర్త పేర్కొనెను. కాని అందు చింతామణిలో నిరూపింపబడిన 'నేను, నన్ను' మున్నగువానిప్రక్రియ ప్రౌఢవ్యాకర్త పేర్కొనలేదు.

అయినను చింతామణితో సంబంధము గలిగియున్న బాలవ్యాకరణమునం దుక్తమైనవిషయమును గూడ దృష్టియం దుంచుకొని కూడ ప్రౌఢవ్యాకరణము రచింపబడినది. 'ఉండిపదంబు పరం బగుచో వలన కందువర్ణక మట్లు నవర్ణకంబు నగు' మొద లగుఆయా సూత్రములు బాలవ్యాకరణమునకు వివరణప్రాయములే అనవచ్చును.

'ముత్తియశబ్దేతరంబులయందును దఱుచుగ నిత్యలోపంబు చూపట్టెడి' మున్నగులక్షణములలో విశేషప్రయోగసాధనదృష్టికంటె

సూరిఅభిప్రాయమును తిరస్కరించుఆకాంక్ష అధికముగా తోచును.

ఇట్టివానివలన బాలవ్యాకరణశేష మనదగి ప్రౌఢవ్యాకరణ మనుపేరు ప్రసిద్ధి కెక్కినది.

**ఇతరలక్షణవివేచనము :**

బాలవ్యాకరణమందు క్త మయినదానిని విడిచిన ప్రౌఢవ్యాకర్త చింతామణికి శేషగ్రంథ మగువికృతివివేకము మొ॥పూర్వలక్షణగ్రంథములలో చెప్పబడినఅంశములను తెనుగుచేసెను. 'కో శబ్దం బొండు సంబోధనంబున స్త్రీవాచకంబునకుం బరంబుగ నగు' అన్నది'కో ఇతి స్త్రీవాచకో భవేత్ పర తో్రివ' అను వికృతివివేక లక్షణమున కనువాదము. అయ్యును 'అయ్యాది ప్రాస్వాంతంబును నయ్యాడి' అనునది ప్రౌఢవ్యాకర్త విశేషించి చెప్పెను.

మొత్తముపై ప్రౌఢవ్యాకర్త వికృతివివేకము మొ॥ ఇతర వ్యాకరణము లాధారముగా కొంతలక్షణము చేసినట్లు గుర్తింపనచ్చును.

**విశేషలక్షణము :**

ప్రౌఢవ్యాకర్త అపూర్వవ్యాకరణ మని చెప్పినయిందు లక్షణ మపూర్వము కొంత లేకపోలేదు.

వాక్యప్రకరణ మపూర్వముగా ఇందు చేరినది. అన్వయవిశేషములు, కొంతసర్వనామప్రక్రియ మరి కొన్నిలక్షణములు ప్రౌఢవ్యాకర్త లక్ష్యానుగుణముగ స్వతంత్రముగ చేసె.

**ఆంగ్లవ్యాకరణప్రభావము :**

పూర్వాంధ్రవ్యాకరణములకంటె అధికముగా 'ప్రౌఢవ్యాకరణము'నందు చేరినవాక్యపరిచ్ఛేదము ఆంగ్లవ్యాకరణప్రభావముచేత అందురు. వాక్యమునుగూర్చి చెప్పదలచుట, నామములు, క్రియ, లవ్యయము లని పదములను వర్గీకరించుట, సమాపకక్రియలు అసమాపకక్రియలు అని క్రియలను విభజించుట, మొదలగుకొన్ని

అంశములలో ఆంగ్లవ్యాకరణప్రభావము గలదు. అయినను ఇందలి లక్షణము మాత్రము సంస్కృతసంప్రదాయానుగుణమె. వాక్య లక్షణమె సాహిత్యదర్పణమునుండి ప్రౌఢవ్యాకర్త స్వీకరించెను. ఇట్లె మహావాక్యలక్షణము, విశేష్యాదులు నామభేదములుగాఁ జెప్పుట, కర్తరిప్రయోగాదులవివరణము మొదలుగా లక్షణము సంస్కృత సంప్రదాయానుగుణమె.

**ప్రయోగప్రదర్శనము :**

విశేషప్రయోగముల నేర్చి కూర్చి యీవ్యాకరణ మసాధారణలక్షణములతో వ్రాసినట్లు గ్రంథకర్తయే చెప్పెను. విశేషకవిప్రయోగములకు లక్షణము చెప్పబడుచున్నది కావున (అసాధారణ లక్షణము) ఇందలిలక్షణమునకు కారణమైనప్రయోగమును తప్పక ప్రదర్శింపవలసినదే. ఏనుఁగున నేనుఁగు, అవసరమక్కఱలు మొదలగుచోట్ల ఒక్కొక్కప్రయోగమునకె లక్షణ మేర్పడినది. ఇది ప్రౌఢవ్యాకర్తప్రయోగపరిశీలనాపటిమను తెలుపును. శబ్దరత్నాకర నిర్మాణ మింకను నిరూపించు.

సూత్రనిర్మాణాదులలో నెవి యేని లోటుపాటు లున్నను బహుముఖశ్రమతో కవిప్రయోగవిశేషములతో అసాధారణలక్షణము చేయుటలో ప్రౌఢవ్యాకరణమున రచనాప్రణాళిక చక్కఁగా నుపయోగించినది.

## 8. ప్రౌఢవ్యాకరణము-నామసార్థక్యము

శ్రీబహుజనపల్లిసీతారామాచార్యులుగారు తాము వ్రాసిన వ్యాకరణమును 'త్రిలిఙ్గలక్షణశేషము అను ప్రౌఢవ్యాకరణము' అని పేర్కొనిరి. త్రిలింగలక్షణ మనగా తెలుగువ్యాకరణము. కావున త్రిలింగలక్షణశేష మనగా నంతకుపూర్వము తెనుగువ్యాకరణములలో చెప్పగా మిగిలినలక్షణము. అదె ప్రౌఢవ్యాకరణము.

**ప్రౌఢవ్యాకరణము :**

పీఠికయందు గాని ఇతరస్థలములలో గాని వ్యాకర్త త్రిలింగ లక్షణశేష మనుపేరే కాని 'ప్రౌఢవ్యాకరణము' అనుపేరు ఎచ్చటను ప్రస్తావింపలేదు. కాని గ్రంథకర్త పర్యవేక్షించిన మొదటిముద్రణము నుండి 'ప్రౌఢవ్యాకరణము' అనునది యీగ్రంథముయొక్క ముఖపత్రముపై వెలయుచుండుటచే ఈపేరు గూడ గ్రంథకర్త ఉద్దేశపూర్వకముగనె యేర్పఱచినట్లు గుర్తింపవచ్చును. త్రిలింగలక్షణ మనుపేరు కంటె ప్రౌఢవ్యాకరణ మనుపేరే యీగ్రంథమునకు ప్రసిద్ధమైనది.

**సంజ్ఞార్థము :**

ప్రౌఢవ్యాకరణము అనుపేరు ముందుగా బాలవ్యాకరణమును స్ఫురింపజేయును. దీనివలన నిది బాలవ్యాకరణముకన్న మిన్న అను అభిప్రాయమును గల్గజేయును. అందువలననె కొందఱు బాలురకొఱకయినవ్యాకరణము బాలవ్యాకరణము కాగా ప్రౌఢులకొఱకయిన వ్యాకరణము గాన ఇది ప్రౌఢవ్యాకరణ మని చెప్పుదురు. కాని సూరివ్రాతలనుబట్టి బాలవ్యాకరణము బాలురకొఱకయి చేయబడిన దని చెప్పవలెను.

కాని ప్రౌఢవ్యాకరణ మట్లు గాదు. తమగ్రంథమునుగూర్చి ఆచార్యులుగారు 'విశేషప్రయోగముల నేర్చి కూర్చి త్రిలింగలక్షణశేషం బనునొకయపూర్వవ్యాకరణము వ్రాసితిని. ఇందలిలక్షణము లసాధారణములు. ఇయ్యది విద్యార్థుల కత్యంతోపకారకము' అని పేర్కొనిరి. ప్రౌఢవ్యాకరణము విద్యార్థులకొఱకు వ్రాయబడినదే. ఇందలిలక్షణము లసాధారణములు, విశేషములు, నపూర్వము లగుటచే విషయగతప్రౌఢిచే ఇది ప్రౌఢవ్యాకరణ మయిన దన్నమాట.

బాలవ్యాకరణమునకు తరువాతిగ్రంథ మనుఅర్థమును స్ఫురింపజేయుచు భాషాసాధారణలక్షణమును దెలిసికొనినపిమ్మట అసాధారణ మగువిశేషలక్షణమును దెలుపుచు ప్రౌఢమైనయీవ్యాకర

ణము మూలమున భాషాస్వరూపము సమగ్రముగా తెలిసి విద్యార్థులు ప్రౌఢు లగుదు రనియు తలపు గావచ్చు.

ప్రౌఢ మైనవ్యాకరణము గాన ఇది ప్రౌఢవ్యాకరణ మని ఈ గ్రంథకర్తవచనములనుబట్టి యూహింపవచ్చును.

**సార్థక్యము :**

రచనాప్రణాళిక, సూత్రనిర్మాణచాతుర్యము మున్నగులక్షణములనుబట్టి ప్రౌఢవ్యాకరణముకంటె బాలవ్యాకరణమె ప్రౌఢ మని చెప్పుటలో తప్పు లేదు. అయినను-

**రచనాలక్ష్యము :**

బాలవ్యాకర్త అది బాలురకు సుసాధముగా నుండునట్లు రచించెను. ప్రౌఢవ్యాకరణ మట్టియుద్దేశముతో రచింపబడినది కాదు. అసాధారణములును, విశేషములు నైనలక్షణము చెప్పబూనినది.

**లక్షణ మసాధారణము :**

భాషాసాధారణలక్షణము తెలిసినవానికి విశేషలక్షణ మెఱుకపఱచవలెను. పూర్వవ్యాకరణములచే ఆంధ్రభాషాసామాన్యలక్షణము తెలిసినవారికి విశేషములు దెలుప బూనిన దగుటచే నిందలివిషయము ప్రౌఢ మగుచున్నది.

**అరుదయినప్రయోగాలు :**

విశేషప్రయోగములను గుర్తించి దానికి లక్షణ మిట చేయబడినది. విశేషప్రయోగములు వెదకి చూసిన దగుటచే ఇది ప్రౌఢము. ఉదా. కు బాలవ్యాకరణముము త్రియశబ్దమునందుమాత్రమిత్వలోపము చెప్పగా ప్రౌఢవ్యాకరణము 'ము త్రియశబ్దేతరంబులయందును దఱచుగ నిత్వలోపంబు చూపట్టెడి' నన్నది. ము త్రియేతరము లగువేవో శబ్దములలో నీకార్యము గల దన్నది ప్రయోగానుగుణముగా మాత్రమె గుర్తింపవలసియున్నది.

మిశ్రద్వంద్వము, అజడంబుత్తృతీయకు సవర్ణకము మున్నగు కొన్నిలక్షణములకు లభ్యమైన దొక్కొక్క ప్రయోగమె.

కవిప్రయోగములందు మూలమూలల నున్న యిట్టిప్రయోగవిశేషములను గూడ నెఱుకపఱచుచున్నయీవ్యాకరణము ప్రతిపాదించులక్షణము తత్కర్త పేర్కొన్నట్లుగా అసాధారణ మని గుర్తింపవచ్చును. ఇట్టిఅసాధారణవిషయములు గలయీగ్రంథము ప్రౌఢమె యగును.

**వాక్యప్రకరణము :**

'వాక్యపరిచ్ఛేదము' అనునది యిందు అపూర్వముగా ప్రవేశించినవిభాగము. పదవాక్యగతవిశేషములు, అన్వయవిశేషములు మున్నగునవి యిందుచెప్పబడినవి ఇట్టి విషయము పూర్వవ్యాకరణములందు ప్రత్యేకముగా ప్రస్తావింపబడలేదు.

ఇట్లీవ్యాకరణము తత్కర్త పేర్కొన్న ట్లపూర్వలక్షణములతో ఆంధ్రభాషయందలియసాధారణస్థితులను స్పష్టము చేయుచు విషయగత మైనప్రౌఢిమూలమున ప్రౌఢ మగువ్యాకరణ మయి ప్రౌఢవ్యాకరణమనునామము సార్థకము చేసికొన్న దని చెప్పవచ్చును.

## 9. త్రిలింగలక్షణశేషము - నామసార్థక్యము

**త్రిలింగలక్షణశేషము :**

పీఠికలోను, పరిచ్ఛేదాంతగద్యలలోను "త్రిలింగలక్షణశేషము'గా తనవ్యాకరణమును సీతారామాచార్యులుగారు పేర్కొనిరి. ముఖపత్రమున త్రిలింగలక్షణశేషము అను ప్రౌఢవ్యాకరణము అని పేర్కొనబడె. చివరిలో (గ్రంథముద్రణమునాటికి) 'ప్రౌఢవ్యాకరణ' మనుపేరుపై గూడ దృష్టి ఏర్పడినను గ్రంథకర్త మొదటినుండియు తనఈగ్రంథమునకు 'త్రిలింగలక్షణశేషము' అనునామమునె ఉద్దేశించె నని దీనిపీఠికాదులనుబట్టి నిశ్చయముగా చెప్పవచ్చును.

**సంజ్ఞార్థము :**



త్రిలింగ మనగా తెలుగు. శేష మనగా చెప్పగా మిగిలినది. అనగా తనకు పూర్వము (తెలుగు) వ్యాకరణములందు చెప్పగా మిగిలియున్న భాషాలక్షణము త్రిలింగలక్షణశేషము.

'త్రిలింగలక్షణము' అనుపేరుతో తెలుగున అంతకు (త్రిలింగ లక్షణశేషమునకు) ముందొకవ్యాకరణము కానరాదు. రావిపాటి గురుమూర్తిశాస్త్రి 'తెలుగువ్యాకరణము' కలదు. అదె 'త్రిలింగ లక్షణము' అని చెప్పుటకు ప్రౌఢవ్యాకరణమునందలి అంతర్విషయ ములు సహకరింపవు.

కాగా ఈప్రౌఢవ్యాకరణము అంతకు పూర్వము కలదేదో ఒక తెలుగువ్యాకరణమునకు మాత్రమె శేషము కాదు. ముందున్న తెలుగువ్యాకరణములలోని త్రిలింగలక్షణము మొత్తమునకు శేషము ఈత్రిలింగలక్షణశేషము.

**సార్థకత్వము :**

ఇంతటిపెద్దపేరు ఈవ్యాకరణమునకు తగదేమొ అని కొందర నుమానించిరి. ఇది ఎంతవరకు సార్థక మనుటకు గ్రంథకర్తవచన ములలో ఆధారములు చూతము.

**ఆధారములు :**

తుద కిప్పుడు తద్భారతాదిగ్రంథపరిశోధనంబుచే దొరకిన విశేషలక్షణప్రయోగముల నేర్చి కూర్చి త్రిలింగలక్షణశేష మను నొకయపూర్వవ్యాకరణము దీని వ్రాసితిని. ఇందలిలక్షణము లసా ధారణములు - అని గ్రంథకర్త పీఠికలో పేర్కొనెను.

**i. అపూర్వవ్యాకరణము :**

క్త్వార్థ మయినయిత్తునకు సంధి జరుగకుండుట ఈభాషకు సాధారణలక్షణము. "ఇప్రత్యయాంతావ్యయంబునకు సంధియు జూ పట్టుట" అసాధారణము. భాషయందలియిట్టిఅసాధారణలక్షణములను పేర్కొనుటనే ఇందలిలక్షణము లసాధారణములు అను టుచితమె.

పూర్వవ్యాకరణములు భాషాసాధారణలక్షణము చెప్పుచుండగా తద్భిన్నముగా అసాధారణములు చెప్పుచు అపూర్వవ్యాకరణ మగుచున్నది. అనగా సాధారణలక్షణములు చెప్పుపూర్వాంధ్ర వ్యాకరణముల కిది శేష మన్నమాట.

కావుననె పూర్వవ్యాకరణనిరపేక్షముగా ఇందలిలక్షణము సరిగా తెలియదు. అసాధారణలక్షణము తెలియుటకు ముందు భాషాసాధారణలక్షణ మెఱిగియుండవలయును గదా. ఉదాహరణమునకు—

ప్రౌఢవ్యాకర్త 'అక్ప్రత్యయాంతాన్వయంబు కళయ' అనెను. అంతకు ముందు కొందరు వ్యాకర్తలు ఇది ద్రుతప్రకృతికము గూడ అగు నని తలచుట తెలిసిన గాని ఈలక్షణ మారంభించుటకు మూలము తెలియదు. ఇట్లు పూర్వాంధ్రవ్యాకరణములు చదివి అందలిలోటుపాట్లను ప్రౌఢవ్యాకరణముచే సరి చేసికొనవలెను. కావున ఇట్టిది పూర్వమువందలి త్రిలింగలక్షణముల కెల్ల శేషమె అగుచున్నది.

ii. బాలవ్యాకరణమాత్రశేషమా ? :

ప్రౌఢవ్యాకరణము అనుపేరునుబట్టి కావచ్చును ఇది బాలవ్యాకరణమునకు శేషగ్రంథముగా కొందరు పేర్కొందురు. కాని బాలవ్యాకరణమున కొక్కదానికె శేషముగా చెప్పదలచిన 'త్రిలింగలక్షణశేష' మనుపే రుంచునా? త్రిలింగలక్షణ మనగా బాలవ్యాకరణ మొక్కటె కాదు గదా. ఇంకను ప్రౌఢవ్యాకర్త తనగ్రంథమున నెచ్చటను సూరిని గాని బాలవ్యాకరణమును గాని స్పష్టముగా పేర్కొననెలేదు. బాలవ్యాకరణము శేషమె వ్రాయదలచిన అట్లు పేర్కొనకుండునా ?

కజ్యంతము, నుజ్యంతము అని కాక అక్ప్రత్యయాంతము, అన్ప్రత్యయాంతము అనురీతిని వ్యవహరించుట మొద లగుకారణములనుబట్టి ఇది బాలవ్యాకరణమున కొక్కదానికె శేష మనరాదని కొందరు విమర్శకులు పేర్కొనిరి.

'తద్భవములందును నలఘురేఫము గలదు'. 'నెన్నడాదుల న్నెఱి దగు' మున్నగు పెక్కువిధానములు బాలవ్యాకరణము నుద్దేశించియే చెప్పబడిన వనుట స్పష్టము. బాలవ్యాకరణము కూడ ఒక త్రిలింగలక్షణమె కావున, ప్రసిద్ధమును గావునను దానికి శేషముగా వివరణాద్యాత్మకలక్షణములు ప్రౌఢవ్యాకరణమునం దుండుటలో వింత లేదు. కాగా ఇది బాలవ్యాకరణమునకు గూడ శేషమె కాని బాలవ్యాకరణమునకె శేష మనరాదు.

iii. **చింతామణిశేషము :**

బాలవ్యాకరణమున సంఖ్యానామప్రక్రియ చెప్పబడలేదు. ప్రౌఢ వ్యాకరణము చెప్పినది. కాని చింతామణిలో చెప్పబడిన సంఖ్యాశబ్ద ములప్రక్రియ ప్రౌఢవ్యాకర్త వివరించెను. 'ఊరుచోఁబు మేన్వాదు లున్నగ్విషయంబులు' అనుచో 'శేషాంచి' త్తనుచింతామణిలక్షణము చేతనె ఉన్లోప మగు నని ప్రౌఢవ్యాకర్త వివరించెను. ఇట్టి చింతా మణివివరణము లిం దింకను గలవు. ఇట్టికారణములనుబట్టి ప్రౌఢ వ్యాకరణము చింతామణికి శేష మగును.

iv. **త్రిలింగలక్షముల కెల్ల శేషమె :**

చింతామణి బాలవ్యాకరణములకె కాదు. అంతకు పూర్వ మున్నత్రిలింగలక్షణముల కన్నింటికిని ప్రౌఢవ్యాకరణము శేషమె.

'దీర్ఘ స్స్యా ద్వర్ణనిర్దేశే' అన్నది వికృతివివేకము. 'విధానో చ్చారణముల' వధికముగా ప్రౌఢవ్యాకర్త పేర్కొనెను.

'పురమునందలివా రని పొసగ బలుకునెడ పురంబునవా రని ఇడగవచ్చు' అని కవిసంశయవిచ్ఛేదము. సప్తమీతత్పురుషమునందు నవర్ణకంబు నగు. అని ప్రౌఢవ్యాకర్త లక్షణము చేసెను.

'రాహువు బాహువు తరు వనంగ రాహు బాహు తరు వన రాజభూష' అని సర్వలక్షణసారసంగ్రహము, మరియు ఆంధ్ర

కౌముదిలో చెప్పబడగా ప్రౌఢవ్యాకర్త లక్ష్యానుగుణముగా రాహు బాహుశబ్దములకె పరిమితము చేసెను.

ఇట్లు ఇతరపూర్వవ్యాకరణములనుండియు గ్రహింపవచ్చును.

300 పైగా సూత్రము లున్న ప్రౌఢవ్యాకరణములో ఆమ్రేడిత స్థలములు అన్వయాదులు మున్నగు అనేకాంశములను చెప్పు 160 సూత్రములు అనగా సగము గ్రంథము ప్రౌఢవ్యాకర్త స్వతంత్రముగా చెప్పినదే అనవచ్చు.

కొన్ని అంశములు పూర్వవ్యాకర్తలు చెప్పినవిగానె తోచినను అట అభిప్రాయభేదములను పరిష్కరించుచు ఉచితపక్షమును నిర్ధారించుటచే నట్టిలక్షణములు త్రిలింగలక్షణశేషములె యగును. అక ప్రత్యయాంతాన్వయంబు కళయ. మొదలగున విట్టివి.

ప్రౌఢవ్యాకరణమందలిలక్షణములు పూర్వవ్యాకరణములందు చెప్పబడినట్లు కొన్ని యెడల తోచినను. అవి యథాతథానువాదములు కాక వివరణాత్మకము లైయుండుట గుర్తించినచో నిది వానికిని శేషగ్రంథమె యని తెలియవచ్చును.

కానా త్రిలింగలక్షణశేషము అనునామము ప్రౌఢవ్యాకరణమునకు సార్థకముగనె చెప్పవచ్చును. అయ్యును లక్షణము నేర్పరుచుటలో ప్రౌఢవ్యాకర్త మరి కొంత జాగరూకత తీసికొన్న నీనామము ఇంకను దృఢముగా సరిపడెడి దని తోచుచున్నది.

## .10 ప్రౌఢవ్యాకరణము- బాలవ్యాకరణమునకు శేషగ్రంథము

### ప్రౌఢవ్యాకరణము :

'త్రిలింగలక్షణశేషము అను ప్రౌఢవ్యాకరణము అని సీతారామాచార్యులుగారు తమవ్యాకరణమునకు ప్రౌఢవ్యాకరణము

అనుపేరు ముఖపత్రముపై ఉంచిరి. ఈపేరు గ్రంథాంతర్భాగమున గానరాదు. ప్రౌఢవ్యాకరణము అనుపేరుపై ఈవ్యాకర్తకు విశేష ఏల మక్కువ గలిగినదో.

కాని ప్రౌఢవ్యాకరణము అనుపేరు బాలవ్యాకరణమును స్మరింపజేయును. ఈపేరు బాలవ్యాకరణమును మించినది, దానికి తరువాతి గ్రంథము అనుఅభిప్రాయమును గల్గించును. అది ఉద్దేశించియే ప్రౌఢవ్యాకరణ మనుపేరు తగిలించె నేమొ. ప్రౌఢవ్యాకరణ మనుపేరె ప్రచారములోనికి వచ్చుటకు గాని ఇది బాలవ్యాకరణశేష మనునుద్దేశమునకు గాని బాలవ్యాకరణమునకు గల ప్రసిద్ధి కారణము కావచ్చును.

**బాలవ్యాకరణశేషము :**

గ్రంథకర్త తరుచుగా ప్రస్తావించిన 'త్రిలింగలక్షణశేషము' అనుపేరునుబట్టియు ఇది బాలవ్యాకరణమునకు గూడ శేష మనును. బాలవ్యాకరణమును త్రిలింగలక్షణమె కదా. ప్రచారములోనుండి ప్రసిద్ధ మగుటయు, చింతామణిప్రభావము గలిగియుండుటనుబట్టియు బాలవ్యాకరణము నుద్దేశించియే ఇందు పెక్కులక్షణములు చేయబడిన వని తోచు. అందువలననే చింతామణ్యాదు లనుక్తతాంత్ర వ్యాకరణశిష్టము లగులక్షణములు గూడ ఇందు చెప్పబడినను ఆధిక్యము, స్పష్ట మగుసంబంధము ననుసరించి ఇది బాలవ్యాకరణశేష మనునభిప్రాయము ప్రబలినది.

ఇందలిలక్షణమునకు బాలవ్యాకరణముతో గలసంబంధము నిట్లు గమనింపవచ్చును.

**i. వివరణాత్మకములు :**

బాలవ్యాకరణమునందు ఆయాలక్షణములఅభిప్రాయ మట స్పష్టముగా లేక సందేహము గల్గు నని తలచినచోట సూరిసూత్రము

లచే సిద్ధించు అర్థమునె స్పష్టము చేయుచు ప్రౌఢవ్యాకరణము వివరణాత్మకము లగులక్షణములు చేసినది.

'ఉండిశబ్దము పరం బగునపుడు వలనకు ద్వితీయాసప్తములు ప్రాయికంబుగ నగు' అని బాలవ్యాకరణము. ఇట 'సప్తమి' అని సామాన్యముగా చెప్పుటచే సప్తమీవిభక్తు లగు 'అందు-న' ప్రత్యయములు రెండును లక్షణసిద్ధము లగును. 'సంప్రదానంబునకుం జతుర్థి యగు' అనుచో చతుర్థు లగు కొఱకు-కయి అనునవి రెండు నగుచునే యున్నవి. సూరి 'వనమందుండివచ్చె' అని అందు ప్రత్యయము నుదాహరించెను. సూరి ఉదాహరింపనికారణముగా సప్తమి అయినను 'న'వర్ణకము రా దని సందేహింతు రేమొ అని శంకించుకొని ప్రౌఢవ్యాకరణము 'ఉండిపదంబు పరం బగుచో వలనకందువర్ణక మట్లు నవర్ణకంబు నగు' అన్నది. ఇది బాలవ్యాకరణసిద్ధమె కావున దాని అభిప్రాయము నీలక్షణము వివరించుచున్న దని తెలియవచ్చు. ఈ సూత్రమునందలి 'అందువర్ణక మట్లు' అనుదళము బాలవ్యాకరణోదాహృతిని పరామర్శించుచు బాలవ్యాకరణము నుద్దేశించియె చెప్పబడినట్లు స్పష్టముచేయు. ఇట్టివి ప్రౌఢవ్యాకరణమునకు బాలవ్యాకరణముతో గలసన్నిహితసంబంధమును నిరూపించు.

ఓశబ్దము 'సంబోధ్యవాచకమునకు ముందే ప్రయోగింపబడు' అని చెప్పినసూరివచనములోని 'ముందే' అనుమాటలో అవ్యవహితము కావలె నేమొ యనుసందేహము గల్గుచుండగా 'ఓశబ్దం బొక్కచో సంబోధ్యవాచకమునకు ముం దితరశబ్దవ్యవహితం బయి కానంబడియెడి' అను ప్రౌఢవ్యాకరణలక్షణము దానిని వారించుచున్నది.

'నకారం బసాధారణంబు ద్రుతంబు' అను ప్రౌఢ. సూత్రమును దానివివరణమును- బాలవ్యాకరణములో ద్రుతప్రకృతికములను అట నట సాధించి ఉదాహరించిన సూరిఅభిప్రాయములను ఒక

చోటికి దెచ్చి చెప్పుచు బాలవ్యాకరణమున కీలక్షణము వివరణాత్మక మగుచున్నది.

'ఒకానొకచో ద్వంద్వంబునం బూర్వపదంబు క్లీబసమం బగు' అను ప్రౌఢ. లక్షణము "అచ్ఛికశబ్దంబుతోడ స్త్రీసమంబు ప్రాయికంబుగ ద్వంద్వం బగు" అను బాలవ్యాకరణలక్షణమందలి ప్రాయికశబ్దమునకు వివరణమె.

ii. **సవరణములు :**

బాలవ్యాకరణమునందలిఅభిప్రాయము కవిప్రయోగాదులకు భిన్నముగా కనబడినచోట్ల లక్ష్యానుగుణముగా ప్రౌఢవ్యాకరణము సవరించినది.

ఇయలోనిఇకారమునకు కొందరు లోపము చెప్పిరి గాని అది కవిప్రయోగములందు మృగ్య మనియు "ముత్తియశబ్దమునందు మాత్ర మిత్వలోపంబు గానంబడియెడి" అనియు బాలవ్యాకరణము పేర్కొన్నది. 'ముత్తియశబ్దేతరంబులయందును దఱుచుగ నిత్వలోపంబు గానంబడియెడి' అని ప్రౌఢవ్యాకరణ మాఅభిప్రాయమును సవరించినది. ఇందలి 'ముత్తియశబ్దేతరంబులయందును (తఱుచుగ-గానంబడియెడి) అనుదళము ఈలక్షణము బాలవ్యాకరణము నుద్దేశించియే చెప్పబడిన దని స్పష్టము చేయుచున్నది.

'విను మనియె- ఇచ్చట నచ్చు పరం బయినది కాబట్టి లోపము లేదు' అనుబాలవ్యాకరణమును సవరించుచు 'మధ్యమపురుషమువర్ణకంబున కచ్చు పరంబగునపుడును లోపంబు చూపట్టెడి' అని ప్రౌఢవ్యాకరణముపేర్కొన్నది. ఇందలి అచ్చు పరం బగునపుడును అనుదళము బాలవ్యాకరణమునే యుద్దేశించి చెప్పుటను నిరూపించును.

'బహువ్రీహిని స్త్రీవాచ్యం బగుచో నుపమానంబు మీఁది మేనునకు బోఁడి యగు' అని బాలవ్యాకరణము,అలరుబోఁడీత్యాదు

లుపమానపూర్వపదకర్మధారయంబులు' అని ప్రౌఢవ్యాకరణము సవరణము. ఇట అలరు+మేను. అను బాలవ్యాకరణప్రక్రియనుగూడ అలరు+పోఁడి అనుతీరుగా ప్రౌఢవ్యాకరణము సవరించినది.

అలఘురేఫము తత్సమతద్భవములందు లే దని బాలవ్యాకరణము. తద్భవంబులందును నలఘురేఫము గల దని ప్రౌఢవ్యాకరణము సవరణము.

'విశ్వకర్మాదులకు స్త్రీత్వం బగు' అని బాలవ్యాకరణము. 'విశ్వకర్మం డనియు రూపంబు' అని ప్రౌఢవ్యాకరణముసవరణము.

ఇట్లే కపిలగడ్డము, ప్రాణగొడ్డము- మొద లగువిషయము లందు ప్రౌఢవ్యాకరణము బాలవ్యాకరణాభిప్రాయమును సవరించు చున్నది.

iii. **పూరణములు :**

బాలవ్యాకరణమున ప్రతిపాదింపబడినలక్షణము నామోదించుచు దానికి సంబంధించినవి శేషాంశమును పేర్కొనుచు సమగ్రపఱచుట ప్రౌఢవ్యాకరణమునందు కొన్ని యెడల కనవచ్చును.

లెమ్ము+లెమ్ము అని యుండగా 'ఆమ్రేడితంబు పరం బగు నపుడు మధ్యమముమువర్ణలకు లోపంబు విభాష నగు' అను బాలవ్యాకరణలక్షణముచే 'ము' లోపించి లెలెమ్ము- అని యగును. 'లేలెమ్ము' అని కావలసినరూపసాధనము బాలవ్యాకరణమున అసమగ్రముగ నిలిచిపోయినది. 'ఆమ్రేడితంబు పరం బగునపుడు కృతహ్రస్వంబునకు దీర్ఘం బగు' అనులక్షణముచే ప్రౌఢవ్యాకరణము దానిని పూరించినది.

'షష్ఠీసమాసమునం దుకారఋకారముల కచ్చు పరంబగు నపుడు నుగాగమం బగు' అని బాలవ్యాకరణముచెప్పిననుగాగమము నంగీకరించుచునె ప్రౌఢవ్యాకరణము 'కొన్నిచోట్ల షష్ఠీసమాసంబునం దుకారంబున కచ్చు పరం బగునపుడు నుగాగమంబునకు లోపం బగు' అని దానికి క్వాచిత్కముగా లోపము చెప్పినది. నుగాగమము రా

దనక (వచ్చి) లోపించు ననుటచే ఈప్రౌఢవ్యాకరణలక్షణము బాల వ్యాకరణమునకు పూరక మనవచ్చును.

ఇట్లే కంటె-అందుపరకనగాగమము, శత్రర్థ'చు'పరకపత్వము మొద లగువిధులు బాలవ్యాకరణమునకుపూరణములుగాచెప్పుదురు.

బాలవ్యాకరణమున సర్వనామరూపములపట్టిక ఈయబడినది. ప్రౌఢవ్యాకరణము వానిప్రక్రియ నిరూపించినది. ఇట్టివి పూరణము లుగా చెప్పవచ్చును.

iv. **విశేషలక్షణము :**

బాలవ్యాకరణము స్పృశింపనిఅనేకము లగుఅంశములు ప్రౌఢ వ్యాకరణమున చెప్పబడినవి. విశేషణములు, జాత్యేకవచనాదులు, ద్విరుక్తిస్థలము, వాక్యప్రకరణము మొద లగునవి ఇట్టివి.

ఇట్లు బాలవ్యాకరణమునకు వివరణాద్యాత్మకముగా ప్రౌఢ బాలవ్యాకరణము వ్యాకరణమునకు శేషగ్రంథ మని పేర్కొనదగిన విధముగా మిక్కిలి సన్నిహితసంబంధముతో రచింపబడినది.

## 11. బాలవ్యాకరణము శాసనాత్మకము,- ప్రౌఢవ్యాకరణము వర్ణనాత్మకము

వ్యాకరణమునకు శబ్దశాసనము, శబ్దానుశాసనము అనియు వ్యవహారము. శబ్దములను శాసించునది (శిక్షించునది) శబ్దశాసనము. అనగా ఈశబ్ద మి ట్లుండవలెను, ఈశబ్ద మి ట్లుండరాదు అనురీతిని శాసించునది వ్యాకరణము. తెలుగునకు తెలుగులో వ్రాయబడిన వ్యాకరణములలో బాలవ్యాకరణము సుప్రసిద్ధమైనది. పిదప ప్రౌఢ వ్యాకరణమును అట్టిదె.

ఇందు బాలవ్యాకరణము శాసనాత్మక మైనది కాగా ప్రౌఢ వ్యాకరణము వర్ణనాత్మక మయినది.

**శాసనాత్మకత్వము :**

శాసించునట్టిపద్ధతిలో చెప్పుట శాసనాత్మకత. అనగా, అగును, వచ్చును మొదలగువిధముగా విధిముఖముగా గాని, లేదు, కాదు మొదలగువిధముగా నిషేధముఖముగా గాని శబ్దమును శాసించుచున్నట్లుగా చెప్పుట శాసనాత్మకత అని గ్రహింపదగును.

**బాలవ్యాకరణము శాసనాత్మకము :**

తెలుగునకు ప్రాథమికాంశములతో ప్రారంభించి లక్షణము చేసినబాలవ్యాకరణ మిట్టిది.

“ఉత్తున కచ్చు పరంబగునపుడు సంధి యగు, పుంలింగ మగు మహద్వాచకమునకు డుఙ్ఙగు” మొదలగులక్షణములు విధిముఖముగా శాసించునవి.

“క్త్వార్థంబైనయిత్తునకు సంధి లేదు, నిర్జినామంబుల కయుగాగమంబు గలుగదు” మొదలగునవి నిషేధముఖముగా శాసనము చేయునవి.

ఇట్లు వివరణమునందు సైతము సూరివచనములు శాసనాత్మకముగా నుండుట గుర్తింపవచ్చును.

పత్వంబు హెచ్చునకుం గలుగదు, మెచ్చునకు పైభాషికంబు మొ॥

ఈవిధముగనె కూఁతుళ్ళు, కూఁతురని, చేతురు, కోతురు ఇత్యాదులు గ్రామ్యము లని బాలవ్యాకరణము శాసించెను.

కొన్నియెడల ద్రుతంబుమీఁద నకారంబు గానంబడియెడి. కెంధూళి, కెంజడ లనియుఁ బ్రయోగంబులు గానంబడియెడి నను తీరుగా నట నట ప్రయోగవర్ణనము బాలవ్యాకరణమున లేకపోలేదు. కాని యిట్టివి అరుదు.

కాగా బాలవ్యాకరణమునందలిలక్షణము దాదాపుగాతొంబది వంతులు శబ్దస్వరూపమునుగూర్చి శాసించునవె యగుటనే బాల వ్యాకరణము శాసనాత్మక మనుట స్పష్టము.

**వర్ణనాత్మకత :**

వర్ణనము అనగా వివరించుట. ఈశబ్ద మి ట్లుండవలె లేదా ఇట్లుండరా దనురీతిగా శాసించుపద్ధతి శాసనాత్మకత గా గా, 'ఈశబ్ద మిట్లున్నది' అనురీతిగా శబ్దముయొక్క స్వరూపమును ఉన్నదానిని వర్ణించుచున్నట్లుగా చెప్పుట వర్ణనాత్మకత.

అనగా కవిప్రయోగములందు ఆశబ్ద మె ట్లున్నదో గమనించి ప్రయోగములం ది ట్లున్నది. కాన ఇట్లుండును. అనురీతిగా వర్ణించుట.

**ప్రౌఢవ్యాకరణము-వర్ణనాత్మకము :**

ప్రౌఢవ్యాకరణ మీమార్గములో రచించబడినది. ఆవిషయమును ప్రౌఢవ్యాకర్తయే గ్రంథారంభమున చెప్పినమాటలవలన గ్రహింపవచ్చును.

"తద్భారతాదిగ్రంథపరిశోధనంబుచే దొరకినవి శేషలక్షణ ప్రయోగముల నేర్చి కూర్చి త్రిలింగలక్షణశేషం బను నొకయపూర్వ వ్యాకరణమును దీని వ్రాసితిని."

ఆచార్యులుగారు శబ్దరత్నాకర మనునిఘంటువును నిర్మించుటకై సంపాదించినకవిప్రయోగములను గూర్చి యీవ్యాకరణము రచించి రనుట సారాంశము. ఇట్లె కవిప్రయోగములం దున్నవిశేషములను వివరించి చెప్పుటకై యారంభింపబడినది గాన నిదివర్ణనాత్మకమైనది.

ఈలక్ష్యమునుబట్టియే కాక యిందలిలక్షణము చేయబడిన తీరును నట్లె ప్రయోగవర్ణనాత్మక మయియున్నది.

'ఇప్రయాంతవ్యయంబునకు సంధియుఁ జూపట్టెడి, తచ్ఛబ్దాంతము లగుధాతుజవిశేషణంబులమీఁద నరు చూపట్టదు'

మున్నగుతీరుగా 'చూపట్టు-కానంబడు'- మొదలగుక్రియలు

తోనె ప్రౌఢవ్యాకరణలక్షణము పెక్కుభాగము ప్రయోగముల స్వరూపమును వివరించి చెప్పునదే అగుచున్నది.

ఇట్టిక్రియాపదము లేకున్నను 'ప్రాసంబున మకారంబు పరం బగుచో ద్రుతంబునకు మకారాదేశం బగు' అనుచో 'ప్రాసంబున' అనుదళము ఈలక్షణము ప్రయోగవివరణమె అని నిరూపించును.

'కొన్ని యెడలఁ దెలుఁగులమీఁదిసాంస్కృతికశపలకు గదనలు గానంబడియెడి' అనుచో 'కొన్ని యెడల ననగా ప్రాసంబులం దని యర్థము' చేయుట ఇట్టిదే కదా.

సర్వనామప్రకరణాదులలో విధినిషేధాదిరూపముగా శాసనాత్మక మగులక్షణము ప్రౌఢవ్యాకరణములో లేకపోలేదు. అదిమిక్కిలి అల్పము.

ఇంక ప్రౌఢవ్యాకరణమునందు లక్షణ మంతటికిని దాదాపుగా కవిప్రయోగములె ఆధారములు. వానినిబట్టి చూడగా ఈప్రయోగములను వర్ణించునదే దానిలక్షణము నని స్పష్టముగా గుర్తింప వచ్చును. బాలవ్యాకరణమున నిట్టిస్థితి తక్కువ.

కవిప్రయోగములందు కానవచ్చినవి శేషములు నిరూపింప దలచుట అనుగ్రంథకర్తయె పేర్కొన్నరచనాలక్ష్యమునుబట్టియు, లక్షణము చెప్పినవిధానమునుబట్టియు, ప్రయోగప్రదర్శనమునుబట్టియు నీప్రౌఢవ్యాకరణము ప్రయోగములను లక్షణమున వివరించున దై యున్న దనుట స్పష్టము.

కాగా అధికముగా ప్రయోగవివరణము చేయుచున్న ప్రౌఢవ్యాకరణలక్షణము వర్ణనాత్మక మగువ్యాకరణ మనుటలో సందేహము లేదు.

# 12. బాలప్రౌఢవ్యాకరణములు - సంస్కృత వ్యాకరణప్రభావము

**తెలుగువ్యాకరణము :**

అత్యంతప్రాచీనకాలముననె ఏర్పడి విస్తరించిన తెలుగు వ్యాకరణము రచనావిధానములో మూడుభేదములు గోచరించును. కొన్ని సంస్కృతప్రాకృతవ్యాకరణప్రభావముతో తన్మార్గమున రచింపఁబడినవి. ఆంధ్రకౌముది మొదలగువానిలో నీఅనుసరణ అత్యధికము, ఆంధ్రభాషాభూషణము మొదలగుకొన్నివ్యాకరణములు స్వతంత్రమార్గములో రచింపబడినవి కలవు. ఆధునికాంధ్రవ్యాకరణములు కొన్ని ఆంగ్లవ్యాకరణప్రభావమునకు లోనయి రచింపబడినవి. ప్రౌఢవ్యాకరణమున అపూర్వముగా వాక్యపరిచ్ఛేద మారంభించుటలో ఆంగ్లవ్యాకరణ ప్రభావము గలదు. కాని అందలిలక్షణము మాత్రము సంస్కృతసంప్రదాయానుగుణమె అనుట గమనింపవచ్చును.

**సంస్కృతవ్యాకరణప్రభావము :**

చింతామణి మరియు కొన్నివ్యాకరణములలో సంస్కృతముతోపాటు కొలదిగాప్రాకృతవ్యాకరణములప్రభావమును గోచరించును. చింతామణిమార్గములో రచింపబడినవె అయినను చింతామణికోవవ్యాకరణములందు గలప్రాకృతవ్యాకరణప్రభావము బాలప్రౌఢవ్యాకరణములపై లేదు. సంస్కృతవ్యాకరణములలోను పాణినీయము (వైయాకరణసిద్ధాంతకౌముది) ప్రభావమె తెలుగువ్యాకరణములందు గానవచ్చెడిని.

బాహ్యాభ్యంతరవిషయములలో తెలుగువ్యాకరణముపై దీనిప్రభావము నిట్లు గుర్తింపవచ్చును.

**బాహ్యనిదర్శనములు. (i) పరిచ్ఛేదవిభాగము :**

బాలవ్యాకరణమున తెలుగుభాషాలక్షణము 'సంజ్ఞా-సంధి-

తత్సమ-ఆచ్ఛిక - కారకాదిపరిచ్ఛేదములుగా విభజింపబడియున్నది. ఇందలితత్సమాచ్ఛికములను శబ్దపరిచ్ఛేదముగ నేకము చేసినప్రౌఢ వ్యాకరణమునను పరిచ్ఛేదవిభాగ మింతే. ఈపరిచ్ఛేదవిభాగము వైయాకరణసిద్ధాంతకౌముదియందలిపరిచ్ఛేదవిధానమును అనుసరించి యున్నది. సంస్కృతభాష కున్నవిస్తృతి తెలుగునకు లేకుండుటచే సంధిశబ్దసమాసతద్ధితాదులలో కౌముదియందలివి శేషవిభాగము తెలుగున లేకున్నను, తెలుగునకు తగినరీతిలో అవాంతరవిభాగము గలదు. తత్సమపరిచ్ఛేదము అజంతహలంతప్రకరణములు, ఆచ్ఛిక పరిచ్ఛేదమున సర్వనామ, ఔపవిభక్తికప్రకరణములు మొదలగున విట్టివి.

కాగా లక్షణవిషయము తెలుగునకు తగినరీతిలో సంస్కృత వ్యాకరణమార్గము ననుసరించి ఆక్రమములోనె ఆయాపరిచ్ఛేదము లుగా విభజింపబడిన దని గుర్తింపవచ్చును.

ఆంధ్రకౌముది మొద లగువానిలో గ్రంథనామములందే తత్ప్రభావము గోచరించును.

**(ii) సూత్రాత్మకరచనము :**

అల్పాక్షరత్వాదిలక్షణములతో పాణినీయమువలె ఈవ్యాకర ములును సూత్రాత్మకములుగా రచింపబడినవి. ప్రౌఢవ్యాకరణమున మాత్రము కొన్నిసూత్రములు వివరణములవలె సాగినవి. 'జిత్తు బిందుపూర్వం బగు- అనుసూత్రముచేత మున్నగురీతిని వీనిని సూత్రములుగా సూరియు పేర్కొనెను.

**(iii) వృత్తిరచనము :**

సిద్ధాంతకౌముదియందువలె నీవ్యాకరణములలో సూత్రము లకు సంగ్రహముగా వృత్తి వ్రాయుట అట నట గానవచ్చును.

జిత్తు బిందుపూర్వం బగు- జకార మిత్తుగా గలదానికి ముందు బిందువు వచ్చు నని యర్థము.

అకప్రత్యయాంతావ్యయంబు కళయ - వ్యతిరేకార్థకభూతకాలికాసమాపకక్రియ ద్రుతప్రకృతికము కాదని యర్థము.

కొన్నియెడల సూత్రములందలిముఖ్యపదముల కర్థము వ్రాయబడినది. కొన్నియెడల స్పష్టము, ఉక్తము అనురీతిని వివరించుటయు గానవచ్చు.

### iv. వార్తికములు :

సంస్కృతవ్యాకరణమునవలె ఇందును సూత్రముకంటె విశేషాంశమును వార్తికములుగా వివరణమునందు పేర్కొనుట ఈవ్యాకరణములందు గలదు.

పత్వంబు హెచ్చునకుం గలుగదు. వర్గువునందలివువర్ణకంబొండె లోపించు నొ॥.

### v. ఉదాహరణములు :

ఉదాహరణములు, ప్రత్యుదాహరణములతో లక్షణమును స్పష్టము చేయుట కౌముదియందువలె ఇందును గలదు.

విను మనియె. ఇచ్చట నచ్చు పరం బయినది కాబట్టి లోపము లేదు. అద్విరుక్తం బనుటచే తేపతేపకు - నొ॥

ఉదాహరణములుగా బాలవ్యాకర్త కొన్నియెడల కవిప్రయోగములను ప్రదర్శించెను. కవిప్రయోగమూలక మగుటచే ప్రౌఢవ్యాకరణమున కవిప్రయోగప్రదర్శనము ప్రచురము.

### ఆభ్యంతనిదర్శనములు :

గ్రంథాంతర్విషయములందు సంస్కృతవ్యాకరణప్రభావమింకను గాఢము. సంస్కృతలక్షణమును సమన్వయించుకొనవలసిన తావులు కొన్ని కాగా సంస్కృతలక్షణము ననువదించినతావులును, అనుసరించి స్వతంత్రముగా చెప్పినతావులును గలవు.

**i. సంజ్ఞలు :**

ఉపధ, ఆమ్రేడితము, ఉత్తమము, అవసానము మొదలగు అనేకసంజ్ఞలు సంస్కృతమునుండియే గ్రహింపబడినవి. ఉపధ యనగా తుదివర్ణమునకు ముందువర్ణము మొదలగురీతిని కొన్నిసంజ్ఞల యర్థము సంస్కృతమునుండి యనువదింపబడినది. ఇట్టిస్థితి కారక (సమాస)ప్రకరణమున అధికముగా గానవచ్చు. ఉత్తమము, అవసానము మొదలగుసంజ్ఞలనుగూర్చి తెలుగున వివరింపబడలేదు. సంస్కృతలక్షణము నాశ్రయించియే వీనినిగూర్చి తెలియవలయును.

పరుషము సరళము మున్నగువానిని పూర్వాంధ్రవ్యాకరణములనుండి స్వీకరించినయీ వ్యాకరణములు సంస్కృతసంప్రదాయానుగుణముగా లాఘవాదిప్రయోజనములకై ముత్తు త్రికము మొదలగుసంజ్ఞలను స్వతంత్రముగా నేర్పరచినవి.

**ii. ఇత్తులు :**

నుక్, లట్, మొదలగురీతిని కకారము, టకారము మొదలగునవి సంస్కృతానుసారముగా ఇత్తులుగా స్వీకరింపబడినవి. నుమ్ అనుచో ప్రౌఢవ్యాకర్త మిత్తు స్వీకరించెను. లజి, ముజ్ ఇత్యాదిగా సంస్కృతసంప్రదాయములో ఇత్త్వప్రయోజనములకయి జి మొదలగునవి ఇత్తులుగా చెప్పబడినవి.

**iii. ప్రత్యాహారాలు :**

'లకారంబునకు ముప్పురుషము ఞగు' అనుచో 'ఞకారంబు ప్రత్యాహారార్థంబు' అని చెప్పి సూరి తుఞు, వుఞు, మొదలగు ప్రత్యాహారములను ప్రయోగించెను. ఇట్లు ప్రత్యాహారములు చేయు విధానము సంస్కృతవ్యాకరణము ననుసరించినదే.

**iv. పరిభాషలు :**

లక్షణవిధానము సంస్కృతపరిభాషల ననుసరించి యుండుట

యీ వ్యాకరణములందు సమానము. 'ప్రథమమేతరవిభక్తివిధి నిరవకాశంబు గావున దీనిని బాధించెడిని' అను సూరివివరణము 'నిరవకాశా హి విధయః సావకాశాన్ విధీన్ బాధన్తే' అను సంస్కృతపరిభాష మూలముగా గల్గినదే. నుక్ టుక్ అనుచో 'ఆద్యన్తౌ టకితౌ' యను నదియు, ప్రౌఢవ్యాకర్త చెప్పిన 'నుమ్' అనుచో 'మి దచో ఽన్త్యాత్పర' అనునదియు మొదలుగా సంస్కృతపరిభాష లట సమన్వయించి నపుడే యీవిధానములు సరిగా కుదురును. ఇట్లె షష్ఠీస్థానే యోగా, విభక్తిలకారము అనుచో యదాగమా స్తద్గుణీభూతా స్తద్గ్రహణేన గృహ్యన్తే యని మొదలుగా పెక్కుపరిభాషలు ఈవ్యాకరణము లందు సమన్వయింపవలసియున్నవి.

### v. కార్యవిధానములు :

నిత్యము- విభాష- వైకల్పికము- బహుళము మున్నగా ఆయాకార్యములు విధింపబడినతీరు సంస్కృతానుగుణము. వాని స్వరూపము సంస్కృతమునుండియే తెలియవలెను. ఇట్లె, ఆగమ,- ఆదేశాదిపద్ధతులు మొ॥

'విధానసామర్థ్యముచే నిత్యమునకు లోపము లేదు'

'వ్యవస్థితవిభాషచే నిత్యతంబునకు సంశ్లేషంబు లేదు.' అను తీరుగా విధానసామర్థ్యపద్ధతి, విభాషకు వ్యవస్థ చేయుట మొదలగు పద్ధతులు సంస్కృతవ్యాకరణము ననుసరించినవే.

### vi. జ్ఞాపనవిధానము :

'ఈజ్ఞాపకంబుచేతనె నామంబులకు ధాతుత్వవివక్షయం దించుగాగమం బగు- ఆంధ్రశబ్దచింతామణియందుం గలఇదమద సిత్యాదిసూత్రమందలియదఃప్రభృతులు వ్యర్థము లగుచు స్వేతరంబులకును సకార్యంబు లని తెలుపు'- మున్నగువిధముగా నాయా లక్షణభాగములు వ్యర్థము లయి అర్థాంతరమును సాధించుచు

ప్రయోజనవంతములై సార్థకము లగునట్లు వర్ణించుట సంస్కృత పద్ధతియె.

vii. **(అధికార)సూత్రవిశేషము :**

సంజ్ఞా, పరిభాష, మొదలుగా విధానముతీరునుబట్టి సూత్రములలో గలభేదములు బాలప్రౌఢవ్యాకరణములందు గనవచ్చును. 'ధాతువునకు' ఇయ్యది యధికారసూత్రంబు' అనుచో సూరి అధికార సూత్రముగా స్పష్టముగా చెప్పిన యీ'అధికార'పద్ధతి సంస్కృత సంప్రదాయమె.సంజ్ఞాను ఉభయవ్యాకరణములందును ప్రసిద్ధములె.

viii. **సాధనవిధానము :**

ఈశబ్ద మిట్లుండును అని పదస్వరూపమును నిర్దేశించుట కాక ఆయాపదములందు గల్గు వర్ణవికారములను చెప్పుచు రూపములను సాధించువిధానము సంస్కృతానుగుణముగనె ఈవ్యాకరణములందు గనవచ్చును. అంద్వాదులు అందఱ్వాదులు అనురీతిని గణముగా నేర్పఱచుట మొదలగున వీపద్ధతిలోనివి.

xi. **నిపాతలు :**

శాస్త్రముచే నొకతీరుగా నేర్పడవలసినరూపమును ప్రయోగానుసారముగా నింకొకతీరుగా నుండునట్లు నియమించుటను నిపతించుట అందురు. 'వేధ పురోధ పురోధనుడు.' 'తాము తమరు తారు నగు' అనురీతిని బాలప్రౌఢవ్యాకరణములయందు ఈనిపాత విధానములు గానవచ్చును.

x. **ఇతరములు :**

సంస్కృతశబ్దములలింగము, కవిప్రయోగపరామర్శనము మొ॥ అనేకవిధములుగా తెలుగువ్యాకరణములు సంస్కృతవ్యాకరణ ప్రభావముతో తత్సంప్రదాయానుగుణముగా రచింపబడి శాస్త్ర గౌరవము నందినవి. బాలప్రౌఢవ్యాకరణములు రెండును సంస్కృత సంప్రదాయానుగుణముగనె రచింపబడినవను అందుకు నిదర్శనములు బాలవ్యాకరణములో అధికముగా స్పష్ట మగును.

## 13. బిందువు

బిందు రనుస్వారః. అనుస్వారమునకు బిందు వనియు సంజ్ఞ. సున్నయె అనుస్వారము, ఇది స్వరమును అనుసరించియె యుండును.

**భేదములు :**

సంస్కృతప్రాకృతములలో బిందువు నిండుసున్నగా ఒకే విధము. తెలుగునందు మాత్రము 1. ఖండము (అరసున్న) 2. పూర్ణము (నిండుసున్న) అని రెండువిధములు. ఇవి ఒక్కొక్కటి సిద్ధము, సాధ్యము అని మరల రెండువిధములు.

**1. సిద్ధఖండబిందువు :-** శబ్దమునందు సహజముగా (సిద్ధమై) ఉన్న అరసున్న 'సిద్ధఖండబిందువు.' ఉదా. చీఁకటి మ్రాఁను.

**2. సిద్ధపూర్ణబిందువు :-** శబ్దమునందు సహజముగా ఉన్న నిండుసున్న సిద్ధపూర్ణబిందువు. ఉదా. వంక, చెంబు.

**3. సాధ్యఖండబిందువు :-** వ్యాకరణముచే సాధింపబడిన అరసున్న సాధ్యఖండబిందువు. ఉదా. పూచెఁగలువలు, రాముఁడు.

**4. సాధ్యపూర్ణబిందువు :-** వ్యాకరణముచే సాధింపబడిన నిండుసున్న సాధ్యపూర్ణబిందువు. ఉదా. పూచెం గలువలు, తేంట్లు.

**బిందుస్థితి :**

**పరుషసరళములకుముందే :-**

1. సంస్కృత మేతరంబు లయిన తెలుఁగుశబ్దంబులయందుఁ బరుషసరళంబులకు ముందే బిందువు కానంబడుచున్నది." పయి నాలుగువిధము లయినబిందువులును తెలుగున కచటతప (పరుష ములు) గజడదబ (సరళములు) అనువర్ణములకు మాత్రమే పూర్వమున నుండును. ఉ. చీఁకటి, చెంబు, రేఁగు, చెందొవ.

కావున అచ్చతెనుగుమాటలలో స్థిరమునకు పూర్వమునందు

సంధి జరుగక పూర్వము చజలు దంత్య తాలవ్యములలో ఏవి అగునో సంధి జరిగినపిదప ఏఅచ్చుతో గూడినను పూర్వావస్థయందలి దంత్య తాలవ్యతలే యుండును. త్రాచు+ఏది, త్రాచేది. ఇట సంధికి పూర్వము ఉత్వముతో గూడుటచే దంత్యమైనచకారము సంధియైనపిదప ఏకారముతో కూడియున్నను తాలవ్యము గాక పూర్వస్థితి ననుసరించిదంత్యమే యగును. ఇట్టే పచ్చి+ఆకు- పచ్చాకు- అనుచో తాలవ్యము. దంత్యముగా పలుకుచో పచ్చనిఆకు (పచ్చ+ ఆకు) అని అర్థము. ఇట్లె అచ్చు+ఐనది- అచ్చైనది మొ.

**ఉభయములు? :**

'ఒకానొకచో జకారం బుభయంబు నగు' అనుసూత్రముచే ప్రౌఢవ్యాకర్త జకార ముభయ మగుట చెప్పెను. 'తీయంగ బంచదార నెనుదీయంగ' ఇత్యాదులలో చకారమునకును ప్రౌఢవ్యాకర్త పేర్కొన్నస్థితి కలదు. ఇట్లు చజలు కొన్నియెడల ఉభయము లగు నని చెప్పవలసియున్నది. కాని ప్రౌఢవ్యాకర్తయును ఒకఅర్థమున దంత్యమును వేరొకఅర్థమున తాలవ్యమును అగు నని చెప్పుటను బట్టి యివి ఒకేసారి దంత్యతాలవ్యము(ఉభయము)గా ఉచ్చరింపబడుట లేదు. అట్టిఉచ్చారణము అసంభవము. కావున చజలు దంత్యములో కాక తాలవ్యములో అగునే కాని ఉభయము లగుట లేదని గుర్తింపదగును.

**సాంస్కృతికచజలు :**

చజలయెడ దంత్యము, తాలవ్యము అనుభేదము అచ్చతెనుగులోనె. సంస్కృతమున చజలు ఏఅచ్చుతో గూడియున్నను తాలవ్యములు మాత్రమె అగును. కావున దాని ననుసరించి తెలుగునందలి సంస్కృతసమములందును చజలు ఏఅచ్చుతో గూడినను తాలవ్యములే అగును. చంద్రుఁడు. జైత్రయాత్ర మొ॥.

**సాంస్కృతికదంత్యచజలు :**

'సంస్కృతసమంబులం దికారాంతము లయినశబ్దములయు పథాచజలు బహువచనంబు పరం బగునప్పుడు దంత్యము లగును' అనుసూత్రముచే సంస్కృతసమములందును చజలు దంత్యము లగుట కొన్నియెడలఁ గలదు. కోచులు వాజులు మొ॥.

**రాజు :** 'మఱియు రాజుశబ్దం బొక్కటి దంత్యయుక్తంబు గానంబడియెడి' అని సూరి ఉక్త్యముతో గూడినప్పుడు సంస్కృతసమ మగు 'రాజు' అనుశబ్దములో నిజకారము దంత్యమె అగు నని పేర్కొనెను. మహారాజు ఖగరాజు మొ॥ ఇట్లనుటవలన పాండురాజ, చంద్రా! రాజవా? ఇత్యాదులందు 'రాజ'శబ్దమందలిజకారము తాలవ్యమె అగును.

'రాజు వైకృతం బని కొందఱందురు' అనుసూత్రముచే ప్రౌఢవ్యాకర్త దంత్య మగుజకారము గల 'రాజు' అచ్చతెలుఁగుపద మగుటను కొందఱమతముగా చెప్పెను. అయినను సంస్కృతసమ మగురాజుశబ్దములో దంత్యత అంగీకరింపవలసినదే యున్న దని 'మహారాజు' మొదలగుస్థలములు నిరూపించుచున్నవి.

ఇంకను అచ్చు (స్వరము) మొదలగుకొన్నితత్సమములలో దంత్యత వినిపించును.

**దంత్యతాలవ్యములసవర్ణత :**

'తుల్యాస్యప్రయత్నం సవర్ణమ్' అనుసూత్రముచే సంస్కృతమున తాలువు మొదలగుస్థానములును, స్పష్టము మొదలగు ప్రయత్నములును సమానముగా నున్నవర్ణములు సవర్ణము లని చెప్పబడినది. తెలుగునందలి రెండువిధము లగుచజలును, స్పృష్ట ప్రయత్నము సమానముగాఁ గల్గినవే యైనను తాలవ్యచజలకు తాలువును, దంత్యచజలకు దంతములును స్థాన మగుటచే నట్టి భేదము

గలవు. అందుకే సూరి ప్రత్యేకముగా "దంత్యతాలవ్యంబు లయిన చజలు సవర్ణంబులు' అని వీనికి సవర్ణతను సూత్రించెను.

**సావర్ణ్య ప్రయోజనము :**

దంత్యతాలవ్యచజలసవర్ణతకు ప్రయోజనమును సూరి వివరించెను. 'తాలవ్యచకారంబు దంత్యచకారంబునకు, తాలవ్యజకారంబు దంత్యజకారంబునకును గ్రాహకములు' అనగా ఆయాస్థలములందు తాలవ్యచజలచే దంత్యచజలును గ్రహింపబడి తాలవ్యచజలకు విధించిన ఆయాకార్యములు దంత్యచజలకును వచ్చుట యీసావర్ణ్యమునకు ప్రయోజనము.

'కచటతపలు పరుషంబులు' అనుసూత్రమునందలి తాలవ్యచకారముచే దంత్యచకారము గ్రహింపబడును. కావున ఈసూత్రముచే తాలవ్యచకారమునకు విధింపబడినపరుషము అనుసంజ్ఞ దంత్యచకారమునకును సిద్ధించి అదియు పరుషమే అగును.

'గజడదబలు సరళంబులు' అనుసూత్రమందలి తాలవ్యజకారముచే దంత్యజకారము గ్రహింపబడును. కావున దీనిచే తాలవ్యజకారమునకు విధింపబడినసరళము అనుసంజ్ఞ దంత్యజకారమునకును సిద్ధించును.

ఇట్లే 'ప్రథమమీఁది పరుషములకు గసడదవలు బహుళంబుగా నగు' అను సూ. యథాక్రమముగా తాలవ్యచకారమునకు విధింపబడిన సకారాదేశము దంత్యచకారమునకును కల్గును. ఇతఁడు + చిన్న- ఇతఁడు సిన్న-అప్పుడు + చనియె- అప్పుడు సనియె మొ॥.

ఇట్టిప్రయోజనములకై దంత్యతాలవ్యచజలకు తెలుగున సావర్ణ్యము విధింపబడినది.

# 15. ద్రుతము

ఆంధ్రవ్యాకరణవాఙ్మయమున ద్రుతమునకు ప్రత్యేకస్థాన మేర్పడినది. ద్రుతము ఏది అను అంశముననే వివాదములు పెక్కు గలవు.

**ద్రుతసంజ్ఞ :**

'ద్రుత మనఁగా నొల్లసియుండ కుఁగిపోవునది' అని ప్రౌఢ వ్యాకరణము ద్రుతసంజ్ఞను వివరించినది. అవసర మనుకొన్నపుడు లోపించిపోవునది కావున అట్టిది ద్రుత మని అభిప్రాయము. వచ్చెను- వచ్చె. దీనిని సార్థకసంజ్ఞగా గుర్తింపదగును.

**నకారము :**

'ద్రుతాఖ్యో నః' అను ఆంధ్రశబ్దచింతామణి లక్షణము ననుసరించి చిన్నయసూరియును 'నకారంబు ద్రుతంబు' అని పేర్కొనె. నకారము అనగా పొల్లునకారము న్. 'ద్రుతాంతము లయినపదములు ద్రుతప్రకృతికములు' అనుసూత్రమునొద్ద ద్రుతప్రకృతుల చివరి ద్రుతమును పొల్లునకారముగనె చిన్నయ ప్రదర్శించెను.

**సాధారణము కాదు :**

సాధారణముగా పొల్లునకార మెల్లయెడల ద్రుతము అయినచో నకారము చివర గలిగినపదము లెల్ల ద్రుతప్రకృతికము లగును. కాని సూరి ద్రుతప్రకృతు లేవో ప్రత్యేకముగా వివరించెను. కావున సూరి పేర్కొన్న ద్రుతప్రకృతుల పట్టికలో చేరనిపదములు ద్రుత ప్రకృతులు గావు. అనగా అట్టిశబ్దములలో చివర నకార మున్నను అది ద్రుతము గా దనవలెను. నకార మెల్లయెడల ద్రుతము కాని నకారాంతము లెల్ల ద్రుతప్రకృతికములు కావని చెప్పజాలము కదా.

సూరి చూపిన ద్రుతప్రకృతికములలో 1. ద్వితీయ, తాను నేను మొదలగువానియందలి ద్రుతము ప్రత్యయము. 2. తృతీయాదు లందలి నకార మాగమము. 3. అయ్యెన్ అనుచోట ఉన్న నకార మవ్యయము. 4. వలెన్ మొదలగువానిలోనిది ప్రకృతిగతము.

కావున 1. ప్రత్యయము 2. ఆగమము 3. అవ్యయము 4. వలె ప్రభృతులందు శబ్దగతమును అయిన నకారము మాత్రమె ద్రుతము.

**నువర్ణము :**

సూరిమతమున ద్రుతము నువర్ణ మనుటకు కొన్ని ఆధారములు గమనింపవచ్చును.

1. ద్రుతప్రకృతికసంజ్ఞను చెప్పినచోట పొల్లునకారమును చూపినసూరి ద్రుతకార్యములను ప్రదర్శించుసందర్భమున ద్రుతము 'ను'వర్ణముగా చూపెను. పూచెను+కలువలు మొ॥

2. ద్రుతమునకు స్వాత్వమును వివరించుచో 'స్వాత్వ మనఁగా ద్రుతమునకు ప్రకృతిభావ' మని చెప్పి ద్రుతస్వాత్వస్థితిని పూచెను గలువలు, వచ్చెను గోవు లనురీతిగా నువర్ణమును చూపెను. దీనిని బట్టి ద్రుతముయొక్క సహజరూపము 'ను' అని తెలియవలెను.

3. మీఁదిహల్లుతో కూడుకొనుట అనుసంశ్లేషమును ద్రుతమునకు విశేషకార్యముగా విధించుటనుబట్టి ద్రుతము'ను'(ని)వర్ణముగా గుర్తింపవచ్చును. పొల్లే అయిన సంశ్లేషమును విధింప నక్కర లేదు.

4. ఇట్లే అవసానమునందు ద్రుతస్వరమునకు లోపము, ద్రుతంబుమీఁది నకారంబు గాసంబడియెడి మున్నగువిధులు ద్రుతము కేవలము పొల్లునకారము కా దని తెలుపును.

5. ద్రుతమును విధించినచోట్ల సూరి దాదాపు ఎల్లయెడల 'ను'వర్ణమునె చూపుట బలమైనప్రమాణము. 'లూట్టు మున్గున కైమతవర్ణంబులు ద్రుతాంతంబు లగు' అనుసూత్రమున ద్రుతమును విధించుచు కలిగెమను-కలుగుచును' అని ద్రుతమును 'ను' వర్ణముగా జూపెను. ఇట్టిస్థలములు ద్రుతము 'ను'వర్ణ మనునంశమును నిశ్చయించును.

**అసాధారణము :**

ఇట్టిఆధారములనుబట్టి నకారము సాధారణమైనది ద్రుతముగా దనియు కొన్ని ప్రత్యేకలక్షణములు గలిగినది ద్రుత మనియు సూరిమతమును దెలియనగును.

దీనిని గుర్తించిన ప్రౌఢవ్యాకర్త 'నకారం బసాధారణంబు ద్రుతంబు' అని సూత్రించి ప్రత్యయాగమాన్వయాత్మక మై ఉత్వ విశిష్టం బయిననకారంబు ద్రుతంబు' అని వివరించెను. ఇది సూరి తన సూత్రాంధ్రవ్యాకరణములో చెప్పిన- 'విభక్త్యాగమచార్థో ను ద్రుతిః' అనులక్షణమున కనువాదమె- సూరి బాలవ్యాకరణములో ఇంకను అధికముగా 'వలెను' మొదలగువానిలోనిశబ్దగత మైన'ను' వర్ణమును సైతము ద్రుతముగా నిరూపించె. 'అన్వయాత్మకము' అనుటలోనె యిదియు సంగ్రహింపబడును నని ప్రౌఢవ్యాకర్త తలచె నేమొ.

ఇంకను బాలవ్యాకరణము కన్+దోయి- కందోయి, కన్దోయి అని యుదాహరించినస్థలములనుబట్టి 'కన్' మొద లగుచోట్ల శబ్దగత నకారపుపొల్లు ద్రుత మని తలచినట్లు కొంద రూహింతురు.

ద్రుత మయిననయినానువర్ణ మాయాస్థితులలో ఇత్వమును పొంది 'ని' అని అయినను, స్వరలోపముతో 'న్' అని అయినను, 'ఏకదేశవికృత మనన్యవత్' అనున్యాయము ననుసరించి ద్రుతమె యగును. వనమును, రాముని, రామున్.

ను-ని-న్, అను ఈమూడింటిలో నకారముస్థిరముగా (మూలక) ఉన్నది. కావుననె చింతామణి నువర్ణమును ద్రుతముగా చెప్పక 'ద్రుతాఖ్యో నః' అని 'నకారంబు ద్రుతంబు'గా చెప్పినట్లు ప్రౌఢ వ్యాకర్త పేర్కొనెను. నువర్ణమునె ద్రుతముగా చెప్పినను ఈచోట్ల బాధ లేదు.

ద్రుతస్వరూపము :

కావున బాలప్రౌఢవ్యాకరణముల ననుసరించి-

1 ప్రత్యయము : తాను-నేను- చదువును-

2 ఆగమము : నా చేతను, భక్తునను

3 అవ్యయము : అయ్యును, రాముడును

4 'వలెను' మొద లగువానియందున్నదియు అయిన 'ను' వర్ణము ద్రుతము.

అదియును గాక, కన్దోయి మొద లగుకొన్ని స్థలములందు- ద్రుతనువర్ణమునుండి యేర్పడక సహజముగాపొల్లయిననకారము ద్రుత మగుటను విశేషముగాగ్రహింపవలసియున్నది.

## 16. ద్రుతప్రకృతికములు-కళలు

తెలుగుభాషలోనిపదము లెల్ల ద్రుతమునుబట్టి కళలు ద్రుతప్రకృతికములు అని రెండువిధము లగుచున్నవి.

ద్రుతము :

'నకారంబు ద్రుతంబు' ప్రౌఢవ్యాకరణము 'నకారం బసాధారణంబు ద్రుతంబు' అని పేర్కొనినది. ప్రత్యయము గాని, ఆగమము గాని, అవ్యయము గాని అయి ఉత్వముతో కూడియున్న నకారము అనగా 'ను'వర్ణము ద్రుతము. వలెను మొద లగుఅవ్యయములందలిచివరినువర్ణము కూడ ద్రుతమె. ద్రుత మయిన ఈను వర్ణము ఇకారాదులపై నుండి ఇత్వమును పొంది(ని)నను, స్వరము లోపించి పొల్లుగా నున్నను ద్రుతమె అగును. ఇట్లు ను-ని-న్ అను వానిలో స్థిరముగా నుండునకారము నుద్దేశించియే చింతామణి 'ద్రుతాఖ్యో నః' అని పేర్కొన్నట్లు ప్రౌఢవ్యాకరణము వివరించినది. సూరియు 'నకారంబు ద్రుతంబు' అనెను.

**ద్రుతప్రకృతికములు :**

'ద్రుతాంతము లైనపదములు ద్రుతప్రకృతికములు' ద్రుతము చివర గలిగినపదమునకు ద్రుతప్రకృతికము అని సంజ్ఞ. ఇది ద్రుత ప్రకృతి అనియు వ్యవహరింపబడును. ద్రుతప్రకృతికములను చిన్నయ సూరి ఇట్లు వివరించెను.

**1. సుబంతాలు :**

1. **ప్రథమాకయిపట్టియొక్కేతరము లయినవిభక్తులు :** నామ విభక్త్యంత(సుబంత)ములలో ప్రథమావిభక్తి, కయి, పట్టి, యొక్క అనునవి తప్ప మిగిలిన (ఏకబహువచన)విభక్తి చివర గలిగినవి ద్రుతప్రకృతికములు. ద్వితీయ- నన్నును-రాముని; తృతీయ-నాచేతను, నాతోడను;చతుర్థి-నాకొఱకును;పంచమి-నావలనను, నాకంటెను; షష్ఠి-నాకును, మాలోపలను;సప్తమి-మాయందును, ఘటమునను మొ.
2. **నేనుతాను పదంబులు:** ప్రథమాంతములలో నేను తాను అను రెండుశబ్దములు ద్రుతప్రకృతు లగును.

**2. తిఙంతాలు :**

3. **ఉత్తమపురుషైకవచనములు :** క్రియాపద(తిఙంత) ములలో వర్తమానము మొదలగుఅన్నిఅర్థములయందును ఉత్తమ పురుషఏకవచనాంతము లగుశబ్దములు ద్రుతప్రకృతులు- వచ్చుచున్నాను- వత్తును- మొ॥
4. **భూతతద్ధర్మాద్యర్థకప్రథమపురుషైకవచనంబులు:** క్రియాపదము లలో ఇంకను 'భూతార్థక(లిడంత)ములును తద్ధర్మాద్యర్థక (లాడంత)ములును అయినప్రథమపురుషఏకవచనాంతములు ద్రుతప్రకృతులు. భూత-వచ్చెను. తద్ధర్మాది-వచ్చును. మొ॥
5. **ఆశీరాద్యర్థంబు లయిన'ఎడు,త'వర్ణకంబులు :** ఆశీస్సు మొదల గుఅర్థములందు (లాడంతములు) వచ్చు ఎడు-త ప్రత్య

యము లంతమందు గలిగిన క్రియాపదము లెల్ల- ద్రుత ప్రకృతులు. ప్రసన్నులయ్యెదను, కావుతను మొ॥

**3. అవ్యయములు :**

**5. శత్రుతుమానంతర్యచేదాద్యర్థకంబులు :**

1. శతృప్రత్యయార్థక మగు 'చు' ప్రత్యయ మంతమందు గలవి, చేయుచును, 2. 'తుమున్' ప్రత్యయార్థక మగు 'ను' ప్రత్యయ మంత మందుగలవి, చేయను (చేయగా). ఇట భావలక్షణ మును గ్రహింపవలెను. 3. ఆనంతర్యార్థక మగుమున్ ప్రత్యయ మంతమందు గలవి- చేయుమున్, 4. చేత్, వృత్తం బగు భావలక్షణము అర్థము లిచ్చు 'న' ప్రత్యయాంతములు. చేసి నన్- ద్రుతప్రకృతులు.

**7. వలెప్రభృతులు:** వలె మొద లగుఅవ్యయములు ద్రుతప్రకృతిక ములు. సముచ్చయము మొద లగుఅర్థవిశేషముల నిచ్చు 'ను' అనుఅవ్యయము ద్రుతము. కావున అది అంతమందు గలిగినశబ్దములు ద్రుతప్రకృతులు. సీతయును రాముడును మొ॥ ఇంకను వలెను, పోలెను మొద లగుఅవ్యయములు ద్రుత ప్రకృతులు.

**కళలు :**

'ద్రుతప్రకృతులు గానిశబ్దంబులు కళ లనంబడు'.

ద్రుతప్రకృతులలో చేరనిపదము కళ యనుసంజ్ఞను పొందును. వీనికి చివర నకారము (ద్రుతము) ఉండదు. సూరి పేర్కొన్న ద్రుత ప్రకృతుల ననుసరించి కళలను ఇట్లు గుర్తింపవచ్చును.

**1. సుబంతములు :**

**1. ప్రథమాకయుషష్టియొక్కవిభక్తులు :-** 'నేను- తానుఅనునవి తప్ప మిగిలిన ప్రథమాంతములు, కయి యనుచతుర్థి, పట్టిఅనుపంచమి,

యొక్క- అనుషష్ఠి అంత మందుగలిగినపదములు కళలు. ఉదా. రాముండు- విష్ణువులు- గోడ- రామునికయి- జ్ఞానమునుబట్టి- హరి యొక్క- మొ॥

**తిఙంతములు :**

**2. ఉత్తమపురుషైకవచనేతరములు :-** భూతతద్ధర్మాద్యర్థక ప్రథమపురుషైకవచనములును, అన్ని అర్థములందును ఉత్తమపురుషైకవచనములును తప్ప మిగిలినక్రియాపదము లెల్ల కళలు. ఉదా. వచ్చుచున్నాండు, వచ్చిరి, వత్తురు, రావు, రాగలము. మొ॥

**అవ్యయములు :**

**3. క్త్వార్థకాదులు :-** క్త్వాప్రత్యయార్థక మగు 'ఇ' ప్రత్యయమంతమందు గలవి, అట్లె వ్యతిరేకక్త్వార్థకము లగుప్రత్యయాంతములును అయినఅవ్యయములు కళలు. ఉదా. తిని, తినక. మొ॥

'అకప్రత్యయాంతావ్యయంబు కళయు' అని ప్రౌఢవ్యాకర్తయు వ్యతిరేకక్త్వార్థకము కళగా చెప్పెను.

నఱప్రభృతులు ద్రుతప్రకృతికములు గావున నఱప్రభృతులలో చేరని అవ్యయములు కళ లగును. అక్కట ఏల. మొ॥

ఇట్లు కళాద్రుతప్రకృతికములను లాక్షణికులు విస్తరముగనె నిరూపించిరి. విశేషము లేమి యైన ప్రయోగములనుబట్టి గ్రహింపదగును.

## 17. లఘ్వలఘుయరలవలు

'యరలవలు లఘువు లనియు నలఘువు లనియు ద్వివిధంబు లగు' అనుసూత్రముచే తెలుగులో 'య,ర,ల,వ' అనునాలుగువర్ణములును ఒక్కొక్కటి లఘు వనియు, అలఘు వనియు రెండు విధములు,

**లఘువు : అలఘువు :**

'యస్యోచ్చారణే జిహ్వాగ్రోపాగ్రమధ్యమూలానాం శైథిల్యం జాయతే స లఘూచ్చారణః'- ఏవర్ణమును ఉచ్చరించునపుడు నాలుక శిథిల మగునో (సడలు- వదులుగా నుండునో) ఆవర్ణము లఘువు.

అట్టి శైథిల్యము లేక సాధారణముగా ఉచ్చరింపబడునో ఆవర్ణము అలఘువు అగును.

ఉచ్చారణమునందలియిట్టి భేదముచేతనె యరలవలు తెలుగున రెండువిధము లయినవి.

**యకారము**

**లఘువు :**

"సంధి లేనిచోట స్వరంబుకంటెం బరం బయినస్వరంబునకు యడాగమం బగు" అనుసూత్రముచే ఆగమముగా వచ్చినయకారము లఘువు. హరి+అతఁడు-హరియతఁడు మొ॥

**అలఘువు :**

సంధి లేనిచోట ఆగమ మయినది తప్ప ఇతరమైనయకారము ఎట్టి దైనను అలఘువె.

హరియించు - (ఇయుడాగమమందలియకారము)

పోయెను - (ఆదేశ మయినయకారము)

తీయన - (శబ్దసహజ మగుయకారము) మొ॥

**రేఫము :**

**లఘువు :** సాధు రేఫము (ర) లఘువు పెరుగు- కరుగు మొ॥

**అలఘువు :**

శకటరేఫము (ఱ) అలఘువు విఱుగు మెఱుగు మొ॥

**లకారము :**

**లఘువు :** 'ల'కారము లఘువు తల నెల మొ॥

**అలఘువు :** 

బహువచనము పర మైనప్పుడు డ,ర,ల,ళకు ఆదేశముగా వచ్చినళకారము అలఘువు.

త్రాడు+లు=త్రాళులు; వరు+లు=వళులు,

పాలు+లు=పాళులు- త్రాళ్లు మొ॥

వర్ణమాలయందు పరిగణింపబడినళకారము ఈఅలఘుళకారము కాదు. తళుకు, బెళుకు ఇత్యాదులలో నున్నఅళకారము వేరొకటి.

**వకారము :**

**లఘువు :** 'ప్రథమమీఁదిపరుషములకు గసడదవలు బహుళంబుగా నగు' మొద లగులక్షణములచే పకారమునకు ఆదేశముగా వచ్చిన వకారము లఘువు. అతఁడు+పలికె-అతఁడు వలికె. ఊరువల్లెలు మొ॥

**అలఘువు :** పకారమునకు ఆదేశ మయినది తప్ప వే రయిన వకార మెల్ల అలఘువు. చిగురు- చివురు- (గకారమున కాదేశ మైన వకారము) ఆవు (శబ్దసహజ మైనవకారము) మొ॥

## 18. భాషావర్గీకరణము

సంస్కృతమునుండియు, ప్రాకృతమునుండియు కొన్ని పదములు తెలుగులోనికి వచ్చి కలిసినవి. తెలుగుభాష సహజముగా కొంత కలదు. ఇట్టిమొత్తము తెలుగుభాషాపదములను లాక్షణికులు ఇట్లు వర్గీకరించిరి.

**తత్సమము :**

'సంస్కృతప్రాకృతతుల్యం బగుభాష తత్సమంబు.'

సంస్కృతముతో గాని లేదా ప్రాకృతముతో గాని సమముగా నున్న తెలుగుశబ్దము తత్సమము. తెలుగువిభక్తులు, విభక్తినిమిత్తక మగుప్రకృతివికారములు గల్గినసంస్కృతప్రాకృతశబ్దములు తత్సమము లని స్థూలముగా చెప్పవచ్చును.

సంస్కృతముతో సమముగా నున్నది సంస్కృతసమము.

విద్య-(విద్యా). ఆకాశము (ఆకాశః)

ప్రాకృతముతో సమముగా నున్నది ప్రాకృతసమము.

సిరి. (శ్రీః-సిరీ)

సంస్కృతసమము, ప్రాకృతసమములు తత్సమములు. తత్సమమును 'తత్స' యనియు పూర్వులు వ్యవహరించిరి. సమ, తత్సమాది సంజ్ఞలు కేవలము సంస్కృతసమము అనుఅర్థముతో వ్యవహరించుటయు కనిపించును.

**తద్భవము :**

'సంస్కృతప్రాకృతభవం బగుభాష తద్భవంబు'

సంస్కృతమునుండియు, ప్రాకృతమునుండియు పుట్టినభాషకుతద్భవము అని సంజ్ఞ దీనినే ప్రాచ్యులు 'తజ్జ' యనియు వ్యవహరించిరి.

తెలుగువిభక్తులు, విభక్తినిమిత్తకములు నగుమార్పులకంటె ముందుగా సంస్కృతప్రాకృతప్రకృతులు మార్పులను జెందిన నవి తద్భవము లగు నని స్థూలముగా ఊహింపవచ్చును.

సంస్కృతమునుండి పుట్టినభాష 'సంస్కృతభవము'.

ఆకసము- (ఆకాశః)

ప్రాకృతమునుండి పుట్టినభాష 'ప్రాకృతభవము'.

అచ్చెరువు- (ఆశ్చర్యమ్-అచ్చేరం)

సంస్కృతభవ, ప్రాృతభవములు తద్భవములు.

ప్రాకృతసమభవములను గొందఱు సంస్కృతభవములుగా చెప్పుట గానవచ్చును.

**దేశ్యము :**

'త్రిలింగదేశవ్యవహారసిద్ధం బగుభాష దేశ్యంబు'

త్రిలింగదేశమునందలి జనులయొక్క వ్యవహారములనుండి ఏర్పడినభాషకు దేశ్య మని సంజ్ఞ.

ఈశబ్దములపుట్టుకకు వానింగూర్చి తెలియుటకును దేశజన వ్యవహార మొక్కటియె ఆధారము. నేడితరద్రావిడభాషలనుండియు తెలియ నవకాశ మేర్పడె. ఉదా. ఊరు-పేరు.

**గ్రామ్యము :**

'లక్షణవిరుద్ధం బగుభాష గ్రామ్యంబు'.

వ్యాకరణమునకు విరుద్ధముగా ఉన్నభాషకు గ్రామ్య మని పేరు. రాముణ్ణి-తెస్తాను.

గ్రామ్యము లక్షణవిరుద్ధము గావున కావ్యములలో ప్రయోగింపరాదు.

'గ్రామ్యంబు శక్తిజాతివర్ణనంబున బ్రయోగార్హం బగు,' అనుప్రౌఢవ్యాకరణసూత్రము గ్రామ్యము కూడ పాత్రోచితముగా కావ్యములలో ప్రయోగించుట కవకాశము కల్పించుచున్నది. కాని యట్టితావుల నైన గ్రామ్యము ప్రయోగింపబడుట పూర్వకావ్యము లందు వెదుకవలసియున్నది.

**గ్రాహ్య (అనింద్య) గ్రామ్యములు :**

'ఆర్యవ్యవహారంబుల దృష్టంబు గ్రాహ్యంబు'.

నన్నయ మున్నగుమహాకవుల కావ్యములలో కనబడినశబ్దము లెట్టి వైనను అనగా లక్షణవిరుద్ధము లై గ్రామ్యము లైనను అవి గ్రహింపదగినవే. అట్టివి కావ్యములందు ప్రయోగించుట కర్హము లగును. కలకంఠుడు-కపిలకన్నులు- మొ॥ గ్రామ్యము లయ్యును గ్రాహ్యము లగుటచే ఇట్టివానిని 'గ్రాహ్యగ్రామ్యము' లనఁదగును. కొందరు వీనిని 'అనింద్యగ్రామ్యములు' అని వ్యవహరింతురు.

ఇట్లు ఆంధ్రభాష 1. తత్సమము, (సంస్కృతసమము, ప్రాకృతసమము) 2. తద్భవము (సంస్కృతభవము, ప్రాకృతభవము) 3. దేశ్యము 4. గ్రామ్యము అని విభాగింపబడినది. ఇందు గ్రామ్యము కంటె వే ఱయినభాష కావ్యములందు ప్రయోగించుకొనవచ్చును.

ఈ భాష మనోరథమార్గమున 1. సంస్కృతసమము 2. ఆచ్ఛికము అని రెండువిధములుగా విభజింపబడినది. సంస్కృతముతో సమము సంస్కృతసమము. రాముఁడు- విద్య. పూర్వోక్తము.

**అచ్చ: ఆచ్ఛికము :**

'సంస్కృతసమేతరం బయినయాభాష యచ్చ యనంబడు'.

సంస్కృతసమముకంటె వేఱైనది అనగా 1. ప్రాకృతసమము 2. తద్భవము 3. దేశ్యము అనువిధము లయినవి. దీనికి 'అచ్చ' యని పేరు. ఇదియే ఆచ్ఛికము. అచ్చ, ఐనయాంధ్రము అచ్చాంధ్రము. అనగా అచ్చ తెనుగు. సంస్కృతసమము గలియనిది. ప్రాకృతసమ, తద్భవములు గలిసినను నది యచ్చ తెనుఁగే.

ఉదా. సిరి- ఆకసము- అచ్చెరువు- ఊరు.

ఇట్లు భాషాలక్షణమునుబట్టి ప్రాకృతమువలె తెలుగుభాష తత్సమాదులుగా విభజింపబడినది.

## 19. బాలప్రౌఢవ్యాకరణమతభేదములు - తత్సమములు

సూరి తత్సమములుగా పేర్కొనినశబ్దములు కొన్ని తత్సమములు గావని, మఱి కొన్ని వేఱువిధముగా నిరూపించుచు ప్రౌఢవ్యాకర్త సూరిమతముతో భేదిల్లుట గమనించవచ్చును.

**1. కారము :**

'సంస్కృతప్రాకృతతుల్యం బగుభాష తత్సమంబు' అని సూత్రించిన సూరి 'కలుః- కారో - కారము' అని 'కారము' అను తెలుగుశబ్దము 'కారో' అను ప్రాకృతముతో తుల్యమనియు తత్సమమనియు చెప్పెను. కాని ప్రౌఢవ్యాకర్త 'కారము క్షారశబ్దభవము' అని సూత్రించి 'క్షార' అనుసంస్కృతశబ్దమునుండి పుట్టిన దనియు 'కారము' తద్భవ మనియు చెప్పెను. కాని క్షారశబ్దమునకు కార మను అర్థము లేకుండుటచే సూరిమతమే సమంజసము.

## 2. విశ్వకర్ముండు

'విశ్వకర్మాదులకు స్త్రీత్వం బగు' అని సూత్రించి సూరి స్త్రీత్వాతిదేశమువలన దీనికి ఉత్వమ్ములు లేవని స్పష్టము చేసెను. అందువలన సూరిలక్షణముచే, 'విశ్వకర్మ' అనియే యుండవలెను. కాని 'విశ్వకర్ముండు' అని ఉండరాదు. ప్రౌఢవ్యాకర్త 'విశ్వకర్ముం డనియు రూపంబు' అని సూత్రించి విశ్వకర్మశబ్దమునకు ఉత్వమ్ములు వచ్చుటయు కల దని పేర్కొనెను. 'విశ్వకర్మునికూఁతు' అనుపెద్దన గారిదొకేఒక్క ప్రయోగము గుర్తింపదగియే యున్నది.

## 3. రాజు :

"మఱియు రాజుశబ్దం బొక్కటి దంత్యయుక్తంబు గానంబడియెడి' అని సూరి సంస్కృతసమ మగు 'రాజు' అనుశబ్దమున జకారము దంత్య మని వివరించెను. కాని ప్రౌఢవ్యాకర్త 'రాజు ప్రకృతం బని కొందఱందురు' అని సూత్రించి 'రాజు' అనునది తద్భవముగా కొందఱమతమును ప్రస్తావించెను. తద్భవరాజుశబ్ద మున్నను 'మహారాజు, ఖగరాజు' మొదలగుచోట్ల 'రాజు' సంస్కృతసమమునను 'ఒకానొకచో జకారం బుభయంబు నగు'అని చెప్పి 'పాండురాజ' మనుచో తత్సమరాజశబ్దమందలి జకారము దంత్య మగుటను ప్రౌఢవ్యాకర్తయును పేర్కొనెను. కావున ఈవిషయమున ప్రౌఢవ్యాకర్త నిశ్చయముగా సూరిమతమును విభేదించె ననరాకున్నది. కాని 'రాజు' అని ఉత్వముతోఁ గూడియున్నపుడే తత్సమశబ్దమునందు జకారము దంత్య మగునని సూరిమతము. 'పాండురాజ' అనుచో అత్వముతోఁ గూడినది సూరిమతమున తాలవ్యమె. అదియు దంత్యమె అను ప్రౌఢవ్యాకర్తమతము సరి కాదు అట్టి ఉచ్చారణము లేదు.

## 4. విధము :

'కంధరాదులు క్లీబతుల్యంబులు బహుళంబుగా నగు' అనిసూత్రించి బహుళశబ్దముచే విధాఅను స్త్రీలింగశబ్దమునకు క్లీబతుల్యతనిత్యముగా

వచ్చి విధము అనురూప మేర్పడు నని సూరి పేర్కొనెను. ఇచట ప్రౌఢవ్యాకర్త 'విధాశబ్దంబు సంస్కృతంబునం బుంలింగంబు నగు' అని సూత్రించి పుంలింగ మగు 'విధ' శబ్దమె తత్సమ మయి విధము (వృక్షః-వృక్షము)అని యగు ననియు, స్త్రీలింగ మగువిధాశబ్దమునకు తెలుగున ప్రయోగము లే దనియు చెప్పెను. అనగా 'విధా'శబ్దమునకు సూరి క్లీబతుల్యతను చెప్పుట అనవసర మని ప్రౌఢవ్యాకర్తమతము. కాని యెటనో యొకకోశములో నున్నను పుంలింగ మగువిధశబ్దము అప్రసిద్ధము. కావున ప్రసిద్ధ మగుస్త్రీలింగశబ్దమునుండియే తత్సమ రూపమును సాధించిన సూరిమతము సముచితము.

### 5. దంష్ట్రి :

'కంధరాదులు క్లీబతుల్యంబులు బహుళంబుగా నగు' అని సూత్రించి సూరి 'దంష్ట్రా' శబ్దమను స్త్రీలింగశబ్దమును కంధరాదులలో చేర్చి వైకల్పిక క్లీబతుల్యత్వముచే దంష్ట్రము-దంష్ట్రి అనురూపములను సాధించెను. ప్రౌఢవ్యాకర్త 'దంష్ట్ర'మని సంస్కృతమున ఇది పుంలింగము కూడ నై యున్నట్లు పేర్కొనెను. పుంలింగశబ్దమునుండి దంష్ట్రము (వృక్షః-వృక్షము) అనియు, స్త్రీలింగశబ్దమునుండి దంష్ట్రి అనియు తత్సమరూపము లేర్పడు నని. కావున సూరి దంష్ట్రాశబ్దమును కంధరాదులలో చేర్చి వైకల్పిక క్లీబతుల్యత చెప్ప నవసరము లే దని ప్రౌఢవ్యాకర్తమతము. కాని పుంలింగదంష్ట్రశబ్ద మేదో యొకకోశములో నున్నను అప్రసిద్ధ మగుటచే ప్రసిద్ధ మైనస్త్రీలింగశబ్దము నుండియే తత్సమరూపములను సాధించినసూరిమత ముచితము.

### 6. అర్ఘువు-ధర్మువు:

'అమహన్నపుంసకముల కదంతములకు మువర్ణకం బగు' అను సూత్రముచే సూరి వీనిమువర్ణకాంతరూపములను మాత్రమే సాధించెను. అర్ఘము-ధర్మము మొ॥ అర్ఘాదులకడయచ్చున కుత్వంబును మీఁద వువర్ణకంబును వైకల్పికంబుగా నగు' అని సూత్రించి ప్రౌఢ

వ్యాకర్త అర్హువు, ధర్మువు అనురీతిరూపములను విశేషముగ సాధించెను. ఇట్లె వర్గు. సూరి వీనిని తనసూత్రాంధ్రవ్యాకరణములో సాధించెను.

### 7. రాహు :

'ఉకారాంతం బగుమహత్తునకు వువర్ణకంబు బహుళంబుగా నగు' అని సూత్రించి సూరి రాహువు, (రాహుండు) అనురూపములను స్పష్టము చేసెను. ప్రౌఢవ్యాకర్త 'రాహుబాహుశబ్దంబుల కంతట వువర్ణకలోపంబు వైకల్పికంబు' అని సూత్రించి 'రాహు' అను రూపమును సాధించెను. పైసూరిసూత్రమందలి బహుళశబ్దముచే ఈరూపము బాలవ్యాకరణమునను సాధింపబడును.

### 8. బాహు :

'ఉకారాంతగోశబ్దంబుల కంతట వువర్ణకం బగు' అనుసూత్రముచే 'బాహు' అనురూపము మాత్రమె బాలవ్యాకరణముచే సిద్ధించును. 'రాహుబాహుశబ్దంబుల కంతట వువర్ణకలోపంబు వైకల్పికంబు' అనుసూత్రముచే ప్రౌఢవ్యాకర్త వువర్ణకము లోపించిన 'బాహు' అనురూపమును గూడ సాధించెను. కాని 'బాహు' అను ప్రథమైకవచనాంతరూపము గానరాదు.

### 9. మల్లురు :

'మల్ల' అనుశబ్దమున లోపధము దీర్ఘపూర్వకము గాకుండుటచే 'అదంతం బయి దీర్ఘపూర్వలోపధం బయినమహత్తుపిూఁది విభక్తిలకారంబునకు రేఫం బగు' అనుసూత్రముచే పైని రేఫము రాదు. కావున బాలవ్యాకరణముచే 'మల్లులు' అనియే అగును గాని 'మల్లురు' అని కాదు. 'ద్విత్వయుక్తలాంతంబుపిూఁది బలకును రుర లాదేశంబు లగు' అనుసూత్రముచే 'మల్లురు' అనురూపమును ప్రౌఢవ్యాకర్త సాధించెను. అట్టిరూపము లరుదు. తిక్కనాదులు ప్రాసఘటితముగా 'మల్లులు' అని ప్రయోగించిరి.

# 20. బాలప్రౌఢవ్యాకరణమతభేదములు - దేశ్యతద్భవాలు

**తద్భవము కాఱియ :**

బాలవ్యాకర్త దేశ్యములుగా చెప్పినకొన్నిశబ్దములను ప్రౌఢవ్యాకర్త దేశ్యములు కావనెను. మఱి కొన్నింటివిషయమునను భేదాభిప్రాయములు గోచరించుచున్నవి.

'శకటరేఫము తత్సమతద్భవములందు లేదు' అని బాలవ్యాకర్త పేర్కొనెను. కాని సూరి తననిఘంటువులో తద్భవములందును అరుదుగ శకటరేఫము గలదని చెప్పి 'కాఱియ' అని చూపెనట. బాలవ్యాకరణమున తద్భవములలో శకటరేఫము లేదని నిశ్చయించి. 'ఇయకు మాఱుగా నామాంతంబున కెత్వంబు బహుళంబుగాఁగు'ననుచో 'కాఱియ'చూపెను. దీనినిబట్టి బాలవ్యాకర్త ఇది దేశ్యమని తలంచెనేమో అని సందేహము కల్గును. ప్రౌఢవ్యాకర్త 'తద్భవములందును లఘురేఫముగలదు' అని సూత్రించి తద్భవములలో శకటరేఫ ముండుటను పేర్కొనెను. కాని కాశబ్దభవముగా కాఱియ తద్భవ మనియు ఇట్లు తద్భవములలో శకటరేఫ కల దనియు ప్రౌఢవ్యాకర్త మతము.

**దేశ్యములు : 2. కోట :**

'త్రిలింగదేశవ్యవహారసిద్ధం బగుభాష దేశ్యంబు' అని సూత్రించి బాలవ్యాకర్త 'కోట' అనునది దేశ్యముగా ఉదాహరించెను. ప్రౌఢవ్యాకర్త 'కోటపేటలు వైకృతములు' అని సూత్రించి ఇది తద్భవముగా పేర్కొనెను. కోట్ట లేదా కోట, అనుసంస్కృత శబ్దములనుండి ఇది తద్భవముగా ఏర్పడిన దని ప్రౌఢవ్యాకర్తమతము. ఏదైన నిఘంటువునందున్నను ఈశబ్దములు అప్రసిద్ధము లగుటచే వీనినుండి తద్భవముగా కోటఏర్పడిన దను ప్రౌఢవ్యాకర్తమతముకంటె బాలవ్యాకర్తమతము సహజముగా తోచుచున్నది.

### 3. పేట :

'త్రిలింగదేశవ్యవహారప్రసిద్ధం బగుభాష దేశ్యంబు' అని సూత్రించి బాలవ్యాకర్త 'పేట' దేశ్యముగా ఉదాహరించెను. కాని ప్రౌఢవ్యాకర్త 'కోటపేటలు ప్రాకృతములు' అని సూత్రించి పేఁట తద్భవ మనియు, పిండా (విటజనాశ్రయః) శబ్దమునుండి పుట్టిన దనియు పేర్కొనెను. ప్రౌఢవ్యాకర్త ఇట్లు పేర్కొనుటలో ఇది దేశ్య మను బాలవ్యాకర్తమతము సరి గాదని అభిప్రాయము. కాని బాలవ్యాకర్త దేశ్యముగా చూపిన పేట శబ్దమునందు అరసున్న లేదు' హారములోనివరుస మొదలగునవి అర్థములు. శబ్దరత్నాకరములో దీనిని ప్రౌఢవ్యాకర్త దేశ్యముగానే పేర్కొనెను. ప్రౌఢవ్యాకర్త తద్భవ మని సూత్రించిన 'పేఁట'లో అరసున్న గలదు. (నగరము-నగరశాఖ) సూరి ఉదాహరించిన దిది కావున నిట భేదము లేదనవచ్చును.

### 4. కన్య :

'ఇయుఙ్ పరంబుగా నామాంతంబగు కన్యంబు బహుళంబుగా నగు' అనుసూత్రమునొద్ద బాలవ్యాకర్త 'ముత్తియశబ్దంబునందు మాత్ర మిత్వలోపంబు గానంబడియెడి' అని చెప్పెను. 'ముత్తియ' అనుదానికంటె వేఱైనశబ్దమునందలి ఇయులో ఇకారమునకు లోపము లేదని బాలవ్యాకర్తమతము. ప్రౌఢవ్యాకర్త 'ముత్తియశబ్దేతరంబుల యందును దఱచుగ నిత్వలోపంబు గానంబడియెడి' అని సూత్రించి ఇతరశబ్దములందును 'ఇ'లోపమును పేర్కొనెను. కన్నియ- కన్య- పీడియము- పీడ్యము మొ॥ ప్రౌఢవ్యాకర్త అభిప్రాయము కొంతవఱ కుచితమే.

### 5. ఎల్లను :

బాలవ్యాకర్త "సర్వపర్యాయం బగు నెల్లశబ్దంబు ప్రమతాంతం బగు నయ్యన్వయంబు' అని పేర్కొనెను. ప్రౌఢవ్యాకర్త 'సర్వపర్యాయము

బయినయెల్ల శబ్దమునకు సప్తమియు విశేష్యమునకు ముందు ప్రయోగంబునుం జూపట్టెడు’ అని సూత్రించి ఎల్లశబ్దముపై సప్తమీవిభక్తి కలదనెను. విభక్తి యున్న దనుటనుబట్టి యిది యవ్యయము గా దనియు, సర్వనామ మనియు ప్రౌఢవ్యాకర్త తలచినట్లు పైకి తోచును.

కాని ప్రౌఢవ్యాకర్త శబ్దరత్నాకరమునందు సమస్తము అను అర్థమున నిది ప్రమత్తాంత మైనఅవ్యయమే అని బాలవ్యాకర్తమతమునే అనుసరించెను. అవ్యయ మైనను ఎల్లయందు అని సప్తమి కల్గుటను అచ్చట వివరించెను. ఎల్లయందు అన్నది మార్గాంతరమున సాధింపదగును. ఏ మైన సర్వపర్యాయ మైనఎల్లశబ్దము ప్రమత్తాంత మైనఅవ్యయ మనుటలో బాల ప్రౌఢవ్యాకర్తలమతమున భేదము లేదు.

### 6. ఎల్లన్‌శిష్యులన్ :

‘సర్వపర్యాయం బయినయెల్లశబ్దంబు ప్రమత్తాంతం బయిన యవ్యయంబు’ అని చెప్పినబాలవ్యాకర్త ‘దీని కసమాసంబున విశేష్యంబునకు ముందు ప్రయోగంబు లే’ దనెను. దీనిని తిరస్కరించుచు ప్రౌఢవ్యాకర్త ‘సర్వపర్యాయం బయినయెల్లశబ్దమునకు సప్తమియు విశేష్యమునకు ముందు ప్రయోగంబునుం జూపట్టెడు’ అని సూత్రించి ‘ఎల్లన్ శిష్యులన్’ అను శ్రీనాథప్రయోగమును జూపెను. ఇట సమాసము గాకుండంగా శిష్యులన్ అనువిశేష్యమునకు ముందు “ఎల్లను” అనునది ప్రయోగింపబడినది.

కాని యిచట శిష్యులన్ అనునదే విశేషణముగను, ఎల్లన్ అన్నది విశేష్యముగను తోచుచున్నది. ఈపక్షమున బాలవ్యాకర్తమతమున విరోధము లేదు.

## 21. బాలప్రౌఢవ్యాకరణ మతభేదములు-గ్రామ్యములు

1. గ్రామ్యము: “లక్షణవిరుద్ధంబగు భాష గ్రామ్యంబు” అని సూత్రించి బాలవ్యాకర్త “ఈభాష ప్రయోగంబున కనర్హంబు” అని స్పష్టము

చేసెను. కావున గ్రామ్యభాష కావ్యములందు ప్రయోగించుటకు తగ దని బాలవ్యాకర్తమతము. కాని ప్రౌఢవ్యాకర్త 'గ్రామ్యంబు తత్తజ్జాతివర్ణనంబునం బ్రయోగార్హం బగు' అని సూత్రించెను కాన ఆయాసందర్భములలో గ్రామ్యము కూడ కావ్యములందు ప్రయోగింపదగినదే అని ప్రౌఢవ్యాకర్తమతము. మొక్కేము సామి వంటి గ్రామ్యప్రయోగము లాయాకావ్యములందు కానరావు.

**2.** కపిలకన్నులు (కపిలగడ్డము, కపిలజడలు) : 'కపిల' అను కేవలసంస్కృతశబ్దమునకు 'కన్నులు' అనువికృతిశబ్దముతో ఏర్పడిన యీసమాసము లక్షణవిరుద్ధము. కావున గ్రామ్యము అయినను నన్నయమహాకవి ప్రయోగించెను కావున 'ఆర్యవ్యవహారంబుల దృష్టంబు గ్రాహ్యంబు' అని సూత్రించి బాలవ్యాకర్త గ్రాహ్య గ్రామ్యముగా చెప్పెను. కాని ప్రౌఢవ్యాకర్త 'కపిలశబ్దభవంబు కవిలశబ్దం బొంటు గానంబడియెడి' అని సూత్రించి కపిలశబ్దమునుండి పుట్టిన 'కవిల' అనుతద్భవశబ్దమునకు చేసినసమాసము గావున 'కవిల కన్నులు' అనునది గ్రామ్యము కా దనియు నన్నయ కవిలకన్నులు అనియే ప్రయోగించె ననియు పేర్కొనెను. కాని 'కవిల' శబ్దమొకటి ప్రత్యేకముగా గానరాకుండుటచే ఈప్రౌఢవ్యాకర్త మతము గ్రహించుట కవకాశము చాలకున్నది.

**3. ప్రాణగొడ్డము :** ప్రాణ అను కేవలసంస్కృతశబ్దమునకు గొడ్డము అనువికృతిశబ్దముతో? చేయబడినయీసమాసము లక్షణ విరుద్ధము. కాని మహాకవిప్రయుక్తము. 'ఆర్యవ్యవహారంబుల దృష్టంబు గ్రాహ్యంబు' అని బాలవ్యాకర్త ఇది గ్రాహ్యగ్రామ్యముగా పేర్కొనెను. కాని ప్రౌఢవ్యాకర్త 'ప్రాణగొడ్డము గ్రామ్యంబు నాఁదగు' అని సూత్రించి ఇది గ్రామ్యము కా దనెను. 'ప్రాణపుట్టిక' శబ్దమునుండి 'ప్రాణగొడ్డ' మన్నది తద్భవముగా నేర్పడె ననియు, (హంస

యాన.) అంచయాన మొదలగు తద్భవములలో ఉత్తరపదము అట్లే నిల్చియున్నట్లు, ప్రాణగొడ్డ మను తద్భవములో 'ప్రాణ' అను పూర్వపదము మార్పుచెందలేదనియు పేర్కొనెను. తెలుగున 'గొడ్డము' అను శబ్ద మొకటి ప్రత్యేకముగా గానరాకుండుటనుబట్టియును ప్రౌఢవ్యాకర్తమతమె ఉచిత మని తోఁచుచున్నది.

**4. కఱకంఠుడు :** ఇందు కఱశబ్ద మాచ్ఛికము. కంఠము అనునది సంస్కృతసమము. ఇది త్రిసమము గాదు గావున తెలుఁగున వీనికి (మిశ్ర) బహువ్రీహి సమాసము కుదురదు. కావున ఇది లక్షణవిరుద్ధ మయి గ్రామ్య మైనది. అయినను మహాకవి నన్నయ ప్రయోగించెను. అందుచే 'ఆర్యవ్యవహారంబుల దృష్టంబు గ్రాహ్యంబు' అని సూత్రించి బాలవ్యాకర్త ఇది గ్రాహ్యగ్రామ్యముగా చెప్పెను. కాని ప్రౌఢవ్యాకర్త 'కఱకంఠుఁడు బహువ్రీహి' అని సూత్రించి, ఇట తెలుగున సమాసము క్రొత్తగా చేయబడలేదనియు, 'గరకంఠ' అనుసంస్కృత (బహువ్రీహి) శబ్దమునుండి తద్భవముగా కఱకంఠ శబ్దము ఏర్పడిన దనియు చెప్పెను. కాని అనాంధ్రవర్ణ మగు ఱకార స్థితిచేతను (కఱ దేశ్యము) 'కఱకంఠుఁడు' తద్భవ మను ప్రౌఢవ్యాకర్త మతము ఆమోదయోగ్యముగా కానరాకున్నది.

## 22. బాలప్రౌఢవ్యాకరణమతభేదములు-సంధిరూపములు

ఈ యూస్థలములయందు సంధి జరిగినతీరును గూర్చి బాలప్రౌఢ వ్యాకర్తలమతమున భేదములు గానవచ్చును.

**1. ఎఱం గెఱంగి :** ఎఱింగి+ఎఱింగి అని యుండగా 'అచ్చున కామ్రేడితంబు పరం బగునపుడు సంధి తఱచుగ నగు' అనుసూత్రముచే సంధి ప్రాప్తించుచున్నది. ఐనను 'ఏఁగి యేఁగి' యనుచో

క్త్వార్థం బగుట సంధి లేదు' అనుసూత్రముచే సూరి సంధి రా దనెను. ఎఱింగి యెఱింగి.

కాని ప్రౌఢవ్యాకర్త 'ఇత్ప్రత్యయాంతావ్యయంబునకు సంధియుఁ జూపట్టెడి' అని సూత్రించి క్త్వార్థం బైనయిత్తునకు నదునుగా సంధి యగుటను పేర్కొనెను. ఎఱిం గెఱింగి.

**2. చిట్టడవి :** చిఱు+అడవి అని యుండఁగా 'కుఱుచిఱుకడు నడునిడుశబ్దంబులఱడల కచ్చు పరం బగునప్పుడు ద్విరుక్తటకారం బగు' అనుసూత్రముచే 'ఱు'వర్ణమునకు 'ట్ట' వచ్చి 'చిట్టడవి' యగు నని బాలవ్యాకర్తమతము.

'చిట్టడవిఁ జిట్టి' అని సూత్రించి ప్రౌఢవ్యాకర్త 'చిట్టి+అడవి' అని విభాగించి యిచట సంధి నిత్యముగా వచ్చు ననెను. సంధి నిత్య మనుటకు సరియైనయాధారములు లేకుండుటచేతనే కాక 'చిఱుడవి' అనురీతిరూపములను నాదరించుచును సూరిమతమె సమ్మతింపదగి యున్నది.

**3. పేర ల్గోపించినన్ :** పేరల్+కోపించినన్ అని యుండగా 'తెనుఁగులమీఁదిసాంస్కృతికపరుషములకు గసడదవలు రావు' అను సూత్రముచే గసడదవాదేశము నిషేధించెనుగావున 'పేరల్ కోపించిన' అనియే యుండవలె నని బాలవ్యాకర్తమతము.

కాని కొన్నియెడలఁ 'దెనుఁగులమీఁదిసాంస్కృతికకతపలకు గదవలు గానంబడియెడి' అని సూత్రించి ప్రౌఢవ్యాకర్త కొన్ని యెడల నీయాదేశమును పేర్కొనెను. పేరల్ గోపించిన. ఇక్లే
ఇట్లు దపంబు (ఇట్లు+తపంబు) వేవణములు (వే+పణములు) మొ॥.

**4. అందచందములు :** అంద+చంద(ములు) అని యుండగా 'ద్వంద్వంబునం బదంబుపయిపరుషములకు గసడదవ లగు' అను

సూత్రముచే 'అందసందములు' కావలె నని బాలవ్యాకరణము పేర్కొనుచున్నది.

ఇట ప్రౌఢవ్యాకర్త 'కొన్నియెడల ద్వంద్వంబునం బదంబు మీఁదిచతపలకు సదసలు గానంబడవు' అని సూత్రించెను. దీనిచే సకారాదేశము రాక అందచందములు అనియే యుండును. (ఇట్లే కండతుండెములు, రాకపోకలు మొ॥.)

**5. బచ్చింట :** బచ్చుయొక్క ఇల్లు అనువిగ్రహముచే నేర్పడిన షష్ఠీతత్పురుషమునందు బచ్చు+ఇల్లు అని యుండగా 'షష్ఠీసమాసంబునం దుకారఋకారంబుల కచ్చు పరం బగునపుడు నుగాగమం బగు' అనుసూత్రముచే నుగాగమము వచ్చి బచ్చునిల్లు- 'బచ్చునింట' అని బాలవ్యాకర్తమతమున నగును.

'కొన్నిచోట్ల షష్ఠీసమాసమునం దుకారంబున కచ్చు పరం బగునపుడు నుగాగమంబునకు లోపం బగు' అనుసూత్రముచే ప్రౌఢవ్యాకర్త నుగాగమమునకు లోపము చెప్పి (ఉత్వసంధిచే) బచ్చిల్లు-బచ్చింట అని యగు నని పేర్కొనెను.

కాని బాలవ్యాకరణమునను 'ఆగమశాస్త్ర మనిత్యమ్' అను పరిభాషచే నుగాగమము అనుకుగా రానియుదాహరణములు సంగ్రహింప వీలు కలదు. (ఇట్లే గోకుల మిల్లిలు, కిరి సందము).

**6. పూరెమ్మ :** పూవు+రెమ్మ- అని యుండగా 'సమాసంబునం బ్రాఁతాములతోలియచ్చుమీఁదివర్ణంబుల కెల్ల లోపంబు బహుళంబుగా నగు' అనుసూత్రముచే పూవుశబ్దములో 'వు'వర్ణము లోపించి 'పూరెమ్మ' అని యగు నని బాలవ్యాకర్తమతము.

ప్రౌఢవ్యాకర్త 'పూపూవు' అని సూత్రించి 'పూవు' అను అర్థమున 'పూ' అనుశబ్దము గల దనెను. అనఁగా 'పూ'శబ్దమునకు 'రెమ్మ'తో సమాస మై 'పూరెమ్మ' అని యగును గావున ఇచట

'పూవు'లో వువర్ణము లోపించిన దని చెప్ప నవసరము లే దని అభిప్రాయము.

కాని "పూఁదోట" మున్నగుచోట్లగా ద్రుతప్రకృతికత్వమున నుగాగమము వచ్చుట గలదు. కావున పూచెన్ను అనుచో 'పూ' అనునది పూవుశబ్దలుప్తశేష మనుసూరిమతమె ఉచితముగా తోచుచున్నది.

**7. నెన్నడుము :** 'అన్యంబులకు సహిత మీకార్యంబులు కొండొకచోఁ గానంబడియెడి' ననుసూత్రమునందు బాలవ్యాకర్త నెఱ+నడుము= నెన్నడుము అని చూపెను. కావున నెన్నడుములో పూర్వపదము 'నెఱ' అని బాలవ్యాకర్తమతము.

కాని ప్రౌఢవ్యాకర్త 'నెన్నడాదులన్ నెఱి యగు' అని సూత్రించి ఇచట పూర్వపదము 'నెఱి' అని పేర్కొనెను. పూర్ణమను అర్థము గల నెఱశబ్దముకంటె, రమ్యమను నర్థము నిచ్చు 'నెఱి' అనునదే యిచట ఉచిత మని అభిప్రాయము. ప్రౌఢవ్యాకర్త మత ముచితమె యనిపించు.

**8. ఆడిదె :** ఇట ఆడుము+ఇదె అని యుండును. 'మధ్యమపురుషమువర్ణకంబునకు హలవసానంబులు పరంబు లగునపుడు లోపము విభాష నగు' అని సూత్రించిన బాలవ్యాకర్త 'చూడుమసిరియె- వినుమనియె- ఇచ్చట నచ్చు పర మయినది కావున లోపము లేదు' అని అచ్చు పరమైనపుడు మధ్యమమువర్ణకలోపము లే దని పేర్కొనెను.

'మధ్యమపురుషమువర్ణకంబున కచ్చు పరం బగునపుడును గొన్నియెడల లోపంబు చూపట్టెడి' అని సూత్రించిన ప్రౌఢవ్యాకర్త ములోపమును పేర్కొనెను. ఆడు+ఇదె ఉత్వసంధి అయి ఆడిదె అని యగును.

ఇచట 'ఆడితే' అనునది అసలైనపాఠము. కావునా వను

వను'-మున్నగుచోట్ల అరుదుగ ఈకార్యము గలదు. ప్రౌఢవ్యాకర్త మత ముచితమె.

## 22. బాలప్రౌఢవ్యాకరణములు-అచ్సంధులు

**సంధి :-** "పూర్వపరస్వరంబులకుం బరస్వరం బేకాదేశం బగుట సంధి యనంబడు"- మొదటిశబ్దము చివరిఅచ్చు దానికి పరముగా ఉన్న రెండవశబ్దము మొదటిఅచ్చు అనురెండింటిస్థానమునను రెండవశబ్దము మొదటిఅచ్చు ఒక్కటి మాత్రమే ఆదేశముగా వచ్చుట తెలుగులో సంధి అనబడును. ఇది అచ్సంధిలక్షణముగా చెప్పనగును.

**ఉత్త్వసంధి :-** 'ఉత్తున కచ్చు పరం బగునపుడు సంధి యగు' హ్రస్వమైనఉకారమునకు సంధి నిత్యముగా వచ్చును.
రాముఁడు+అతఁడు=రాముఁడతఁడు.

ద్రుతప్రకృతికములలో "ప్రథమేతరవిభక్తిశత్రర్థచువర్ణంబులం దున్నయుకారమునకు సంధి వైకల్పికముగా నగును"- నన్నున్+అడిగె- నన్నడిగె. వీనికి సంధి లేనిపక్షమున ద్రుతము మీాదిఅచ్చుతో గూడును. నన్నునడిగె.

**ఇత్త్వసంధి :** "ఏమ్యాదులయిత్తునకు సంధి వైకల్పికముగా నగు" ఏమి మొద లగుశబ్దములందలి'ఇ'కారమునకు సంధి వైకల్పికముగా వచ్చును. ఏమి+అంటివి= ఏ మంటివి. సంధి రానిపక్షము నందు "సంధి లేనిచోట స్వరంబుకంటెం బరం బయినస్వరంబునకు యడాగమం బగు' యకారము చేరి ఏమి యంటివి.

'క్రియాపదంబులం దిత్తునకు సంధి వైకల్పికముగా నగు' (ప్రథమ, ఉత్తమపురుషబహువచన)*క్రియలందలిఇకారమునకు సంధి వికల్పముగా వచ్చును.

వచ్చిరి+అప్పుడు=వచ్చి రప్పుడు, వచ్చిరి యప్పుడు.

వచ్చితిమి+ఇపుడు=వచ్చితి మిపుడు, వచ్చితిమి యిపుడు

'మధ్యమపురుషక్రియలయం దిత్తునకు సంధి యగును' మధ్యమపురుషక్రియలలోని ఇకారమునకు సంధి నిత్యముగా వచ్చును. పలికితివి+అపుడు=పలికితి వపుడు.

'క్త్వార్థం బైనయిత్తునకు సంధి లేదు' అని సూరి క్త్వార్థక మగు ఇకారమునకు సంధి లే దనెను. వంగి+వంగి= వంగి యొంగి. ఈ అభిప్రాయమును సవరించుచు ప్రౌఢవ్యాకరణము, 'ఇప్రత్యయాంతావ్యయంబునకు సంధియుఁ జూపట్టెడి అని సంధి అరుదుగా నుండుటను చెప్పెను. ఎగిరి+ఎగిరి=ఎగిరెగిరి.

**అత్త్వసంధి :** 'అత్తునకు సంధి బహుళముగా నగు' హ్రస్వమైనఅకారమునకు బహుళముగా సంధి వచ్చును. మేన + అల్లుడు-మేనల్లుడు. సంధి రానిపక్షమునందు యడాగమము వచ్చి 'మేన యల్లుడు.

పయిసూత్రమున బహుళగ్రహణముచే స్త్రీవాచకతత్సమ సంబోధనాంతాదులకు సంధి లేదు. అమ్మ యిచ్చెను, చదువుము యనెను. వెలయాలు. వీనిలో స్త్రీవాచకతత్సమములందలి అకారమునకు ఆధునికకృతులలో సంధి కనిపించుచున్నది. నెలఁ తిచ్చెను, గంగనుకాసె.

'ఉన్న, కల, న'వర్ణకములపై తచ్ఛబ్దవకారము లోపించిన సందర్భమునం దీసంధి నిత్యముగా వచ్చును. వచ్చినాడు. (వచ్చినవాడు).

**ఆమ్రేడితసంధి :** 'అచ్చున కామ్రేడితంబు పరం బగునపుడు సంధి తఱుచుగ నగు'. ఆమ్రేడితము (ద్విరుక్తముయొక్క పరరూపము) పర మగునపు డన్నిఅచ్చులకును సంధి తఱుచుగా వచ్చును.

ఆహా+ఆహా- ఆహాహా- తఱుచుగ అనుటవలన ఇంచుక యించుక, ఏమి యేమి యనుతీరుగా కొన్నియెడల సంధి లేకపోవుట గుర్తింప వచ్చును.

**ఆర్యాద్యర్థకసంధి :** 'శ్రేష్ఠతావాచకంబు లగునార్యాంబాద్యర్థక శబ్దంబులు పరంబు లగుచో నన్నియచ్చులకు సంధి నిత్యము' అని ప్రౌఢవ్యాకరణము. బిరుదాదిసమాసములలో **అయ్య అమ్మ** మొదలగుశబ్దములు పర మగునప్పుడు నచ్చు లన్నిటికిని సంధి నిత్యముగా వచ్చును, వదినె+అమ్మ- వదినమ్మ- సీతమ్మ మొ॥ **అమ్మాజియమ్మ** కలవాణియమ్మ- మొదలగుచోట్ల అరుదుగా నీసంధి జరుగనితావులు గూడ కవిప్రయోగములందు గానవచ్చెడిని.

**అపదసంధి :** "ఉదన్తనామంబులం దప్ప నపదాదిస్వరంబు పరం బగునపు డచ్చునకు సంధి యగు" అందు, అవ అనునవి రెండు తప్ప మిగిలిన పదము గానిశబ్దము పర మైనపు డన్నిఅచ్చులకు నిత్యముగా సంధి వచ్చును. వీసె+ఎడు-వీసెడు.

అందు-అవ అనుఅపదములు పర మయినపుడు (పదములకు వలె) సామాన్యశాస్త్రముల కనుగుణముగా సంధి వచ్చును. వనమందు ఎనిమిదవ, ఎనిమిదియవ మొ॥

**ద్రుతపూర్వస్వరసంధి :** "ఇంకాదులకుఁ దప్ప ద్రుతప్రకృతికంబులకు సంధి లేదు" ఇంక, ఇంగ, ఎట్టకు, ఏలకు అనునవి ఇంకాదులు. ఇవి, ప్రథమేతరవిభక్తిశత్రర్థచువర్ణములు, ఏమ్యాదులలో చేరినషష్ఠీవిభక్తి యగు 'కి'వర్ణము అనునవి దప్ప మిగిలినద్రుతప్రకృతికమునందును ద్రుతమునకు పూర్వమునం దున్నఅచ్చునకు సంధి రాదు- వచ్చెన్+అతఁడు- వచ్చెనతఁడు.

**ద్రుతద్విత్వము :** "కొన్నియెడలఁ బ్రామాణికప్రయోగంబుల ద్రుతంబున కచ్చు పరం బగుచో ద్విత్వంబు చూపట్టెడి" అను

ప్రౌఢవ్యాకరణలక్షణముచే అచ్చు పర మయినపు డదుముగా ద్రుతమునకు ద్విత్వము వచ్చును. సర్వమున్+అతని-సర్వము న్నతని.

**ఋౡపరకత :** "పదాద్యంబులు ఋౡవర్ణంబులు రలతుల్యంబులు" పదము మొదటి ఋకారము రేఫతోను, ౡకారము లకారముతోను తుల్యములు. కావున ఋౡలు పర మైనపుడు సంధి రాదు. ఋౡలకు యడాగమము రాదు. అతడు ఋషి, అది ౡకారము.

ఈవిధులవలన ఆమ్రేడితము, అపదము, ఆర్యాద్యర్థకములు తప్ప ఏది పర మైనను హ్రస్వము లగు అ-ఇ,ఉలకు తప్ప ఇతరస్వరములకు సంధి లేదు. నదిని యున్నది, గ్లా యుదయించె. 'ఉ'కారమునకుఁ దప్ప అ-ఇలకును సంధి సార్వత్రికము గాదు. ఇట్లే ఆమ్రేడితము ఆర్యాద్యర్థకము పర మైనపుడును సంధి లేకపోవుట కలదు.

మొత్తముపై ఉత్తునకు మాత్రమె తెలుగున సంధి నిత్యము. కాఁగా తెలుగులో సంధి జరుగకుండుటయె యధికము.

## 23. బాలప్రౌఢవ్యాకరణములు-ఆగమసంధులు

ఆగమముగా వచ్చినసంధికార్య మాగమసంధి యనఁదగును.

**ఆగమము :** 'ఆగమం బనఁగా వర్ణాధిక్యంబు'. అధికముగా వచ్చి చేరువర్ణమునకు ఆగమము అని సంజ్ఞ. సంధియందు కొన్ని యెడల ఉన్నవర్ణములు అట్లె యుండగా వేరొకవర్ణము అధికముగా వచ్చి చేరుట గలదు. కఱకు+అమ్ము=కఱకుటమ్ము మొ॥

ఇట్టివి ఆగమసంధులుగా గ్రహింపదగును.

**1. టుగాగము :** 1. 'కర్మధారయంబులం దుత్తున కచ్చు పరం బగునపుడు టుగాగమం బగు'. కర్మధారయసమాసములలో అచ్చు పరముగా నున్నపుడు పూర్వపదముచివరి ఉత్వమునకు పైని టకారము ఆగమ మగును. కఱకు+అమ్ము- కఱకు టమ్ము.

2. 'కర్మధారయంబునం జేర్వాదిశబ్దంబుల కచ్చు పరం బగునపుడు టుగాగమంబు విభాష నగు'- వేరు మొదలగువానిపైని పై టకారాగమము వికల్పముగా వచ్చును, చిగురు+ఆకు=చిగురుటాకు. టుగాగమము రానపు డుత్త్వసంధి వచ్చి చిగురాకు.

II. **రుగాగమము :** 1. పేదాదిశబ్దంబుల కాలుశబ్దము పరం బగునపుడు కర్మధారయంబునందు రుగాగమం బగు' కర్మధారయ సమాసమునందు 'ఆలు'శబ్దము పరముగా నున్నపుడు పేద మొదలగు వానికి చివర రేఫము వచ్చును- పేద+ఆలు- పేదరాలు. జవ్వని + ఆలు అనుచో ఇచట జవ్వనిశబ్దమునకు 'జవ' అనునది ఆదేశముగా వచ్చును. జవరాలు.

2. "కర్మధారయంబునం దత్సమంబుల కాలుశబ్దము పరం బగునపు డత్వంబున కుత్వంబును రుగాగమంబు నగు" తత్సమశబ్దముల చివరిఅత్వమునకు ఉత్వమును, మీద రేఫమును వచ్చును. ధీర+ఆలు= ధీరురాలు.

III. **నుగాగమము :** "షష్ఠీసమాసమునం దుకారఋకారముల కచ్చు పర మగునపుడు నుగాగమం బగు" షష్ఠీతత్పురుషసమాసములో అచ్చు పరముగా నున్నపుడు పూర్వపదముచివరిఉత్వమునకును, ఋత్వమునకును పైని నకారము వచ్చి చేరును. రాజు (యొక్క) ఆజ్ఞ- రాజునాజ్ఞ, విధాతృ(యొక్క) ఆనతి= విధాతృనానతి.

ఇచట ప్రౌఢవ్యాకర్త "కొన్నిచోట్ల షష్ఠీసమాసంబునం దుకారంబున కచ్చు పరం బగునపుడు నుగాగమంబునకు లోపంబు నగు" అని కొన్నియెడల ఉత్వముపై నుగాగమమునకు లోపమును చెప్పెను. శిరసు(యొక్క)అందము- శిరసందము.

2. 'ఉదంత మగుతద్ధర్మార్థవిశేషణమున కచ్చు పర మగునపుడు నుగాగమం బగు'- అచ్చు పరముగా నున్నపుడు, చేయు,

చేసెడు అనుతీరుగా ఉదంతము లయినధాతుజవిశేషణములకు పైని నకారము చేరును. చేయు+అతఁడు- చేయునతఁడు.

3. 'సమాసంబుల నుదంతంబు లగుస్త్రీసమంబులకుం బుంపులకుం బరుషసరళంబులు పరంబు లగునపుడు నుగాగమం బగు'- ఇట్లు ఆగమముగా వచ్చిననువర్ణము ద్రుతము కావున దానికి ద్రుతకార్యము లగును. చిగురు + కయిదువు- చిగురును + కయిదువు చిగురుంగయిదువు మొ॥

4. 'ఉదంతస్త్రీసమంబులకుం బుంపులకు నదంతగుణవాచకంబులకును దనంబు పరం బగునపుడు నుగాగమం బగు'. 'తన' అను తద్ధితప్రత్యయము పర మగునపుడు ఆగమ మయిన ఈనువర్ణము ద్రుతము. కావున దీనికి ద్రుతకార్యము లగును. సొగసు+తనము- సొగసును+తనము- సొగసుందనము మొ॥

5. 'లుప్తశేషంబులకుం బరుషములు పరము లగునపుడు నుగాగమం బగు' తొలిఅచ్చుమీఁదివర్ణములు లోపింపగా మిగిలిన ప్రాతాదిశబ్దములకు పరుషములు పర మయినపుడు నుగాగమము వచ్చును. ఈనువర్ణము ద్రుతము కావున ద్రుతకార్యము లగును. ప్రా+కెంపు- ప్రాఁగెంపు క్రొ(త్త)శబ్దమునకు కొన్నియెడల నుగాగమము వచ్చును. క్రొంబసిఁడి మొ॥

6. ఇచట ప్రౌఢవ్యాకర్త 'సమాసమందుఁ దత్సమంబు పరం బగునపుడు నుగాగమాదులు కానంబడియెడి' అని వివరించెను. ముందు+కోపము- ముంగోపము మొ॥.

IV. **అలిగాగమము** : అంద్వాదుల కలిగాగమంబు సమాసంబునం దగు- సమాసమునందు, అందు, ఎందు అనువానికి అలి అనునది ఆగమ మగును. అందును+వారు- అందలివారు మొ॥

x/ V. **వుగాగమము** : ఉదంతనామంబున కనుకరణంబునందు వుగాగమం బగు' అనుకరించునపుడు క్రియాపదము గానిఉదంత మగు

సంస్కృతశబ్దమునకు చివర వకారము వచ్చి చేరును. ఇయం ధేను(ః)+అని=ఇయ్యం ధేను వని.

VI. పుగాగమము : ప్రౌఢవ్యాకర్త 'తామర కాకు పరం బగు నపుడు పుగాగమం బగు' అని పేర్కొనెను. తామర + ఆకు తామరపాకు.

VII. ముగాగమము : ప్రౌఢవ్యాకర్త ధ్వన్యనుకరణశబ్దంబుల కనుధాతువు పరం బగుచో ముగాగమం బగు' అని చెప్పెను. కనకన+అను- కనకనమ్+అను- కనకన మను.

## 24. ఆమ్రేడితసంధులు

ఆమ్రేడితము : ద్విరుక్తముయొక్క పరరూపము ఆమ్రేడితము. ఆమ్రేడితము పర మయినపుడు సంధియందు పెక్కుమార్పులు గలుగుచున్నవి.

**1. (పరరూప)సంధి** : 'అచ్చున కామ్రేడితంబు పరం బగు నపుడు సంధి తఱచుగ నగు' ఆమ్రేడితము మొదటిఅచ్చు పర మయి నపుడు అన్ని అచ్చులకును దాదాపు నిత్యముగానె సంధి వచ్చును. ఔర+ఔర=ఔరౌర, ఆహా+ఆహా=ఆహాహా.

ఏమి+ఏమి మొద లగుకొన్నిచోట్ల వికల్పము. ఏమేమి- ఏమి యేమి, ఇంచు కించుక ఇంచుక యించుక.

**2. 'ట్ట'ఆదేశము** : 'ఆమ్రేడితంబు పరం బగునపుడు కడా దులం దొలియచ్చుమీఁదివర్ణంబుల కెల్ల నదంతం బగుద్విరుక్తటకారం బగు' భృశార్థమునం దయినద్విరుక్తియందు ఆమ్రేడితము పర మైనపుడు కడ మొద లగువానిలోని మొదటిఅక్షరమునకు పైనున్న వర్ణము లన్నింటిస్థానమును 'ట్ట' అనునది ఆదేశ మగును.

కడ+కడ = కట్టకడ

**3. విభక్తిలోపము :** 'ఆమ్రేడితంబు పరంబగునపుడు విభక్తి లోపంబు బహుళంబుగా నగు' ఇంటన్+ఇంటన్ అనుచోట్ల విభక్తి (అన్) లోపింపఁగా- ఇంట్+ఇంటన్- ఇంటింటన్ అని యగును. విభక్తి లోపింపనిపక్షమునందు- ఇంట నింటన్.

**4. అంత్యాక్షరలోపము :** పయిసూత్రమునందలి బహుళగ్రహణముచే ఇంచుక నాఁడు మొదలగువానియందు చివరి అక్షరమునకు లోపము వచ్చుటయు కలదు. ఇంచుక+ఇంచుక- ఇంచు+ఇంచుక- ఇంచించుక. చివరి అక్షరము లోపింపనిచో సంధి వికల్పముగా జరిగి ఇంచుకించుక, ఇంచుక యించుక అని యగును.

**5. ముడుఁజ్లోపము :** 'ఆమ్రేడితంబు పరంబగునపుడు మధ్యమముడుఁజులకు లోపంబు విభాష నగు'- మధ్యమపురుషప్రత్యయము లైన ము, ముజ్ అనువానికి ఆమ్రేడితము పరమైనపుడు లోపము వికల్పముగా వచ్చును. ఉండుమ(ము)+ఉండుము- సంధియై ఉండుండుము. లోపము రానిపక్షమున ఉండుమండుము ఇట్లే కొట్టుకొట్టుము మొ॥ ఇమ్మిమ్ము ఇత్యాదులందు లోపము లేదు.

**6. దీర్ఘము :** పైసూత్రముచే ముడుఁజులు లోపించినచోట 'ఆమ్రేడితంబు పరంబగునపుడు కృత్ప్రత్యయంబునకు దీర్ఘంబగు' అని ప్రౌఢవ్యాకర్త కృత్ప్రత్యయమునకు దీర్ఘమును విధించెను. (తెమ్ము+తెమ్ము)- తె+తెమ్ము- తేతెమ్ము. మొ॥

**7. అందదుకుప్రభృతులు :** 'అందదుకు ప్రభృతులు యథాప్రయోగంబుగ గ్రాహ్యంబులగు' అదుకు+అదుకు మొదలగుచోట్ల ఆమ్రేడితము పరమయినపుడు వర్ణవికారము లొక్కొక్కచోట నొక్కొక్కవిధముగా నున్నవి. అట్టివి కవిప్రయోగములనుండి గ్రహింపవలెను. అదుకు+అదుకు- అందదుకు. ఇంకులు-ఇంకులు- ఇట్టింకులు మొ॥

**8.** గిగీలు : 'నిందయం ద్వామ్రేడితంబునాద్యక్షరములకు హ్రస్వదీర్ఘంబులకు గిగీ లగు' నిందార్థమునందు ద్విరుక్తము లయిన శబ్దమున రెండవదానిమొదటిఅక్షరము హ్రస్వమైనదానికి 'గి'వర్ణమాదేశ మగును. దీర్ఘమైన 'గీ' ఆదేశ మగును. కుంభకర్ణుడు గింభకర్ణుడు మొ॥ ఇది సంధికార్యము కాదు. ఆమ్రేడితస్థలమునందలి విశేషము.

## 25. గసడదవాదేశము

**గసడదవాదేశము :**

'గసడదవ' అనునవి ఆదేశముగా వచ్చుట గసడదవాదేశము. ఇవి 'కచటతప'లకు అగును.

**1. ప్రథమమీద :** 'ప్రథమమీఁదిపరుషములకు గసడదవలు బహుళంబుగా నగు' ప్రథమాంతములకు పైనున్న కచటతపలకు యథాక్రమముగా గసడదవలు వచ్చును. వాఁడు+కొట్టె- వాఁడు గొట్టె. ఆదేశము రానిపక్షమున- వాఁడు కొట్టె. 'దంత్యతాలవ్యంబు లయినచజలు సవర్ణంబులు' కావున ఇచట తాలవ్యచకారమునకు విధింపబడిన సకారము దంత్య మగుచకారమునకును వచ్చును. అప్పుడు+చనియె- అప్పుడు సనియె.

**2. క్రియలమీద :** 'ఈకార్యము కళ లగుక్రియాపదముల మీఁద సహితము గానంబడియెడి' నయిసూత్రమున ప్రథమమీఁద చెప్పిన గసడదవాదేశము కళలైనక్రియాపదములమీద గూడ వచ్చుట గలదు. రారు+కదా- రారు గదా, రారు కదా మొ॥.

**3. సాంస్కృతికములకు లేదు :** 'తెనుఁగులమీఁదిసాంస్కృతిక పరుషములకు గసడదవలు రావు' అచ్చతెనుగుశబ్దములకు మీద నున్నసంస్కృతసమశబ్దాదిపరుషములకు గసడదవలు రావు వాఁడు+కంసారి- వాఁడు కంసారి, మొ॥

కావున తెనుగులమీఁది తెనుఁగుపరుషములకు, సంస్కృతసమములమీఁది తెనుఁగుపరుషములకు, సాంస్కృతికపరుషములకును గసడదవలగును. వాఁడు గొట్టె, రాముఁడు గొట్టె, రాముఁడు గరుణించు.

**4. గదవలు** ; ఇచట ప్రౌఢవ్యాకర్త 'కొన్నియెడలఁ దెనుఁగులమీఁదిసాంస్కృతికకతపలకు గదవలు గానంబడియెడి' అని సాంస్కృతికము లగుకతపలకు గదవలు కవిప్రయోగములందు ప్రాసఘటితము లైయుండుటను పేర్కొనెను. వే+పణములు = వేవణములు. మొ॥

**5. ద్వంద్వమున** : 'ద్వంద్వంబునం బదంబుపయిపరుషములకు గసడదవ లగు' అని ద్వంద్వసమాసమునం దుత్తరపదాదిపరుషములకు గసడదవలు నిత్యము. తల్లి+తండ్రి = తల్లిదండ్రులు మొ॥

**6. ఆదేశాభావము** : ఇచట ప్రౌఢవ్యాకర్త 'కొన్నియెడల ద్వంద్వంబునం బదంబుమీఁదిచతపలకు సదవలు గానంబడవు' అని సూత్రించి ద్వంద్వమున కొన్నియెడల ఈఆదేశము లేకుండుటను పేర్కొనెను. అందచందములు. ప్రౌఢవ్యాకర్తయే వేఱొకచోట 'విన్నకన్నది' అనునది ద్వంద్వముగా నుదాహరించెను. దీనినిబట్టి ద్వంద్వమున కకారమునకు గకారము కూడ కొన్నియెడల లేకుండుటను గుర్తింపవలసియున్నది.

## 26. ద్రుతకార్యాలు

ప్రత్యయమును, ఆగమమును, అవ్యయమును, వలెను మొదలగువానియం దున్నదియు అయిన ను (ని, న్) అనువర్ణమునకు ద్రుతము అనిసంజ్ఞ. ద్రుతము చివరఁగల్గినపదము ద్రుతప్రకృతికము

అచ్చు, హల్లు, అవసానము పర మగునపు డీ ద్రుతమునకు పెక్కు మార్పు లగుచున్నవి.

**1. పూర్ణస్వరసంధి :** 'ఇంకారములకుఁ దప్ప ద్రుతప్రకృతికములకు సంధి లేదు.' ప్రథమేతరవిభక్తులయందును (ఉకారము) శత్రర్థచువర్ణంబునందును దృష్టాంతము, ఇంక, ఇంగ, ఎట్టకేలకు, ఎట్టకేని అనునవి తప్ప మిగిలిన ద్రుతప్రకృతులయందు ద్రుతపూర్వస్వరమునకు అచ్చు పర మైనపుడు సంధి లేదు. అచ్చట ద్రుతము మీది అచ్చుతో కలిసియుండును. వచ్చెన్ + అతఁడు- వచ్చెనతఁడు. ప్రథమేతరవిభక్తి శత్రర్థచువర్ణము మొదలగువానికి సంధి వికల్పము. నన్నున్+అడిగె, నన్నడిగె- నన్ను నడిగె మొ॥

**2. ద్విత్వము :** 'కొన్నియెడలఁ బ్రామాణికప్రయోగంబుల ద్రుతంబున కచ్చు పరం బగునేని ద్విత్వంబు గానంబడియెడి' అని ప్రౌఢవ్యాకర్త అచ్చు పర మైనపుడు ద్రుతమునకు క్వాచిత్కముగా ద్విత్వమును చెప్పెను. సర్వమున్+అతని- సర్వమున్నతని మొ॥

**3. పరుష సరళాదేశము :** 'ద్రుతప్రకృతికము మీఁది పరుషములకు సరళము లగు' అను సూత్రముచే ద్రుతమునకు పైనున్న పరుషములు సరళము లగును. పూచెను+కలువలు- పూచెను గలువలు.

**4. బిందువు :** 'ఆదేశసరళములకు ముందున్న ద్రుతమునకు బిందుసంశ్లేషంబులు విభాష నగు' అనుసూత్రముచే పరుషముల కాదేశ మయినసరళము పరముగా నున్నపుడు ముందటి ద్రుతమునకు బిందువు అనఁగా సున్నయు, అరసున్నయును వచ్చును. పూచెను+గలువలు పూచెంగలువలు, పూచెఁగలువలు.

**నిషిద్ధస్థలములు :** 'అంటయుఁ కచుఁడుశబ్దంబులం దప్పనుడితొలి హ్రస్వంబుమీఁద ఖండబిందువును ద్రుతంబునకు లోపంబును లేవు' అనిచుడితొలి హ్రస్వముపై అరసున్న యుండదు, కెందామర, దీర్ఘము

మీఁద సాధ్యపూర్ణము లేదు అనుసూత్రముచే దీర్ఘముపై నిండు సున్న యుండదు తాఁజెప్పె.

**5. లోపము :** 'ద్రుతమునకు సరళస్థిరంబులు పరంబు లగునపుడు లోపసంశ్లేషంబులు విభాష నగు' సహజసరళములును స్థిరములును పర మైనపుడు ద్రుతమునకు లోపము విభాషగా గల్గును వచ్చెను+గోవులు- వచ్చె గోవులు మొ॥.

'అవసానంబునందు ద్రుతస్వరంబున కేని ద్రుతంబున కేని లోపంబు బహుళంబుగా నగు' అచ్చు గాని హల్లు గాని ఏవర్ణమును పరముగా లేనపుడు ద్రుతమునకు లోపము బహుళముగా వచ్చును వచ్చెను- వచ్చె.

'సమాసంబునయందు ద్రుతంబునకు లోపం బగు' అనుసూత్రముచే సమాసమున ద్రుతము లోపించును. ఎల్లను+అర్థములు- ఎల్ల యర్థములు మొ॥.

**నిషిద్ధస్థలములు :** 'అంటయింక చుంమశబ్దంబులం దప్ప- అను సూత్రముచే మాట మొదటిహ్రస్వముపై నున్నద్రుతమునకు లోపము రాదు. పెను+దూళి పెదూళి అని కాదు.

అవసానమునందు వచ్చులోపము పద్యాంతములందు గణానుసారముగా వ్యవస్థిత మైయుండును.

సమాసమునందు ప్రత్యేకముగా విధించినచోట్ల నువర్ణము ద్రుత మయ్యును విధానసామర్థ్యముచే లోపింపదు. చిగురుంగైదువు. 'తలంబ్రాలు మొద లగుసమాసంబుల ద్రుతమునకు లోపంబు లేదు' తలంబ్రాలు మొ॥.

**6. సంశ్లేషము :** ఆదేశసరళములకు ముం దున్న, ద్రుతంబునకు సరళస్థిరంబులు పరంబు లగునపుడు- అనుసూత్రములచే, ఆదేశములును సహజములు నయినసరళములు, స్థిరములు పర మగు

నపుడు ద్రుతమునకు సంశ్లేషము వచ్చును. 'సంశ్లేష మనఁగా ద్రుతము పూర్వాదివర్ణముతో గూడికొనుట' యను(వి) ద్రుతమునందలిస్వరము లోపించుటయే సంశ్లేష మని చెప్పవచ్చును. పూచెను+గలువలు- పూచెన్గలువలు. వచ్చెన్ ఋషి మొ॥

**నిషిద్ధస్థలములు :** 'తాను నేను పదంబుల ద్రుతంబునకు సంశ్లేషంబు లేదు' అనుసూత్రముచే తాన్జని, నేన్వింటిని అనురీతిగా ఇచట సంశ్లేషము రాదు.

ఇట్లే ఉత్ప్రేక్షము లగు ప్రాతాదులకు (అవ్యయములకు) వచ్చిన నుగాగమద్రుతమునకును వ్యవస్థితవిభాషచే సంశ్లేషము రాదు. కావున ప్రాన్గొంపు, క్రొన్బసిఁడి పన్నొప్పు అనురీతిరూపము లుండవు.

**7. ద్రుతస్వరలోపము :** అవసానంబునందు ద్రుతస్వరంబున కేని- అనుసూత్రముచే అవసానమందలి ద్రుతమునందున్న అచ్చునకు బహుళముగా లోపము వచ్చును. వాఁడు- వచ్చెను- వాఁడు వచ్చెన్ మొ॥

ఈస్వరలోపమును పద్యాంతములందు గణానుసారముగ నియమింపఁబడియుండును.

అచ్చు పరముగా నున్నపుడు ద్రుతమునందలిఅచ్చునకు సాధారణముగా లోపము కల్గును. నమ్మెన్+అడిగె- మొ॥

**8. స్వత్వము :** సాలవధానవ్యవహితయందు బిందాద్యాదికార్యములు విభాష బహుళ మనురీతిగా చెప్పుటచే నట్టిమార్పులు పొందక ద్రుత మట్లే యుండుటయు గలదు. దానినే స్వత్వ మందురు. 'స్వత్వం బనఁగా ద్రుతమునకు ప్రకృతిభావము.' పూచెను గలువలు- మొ॥.

**నిషిద్ధస్థలము :** 'సమాసంబులందు ద్రుతంబునకు స్వత్వంబు లేదు' అనుసూత్రముచే సమాసమునందలి ద్రుతము స్వత్వస్థితిలో

| | | | |
|---|---|---|---|
| 4. | సంశ్లేషము | హల్లు-అవసానము | ప్రాతాదులలో లుప్త శేషముపైని, గణవిరోధమున |
| 5. | స్వరలోపము | అవసానమునందు | గణవిరోధనమున |
| 6. | స్వత్వము | హల్లు- అవసానము | సమాసములందు |
| 7. | మీఁది నకారము | అచ్చు, హల్లు, అవసానము | |
| 8. | నకారద్విత్వము | అచ్చు | |
| 9. | మకారము | (ప్రాసలో) మకారము | |
| 10. | పూర్వస్వరసంధి | అచ్చు | ఇఁకాది, ప్రథమేతర విభక్త్యాదిభిన్నములు. |

## 28. అలుక్సమాససంధికార్యాలు

**అలుక్సమాసము :** 'సమాసవిభక్తికి లోపం బగు లట్టునకుఁ గాదు' అనుసూత్రముచే సమాసమునందు సాధారణముగా లోపించును. కాని కొన్నిసమాసములందు విభక్తులు లోపింపకుండుటయు గలదు అట్టివానిని అలుక్సమాసములు అందురు. అలుక్సమాసములందు జరుగుకార్యము లిట్లు గుర్తింపఁదగును.

**1. ఇత్వము :** 'చేతతోడవలనఁ **కిత్వం**బు సమాసంబునందగు' ఇత్వమును విధించుటచేత ఇచ్చటి చేత, తోడ, వలన అను విభక్తులు లోపింపవు. కావున ఇవి అలుక్సమాసములు. నీచేతను+ ప్రోవు అనుచో 'సమాసంబునయందు ద్రుతంబునకు లోపం బగు' అనుసూత్రముచే ఇత్వము వచ్చి నీచేతిప్రోవు. ఇట్లే నాతోడిచెలిమి, నీవలనిభయము మొ॥ 'నీప్రోవు' అనురీతిగా విభక్తి లోపించునవి లుక్సమాసములు.

**2. అలిగాగమము:** 'అంద్వాదుల కలిగాగమంబు సమాసంబునం దగు' అనుసూత్రముచే అందు, ఇందు, ఎందు అనుఅవ్యయములకును సప్తమీవిభక్తి యగు 'అందు'కును అలిగాగమము వచ్చును. మాటయందును+నేర్పు=మాటయందలి నేర్పు మొ॥ 'మాటనేర్పు' అని అందువిభక్తి లోపించిన అది లుక్సమాసము.

**3. నవిభక్త్యలుక్సమాసము :** ప్రౌఢవ్యాకర్త "కొన్నియెడల సప్తమీతత్పురుషంబునందు నవర్ణకంబు నగు' అని పేర్కొనెను. కావున సప్తమీవిభక్తి యగునవర్ణకము లోపింపనిసమాసములును గలవు. కువలయంబునను+వారు. 'సమాసంబునయందు ప్రథమంబునకు లోపం బగు'. కువలయంబునవారు. ఇవి సప్తమ్యలుక్ సమాసములు.

ఇట్లు చేత, తోడ, వలన, అందు. అనువిభక్తులు లోపింపని అలుక్సమాసము లేర్పడుచున్నవి.

**4. తలఁబ్రాలుప్రభృతులు :** తలయందు ప్రాలు అనుచో సప్తమికి ద్వితీయ వచ్చి తలను + ప్రాలు అనుచో సమాసమున లోపింపవలసినప్రథమము (ద్వితీయావిభక్తి) "తలఁబ్రాలు మొద లగు సమాసంబుల ప్రథమమునకు లోపంబు లేదు" అనుసూత్రముచే లోపింపదు. ప్రథకార్యములతో తలంబ్రాలు మొద లగురూపము లేర్పడును. కాగా ఇవియు అలుక్సమాసములె. తలఁబ్రాలు మొద లగునవి సప్తమ్యర్థకద్వితీయాలుక్సమాసములు. ఊరబంది ఇత్యాదులు సప్తమ్యలుక్సమాసములు.

**5. నన్నుఁబోలెప్రభృతులు :** ఇంకను ప్రౌఢవ్యాకర్త నన్నుఁబోలె, మిమ్మునలె మొద లగు, ఇన, వత్ అనువానియర్థము గలిగిన శబ్దములతో అలుక్సమాసములను ప్రస్తావించెను.

# 29. అనుకరణసంధికార్యాలు

**అనుకరణము :** యథాతథముగా గ్రహించుట అనుకరణము. సంస్కృతవాక్య(శబ్ద)ము అనుకరణముతో మాత్రమె తెలుగున ప్రయోగింపవలెను.

అయా ప్రత్యేకసందర్భములందు తప్ప సంస్కృతవాక్య(పద)ము అనుకరణము లేకుండ తెలుగున ప్రయోగింపబడుట లేదు.

**అనుకరణరాహిత్యము :** "ఒకానొకచో ననుకరణవిరహితంబుగ సంస్కృతవాక్యంబు గానంబడియెడి" అనుకరణము లేకుండ కూడ సంస్కృతవాక్యము ప్రయోగింపబడుటను ప్రౌఢవ్యాకర్త పేర్కొనెను. అంటిరి నమశ్శివాయ పాపాత్మురాలి

"జయపదం బనుకరణవిరహితంబ తెలుపుచుగ నగు" అని ప్రౌఢవ్యాకరణము "జయ" అను సంస్కృతక్రియాపదము అనుకరణము లేకయె ప్రయోగింపబడుటను పేర్కొనెను. జయ నారాయణ. ఇది అనుకరణముతో ప్రయోగింపబడినచో అదియె విశేషముగా తోచెడిని.

ఈ అనుకరణమునందు అనుకరించువాక్యమునకు 'అను' ధాతురూపము పరముగా ప్రయోగింపబడుచుండును. అనుకరణమునం దనుధాతురూపము పర మగుచుండగా పూర్వమున సంస్కృతవాక్యము చివర జరుగునట్టి వికారములె అనుకరణసంధికార్యములు.

**1. విసర్గలోపము :** 'విసర్గంబున కనుకరణంబున లోపం బగు' సంస్కృతవాక్యము చివర ఉన్న విసర్గకు లోపము వచ్చును. త్వం హరిః+అనె. త్వం హరి యనె.

**2. ఓత్వము:** 'అనుకృతిని నమశ్శబ్దంబుతుదియత్తున కోత్వంబు విభాష నగు' విసర్గ లోపింపగా పిదప 'నమ' అనుశబ్దములోని చివరి అత్వమునకు ఓత్వము వికల్పముగా వచ్చును. తుభ్యం నమ(ః)+అనె.

తుభ్యం నమో యనె, ఓత్వము రానిపక్షమునందు తుభ్యం నమ యనె.

ఈ కార్యము లాంతిచో సహితము గానంబడియెడి. ఈ ఓత్వము నమశ్శబ్దమునందే కాక యితరస్థలములయందును కనబడుచున్నది. లోక(ః)+అటంచున్ - లోకో యటంచున్.

**3. ద్విత్వము :** 'అనుకరణంబునం దుదిహల్లునకు ద్విర్వచనం బగు' సంస్కృతవాక్యముచివర నున్న హల్లునకు నిత్యముగా ద్విత్వము వచ్చును. కస్త్వమ్+అసియె = కస్త్వమ్మసియె.

**4. వైకల్పికద్విత్వము :** 'అనుకరణంబునం దహోమాదుల మకారంబునకు ద్విరుక్తి విభాష నగు' అహమ్ మొదలగు శబ్దములందలి మకారమునకు మాత్రము ద్విత్వము వికల్పముగా వచ్చును. దాసోఽహమ్+అనె - దాసోఽహమ్మనె. ద్విత్వము రానిపక్షమున దాసోఽహ మనె.

**5. వుగాగమము :** 'ఉదంతనామంబున కనుకరణంబునందు వుగాగమం బగు' క్రియాపదము కాని ఉదంతశబ్దమునకు చివర వకారము చేరును. ఇయం ధేను+వ్+అనె - ఇయం ధేను వనె.

ఇతరస్థలములందు సాధారణసంధికార్యము లగును. ధర్మో జయతు+అనుచు - అనుచో నుత్వసంధి యై ధర్మో జయ తనుచు.

**హ్రస్వము రాదు :** అనుకరణమునందు సంస్కృతవాక్యము చివరదీర్ఘమునకు హ్రస్వము వచ్చు నని అప్పకవి చెప్పెను. కాని కవులు దీర్ఘమునకు హ్రస్వమును ప్రయోగింపలేదు. కావున అది అంగీకరింపరాదు. దుర్బలస్య బలం రాజా యన వినవే. 'రాజా' అనుచో దీర్ఘ మట్లే యున్నది.

**6. ముగాగమము:** ధ్వన్యనుకరణశబ్దముల కనుధాతువు పరం బగుచోఁ గొన్నియెడల ముగాగమం బగు' అని ప్రౌఢవ్యాకర్త

ధ్వన్యనుకరణశబ్దములకు అనుకరణములో 'మ'కారము చేరుటను పేర్కొనెను. సలసల+అను. సలసలమ్+అను- సలసల మను.

## 30. తెలుగువిభక్తులు

సంస్కృతమునందువలె తెలుగునను ప్రథమ మొదలుకొని సప్తమివఱకు 7 విభక్తులు గలవు. ఒక్కొక్కవిభక్తియందు ప్రత్యయములు పెక్కు లగుట తెలుగులోనివిశేషము.

**1. ప్రథమ :** 'డుమువులు ప్రథమ' 'డుమువులు' అనునవి నాల్గు ప్రథమావిభక్తులు 'డుమువున లేకవచనంబులు' ఇందలి డుమువు అనునవి ఏకత్వసంఖ్యను మాత్రము బోధించును. కావున ఏకవచనములు. రాముడు, వనము, ధేనువు.

కాతుడు, నీవు, నేను మొద లగుస్థలములం దాచ్ఛికములలో డు, వు, ను, మొద లగునవి ప్రథమైకవచనములు, కొన్నిశబ్దములపై ప్రథమైకవచనము (ము) లోపించును. వనిత- పేరు మొ॥'లువర్ణంబు బహువచనంబు' 'లు'వర్ణము బహుత్వసంఖ్యను బోధించునది కావున బహువచనము. రాములు, వనములు. మొ॥ దీనికి రేఫాదు లగువిశేషకార్యములు గలవు. వాలురు, మీరు, మేము మొ॥

**2. ద్వితీయ :** 'నువర్ణంబు ద్వితీయ'- ద్వితీయయందు 'ను' అనున దొక్కటే ప్రత్యయము. ఇది ఏకత్వబహుత్వములు రెంట నగును. వనమును, వనములను. దీనికె ఇత్వము వచ్చి 'ని' అనురూప మేర్పడును. హరిని మొ॥.

కొన్నిచోటుల నుద్దేశార్థంబునందు ద్వితీయకు గుఱించియు నను ప్రయుక్తం బగు' అని ప్రౌఢవ్యాకర్త చెప్పెను. దీనివలన ద్వితీయపై, కూర్చి, (గుఱించి) అనునవి చేరును. నన్నుఁగూర్చి మము గుఱిచి మొ॥

**3. తృతీయ :** 'చేత తోడ తృతీయ'- చేత మరియు తోడ అనునవి తృతీయావిభక్తులు. వీనినుండి 'చేతతోడలోపలవర్ణకంబుల ప్రథమాక్షరంబులు వైకల్పికంబుగ శేషించు' చే, తో అనురూపములును ఏర్పడును. ఇవి ఏకత్వబహుత్వములు రెంట వచ్చును. రామునిచేత, రాములతో మొ॥

'ఒకానొకచో తోడకు తోడుత నని రూపాంతరంబును గలదు' అని ప్రౌఢవ్యాకరణము. 'తోడ' అనుదానికి 'తోడుత' అనురూపాంతరము గల్గును. 'ప్రాణములతోడుత'- 'జడపదంబు మీఁదితోడకు మెయి మైలు విభాష నగు' అనుదానిచే మెయి, మై అనునవి తోడస్థానమున వచ్చును. అర్థిమెయి, అర్థిమై (అర్థితోడ).

**4. చతుర్థి :** 'కొఱకు కయి చతుర్థి'- కొఱకు, కయి అనునవి రెండును చతుర్థీవిభక్తులు. ఏకత్వబహుత్వములు రెంట నగును. రామునికొఱకు, రాములకయి.

చతుర్థికిం బొంటె యర్థకంబు నగు' అని ప్రౌఢవ్యాకరణము. చతుర్థికి కొన్నియెడల 'పొంటె' అనునది అగును. సంప్రయోగము పొంటెన్.

**5. పంచమి :** 'వలన కంటె పట్టి పంచమి' పంచమీవిభక్తులు వలన, కంటె, పట్టి అనునవి. ఇవి ఏకత్వబహుత్వములు రెంట వచ్చును. వనమువలన, వారికంటె మొ॥ 'ఉండిపదం బొకానొకచో వలనవర్ణకంబున కనుప్రయుక్తం బగు' వలనపై కొన్నియెడల 'ఉండి' అనుపదము చేరును. వనమువలననుండి.

'కొన్నియెడలఁ జేతవిభక్త్యర్థకవర్ణకంబులకును, వలనవర్ణకంబునకును జేసి యనుప్రయుక్తం బగు' అని ప్రౌఢవ్యాకరణము. ధర్మతనూభువువలనఁ జేసి, (ఇచ్చుటం జేసి) మొ॥

**6. షష్ఠి :** కు యొక్క లోపల షష్ఠి. కు, యొక్క, లోపల,

అనునవి మూఁడు షష్ఠీవిభక్తులు. ఇవి ఏకబహువచనములు రెండు నగును. రామునకు. ఇకారముపై కువర్ణమున కిత్వము వచ్చి 'కి' స్వరూపము గల్గును. రామునికి. 'లోపల'కు 'లో' అనురూపముగల్గును. వనములలో.

**7. సప్తమి :** 'అందు న సప్తమి'. అందు, న అనునవి రెండును సప్తమీవిభక్తులు. 'ముమువున కేకవచనంబులు' న-అనునది ఏకవచనము. వనమున అందు ఏకబహువచనములు రెండు నగును. వనమునందు, వనములందు.

'తృతీయాదులకు నుగాగమం బగు' చేత మొదలగువిభక్తులకు చివర నువర్ణము చేరును. రామునిచేతను ఇట్లివి ద్రుతప్రకృతికములు. 'కయిపట్టియొక్కలకు నుగాగమంబు లేదు' అనుటచే కయి, పట్టి, యొక్క ప్రత్యయాంతములు కళలు. రామునికయి.

## 31. సంబోధనమున చేరుశబ్దములు

సంబోధ్యవాచకములకు ముందుగను వెనుకగను చేరుఆయా శబ్దములనుగూర్చి బాలప్రౌఢవ్యాకరణము లిట్లు పేర్కొన్నవి

**1.** ఓ : 'ఓ యామంత్రణంబునం దగు'- సంబోధ్యవాచకము (మహత్తయినను, అమహత్తయినను, ఏకవచనాంత మయినను, బహువచనాంత మయినను) ముందుగా 'ఓ' అనుశబ్దము చేరును. ఓరామ, ఓరాములార.

**2. వ్యవధానము :** ఇచట ప్రౌఢవ్యాకరణము 'ఓశబ్దంబొక్కచో సంబోధ్యవాచకంబునకు ముం దితరశబ్దవ్యవహితం బయి కానంబడియెడి' అన్నది. ధాతుజవిశేషణములసందర్భమున ఓశబ్దమునకును, సంబోధ్యవాచకమునకును నడుమ వ్యవధానము గలదు. 'ఓ వినుపించు నున్నఖచరోత్తములార'.

**2. ఓయి :** 'ఓశబ్దంబునకుం బురుషనీచస్త్రీపురుషామంత్రణంబులందు యిసిరివర్ణంబులు విభాష నంతాగమంబు లగు' పురుష సంబోధనములో ఓశబ్దమునకు పైని యివర్ణము చేరి ఓయి అని అగుట కలదు. ఓయి రామ. (ఓరామ) ఇది బహువచనస్థలమున మిక్కిలి అరుదు. ఓయి నెజ్జులార.

**3. ఓసి :** పయిసూత్రముచేత నీచస్త్రీసంబోధనములో 'సి' వర్ణము చేరి ఓసి అనునదియు అగును. ఓసి దుష్టురాల. (ఓ దుష్టురాల) ఓరి యోసి మైత్రియందుం గలవు. అని ఓసి మైత్రియందును వచ్చును. ఓసి ముద్దుబాల.

**4. ఓరి :** పయిసూత్రముచేతనె నీచపురుషసంబోధనములో ఓశబ్దమునకు 'రి'వర్ణము చేరి ఓరి అనియు అగును. ఓరి దుష్టుఁడ. (ఓ దుష్టుఁడ) ఇదియు మైత్రియందును ప్రయోగింపబడును. ఓరి చిన్నికృష్ణ.

ఓరి ఓసి అనునవి సంబోధ్యవాచకము లేకుండ స్వతంత్రముగా ప్రయోగింపబడుటయు కలదు. సంగతియ యోయి. మొ॥

**5. రో, రొ :** 'రోశబ్దంబొండు సంబోధనంబున స్త్రీవాచకంబునకుఁ బరంబుగ నగు అయ్యది హ్రస్వాంతంబును నయ్యెడి' అని ప్రౌఢ వ్యాకరణము. స్త్రీవాచకముల కేకత్వమున సంబోధ్యవాచకమునకు పరముగా రో అనునది వచ్చును. కమలదళాక్షిరో. దానికి హ్రస్వమును వచ్చును. రమణిరొ. ఇంకను అన్నరో, ఏనుంగురో అనియు ప్రయోగము లున్నవి.

**6. కాన :** 'దేశ్యంబులం గొన్నియెడల స్త్రీవాచకస్త్రీసమంబులగుసంబోధ్యవాచకశబ్దములమీఁద నేకవచనంబునఁ గానశబ్దంబొండును అల యనునవ్యయం బొండును గానంబడియెడి. అల దీర్ఘాంతంబు నగు' అని ప్రౌఢ. కొన్ని శబ్దములకు పరముగా సంబోధ

నమున 'కాన' అనుశబ్దము చేరును. తల్లికాన. ఇంకను పాపజాతికాన, దురాచారులారకాన అనియు ప్రయోగములు గలవు.

**8. అల-అలా :** పయిసూత్రముచే కొన్నిశబ్దములకు పైని 'అల' అనునది వచ్చును. అమ్మలక్కలని. అల అనుదానికి చివర దీర్ఘమును గలదు. అన్నలా. అల, అలా అనునవి సంబోధనమున నైన నగుట విచార్యము.

పయిఅంశముల నిట్లు సంగ్రహముగా గుర్తుంచుకొనవచ్చును.

| సంబోధశబ్దము | సంబోధ్యవాచకము | ఉదాహరణము |
|---|---|---|
| 1. ఓ | అన్నిశబ్దములకు-పూర్వమున వ్యవధానముతో | ఓరామ. ఓసీతలార ఓ వినుపీథినున్న ఖచరోత్తములార ! |
| 2. ఓయి | పురుషసంబోధనమున సంబోధ్యవాచకము లేకుండ | ఓయి రామ. సంగతియు యోయి |
| 3. ఓరి | నీచపురుషసంబోధనమున మైత్రియందు సంబోధ్యవాచకము లేకుండ | ఓరి దుష్టుడ ఓరి చిన్నికృష్ణ ఓరోరి ! |
| 4. ఓసి | నీచస్త్రీసంబోధనమున మైత్రియందు సంబోధ్యవాచకము లేకుండ | ఓసి దుష్టురాల ఓసి ముద్దుబాల ఓసి పోవే |
| 5. రో | స్త్రీవాచకమునకు-పరముగ | కమలదళాక్షిరో |
| 6. రా | ,, ,, | రమణిరా |
| 7. కాన | స్త్రీసమమునకు-పరముగ | తల్లికాన |
| 8. అల | ,, ,, | అమ్మలక్కల |
| 9. అలా | ,, ,, | అన్నలా |

# 32. సంబోధనకార్యములు

అభిముఖముగా చేసికొనుట సమ్ముఖీకరణము. 'ప్రాతిపదిక సంబోధనోక్త్యర్థంబులం బ్రథమ యగు' సంబోధనార్థమున ప్రథమా విభక్తి వచ్చును.

**I. ఏకవచనాంతములు :** ఏకత్వార్థమున సంబోధనమున ప్రథమావిభక్తి ఏకవచన మగును. రాముఁడు, వనము, ధేనువు, కొడుకు మొ॥. ఏకవచనాంతములకు సంబోధనమున కింది కార్యము లిట్లు గుర్తింపదగును.

**1. డుజ్లోపము :** "కృతేతరంబగు సంస్కృతసమంబు సంబుద్ధిడుజ్ఞునకు లోపంబు విభాష నగు" చెప్పబడినసూత్రము గల సంస్కృతప్రాతిపదికలపైని డుజ్ఞునకు వికల్పముగా లోపము వచ్చును. (ఓ రాము మొ॥).

**2. అత్త్వము :** 'సంబోధనంబునం దేకార్థం బగు నపదంబు తుదియుకారంబున కకారం బగు' సంబోధనమున ప్రథమైకవచనాంతము లైన అన్ని శబ్దములయందును చివరిఉత్వమునకు అత్త్వము వచ్చును.

ఓరామ, ఓరాముఁడ ఓవనమ, ఓధేనువ ఓకొడుక మొ॥

**3. అ-ఇ-దీర్ఘము :** "సంబోధనంబునందుఁ బదంబుతుదియకారేకారంబులకు దీర్ఘంబు విభాష నగు" అన్నిశబ్దములకును చివరనున్న అత్వమునకును ఇత్వమునకును వికల్పముగా దీర్ఘము వచ్చును.

ఓరామా, ఓరాముఁడా.

ఓవనమా, ఓధేనువా, ఓకొడుకా. ఓహరీ, ఓతండ్రీ మొ॥

దీర్ఘము రానిపక్షమున ఓరామ, ఓతండ్రి మొ॥

**4. ప్లుతము :** ఉదంతసంస్కృతనామంబు సంబుద్ధిడుజ్ఞునకు నూకారంబు ప్లుతం బాదేశంబు విభాష నగు. సహజముగా ఉదంతము

లయినసంస్కృతప్రాతిపదికలమీాద నున్న సంబోధనమందలి హ్రస్వమునకు ప్లుత మగుఊకారము వచ్చును. మూడుమాత్రలకాలముఉచ్చారణము నకు గుర్తుగా '3' అంకె ఉంచుదురు. ఓవిష్ణూ3 మొ॥ ప్లుతము రాని పక్షమునందు- ఓవిష్ణుఁడ, మొ॥

II. **బహువచనాంతములు :** బహుత్వమును బోధించునప్పుడు సంబోధనమున ప్రథమావిభక్తియందు బహువచనము వచ్చును. ఓరాములు, వనములు మొ॥

**5. ఆరగాగమము :** 'సంబోధనంబునందు బహువచనంబున కారగాగమం బగు' సంబోధనమున బహువచనాంతము లగుశబ్దముల కన్నింటికిని చివర 'ఆర' అనునది వచ్చి చేరును. రాములు+ఆర. రాములార మొ॥.

ఆరగాగమమందలి అత్వమునకు 'సంబోధనంబునందుఁ బదంబు తుదియకారేకారంబులకు దీర్ఘంబు విభాష నగు' అని వికల్పముగా వచ్చును. ఓరాములారా! తంత్రములారా- రాములార- తంత్రములార మొ॥

**6. వైకల్పికారగాగమము :** 'మధ్యమపురుష యోగంబునం దారగాగమంబు విభాష నగు' బహువచనాంత మగుసంబోధ్యవాచకము **మధ్యమపురుషక్రియతో** అన్వయము గలిగియున్నపు డారగాగమము వికల్పముగా వచ్చును. వినుఁడు బాలకులు, వినుఁడు బాలకులార !

# 33. సంస్కృతశబ్దాలు-తత్సమములగువిధానము

### అకారాంతాలు :-

అకారము చివర గలిగినశబ్దములు అకారాంతములు. అజంతము లగుశబ్దములు సాధారణముగ సంస్కృతమున ఏవి ప్రాతిపదికలో అవి అట్లే తెలుగునను ప్రాతిపదికలుగా నిలుచును.

ఇవి తెలుగున తత్సమము లగునపుడు విభక్త్యాదులతో మార్పులను పొందును.

**హ్రస్వము :** 'నామంబులతుదిదీర్ఘంబునకు హ్రస్వం బగు' **అజంత**సంస్కృత(ప్రాకృత)ప్రాతిపదికలచివరిదీర్ఘమునకు హ్రస్వము వచ్చును. వనితా-వనిత.

'ఏకాక్షరంబులకు హ్రస్వంబు లేదు'- సంస్కృతప్రాతిపదిక మొకేఅక్షర మైనశబ్ద మగుచో హ్రస్వము రాదు. శ్రీ, ధీ.

**1. పుంలింగములు :**

**ఉత్వడుజ్ఞులు :** సంస్కృతప్రాతిపదికము అకారాంతమును పుంలింగము నయి మహద్వాచక మయినపుడు 'పుంలింగం బయి మహద్వాచకం బయినసామంబుతుదియత్వంబున కుత్వం బగు' అని (ఎల్లవిభక్తులయందు) ఉత్వము వచ్చును. ప్రథమైకవచనమున 'పుంలింగ మగుమహద్వాచకంబునకు డు జ్ఞగు' అని డుప్రత్యయ మగును. రామ-రాముడు.

**డుజ్లోపాదులు :** 'వృద్ధాదులడుజ్ఞునకు లోపంబు విభాష నగు' వృద్ధ మొద లగుశబ్దములతుదిఅత్వమునకు ఉత్వము వచ్చిన పిదప ప్రథమైకవచన మగు డుజ్ఞునకు వికల్పముగా లోపము వచ్చును. వృద్ధు. మూర్ఖు- మొ॥ లోపము రానిపక్షమున- వృద్ధుడు మొ॥.

'దూతాదులకు స్త్రీత్వంబు బహుళంబుగా నగు' దూత మొద లగునవి సహజముగా పుంలింగము లైనను స్త్రీత్వమును పొందును. కావున ప్రథమైకవచనలోపము, మొద లగుస్త్రీలింగకార్యము లగును. దూత. (దూతను) మొ॥ స్త్రీత్వము లేనిపక్షమున (మహత్) పుంలింగకార్యము లగును. దూతుడు (దూతుని మొ॥).

'సురశబ్దంబు నిత్యంబుగా నసురశబ్దము వైకల్పికముగా స్త్రీ తుల్యము లగు సంస్కృతసమాసంబునం గావు' వీనికి స్త్రీతుల్యత్వ

మై సురలు. అసుర-అసురుఁ డనురీతి నేర్పడును. సిద్ధసమాసములందు స్త్రీతుల్యత్వము లేదు. భూసురుఁడు. మొ॥.

'స్వర్గివాచి దేవసురశబ్దంబు లేకత్వబహుత్వంబులం బ్రయోగింపంబడు' 'దేవ'శబ్ద మెప్పుడు ఏకత్వము బోధించుసందర్భములందే ప్రయోగింపవలెను. దేవుఁడు (దేవుని)(మొ॥) కావున దీనిపై బహువచన ముండదు. సురశబ్ద మెప్పుడును బహుత్వమును బోధించునపుడే ప్రయోగింపబడును. సురలు. కాగా ఇది ఏకవచనాంతము గాదు.

సంబోధనమందు 'కృతోత్వం బగు సంస్కృతనామంబుసంబుద్ధి డుజ్ఞునకు లోపంబు విభాష నగు' అని వికల్పముగా డుజ్ఞు లోపించును. (రాము రాముఁడు)

'సంబోధనంబునం దేకార్థం బయినపదంబుతుదియుకారంబున కకారం బగు' రామ, రాముఁడ. 'సంబోధనంబునందుఁ బదంబుతుది యుకారేకారంబులకు దీర్ఘంబు విభాష నగు. రామా- రాముఁడా.

'సంబోధనంబునందు బహువచనంబున లారగాగమం బగు' బహుత్వమున అన్నిశబ్దములకును లరగాగమము సామాన్యముగ వచ్చును. రాములార, వనితలార, వనములార. 'మధ్యమపురుష యోగంబునం దారగాగమంబు విభాషనగు' మధ్యమపురుషక్రియతో అన్వయించునపుడు మాత్రమువికల్పము. బాలకులు (బాలకులార)

**లకారము-రేఫము :** 'అదంత ద్వి దీర్ఘపూర్వలోపధం బయిన మహత్తుమిఁదివిభక్తిలకారంబునకు రేఫం బగు' బాల- అనువిధమయినప్రాతిపదికలపై బహువచనమునందలిలకారమునకు రేఫము వచ్చును. బాలురు-బాలురన్. దయాళురు అనియు కలదు.

"ద్విత్వయుక్తలాంతంబుమిఁదిలులలకు రు రలగు" అనుప్రౌఢ వ్యాకరణలక్షణముచే మల్లురు- మల్లుర- నని యగు. మల్లులు-

మల్లుల నని ప్రసిద్ధము.

**నిగాగమము :** హుమంతబునకు ద్వితీయాద్యేకవచనంబు పరం బగునపుడు నిగాగమంబు సర్వత్ర విభాష నగు'

ద్వితీయాదివిభక్తులలో ఏకవచనము పర మైనపుడు పినికి వికల్పముగా నిగాగమము వచ్చును. రామునిని రాముచేత. అనుదంత మగుఅచ్చ తెనుగుహుమంతమునకు నిత్యము. మగనిచేత.

**నగాగమము :** కువర్ణకంబు పరం బగునపు డుకారఋకారంబులకు నగాగం బగు' షష్ఠి యగు కువర్ణము పర మగునపుడు నిగాగమము రానిపక్షమున నగాగమము వచ్చును. రామునికి - రామునకు.

ఇచట ప్రౌఢవ్యాకర్త 'కువర్ణకంబు పరం బగునపుడు కవిత్రయంబువారిప్రయోగంబులం దక్క దక్కిన మహాకవి ప్రయోగంబులందునుం గొన్నియెడల నగాగమనంబు చూపట్టదు' అని కొన్నియెడల నగాగమము లేకుండుటను పేర్కొనెను. ప్రాచేతసునకున్.

'కంటెవర్ణకంబు పరం బగునపుడును గొన్నియెడల నగాగమంబు చూపట్టెడి' అని కంటె పరమైనపుడును నగాగమ మరుదుగ వచ్చు నని ప్రౌఢవ్యాకరణము పేర్కొన్నది. శతంబునకంటె.

**నుగాగమము :** 'ఉకారఋకారంబుల కందువర్ణకము పరం బగునపుడు నుగాగమం బగు' సప్తమి ఏకవచనమున 'అందు' పర మగునపుడు నిగాగమము రానిపక్షమున నుగాగమము వచ్చును. రామునందు.

**స్త్రీలింగములు :**

**ప్రథమైకవచనలోపము :** స్త్రీలింగంబుల ప్రథమైకవచనంబునకు లోపం బగు. స్త్రీలింగము లగుశబ్దములకు పైనున్న ప్రథమైకవచనము(ను)నకు లోప మగును. వనిత-విద్య.

**క్లీబతుల్యత :** కంధరాదులు క్లీబతుల్యంబులు బహుళంబుగా నగు. 'కంధరా' మొద లగు స్త్రీలింగశబ్దములకు బహుళముగా క్లీబతుల్యత కలుగును. క్లీబతుల్యతచే ముగ్వర్ణము మొ॥ నపుంసక లింగకార్యములు వచ్చును. కంధరము. క్లీబతుల్యత కలుగని పక్షమునందు స్త్రీలింగకార్యము లగును. కంధర.[1]

బహుళశబ్దమువలన విధాశబ్దమునకు క్లీబతుల్యత నిత్యము. విధము. ఇచట ప్రౌఢవ్యాకర్త 'విధాశబ్దంబు సంస్కృతంబునం బుంలింగంబు నగు' అని పేర్కొని పుంలింగము లగు విధ, దంష్ట్రి అను శబ్దములనుండి యీ (క్లీబతుల్య)రూపములు సాధించెను. అది విచార్యము. సంబోధనమున-ఓ వనితా-ఓ వనిత. మొ॥

ఇతరవిభక్తులయందు వనితను ఇత్యాదిగా సాధారణముగ రూపము లేర్పడును.

**నపుంసకలింగములు :**

**ముగ్వర్ణక ముగాగమాదులు :** అకారాంత సంస్కృతశబ్దములు నపుంసకలింగము లయినను, పుంలింగము లయ్యు అమహద్వాచకము లయినను 'అమహన్నపుంసకములకు కడంతములకు ముగ్వర్ణకం బగు' అని ప్రథమావిభక్తి ఏకవచనమున ముగ్వర్ణకము వచ్చును. కళత్రము-వృక్షము. సంబోధనమందు, కళత్రమ! వృక్షములారా! మొ॥

ముగ్వర్ణకంబునకు మాముడీ యోనిం బూర్ణబిందుపూర్వక మువర్ణం బేని విభాష నగు' మాముడి (్మ) లేదా 'ంబు' అనునది వికల్పముగా ఆముగ్వర్ణకమునకు వచ్చును. వృక్షమ్ము-వృక్షంబు.

**ములోపము :** చరిత్రాదులముగ్వర్ణకంబునకు లోపంబు బహుళంబుగా నగు' చరిత్ర మొద లగువానిముగ్వర్ణకమునకు బహుళముగా లోపము వచ్చును. చరిత్ర-చరిత్రము, బహుళ మనుటచే దర్భ మొద లగువానిపై ఈలోపము నిత్యము. దర్భ, పనస మొ॥

'వానికి మువర్ణకేతరం బయినవిభక్తి పరం బగునప్పుడు ముగాగమం బగు' ఇతరవిభక్తి పర మయినప్పుడు మువర్ణ మాగమ మగును. కళత్రములు వృక్షములను మొ॥ 'మువర్ణకంబునకు విధించుకార్యము ముగాగమంబునకు నగు' మ్రుప్రత్యయమునకు చెప్పినకార్యము లెల్ల ఆగమ మగుమువర్ణమునకును వచ్చును. వృక్షమ్ములు - వృక్షంబులు, చిత్రలు, దర్భలు మొ॥

**ములోపదీర్ఘాలు :** లుఙలు పరంబు లగునప్పు డొకానొకచో ముగాగమంబునకు లోపంబును దత్పూర్వస్వరంబునకు దీర్ఘంబును విభాష నగు'అని కొన్ని రూపాల ముగాగమమునకు లోపమును ముందరి అచ్చునకు దీర్ఘమును వచ్చును. వజ్రాలు-వజ్రాలను-వజ్రాన మొ॥

**ఉత్వపువర్ణాలు :** 'అన్యాములకదయుచ్చున తత్వంబును మీఁద పువర్ణకంబును వైకల్పికంబుగా నగు' అని ప్రౌఢవ్యాకరణ మొకవిశేషమును తెలిపినది. అట్టి మొదలగు శబ్దములకు ఉత్వాపువర్ణకాదు లగును. అష్టువు-ధర్మువులు. వర్గము-వర్గువు మొ॥ వర్గువు అనుచో ఒకసారి పువర్ణము లోపించి 'వర్గు' అనియు ఉండును.

సంబోధనమున ఓవనమా, ఓధర్మువా మొ॥ ఇతర విభక్తులలో వనమును-ధర్మువునందు మొ॥

**పుంలింగతుల్యత :** "క్లీబంబులు మిత్రాదులు మహాద్వాచకంబులు విభాషం బుంలింగతుల్యంబు లగు' నపుంసకలింగము లయిన మిత్రాదిశబ్దములు మహత్తు లయినప్పుడు వికల్పముగా పుంలింగతుల్యము లగును. ఆపక్షమున మహత్పుంలింగకార్యములు గలుగును. మిత్రుండు, పాత్రుండు మొ॥ పుంలింగతుల్యత గలుగనిపక్షమున సహజముగా నపుంసకలింగము లగుటచే నపుంసకలింగకార్యములు గల్గును. మిత్రము—పాత్రము మొ॥

**నక్, నుగాగమాలు :** 'కువర్ణకంబు పరం బగునప్పు డుకార ఋకారంబులకు నగాగమం బగు' షష్ఠియం దేకవచమున కువిభక్తి పరమగునపుడు నగాగమము వచ్చును. వృషమునకు, కొన్నియెడల నీ నవర్ణము లేకుండుటను కంటె పరమైనప్పు డగుటను, ప్రౌఢవ్యాకర్త చేర్కొనెను. ఉత్సవమునకు మొ॥ చక్రిగమునకంటె మొ॥

'అగమమువుపర్ణంబుల కందువర్ణకము పరం బగు నపుడు నుగాగమంబు విభాష నగు' సప్తమీ ఏకవచనమున అందు పరమైనపుడు వికల్పముగా నుగాగమము వచ్చును. వృషమునందు-వృషమందు.

ఉదంతము లగునమహాత్ముల కందువర్ణకము పరం బగునపుడును నగామంబు కొన్నియెడలఁ గానంబడియెడి' అని ప్రౌఢవ్యాకర్త ఇట కొన్నియెడల నగాగమ మగు నని చెప్పెను. పటమునయందు మొదలగునవి.

పుంలింగాదు లగుశబ్దము లన్నింటికిని ద్వితీయాది బహువచనములలో 'బహుత్వంబున ద్వితీయాదివిభక్తులకు లఙాగమం బగు' నని లవర్ణము వచ్చును, రాములను వనితలకొఱకు వనములయందు.

## 34. ఇకారాంతములు

చివర ఇకారము కలిగినశబ్దములు ఇకారాంతములు. అజంతము లగుశబ్దములు సంస్కృతమున ఏవి ప్రాతిపదికలో తెలుగునను అవియే ప్రాతిపదిక లగును.

**హ్రస్వము :** 'నామంబులతుదిదీర్ఘంబునకు హ్రస్వం బగు' అజంతసంస్కృత (ప్రాకృత) ప్రాతిపదికలచివరిదీర్ఘమునకు హ్రస్వము వచ్చును. గౌరీ-గౌరి. మొ॥ 'ఏకాక్షరంబులకు హ్రస్వంబు లేదు'

సంస్కృతప్రాతిపదికము ఒకే అక్షర మైనశబ్ద మైనచో హ్రస్వము రాదు. శ్రీ. మొ॥

**ప్రథమైకవచనలోపము :** ఇకారాంతము లైన సంస్కృత శబ్దములు పులింగమునం దున్నను, మహత్తు లయిన, అమహత్తు లయినను, 'ఇగ్గౌరాయుసంతంబుల ప్రథమైకవచనంబునకు లోపం బగు' అని ప్రథమైకవచనము(సు)నకు లోపము వచ్చును. హరి, శ్రీ, వారి మొ॥

**సంబోధనము :** 'సంబోధనంబునం బదంబు తుదియకారేకారంబులకు దీర్ఘంబు విభాష నగు' సంబోధనమున తుదియిత్తునకు దీర్ఘము వికల్పముగా వచ్చును. ఓహరీ- ఓహరి. బహుత్వమునందు 'సంబోధనంబునందు బహువచనంబున కారగాగమం బగు' ఆరగాగమము సామాన్యముగా వచ్చును. హరులార-గిరులారా.

'మధ్యమపురుష యోగంబునం దారగాగమంబు విభాష నగు' వినుండు హరులు (హరులారా) మొ॥

**నుకు విభక్తులు-ఇత్వము :** 'ఇకారంబుమీఁది కునువు క్రియావిభక్తులయుత్వంబున కిత్వం బగు' ఇకారమునకు పైనున్న ను, కువర్ణములం దిత్వము వచ్చును. హరిని-హరికిని మొ॥

ద్వితీయాదివిభక్తులలో బహువచనమున "బహుత్వంబున ద్వితీయాదివిభక్తులకు లడాగమం బగు" అని లడాగమము వచ్చును. హరులను-గిరులయందు మొ॥

మిగిలినవిభక్తివచనములలో రూపములు సాధారణముగనే యేర్పడును. హరిచేత మొ॥

దీర్ఘమునకు హ్రస్వము వచ్చుటచే ఇదంతములైనశబ్దములు సహజముగా హ్రస్వాంతము లైనశబ్దములవలె రూపము లందును. గౌరి-గౌరిని, గౌరికిని మొ॥

**బహుత్వము-ఉత్వము :** 'ఇత్తునకు బహువచనంబు పరంబగునపు డుత్వం బగు, బహుత్వమున ప్రాతిపదికము తుదియిత్వమున కుత్వ మగును. హరులు గిరులు. దీర్ఘ మట్లే యుండును. శ్రీలు. ధీలు.

## 35. ఉకారాంత(ఓకారాంతములు)

చివర ఉకారము గలిగిన శబ్దములు ఉకారాంతములు. అజంతము లగుశబ్దములు సంస్కృతమున నేవి ప్రాతిపదికలో తెలుగునను అవియే ప్రాతిపదిక లగును.

**హ్రస్వము :** 'నామంబులతుదిదీర్ఘంబునకు హ్రస్వం బగు' సంస్కృతప్రాతిపదికము చివరిదీర్ఘమునకు హ్రస్వము వచ్చును. స్వయంభూ-స్వయంభు (వు). 'ఏకాక్షరంబులకు హ్రస్వంబు లేదు' సంస్కృతప్రాతిపదికము ఒకే అక్షర మైనశబ్ద మగుచో హ్రస్వము రాదు. భ్రూ (వు) గో (వు)

**వువర్ణము :**

**అమహత్తులు :** ఉకారాంతము లయినశబ్దములు ఏలింగమునం దున్నను, 'ఉకారాంతగోశబ్దములు కంతట వువర్ణకం బగు' ప్రథమా విభక్తి యేకవచనమున 'వు' వర్ణకము వచ్చును. తరువు, మధువు. 'అంతట' అనుటచే స్త్రీలింగశబ్దములకును ప్రథమైకవచనలోపమును బాధించి యీసూత్రముచే వువర్ణకమే వచ్చును. వధువు- ధేనువు.

ఓకారాంతములలో గోశబ్ద మొక్కటిమాత్రమే తెలుగున తత్సమముగా ప్రయోగింపబడును. ఏకాక్షర మగుటచే దీనికి హ్రస్వమును రాదు. పైసూత్రముచే ప్రథమైకవచనమున వువర్ణకమే అగును. గోవు.

'ఉదంతంబు లగుసమహత్తుల కంమువర్ణకము పరం బగునప్పుడును నగాగమంబు కొన్నియెడలఁ గానంబడియెడి, అను ప్రౌఢవ్యాకరణ సూత్రముచే ఇచ్చట కొన్నియెడల నగాగమము వచ్చుట కలదు. తరువునయందు మొ॥

'ఉదంతజడంబు సప్తమికి నవర్ణకం బగు' ఉదంతము లైన జడవాచకములకు పైని సప్తమీ ఏకవచనమున 'న' ప్రత్యయము వచ్చును. తరువున. మొ॥

**మహత్తులు :**

**వుడుజ్వర్ణాలు :** 'ఉకారాంతం బగు మహత్తునకు వువర్ణకము బహుళముగా నగు' ఉకారాంతశబ్దములు మహత్తు (పుంలింగమును) అయినచో వువర్ణకము బహుళముగా వచ్చును. శంభువు. వువర్ణకము రాని పక్షమునందు 'పుంలింగ మగుమహత్తునకు డు జ్జగు' అని డుజ్జు వచ్చి శంభుఁడు. అభిమన్యు మొదలగుశబ్దములకు వువర్ణకమసలు రాదు. అభిమన్యుఁడు మను మొదలగుశబ్దములకు వువర్ణకము నిత్యముగా వచ్చును. మనువు. (రాహుశబ్దముపై వువర్ణకము వచ్చి లోపించును. రాహు.)

ఇతర విభక్తులందు వుగాగమాదులును నిగాగమాదులును అగును. శంభువును. శంభునిని, శంభువునందు మొ॥

"బహుత్వమున ద్వితీయాదివిభక్తులకు లడాగమం బగు' తరువులను, శంభువులను. సంబోధనమునందు "ఉదంతసంస్కృత నామంబుసంబుద్ధిడుజ్జునకు నూకారంబు ప్లుతం బాదేశంబు విభాష నగు" డుజ్జునకు ప్లుత మగు ఊకారము (ఊ౩) వచ్చును. శంభూ౩. ప్లుతము రానిపక్షమునందు "సంబోధనంబునం దేకార్థంబయిన పదంబుతుదియుకారంబున కకారం బగు" అని అత్వము వచ్చును. తరువ, శంభువ, శంభుఁడ మొ॥ సంబోధనంబునందు బదంబుతుది

యకారేరంబులకు దీర్ఘంబు విభాష నగు. అత్వమునకు వికల్పముగా దీర్ఘము వచ్చును. తరువా, శంభువా, శంభుండా.

బహుత్వమునం దెల్ల సాధారణముగ 'సంబోధనంబునందు బహువచనంబున కారగాగమం బగు' అను సూత్రముచే ఆరగాగమము వచ్చును. తరువులారా, శంభువులార మొ॥ 'మధ్యమపురుష యోగంబునం దారగాగమంబు విభాష నగు' రక్షింపుండు ప్రభువులు, ప్రభువులార.

## 36. ఋకారాంతములు

అజంతము లగుసంస్కృతశబ్దములు సాధారణముగా సంస్కృతమునం దేవి ప్రాతిపదికలో అవియే తెలుగునను ప్రాతిపదికలుగా నిలుచును. అట్లే ఋకారాంతములును.

**అత్వత్రీవద్భావములు :** 'ఋకారాంతంబున కత్వంబును త్రీవద్భావంబు నగు' ప్రాతిపదికము చివర ఋకారము స్థానమున హ్రస్వ మగుఅకారము ఆదేశ మగును. భ్రాతృ-భ్రాత. మాతృ-మాత.

ఈశబ్దములకు పయిసూత్రముచేతనే త్రీవద్భావము గలుగును. కావున డుజ్ఞు మొద లగుపుంలింగాదికార్యములు గలుగక స్త్రీలింగములకువలె కార్యము లగును. స్త్రీలింగంబుల ప్రథమైకవచనంబునకు లోపం బగు' అని ప్రథమైకవచనము లోపించును భ్రాత.

ఇట్లు చెప్పుటవలన భ్రాతృండు, జామాతృండు అనువిధముగా నుండదు.

**విధాత్రాదులకు వికల్పము :** 'విధాతృధాతృదాతృపవితృనేతృశబ్దంబులకు మహాత్ముల కత్వత్రీవద్భావంబులు విభాష నగు' విధాతృ మొద లగుపయిశబ్దముల ఋకారముస్థానమున అత్వమును, ఈ

శబ్దములకు స్త్రీవద్భావమును వికల్పముగా వచ్చును. వచ్చిన పక్షమున భ్రాత- మాత- అనువిధముగా విధాత-సవిత ఇత్యాదిగ రూపము లేర్పడును.

విభాష గావున అత్వస్త్రీవద్భావములు రానిపక్షమునందు మహత్పుంలింగములకువలె కార్యము లగును. 'పుంలింగ మగుమహ ద్వాచకమునకు డు జ్జగు' అని ప్రథమైకవచనమున డుజ్జు వచ్చును. విధాతృండు సవితృండు. ఇట్లే ద్వితీయాదులందు రామునిని, రామునకు మున్నగువిధముగా విధాతృనిని విధాతృనకు విధాతృనందు- అనురీతిని రూపము లేర్పడును. ఇవి అమహత్తు లయినపక్షమున అత్వస్త్రీవద్భావములు పూర్వసూత్రముచే నిత్యము. నేత యగు సింహము.

అధర్వణునిమాటలనుబట్టి చిన్నయసూరియు ఇచట విధాతృ మొదలగువానిని చెప్పెను. కాని వీనిలో ధాతృ, దాతృ, నేతృ అనుశబ్దములు మూడింటికి అత్వస్త్రీవద్భావములు నిత్యమె. ధాతృండు అనుమున్నగుతీరుగా మహత్పుంలింగకార్యములతో రూపము లుండవు ఇట పేర్కొనని 'మాంధాతృ' అనుశబ్దమునకు అత్వస్త్రీవద్భావములు గలుగని 'మాంధాతృండు, అనురీతిరూపము నన్నయాదులు ప్రయోగించిరి,

కాగా సవితృ, విధాతృ, మాంధాతృ శబ్దములు మూడింటికి మాత్రము అత్వస్త్రీవద్భావములు వైకల్పికముగా చెప్పదగును. మొత్త మాంధ్రభాషలో ఈమూడుశబ్దములు మాత్రమె ఋకారముతో ప్రయోగింపబడుచున్నట్లు మహాకవిప్రయోగానుగుణముగా తెలియ నగును. విధాతృనానతి, మొ॥

అత్వస్త్రీవద్భావము లయినశబ్దములు స్త్రీలింగకార్యములను పొందును, రమను, రమచేత ననురీతిగా భ్రాతను, విధాతచేత-

సవితకు-మొ॥

ఇట్లే అత్మ్వస్త్రీనద్వాచ్యములు గలుగనిపక్షమున ఋకారము నిలిచియుండుశబ్దములు అన్నివిభక్తులయందును మహాత్ప్వంలింగ శబ్దములకువలెనె కార్యము లందును. విధాతృని సవితృనకు, సవితృనందు, విధాతృండ-మొ॥

షష్ఠ్యేకవచనమున నిగాగమము రానిపక్షమున 'ఋవర్ణకంబు పరంబగునపుడు- అనుసూత్రముచే నగాగమము నిత్యముగానగు ననడగు. విధాతృనికి- విధాతృనకు అనియె కాని 'విధాతృకు' అనురీతిరూపము మృగ్యము. ఇట్లే సప్తమ్యేకవచనమున నుగాగమము నిత్యము. సవితృనియందు-సవితృనందు,

**స్త్రీలింగములు-స్త్రీప్రత్యయాంతములు :** "స్త్రీలింగంబు లెల్ల స్వస్వనియతంబు లగుస్త్రీప్రత్యయంబులం గూడి యుండుఁ బ్రకృతులు" స్త్రీలింగశబ్దములు సంస్కృతస్త్రీప్రత్యయములతో కూడి తెలుగున ప్రాతిపదికగా నిలుచును.

కర్తృ అనుశబ్దము స్త్రీప్రత్యయాంత మయి 'కర్త్రీ' అనునది తెలుగున ప్రాతిపదికగా నిలుచును. 'నామంబులతుదిదీర్ఘంబునకు హ్రస్వం బగు' అని హ్రస్వ మయి 'కర్త్రి'. 'ఇగ్గాగాయుగంతంబులు ప్రథమైకవచనంబునకు లోపం బగు' అని ప్రథమైకవచనమునకు లోపము. కర్త్రి-ధాత్రి-మొ॥ ఇట్లు వీనికి 'ఇత్తునకు బహువచనంబు పరం బగునపు డత్వం బగు' మొద లగులక్షణముల ననుసరించి హ్రస్వేకారాంతములకువలె ఆయాకార్యము లగును. ధాత్రులు-కర్త్రిని-నేత్రికి-ఓధాత్రీ!

## 37. ఐకారాంతములు - ఔకారాంతములు

చివర ఐకారము గలిగినశబ్దములు ఐకారాంతములు. ఔకారము చివర గలిగి ఔకారాంతములు. అజంతము లయినయాశబ్దములు

సంస్కృతమున ఏవి ప్రాతిపదికలో తెలుగునను అవియే ప్రాతిపదిక లగును.

**1. ఐకారాంతము - రై :** ఐకారాంతములలో 'రై' శబ్ద మొక్కటి మాత్రమె తత్సమముగా ప్రయోగింపబడుచున్నది.

**ఓత్వము-ప్రథమైకవచనలోపము :** 'రైగ్లౌశబ్దముల కోత్వంబు విభాష నగు' అనుసూత్రముచే రైశబ్దమునందలిఐకారమునకు వికల్పముగా 'ఓత్వము' వచ్చును. రో. ఓత్వము రానిచో రై. 'ఇగ్లౌరాయుగంతంబుల ప్రథమైకవచనంబునకు లోపం బగు' అను సూత్రముచే రో, రై శబ్దములమీఁది సువిభక్తికి లోపము వచ్చును.

ఇతరవిభక్తులలో రో శబ్దమునకు రూపములు రోను రోచేత ఇత్యాదిగా సామాన్యవిధులచే నేర్పబడును.

**ఈతుల్యత :** 'ఐకారం బీతుల్యంబు' ఐకారాంతమై నిల్చు రైశబ్దము ఈకారాంతమునకువలె తత్సమరూపము లందును. ఇకారంబుమీఁదికనువృక్రియావిభక్త్యుత్వంబున కిత్వం బగు' రైని, రైకి. మొ॥ బహుత్వమున రైలు, రైలను మొ॥

**ఔకారాంతములు-గ్లౌ, నౌ :** ఔకారాంతములు గ్లౌ,నౌ శబ్దములు రెండె తత్సమములుగా తెలుగున ప్రయోగింపబడుచున్నవి.

**ఓత్వము-ప్రథమైకవచనలోపము :** 'రైగ్లౌశబ్దంబుల కోత్వంబు విభాష నగు' గ్లౌశబ్దములోని ఔకారము స్థానమున ఓకారము వికల్పముగా వచ్చును. గ్లో. ఓత్వము రానిచో గ్లౌ. ఇగ్లౌరాయుగంతంబుల-అనుసూత్రముచే వీనిపైని ప్రథమైకవచనము(సు)నకు లోపము వచ్చును. గ్లో, గ్లౌ.

ఇతరవిభక్తివచనములలో గ్లోలు, గ్లౌలు, గ్లోను, గ్లౌలను అనుతీరుగా సామాన్యశాస్త్రానుగుణముగ తత్సమరూపము లేర్పడును.

**నావ :** 'నౌశబ్దంబునకు నావ యగు' ఇట 'నౌ' అనుశబ్దము

నకు 'నావ' అను ఆదేశమును, స్త్రీత్వమును నిపాతింపబడినవి. స్త్రీత్వమువలన 'స్త్రీలింగంబుల ప్రథమైకవచనంబునకు లోపం బగు' అని సువిభక్తి లోపించును. నావ.

ఇతరవిభక్తులయందు నావలు, నావను, నావలను అనురీతిగా సామాన్యశాస్త్రముచే రూపము లగును.

**నావి :** నౌ శబ్దమునకు నావ అనియే కాక 'నావి' అనియు ఆదేశ మగు నని పుష్పదంతుడు, అథర్వణుడు మొద లగువారందఱు పేర్కొనిరి, ఆపక్షమున ఇకారాంతశబ్దములకువలె తత్సమరూపము లేర్పడును. నావి-నావులు-నావిని మొ॥

## 38. హలంతములు-సామాన్యవిధానము

హల్లు చివర గల్గినశబ్దములు హలంతములు. అజంతములవలెం గాక హలంతము లగు సంస్కృతశబ్దములు తెలుగున ప్రాతిపదికలుగా చేరుటలో కొంత భేదము గలదు.

**ప్రథమైకవచనాంతతుల్యములు :** 'హలంతంబు ప్రథమైకవచనాంత తుల్యం బెందు నామం బగు' సాధారణముగా హలంతశబ్దములు సంస్కృతమున ప్రథమైకవచనమునం దెట్టిరూపముతో నుండునో అటువంటిరూపము తెలుగున ప్రాతిపదికముగా నిలుచును. రుచ్ - అనుశబ్దమునకు 'రుక్' అను ప్రథమైకవచనాంతతుల్యరూపము ప్రాతిపదికము. అట్లే స్రజ్ - అనునది 'స్రక్' అనురూపముతో తెలుగున ప్రాతిపదిక మగును.

**ఉగాగమద్విత్వములు :** ఇట్టి ప్రాతిపదికముచివర నున్నహల్లునకు 'ఉగాగమంబును ద్విత్వంబును దుదిహల్లున కగు' అనుసూత్రముచే ఉగాగమమును ద్విత్వమును వచ్చును. రుక్కు, స్రక్కు.

**ప్రథమైకవచనలోపాదికము :** 'ఇగ్గారాయుగంతంబుల ప్రథమైకవచనంబునకు లోపం బగు' అనుసూత్రముచే ఉగాగమాంత

ములపై ప్రథమైకవచనము లోపించును.

ఇట్లే యితరవిభక్తులయందు రుక్కులు, రుక్కును ఇత్యాదిగా రూపము లగును.

**డుజాదులు :** ప్రథమైకవచనాంతతుల్యరూపమునందు చివర హల్లు లేనపుడు ఉగాగమద్విత్వముల ప్రసక్తి లేదు. కావున అజంతము లకువలె యథార్థముగా ఉత్వడుజాదు లగును.

సుత్రామన్ శబ్దమునకు తెలుగున సుత్రామా అనునది ప్రాతిపదిక. తుదిదీర్ఘమునకు హ్రస్వము వచ్చి సుత్రామ. ఇది మహత్ పుంలింగము గావున ఉత్వ డుజాదులు వచ్చును. సుత్రాముఁడు సుత్రాముని మొ॥

కర్మ- ఇది అదంతము, నపుంసకలింగము గావున 'అమహన్నపుంసకముల కదంతములకు మువర్ణకం బగు' అని మువర్ణకము వచ్చి కర్మము. ఇట్లే యితరవిభక్తులలో కర్మములు-వర్మమును మొ॥

**ద్వితీయైకవచనాంతతుల్యములు :** మతుప్ప్రత్యయాంతములు మొద లగుశబ్దములు మతుబాదికము అనుపేర ఒకగణముగా కూర్పబడినవి. "మతుబాదికంబు ద్వితీయైకవచనాంతతుల్యంబు నామం బగు' అనులక్షణము ననుసరించి ఈశబ్దములకు సంస్కృతమున ద్వితీయైకవచనమునం దెట్టిరూపము కలదో అట్టిరూపము తెలుగున ప్రాతిపదికముగా నిలుచును.

గుణవత్ అనుశబ్దమునకు సంస్కృతమున దానిద్వితీయైకవచనాంతముతో తుల్య మగు 'గుణవంతమ్' అనునది తెలుగున ప్రాతిపదిక మగును,

**మకారలోపము-డుజాదులు :** "దానియంతిమమకారంబునకు లోపం బగు' ఇట్టి ప్రాతిపదికలచివర నుండుమకారము లోపించును. ఈప్రాతిపదికలు మహత్తు లయినపుడు ఉత్వము, డుజ్జు మొద లగు కార్యము లగును, గుణవంతుఁడు, గుణవంతునిని మొ॥ అమహత్తు

లయినపుడు మువర్ణకము మొదలగు అమహాత్కార్యము లగును. గుణవంతము గుణవంతములు మొ॥ స్త్రీ బోధింపబడునపుడు ఆ ప్రాతిపదికమునకు ఆలుశబ్దముతో సమాసము ఏర్పడి ఉత్వ రుగాగమములు కలుగును. గుణవంతురాలు. స్త్రీలింగశబ్దములను ప్రథమైకవచనలోపము మొదలగు కార్యము లగును. అప్సరస.

**ఉభయములు :**

'ఋత్విగాదులు ద్వితీయైకవచనాంతతుల్యంబులు విభాష నగు' ఋత్విజ్ మొదలయిన కొన్ని శబ్దములకు ఒకసారి ద్వితీయైకవచనాంత ప్రాతిపదికయిగా నిలుచును. తుల్యరూపమును, వేరొకసారి ప్రథమైకవచనాంతతుల్యరూపమును ఋత్విజ్ 1. ఋత్విక్కు. 2. ఋత్విజుఁడు మొ॥ ఇట్లె మహత్తు లయినసకారాంతశబ్దములకును రూపము లుండును. ఊర్ధ్వరేతుఁడు-ఊర్ధ్వరేతసుఁడు మొ॥

**స్త్రీలింగములు-స్త్రీప్రత్యయాంతములు :**

'స్త్రీలింగంబు లెల్ల స్వస్వనియతంబు లగు స్త్రీప్రత్యయంబులం గూడి యిందుఁ బ్రవర్తిల్లు' స్త్రీలింగశబ్దములు సంస్కృతమున చెప్పబడిన ఆయా స్త్రీప్రత్యయము లతో గూడి తెలుగున ప్రాతిపదికలుగా నిలుచును.

గుణవత్ - గుణవతీ- గుణవతి.

రాజన్- రాజ్ఞీ- రాజ్ఞి. మొ॥

**భవచ్ఛత్రాదులు :**

'భవచ్ఛత్రాదుల కిందుఁ బ్రయోగంబు లేదు' భవత్, అను మొదలగు హలంతసంస్కృతశబ్దములు తెలుగులో ప్రయోగింపబడవు. భవద్గుణము లనురీతిగా సమాసమున పూర్వావయవము లై ప్రయోగింపబడవచ్చును.

ఇంక రాజు, బ్రహ్మ- విశ్వకర్మ మొదలగు ఆయాశబ్దములు విశేషముగా నిరూపింపబడినది.

## 39. తకారాంతములు

**ప్రథమైకవచనాంతతుల్యనామములు :** చివర తకారము గల్గినశబ్దములు తకారాంతములు. 'హలంతంబు ప్రథమైకవచనాంత తుల్యం బెందు నామం బగు' అనుసూత్రముచే తకారాంతములు సాధారణముగా సంస్కృతప్రథమైకవచనాంతతుల్యరూపముతో తెలుగున ప్రాతిపదికలుగా నిల్చును. మరుత్-వీరుత్ మొ॥

**1. ఉగాగమద్విత్వములు :** ఉగాగమంబును ద్విత్వంబును దుదిహల్లున కగు' అనుసూత్రముచే ఉగాగమద్విత్వములు వచ్చి మరుత్తు-వీరుత్తు అని యగును దీనిపైని ప్రథమైకవచనమునకు ఇగ్లారాయుగంతంబులప్రథమైకవచనంబునకు లోపం బగు' లోపము వచ్చును.

ఇతరవిభక్తులయందు మరుత్తులు మరుత్తును ఇత్యాదిగా రూపములు సామాన్యవిధులచే నేర్పడును.

**2. తకారలోపము :** 'జగదింద్రజిత్తుల తకారంబునకు లోపంబు విభాష నగు' జగత్, ఇంద్రజిత్ అను ప్రాతిపదికలయందలితకారము నకు వికల్పముగా లోప మగును. జగ- ఇంద్రజి. లోపించిన పిదప 'జగ' అదంత మయినది కావున అదంతామహాత్కార్యములు. అనగా మువర్ణకాదులు పొందును. జగము-జగమ్ము మొ॥ 'ఇంద్రజి' అనునది ఇదంత మైనది గావున ఇకారాంత మగుహరిశబ్దమునకువలె రూపములను పొందును. ఇంద్రజి-ఇంద్రజిని-ఇంద్రజులు మొ॥

తకారము లోపింపనిపక్షమునందు జగత్తు-ఇంద్రజిత్తు ఇత్యాదిగా ఉగాగమద్విత్వములతో రూపము లేర్పడును.

**3. ఆనాదేశము :** ఒకానొకచో మహత్త్వంబునందు మతు ప్రకారంబున కానాదేశంబు విభాష నగు' 'హనుమత్' మొద లగునవి ప్రాతిపదిక లై, అందలితకారమునకు 'ఆన' అనునది ఆదేశ మగును. హనుమాన. అదంతమహత్పుంలింగములకువలె రూపములను పొందును. హనుమానుఁడు- హనుమానుని మొ॥ ఆనాదేశము

రానిపక్షమునందు - హనుమంతుఁడు మొ॥

### II. ద్వితీయైకవచనాంతతుల్యరూపనామములు :

'ఋత్విగాదులు ద్వితీయైకవచనాంతతుల్యంబులు విభాష నగు' ఇంద్రజిత్ (మొ॥) శబ్దమునకు వికల్పముగా ద్వితీయైకవచనాంతతుల్య రూపము ప్రాతిపదిక మగును. 'మతుప్' ప్రత్యయాంతము లగుశబ్దములు తకారాంతములె. బుద్ధిమత్ మొ॥ వీనికి 'మతుబాదికంబు ద్వితీయైకవచనాంతతుల్యంబు నామం బగు' అని ద్వితీయైకవచనాంత తుల్యరూపము ప్రాతిపదిక లగును. బుద్ధిమంతమ్.

**మకారలోపము-డుజాదులు :** 'దానియంతిమమకారంబునకు లోపం బగు' అని చివరిమకారము లోపించి యీశబ్దములు అదంతము లగును. ఇట్టివి మహత్తు లయినచో అదంతమహత్పుంలింగ (రామశబ్ద)మునకువలె ఆయారూపములను పొందును. ఇంద్రజితుఁడు బుద్ధిమంతుని మొ॥

## 40. నకారాంతములు

**ప్రథమైకవచనాంతతుల్యనామములు :** నకారము చివర గలిగిన శబ్దములు నకారాంతములు. 'శ్వన్' అనుశబ్దము ఒక్కటి తప్ప మిగిలిననకారాంతశబ్దములు అన్నియును "హలంతంబు ప్రథమైక వచనాంతతుల్యం బిందు నామం బగు" అనుసూత్రముచే ప్రథమైక వచనాంతతుల్యరూపముతో తెలుగున ప్రాతిపదికముగా నిలుచును.

**డుజాదులు :** వీనికి చివర హ ల్లుండదు. కావున పుంలింగము (మహత్తు) లయినచో అదంతాలురామశబ్దమువలె ఉత్వము, డుజ్జు మొదలగు కార్యములను పొందును. సుత్రామన్- సుత్రామా- సుత్రాముఁడు సుత్రాముని మొ॥నపుంసకలింగము (అమహత్తు)లయిన మువర్ణకము పొందును. కర్మన్-కర్మ=కర్మము, కర్మమును మొ॥

ఇకారాంతాదులు అట్టికార్యములను పొందును. కరిన్-కరి= కరి. కరిని. కరులు. మొ॥

**శ్వానము :** శ్వన్‌శబ్దము మతుబాదులలోనిది. కావున "మతుబాదికంబు ద్వితీయైకవచనాంతతుల్యంబు నామం బగు'. 'శ్వానమ్' అనునది ప్రాతిపదికము. మకారలోపము, ముపర్ణకము, శ్వానము, ఇట్లే శ్వానమును, శ్వానమునకు మొ॥

**రాజు :** 'మహత్త్వంబున స్వార్థపరం బగురాజశబ్దము రాజు నాఁబడు'. రాజన్‌శబ్దమునకు తెలుగున రాజు అనురూపము గలుగును. రాజు- రాజును- ఖగరాజు మొ॥ అమహత్త్వమునందు 'రాజము'.

**విశ్వకర్మాదులు :** 'విశ్వకర్మాదులకు స్త్రీత్వం బగు' విశ్వకర్మన్, యువన్- మున్నగుపుంలింగశబ్దములకు స్త్రీత్వము గలుగును. కావున ఉత్త్వడుజాదిపుంలింగకార్యములు గలుగక ప్రథమైకవచన లోపము మొదలగు స్త్రీలింగకార్యము లగును. విశ్వకర్మ- యువను- యువ్వకు మొ॥

**విశ్వకర్ముఁడు :** "విశ్వకర్ముఁ డనియు రూపంబు' అని ప్రౌఢ వ్యాకర్త. విశ్వకర్మశబ్దమునకు ఒకప్పుడు స్త్రీత్వము లేకపోవుటను ప్రస్తావించెను. అప్పుడు పుంలింగకార్యము లనగా ఉత్త్వడుజాదులు వచ్చును. విశ్వకర్ముఁడు- విశ్వకర్ముని- మొ॥

**బ్రహ్మ :** 'మహద్వాచక మయి పుంలింగ మగుబ్రహ్మశబ్దము నకు స్త్రీత్వంబగు' మహత్పుంలింగమగుబ్రహ్మన్‌శబ్దమునకు స్త్రీత్వము గలుగును. దానిచే పుంలింగకార్యములు వారింపబడి ప్రథమైకవచన లోపము మొద లగుస్త్రీలింగకార్యము లగును. బ్రహ్మ- బ్రహ్మను- మొ॥ అమహత్తయినపుడు స్త్రీత్వము గలుగదు గావున ముపర్ణకాదులు గలుగును. బ్రహ్మము- బ్రహ్మమును- మొ॥ ఇది తత్త్వ, తపో, వేద, యోగములను బోధించును.

**ఆత్మాదులు :** 'ఆత్మేమనిజంతంబులకు నాంతము లగుమనుజ సంజ్ఞలకు స్త్రీత్వంబు బహుళంబుగా నగు' ఆత్మన్‌శబ్దమునకును, ఇమనిచ్-(ఇమన్) ప్రత్యయాంతములకు, **మనుష్యులకు** పేర్లు అయిన నకారాంతశబ్దములకును స్త్రీత్వము బహుళముగా వచ్చును.

స్త్రీత్వము వచ్చినపుడు స్త్రీలింగకార్యము లగును. ఆత్మన్- ఆత్మా-ఆత్మ, ఆత్మను, ఆత్మలు మొ॥ స్త్రీత్వము కలుగనిపక్షమున మహత్తయినమహాత్ (పుంలింగ) కార్యములును, అమహత్తు లయిన అమహత్ కార్యములును గలుగును. ఆత్ముండు- ఆత్ముని, ఆత్మను. ఇట్లె గరిమ- గరిమను. దేవశర్మ- దేవశర్ముండు మొ॥

సుధన్వుఁడు మొద లగువానికి స్త్రీత్వము లేదు.

**స్త్రీలింగములు-స్త్రీప్రత్యయాంతములు :** "స్త్రీలింగంబు లెల్ల స్వస్వనియతంబు లగుస్త్రీప్రత్యయంబులం గూడి యిందుఁ బ్రవర్తిల్లు" నకారాంతస్త్రీలింగశబ్దములును స్త్రీప్రత్యయముతో గూడి తెలుగున ప్రాతిపదిక లగును. వానికి ఇకారాంతములకువలె **ఆయాకార్యము** లగును. రాజన్-రాజ్ఞీ-రాజ్ఞి, రాజ్ఞులు మొ॥

## 41. సకారాంతాలు

సకారము చివర గలిగినశబ్దములు సకారాంతములు. ఇవి **మతుబాదులలో** చేరవు. కావున "హలంతంబు ప్రథమైకవచనాంత తుల్యం బిందు నామం బగు' సకారాంతశబ్దములకు ప్రథమైకవచ నాంతతుల్యరూపములు ప్రాతిపదికలు కావలయును. కాని-

**సంస్కృతప్రాతిపదికలే :** 'సాంతంబులతుదిసకారంబునకు లోపంబు బహుళంబుగ నగు' సకారాంతము సంస్కృతప్రాతిపదికమె తెలుగునను ప్రాతిపదికముగా నిలుచు నని తెలియవలెను.

**అప్సరస :** 'అప్సరస్' శబ్దము మతుబాదులలోనిది. కావున 'మతుబాదికంబు...' అనుసూత్రముచే ద్వితీయైకవచనాంతతుల్య

మగు 'అప్సరసస్' అనునది ప్రాతిపదికము. తుదిసకారము లోపించి స్త్రీలింగము గావున ప్రథమైకవచనలోపాది స్త్రీలింగకార్యములను పొందును. అప్సరస- అప్సరసలు- మొ॥ దీనికి "అప్సర- అప్సరలు అనురీతిరూపములు నుండును.

**అమహత్తులు - సలోపము :** 'సాంతంబులతుదిసకారంబునకు లోపంబు బహుళంబుగా నగు' సాంతములచివరిసకారము బహుళముగా లోపించును. సకారము లోపించి అజంతముగా **మారిన** యీశబ్దములకు అజంతములకువలెనె కార్యము లగును.

ఉరస్- ఉర. సలోపానంతరము అదంత మయినది. కావున మువర్ణకాదు లగును. ఉరము, ఉరములు- మొ॥ ఇట్లే అర్చిస్- అర్చి. ఇకారాంతములకువలె ప్రథమైకవచనలోపము. అర్చులు-అర్చిని మొ॥ ధనుస్-ధను, ఇది ఉదంత మగుటచే వువర్ణకాదు లగును. ధనువు-ధనువును మొ॥

**సలోపాభావపక్షము-ఉగాగమద్విత్వాలు :** సకారము లోపింపనిపక్షమునందు 'ఉగాగమంబును ద్విత్వంబును మది వాల్లున కగు' అని 'ఉగాగమద్విత్వములు వచ్చును. ఈపక్షమునందు 'ఇగ్లా'సూత్రముచే ప్రథమైకవచనము లోపించును. ఉరస్సు-అర్చిస్సు- ఆయుస్సు.

**మనఃప్రభృతులు-వైకల్పికద్విత్వము :** 'మనఃప్రభృతులతుదిసకారంబునకు ద్విత్వంబు విభాష నగు' మనస్ మొద లగువానిలోని సకారమునకు ఉగాగమము నిత్యము కాని ద్విత్వము మాత్రము వికల్పము. మనస్సు-మనసు.

**పయఃప్రభృతులు-సలోపాభావము :** 'సాంతంబుల... అను సూత్రమునందలిబహుళశబ్దముచే పయస్- మొద లగుశబ్దములలోని సకారమునకు లోపము రాదు. పయస్సు-వయస్సు. మొ॥ ఇచట **పయము,** వయము అనురీతిని సకారము లోపించిన రూపము **లుండవు.**

**మహాత్తులు** i) సలోపము : 'మహాద్యాదికంబు లగుసాంతంబుల కంత్యలోపం బేని ద్వితీయైకవచనాంతతుల్యత్వం బే నగు' సకారాంతము లయినశబ్దములు మహత్తు లయినచో ఒకపక్షమున చివర నున్నసకారము లోపించి ఉత్వము, ద్రుతము మొదలగుకార్యము లగును.

అంగిరస్ - అంగిర = అంగిరుఁడు - అంగిరుని మొ॥

ii) **ద్వితీయైకవచనాంతతుల్యనామము:** మరియొకపక్షమునందు వీనికి సంస్కృతమునందలి ద్వితీయైకవచనాంతముతో తుల్య మగు రూపము ప్రాతిపదికముగా నిలుచును. అంగిరసమ్, ఊర్ధ్వరేతసమ్- మొ॥ దానియంత్యమకారము లోపించి ఉత్వము, ద్రుతము మొదలగుకార్యము లగును. అంగిరసుడు, ఊర్ధ్వరేతసుని- మొ॥

iii) **సలోపస్త్రీవద్భావములు:** 'వేధపురోధపురోధసుఁడు' 'వేధస్' అనుశబ్దమున నిత్యముగా సకారము లోపించి స్త్రీవద్భావము గలుగును. స్త్రీవద్భావముచే ఉత్వమునాదు లగుపుంలింగకార్యములు గలుగక ప్రథమైకవచనలోపము మొద లగుస్త్రీలింగకార్యము లగును. వేధ- వేధను- మొ॥

పురోధస్ శబ్దమున సకారలోపమును, స్త్రీవద్భావమును వికల్పముగా వచ్చును. వచ్చినపక్షమునందు స్త్రీలింగకార్యములతో పురోధ, పురోధను, అనురీతిగా నగును. సలోప స్త్రీవద్భావము లేని పక్షమునందు ద్వితీయైకవచనాంతతుల్యత, పుంలింగకార్యములు అనగా ఉత్వమునాదులుకలుగును. పురోధసమ్‌ము- పురోధస- పురోధసుడు-

**స్త్రీలింగములు- ప్రత్యయాంతములు :** 'స్త్రీలింగంబు లెల్ల స్వస్వ నియతంబు లగుస్త్రీప్రత్యయంబులం గూడి యుండుఁ బ్రవర్తిల్లు' స్త్రీలింగశబ్దములు స్త్రీప్రత్యయములతోఁ గూడి వచ్చును.

విద్వస్- విదుషీ- విదుషి- మొ॥

# 42. నిత్యైకవచనాంతాలు-నిత్యబహువచనాంతాలు

**నిత్యైకవచనాంతములు :**

నిత్యము ఏకవచనాంతములు అయియుండుశబ్దములు నిత్యైకవచనాంతములు. ఎల్లవిభక్తులయందు ఎల్లపుడును ఏకవచనమె కాని యీశబ్దములపై బహువచనముచేరదు. అనగా బహుత్వార్థమునందు సయితము ఏకవచనమే యగును.

"అప్పు డిప్పు డెప్పు డనుశబ్దములు నిత్యైకవచనాంతము" లని చిన్నయసూరి ఒకసందర్భమున పేర్కొనెను. అప్పుడు, ఇప్పటికి, ఎప్పటన్ మొ॥

ఇట్టివానిని ప్రౌఢవ్యాకర్త అధికముగా నిరూపించెను.

**అక్కడాదులు :** 'దేశ్యమునం దక్కడాదులు నిత్యైకవచనాంతములు' అక్కడ మొద లగుదేశ్యశబ్దము లెప్పుడును ఏకవచనాంతములె అయియుండును. అక్కడ, ఇక్కడికి ఎక్కడన్ మొ॥

ఇరులు కేలు అనుశబ్దములు బహువచనాంతము లని కొందరు పేర్కొందురు, కాని అవియు నిత్యైకవచనాంతములె. ఇరులున-మొ॥ ఇవి అక్కడ మొద లగువానిలో చేరియున్నవి.

**సస్యవాచకములు:** 'సస్యవాచకశబ్దములును' పైరును బోధించు శబ్దములును నిత్యైకవచనాంతములె. కంది(పైరు)పెసర- మినుము మొ॥ బియ్యము- జీలకఱ్ఱ- మొ॥ ధాన్యవాచకశబ్దములును నిత్యైకవచనాంతములె.

**సంభారవాచకములు :** 'కతిపయసంభారవాచకశబ్దములును' గృహోపయోగు లగువస్తువులను బోధించుశబ్దములు కొన్ని ఎప్పుడును ఏకవచనాంతము లైయుండును. ఉప్పు, చింతపండు మొ॥

**లోహవాచకములు :** 'లోహవాచకశబ్దములును' లోహములను బోధించుశబ్దములును ఎప్పుడును ఏకవచనాంతములే యగును. వెండి- బంగారము మొ॥

**సమానార్థకములు** : 'సమానార్థకము లయినయీడెనసరిసాటి లోనగు దేశ్యవిశేషణశబ్దములును' సమాన మనునర్థము నిచ్చు ఈడు, ఎన, సరి, సాటి మొదలగు విశేషణశబ్దములు నిత్య మేకవచనాంతములె యగును. అవి సరి గావు. సతు లెనయే మొ॥

'సరులు లేని' యనురీతి యెందు రెండు ప్రయోగములు విశేష స్థలములు.

**గుణరసవాచకములు** : 'గుణవాచకము లైన దేశ్యవిశేషణ శబ్దములును' గుణమును రసమును(రుచి) బోధించుశబ్దములు నిత్యైక వచనాంతములు. గుణము-కాళ్లు 'నలుపు'; రసము-పండ్లు 'తీపు'.

**నిత్యబహువచనాంతములు** :

నిత్యము బహువచనమె అంత మందు గలిగియుండుశబ్దములు నిత్యబహువచనాంతములు. ఇట్టి శబ్దములపై ఎల్లవిభక్తులయందు ఎల్లప్పుడు బహువచనమె ఉండును. ఎచ్చట నైన ఏకత్వార్థమును చెప్పదలచికొన్నను ఈశబ్దములపై బహు వచనమె అగును.

**అంతఱ్ఱాదులు** : 'అందఱ్ఱాదులు నిత్యబహువచనాంత ములు'. అందఱు మొదలగుమహత్సర్వనామశబ్దములు ఎప్పుడు బహువచనముతోనె ఉండును. అందఱు ఇందఱును ఎందఱు పలుగురు మొ॥

**అదర్వాదులు** : 'అందరులు లో నగుశబ్దములును' అదరులు మొదలగుశబ్దము లెప్పుడును బహువచనాంతములె యగును' అదరులు. మిడుగురులు మొ॥

ఇవి వృత్తియందు ఏకవచనాంతము లయి కూడ కానవచ్చును. అదరుటగ్గి. మిడుగురుంబురువు.

**ధాన్యవాచకములు** : 'తఱుచుగ ధాన్యవాచకశబ్దములును'

ధాన్యమును బోధించుశబ్దములు చాలవరకు నిత్యబహువచనాంతము లైయుండును. కందులు- పెసలు- మినుములు. మొ॥ తెలుగున గనుటచేత బియ్యము, జీలకఱ్ఱ మొదలగు కొన్ని నిత్యైకవచనాంతములు గ్రహింపబడును.

**కొన్ని క్రీడావాచకములు :** 'క్రీడావిశేషవాచకశబ్దములును' కొన్ని ప్రత్యేక మగుఆటలను బోధించుశబ్దములును నిత్యబహువచనాంతము లగును. అచ్చనగాయలు- గుజ్జనగూళ్ళు, కుప్పిగంతులు మొ॥

## 43. బహువచనము-ఆచ్ఛికశబ్దములందు మార్పులు

**బహువచనము పరమగునపుడు కలుగు మార్పులు :**

ప్రాతిపదికలకు అన్నింటికిని ప్రథమాబహువచనమున 'లు వర్ణంబు బహువచనంబు' అని 'లు' ప్రత్యయ మగును. ద్వితీయ మొద లగువిభక్తులలో 'బహుత్వంబున ద్వితీయాదివిభక్తులకు లడాగమం బగు' అని 'ల' వర్ణము వచ్చును. ఇవి పర మగునపుడు అచ్చతెనుగుప్రాతిపదికమున వివిధఆదేశములు మొ॥ మార్పులు కలుగుచున్నవి.

**1. ఉత్వము :** ఇత్తునకు బహువచనము పరం బగునపు డుత్త్వం బగు' ప్రాతిపదికముచివరిహ్రస్వ మగుఇకారమునకు ఉత్త్వము వచ్చును. తండ్రి+లు-తండ్రులు-తండ్రులను మొ॥ తత్సమములలో హరి-హరులు. మొ॥ దీర్ఘము(ఈ)నకు రాదు. తేజీలు.

'వికృతియం దికారాంతములయుపోత్తమేత్త్వంబునకు బహువచనము పరం బగునపు డుత్త్వం బగు'- వానిఉపోత్తమ మయిన ఇత్త్వమునకును ఉత్త్వము వచ్చును. కలికి+లు-కలుకి+లు కలుకులు

**2. కుజ్జు :** 'కలన్వాదులనువర్ణంబు కు జ్జగు. బహువచనము పరం బగునపుడు నిత్యముగా నగు' కలను మొద లగువానిలోని

చివరినువర్ణమునకు, 'కుక్' అనునది ఆదేశముగా వచ్చును.

మ్రాను+లు=మ్రాఁకులు మొ॥

గుక్ : 'అట్లు రేనుగోనుశబ్దంబులనువర్ణంబు గుక్కగు' రేను, గోను అనుశబ్దములందలినువర్ణము స్థానమున 'గుక్' వచ్చును. రేను+లు= రేఁగులు మొ॥

**అలఘులకారము** : 'బహువచనము పరంబగునపుడు డసంయుక్తంబు లయి యుదంతంబు లయినడలవల కలఘులకారంబు బహుళంబుగా నగు' డులురులయందలిహల్లునకు బహుళముగా అలఘు వగు ళకారము వచ్చును. త్రాడు+లు-త్రాళులు; పదు+లు-పళులు; పాలు+లు-పాళులు.

'బహువచనశ్లిష్టంబు లయి యుద్విరుక్తంబు లయిన డకార లకారంబుల కలఘులకారంబు నిత్యంబుగ నగు' స్వరము లోపించుటచే బహువచనలకారముతో గూడినడకారమునకు, లకారమునకును అలఘు వగుళకారము నిత్యముగా వచ్చును. త్రాడులు-త్రాడ్లు-త్రాళ్ళు; పాలులు-పాల్లు=పాళ్ళు మొ॥

**ండు** : 'ఔపవిభక్తికంబులలివర్ణసంలులువర్ణంబులకు బహువచనంబు పరంబగునపుడు పూర్ణబిందుపూర్వకడువర్ణంబు బహుళంబుగా నగు' కొడవలి, విల్లు మొద లగువానిలోని లి-లువర్ణములకు 'ండు' ఆదేశముగా వచ్చును. కొడవలి+లు=కొడవండులు; విల్లులు=విండులు మొ॥

**తి** : గోతులు మొ॥చోట్ల ఔపవిభక్తిక మగుతివర్ణము ఆదేశము.

**ండ్** : 'అల్వాదులబహువచనలకారంబునకు లోపంబును ముందఱిలువర్ణంబునకు బిందుపూర్వకడకారంబు నగు'. బహువచన లకారమునకు లోపు మగుటతోపాటు ముందున్న అలు మొద లగు

శబ్దములలోనిలువర్ణము స్థానమున 'ంڑ్' అనునది ఆదేశ మగును. ఆలు+లు=ఆండ్రు, కోడ+లు=కోడండ్రు.

**ఉత్వలోపము :** 'బహువచనము పరం బగునపుడు డలటరల యుత్వంబునకు లోపంబు బహుళంబుగా నగు'- డలటరమీఁది ఉత్వము లోపించును. వింటులు-విండ్లు, పాలు+లు-పాల్లు-పాళ్ళు, చెట్టులు-చెట్లు, పేరులు-పేర్లు మొ॥

**అంతిమాక్షరలోపము :** 'బహువచనంబు పరం బగునపుడు చేను పేనుమీఁనుశబ్దంబులనువర్ణంబులోపించు', చేను+లు=చేలు మొ॥

'బహువచనంబు పరం బగునపుడు రేయిప్రభృతులతుదియక్షరంబు లోపించు'- రేయి మొదలగువానిలో చివరిఅక్షరము లోపించును. రేయి+లు-రేలు మొ॥

'బహువచనంబు పరం బగునపు డావుప్రభృతులతుదియక్షరంబునకు లోపంబు విభాష నగు' ఆవులు-ఆలు మొ॥

**బహువచనమునకు గల్గు మార్పులు :**

**లఘురేఫము :** 'పగతాదులబహువచనలకారంబునకు రేఫం బగు' పగత మొదలగుఅచ్ఛికశబ్దములకు పైనున్నబహువచనలకారమునకు రేఫము వచ్చును. పగత+లు-పగతురు మొ॥ అదంతం బయి దీర్ఘపూర్వలోపధం బయిన మహత్తు మీఁదివిభక్తిలకారంబునకు రేఫం బగు' కొన్నియెడల తత్సమప్రాతిపదికల పైనిబహువచన లకారమునకు రేఫము వచ్చును. బాల+లు=బాలురు మొ॥ దయాళురు, మల్లురు అనియు గలవు.

**అలఘురేఫము :** చెయువుబహువచనలకారంబున కలఘురేఫంబు విభాష నగు' చెయువుశబ్దముమీఁద శకటరేఫ మాదేశ మగును. చెయువులు(చెయువులు) మొ॥

'కాప్రత్యయంబుమీఁదిబహువచనలకారంబునకు లఘ్వలఘురేఫం

బులను లఘురేఫంబునకు ముందు బిందుపూర్వకడకారంబు నగు' కాప్రత్యయముమీఁద అలఘురేఫ మాదేశ మగును. విలుకాఱు.

**'ండ్' పూర్వాగమము** : పయిసూత్రముచే బహువచనలకారము నకు రేఫముతోపాటు ముందు 'ండ్' అనుఆగమమును ఒకపక్షమున వచ్చును. విలుకాండ్రు.

'కొన్ని డుమంతంబులబహువచనలకారంబునకు రేఫంబును దానికి ముందు పూర్ణబిందుపూర్వకడకారంబు నగు' గండ మొదలగువానిపై బహువచనలకారమునకు రేఫాదేశము వచ్చి దానికి పూర్వమునందు 'ండ్' అనునది ఆగమ మగును. గండ+లు-గండండ్రు మొ॥

**డుజ్ పూర్వాగమము**: 'త్రేఁ ప్రభృతులబహువచనమునకు ముందు డుజ్జగు' త్రే మొదలగువానిమీఁది లులకు పూర్వమునందు డుజ్ అనునది వచ్చి చేరును. త్రే+లు-త్రే+డులు-త్రేండ్లు.

## 44. ఔపవిభక్తికములు

**ఔపవిభక్తికములు** : 'ఇటితివర్ణంబులు వక్ష్యమాణంబు లౌపవిభక్తికంబులు' బాలవ్యాకరణమున ఆచ్ఛికపరిచ్ఛేదమునందు చెప్పిన 'ఇ-టి-తి' అనువర్ణములు మూఁడింటికి ఔపవిభక్తికము లని సంజ్ఞ. విభక్తులకు సమీపమునందు వచ్చునవి ఉపవిభక్తులు. అవియె ఔపవిభక్తికములు. అని యీసంజ్ఞకర్థము చెప్పుదురు. ఔపవిభక్తికములు చేయుటకు అర్హ మైనప్రాతిపదికలను గూడ ఔపవిభక్తికము లని వ్యవహరింతురు.

**ఔపవిభక్తికస్థలములు** : 'ఇవి ద్వితీయాద్యేకవచనంబులు పరంబు లగునపుడు నామంబులకుం గొన్నింటికిం బ్రాయికంబుగ నగు' 'ఔపవిభక్తికములు ద్వితీయయందు రా వని 'తెలుగువ్యాకరణము'న చెప్పబడినది. కాని అది సరి కాదు. ద్వితీయ మొదలుకొని

యెల్లవిభక్తులయందును ఏకవచనము పరముగా ఉన్నపుడు కొన్ని అచ్చతెనుగుశబ్దములకు వచ్చును. సప్తమీఏకవచన మగునవర్ణకము పర మగునపుడు మాత్రము ఔపవిభక్తికములు రావు. పేరున, త్రోవన మొ॥ ఇవి అచ్చికములలో స్త్రీసమములకు మాత్రమే కన్పించుచున్నవి. ప్రాణివాచకములకు రావని కొందరు విమర్శకులు చెప్పుదురు. కాని అది సరికాదు. తోఁడేటికి, కుందేటికొమ్ము, లేటి పిండు మొ॥

ఈ ఔపవిభక్తికములు చేరుశబ్దములకు గూడ ఒక్కొక్కసారి రాకపోవుట గలదు. నెత్తురుకూడులు ఇల్లాలు మొ॥ ఒకే శబ్దమునకు పర్యాయముగ రెండు ఔపవిభక్తికములు వచ్చుటయు గలదు. గోరిని గోటిని మొ॥ విభక్తిని నిమిత్తముగా జేసికొని యివి ప్రాతిపదికలకు ఆగమముగను, తుదియక్షరమునకు ఆదేశముగను వచ్చును.

ఆగమము-తి- అతితిని- ఆదేశము- ఇ- ఊరిని మొ॥

**ఇవర్ణము:** ఇది ఆదేశముగా మాత్రమె అగును. 'ఊరు మొదలగువాని కిత్వం బగు' ఊరు మొదలగుశబ్దములలో చివరివర్ణమునకు ఆదేశముగా 'ఇ' అను ఔపవిభక్తికము వచ్చును- ఊరిని- చేరికి, మొ॥

**టివర్ణము :** 'టివర్ణంబు గొన్నింటియంతాక్షరంబున కాదేశంబును గొన్నింటి కంతాగమంబును గొన్నింటికిం బర్యాయంబున రెండును ప్రాయికంబుగ నగు' టివర్ణము కొన్నిశబ్దములచివరిఅక్షరమునకు ఆదేశముగా వచ్చును. నోరు-నోటిని, త్రాడు-త్రాటికి- మొ॥ కొన్నిశబ్దములకు చివర ఆగమముగా వచ్చును. అన్ని-అన్నిటిని, వేయి-వేయిటిని మొ॥ కొన్నిశబ్దములకు ఒకసారి చివరిఅక్షరమునకు ఆదేశముగను, మఱొకసారి చివర ఆగమముగాను వచ్చును. రెండు-రెంటిని- రెండింటిని మొ॥

**తివర్ణము :** తివర్ణము కొన్నిటికాగమముగను కొన్నిటి కాదేశముగను వచ్చుచున్నది. అట్టు మొదలగుశబ్దంబుల కంతాగ

మంబు త్రివర్ణంబును రేఫంబున కొక్కటికి లోపంబు నగు' అఱ్ఱు మొదలగుశబ్దములకు త్రివర్ణ మాగమ మగును. అప్పు డొకరేఫ లోపించి ఇత్వ మగును. అఱ్ఱు-అఱితిని మొ॥

'విభక్తి పరం బగునపుడు గోయిప్రభృతులతుదియక్షరంబు త్రివర్ణం బగు' ప్రథమాబహువచనము మొదలుగాని అన్నివిభక్తి వచనములందును గోయిమొదలగుశబ్దములలోనిచివరిఅక్షరమునకు త్రివర్ణముఆదేశముగా వచ్చును. గోతులు-చేతిని మొ॥

**ఔపవిభక్తికములు-అత్వము** : 'ఔపవిభక్తికంబులతృతీయా సప్తముల కత్వం బాదేశంబు బహుళంబుగా నగు'- ఔపవిభక్తిక శబ్దములకు పైనున్నతృతీయాసప్తమీవిభక్తులస్థానమున అత్వ మాదేశముగా బహుళముగా వచ్చును. గోరను- గోరిచేత, గోటను-గోటియందు మొ॥

'ఊరుచోటుమేనాదు లున్గ్విషయంబులు' అని ప్రౌఢవ్యాకర్త ఊరుమొదలగువానికి పైఅత్వము రాదనియు, సప్తమీనవర్ణకము పరమగుచుండగా 'ఉన్'లోప మగుననియు చెప్పెను. ఊరునన్- ఊరన్. ఇట్లే చోటన్-మేనన్ మొ॥

**టితి పరకార్యాలు** : టితి అను ఈఔపవిభక్తికములు పరము లగునపుడు ప్రాతిపదికకు చివర కొన్నివర్ణవికారములు కన్పించుచున్నవి.

**బిందువు** : 'హ్రస్వముమీఁదిటివర్ణమునకు ముందు పూర్ణ బిందువు బహుళముగా నగు' టి అనుఔపవిభక్తికము హ్రస్వముపై నున్నపుడు దానికి ముందు బహుళముగా పూర్ణబిందువు వచ్చును. అన్నిటిని అన్నింటిని మొ॥ క్రిందటికి ఇత్యాదులలో హ్రస్వముపై నున్నను బిందువు లేదు.

'పదాద్యం బగుహ్రస్వంబుమీఁదిటివర్ణంబునకు ముందు పూర్ణ బిందు వగు' పదముమొదటిహ్రస్వముపై నున్నటివర్ణమునకు పూర్వమున పూర్ణబిందువు నిత్యముగా వచ్చును. కన్ను-కంటిని, ఇల్లు-ఇంటికి మొ॥

**అత్వము:** 'టివర్ణంబు పరం బగునపుడుక్రిందుమీఁదుముందు పువర్ణంబుల కత్వం బగు' క్రింద మొద లగుశబ్దములకు టివర్ణము పర మగునపుడు తుదిఉత్వమున కత్వము వచ్చును. క్రిందటిని-(మాపు)మాపటికి- మొ॥

**ఇత్వము :** 'టితివర్ణంబులు పరంబు లగునపు డుత్వంబున కిత్వం బగు'- టి,తి అనుదోపవిభక్తికములు పర మగుచుండగా వానికి పూర్వమునం దున్న ఉత్వమునకు ఇత్వము వచ్చును. రెండు-రెండిటిని అట్టు-అటితికి. ఈఇత్వము కొన్ని యెడల కనిపింపదు- నెత్తుటికి.

అయితే, అనుచో తివర్ణమునకు పైని తృతీయాసప్తముల కత్వ మయినపుడు ముం దుత్వమె కన్పించును. 'తి'పరకతలో ఇత్వము రాగా (అటితితోడ- నటితియందు) తృతీయాసప్తముల కత్వమైనపు డాసూత్రమునందలిబహుళశబ్దము చే ముందరియుత్తునకు ఉత్వ మగును.

## 45. కారకములు

**కారకము :** 'కారక'శబ్దార్థమును, ఆయాకారకములను సూరి ప్రత్యేకముగా పేర్కొనలేదు. మిగిలినకొన్నిసంజ్ఞాదులవలె ఈఅంశ మును సంస్కృతమునుండియె గ్రహింపవలె నని సూరి అభిప్రాయము గావలెను.

'క్రియాజనకన్'- క్రియను గూర్చిన ఆకాంక్షను గలుగజేయు నది కారకము. 'రాముడు' అని ఉచ్చరించిన 'ఏమి చేసెను' అను రీతిగా క్రియను గూర్చినఆకాంక్ష కలుగును. ఇట్టివి కారకములు.

'రామునియొక్క' యనుచో పైరీతిని క్రియాకాంక్ష ఉండదు. కావున అది కారక మనిపించుకొనదు.

'క్రియాన్వయమును కలిగించునది అనగా క్రియాన్వయము గలది' అని కారకశబ్దముయొక్క అర్థమును ప్రౌఢవ్యాకరణము పేర్కొన్నది.

**కారకభేదములు :** 'కారకంబు లనం గర్త్రాదులు' అని సూత్రించిన ప్రౌఢవ్యాకర్త కర్మ మొదలగు కారకములు ఆరింటిని పేర్కొనె.

**కర్తృకారకము :**

కర్త అయినకారకము కర్తృకారకము. "చేతవర్ణకంబు కర్త కగు" అని కర్తృవాచక మగుశబ్దమునకు 'చేత' ప్రత్యయము వచ్చును. "ధాత్వర్థవ్యాపారాశ్రయము కర్త. దేవదత్తునిచేత వంటకము వండబడెను. ఇచట చేత తృతీయావిభక్తి. కర్త్రర్థమునందువచ్చి కర్తృరూపమున క్రియతో అన్వయము గలిగి యున్నది. కావున 'చేత' అనుతృతీయ కర్తృకారకము.

**కర్మకారకము :**

కర్మ అయినకారకము. 'కర్మంబున ద్వితీయ యగు' అని కర్మకు ద్వితీయావిభక్తి వచ్చును. ధాత్వర్థఫలాశ్రయము కర్మము. దేవదత్తుడు వంటకమును వండెను. ఇచట 'ను' అనుద్వితీయావిభక్తి కర్మార్థమున వచ్చి కర్మరూపమున క్రియతో అన్వయించును. కావున ఈ 'ను' ద్వితీయావిభక్తి కర్మకారకము.

**కరణకారకము :**

కరణము అయినకారకము కరణకారకము. 'కరణసహార్థతుల్యార్థయోగంబులం దృతీయకుం దోడవర్ణకం బగు' అని కరణమునకు 'తోడ' (చేత) అనుతృతీయావిభక్తి వచ్చును. క్రియాసిద్ధిం బ్రకృష్టోపకారకంబు కరణంబు. కోలతోడ(చేత) కూల్చె. ఇచట తోడ(చేత) అనుతృతీయావిభక్తి కరణార్థమున వచ్చి కరణరూపమున

క్రియతో అన్వయించుచున్నది. కావున ఈతృతీయావిభక్తి కరణ కారకము.

### సంప్రదానకారకము :

'సంప్రదానంబునకుం జతుర్థి యగు' అని సంప్రదానమునకు చతుర్థీవిభక్తి వచ్చును. త్యాగోద్దేశంబు సంప్రదానంబు నాబడు రామునికొఱకు కన్య నిచ్చెను. ఇచట కొఱకు అనునది సంప్రదానార్థమున వచ్చి సంప్రదానరూపమున క్రియతో అన్వయించుచున్నది కావున చతుర్థీవిభక్తి సంప్రదానకారకము.

### అపాదానకారకము :

అపాయము మొద లగునానివలన కలుగు ఎడబాటు అపాదానము (అపాయభయజుగుప్సా- మొద లగుసూత్రముచే) ఇచట వలనప్రత్యయము వచ్చును. రాజ్యమువలన భ్రష్టు డయ్యె. ఇచట వలన అనుపంచమి అపాదానార్థమున వచ్చి అపాదానరూపమున క్రియతో అన్వయించుచున్నది కావున ఈ'వలన'పంచమి అపాదాన కారకము.

### అధికరణకారకము :

అధికరణము అనగా ఆధారము. 'అధికరణంబునకు సప్తమి యగు' అని ఇచ్చట సప్తమీవిభక్తి వచ్చును. ఘటమందు జల మున్నది. ఇచ్చట అందు అనుసప్తమి అధికరణార్థమున వచ్చి అధికరణ రూపమున క్రియతో అన్వయించుచున్నది. కావున ఈసప్తమీవిభక్తి అధికరణకారకము.

## 46. ప్రథమాది విభక్తులు - అవి వచ్చుస్థలములు

**విభక్తి :** 'విభక్తిశ్చ' అని సంస్కృత లక్షణమునుబట్టి, ప్రాతిపదికలపై వినిపబడిన డుముపులు మొద లైనప్రత్యయములకును,

ధాతువులపై విధింపబడిన 'డుజ్ఱు' మొద లగు ప్రత్యయములకును విభక్తులు అని సంజ్ఞ. ప్రాతిపదికలపై వచ్చువిభక్తులు ప్రథమ, ద్వితీయ- మొదలుగా ఏడు. ఈవిభక్తులు ఆయాయర్థములందు విధింప బడినవి.

**ప్రథమ :**

'డుముువులు ప్రథమ'- ఇందు 'డుముువు' అనునవి ఏకత్వమునను, 'లు' అనునది బహుత్వమునను అగును.

రాముఁడు (ఒక్కఁడు) రాములు (అనేకులు).

'ప్రాతిపదికసంబోధనోక్తార్థంబులం బ్రథమ యగు' ప్రాతిపదికార్థము, సంబోధనార్థము, ఉక్తార్థము వీనియందు ప్రాతిపదికపై ప్రథమావిభక్తి వచ్చును.

**1. ప్రాతిపదికార్థము :** నియతోపస్థితికము ప్రాతిపదికార్థము. రాముఁడు- వనము- ధేనువులు. **2. సంబోధనము :** సంబోధనము అనగా అభిముఖముగా చేసికొనుట. ఓరాముఁడ. **3. ఉక్తార్థము :** ఉక్తము అనగా ఆఖ్యాతముచేత చెప్పబడినది. క్రియావిభక్తిచే కర్త మొద లగువానిలో ఏది చెప్పబడునో దానికి ప్రథమావిభక్తి వచ్చును. రాముఁడు రావణుని సంహరించెను. ఇట కర్తకు ప్రథమ.

**4. భావార్థకాదియోగము:** 'భావార్థకాదియోగంబునఁ గర్తకుం బ్రథమ యగు' భావార్థకము మొద లగువానితో అన్వయమునందు ప్రథమ వచ్చును. రాముఁడు వచ్చుట- రాముఁడు రాఁగా- మొ॥

**5. కాలాధ్వములు :** 'కాలాధ్వములం బ్రాయికంబుగాఁ బ్రథమ యగు' కాలవాచకములును, అధ్వ(మార్గము)వాచకములును అయినశబ్దములకు తఱుచుగా ప్రథమ వచ్చును. కాలము : నిన్న పోయెను. అధ్వము: క్రోశము నడచెను.

**ద్వితీయ :**

'నువర్ణంబు ద్వితీయము'. 'ను' అనున దొక్కటిద్వితీయావిభక్తి. ఇది ఏకత్వబహుత్వములు రెండింట వచ్చును.

**కర్మార్థము** : కర్మంబున ద్వితీయ యగు'- 'ధాత్వర్థ ఫలాశ్రయంబు కర్మంబు నాఁబడు'. రాముఁడు 'వనమును' చూచెను. వనము కర్మ. 'ను' ద్వితీయ అయినది.

**తృతీయ :**

చేత తోడ తృతీయ. ఇవి అద్యక్షరలోపము లయి చే, తో, అనియు ఉండును. 'ఒకానొకచోఁ దోడకుఁ దోడుత యని రూపాంతరంబును గలదు' అని ప్రౌఢవ్యాకర్త తోడకు 'తోడుత' అను రూపమును పేర్కొనెను. ప్రాణముతోడుత. 'జడపదంబులమీఁది తోడకు మెయిమైలు విభాష నగు' అని ప్రౌఢవ్యాకర్త కొన్నియెడల తోడ స్థానమున మెయి, మై అనునవి వచ్చుటను పేర్కొనెను. అర్థిమెయిన్, అర్థిమైన్. ఇవి ఏకత్వబహుత్వములు రెంట నగును.

I. **చేత(చే) : 1. కర్త్రర్థము** : 'చేతవర్ణకంబు కర్త కగు'- ధాత్వర్థవ్యాపారాశ్రయంబు కర్త. రామునిచేత చంపఁబడెను. మొ॥

**2. హేతువు** : 'చేతవర్ణకంబు హేతుకరణంబులకు గ్రహ్యాది యోగజం బగుపంచమికి బహుళంబుగా నగు'. ఫలసాధనయోగ్యం బగుపదార్థము హేతువు. 'విద్యచే' యశంబు గలుగు'.

**3. కరణము** : పయిసూత్రముచే చేతవర్ణక మగును. క్రియాసిద్ధిం బ్రకృష్టోపకారకంబు కరణంబు. 'కోలచేత' కూల్చె.

**4. గ్రహ్యాదియోగము** : కొను, విను మొద లగువానితోడి యోగమునందు 'చేత' వచ్చును. రాజులచేత కప్పంబు గొనియె.

II. **తోడ(తో) : 1. కరణము** : కరణసహార్థతుల్యార్థయోగంబులం దృతీయకుం దోడవర్ణకం బగు' కరణమునకు- తోడ. కోలతోడఁ గూల్చె.

**2. సహార్థయోగము** : పయిసూత్రముచే, సహ(కూడ)అర్థయోగమున తోడ వచ్చును. రాజు 'సేనలతో' వచ్చె.

**3. తుల్యార్థయోగము :** తుల్యార్థముతోడి యోగమున తోడ పయిసూత్రముచే వచ్చును. 'చైత్రునితోడ' మైత్రుండు తుల్యుండు.

**4. అముఖ్యకర్త :** 'సహార్థాముఖ్యకర్మంబునకుం దోడకువర్ణకంబులు ప్రాయికంబుగా నగు' అను, పలుకు, మొ॥ ధాతువుల అముఖ్య కర్మకు తోడ వచ్చును. మైత్రుండు 'చైత్రునితోడ' నిట్లనెను.

**5. ఉపయోగము :** 'ఉపయోగంబునం దాఖ్యాతకుం దోడ వర్ణకం బగు' నియమపూర్వకవిద్యాస్వీకారంబు ఉపయోగంబు. గురువును తెల్పుశబ్దమునకు తోడ వచ్చును. శ్రీకృష్ణులు 'సాందీపనితోడ' వేదంబులు చదివిరి.

**చతుర్థి :**

'కొఱకు, కయి చతుర్థి'. కొఱకు, కయి అనునవి చతుర్థీ విభక్తులు. 'చతుర్థికిం బోలెను వర్ణకంబు నగు' అని ప్రౌఢవ్యాకర్త 'పోలెను' అనునది చతుర్థీవిభక్తిగా చేర్కొనెను. ఇవి యేకత్వ బహుత్వములు రెంట వచ్చును.

**1. సంప్రదానము :** 'సంప్రదానంబునకుం జతుర్థి యగు' త్యాగోద్దేశ్యంబు సంప్రదానంబు. 'రామునికొఱకు' కన్య నిచ్చెను.

**2. ఉద్దేశము :** చతుర్థి కొన్నియెడల ఉద్దేశమాత్రమునకు వచ్చును. పురుషార్థంబుకయి యత్నింపవలయును.

**పంచమి :**

'వలన కంటె పట్టి పంచమి' పంచమీవిభక్తులు, వలన- కంటె- పట్టి అనునవి మూడు.

**1. వలన : అపాదానము :** 'అపాయభయజుగుప్సాపరాజయ ప్రమాదగ్రహణ భవనత్రాణవిరామాంతర్ధి వారణంబు లెద్దాన నగు దానికి వలనవర్ణకం బగు' అపాయము (ఎడబాటు) మొదలగునవి

దేనినుండి కలుగునో దానికి వలన ప్రత్యయము వచ్చును. 'రాజ్యమువలన' భ్రష్టుండయ్యెను మొ॥

ఇంకను హేత్వర్థమందును వలన వచ్చును. విద్యవలన యశంబు గలుగు. నీవు 'వచ్చుటవలన' ధన్యుడ నయితిని, ఉపయోగమున 'సాందీపనివలన' చదివిరి.

II. కంటె : అన్యార్థాదియోగము : 'కంటెవర్ణకం బన్యార్థాదియోగజం బగు పంచమి కగు'. అన్యము, ఇతరము మొదలగు అర్థములతోడి అన్వయమున కంటె ప్రత్యయము వచ్చును. 'రాముని కంటె' నన్యుండు ధానుష్కుండు లేఁడు.

**2.** నిర్ధారణము : 'కంటెవర్ణకంబు నిర్ధారణపంచమి కగు' జాతిగుణక్రియాసంజ్ఞలనుబట్టి ఒకదానినుండి వేఱొకటి నిర్ధారించి చెప్పునప్పుడు దేనినుండి నిర్ధారింపబడుచున్నదో ఆశబ్దమునకు కంటెప్రత్యయము వచ్చును. 'జానపదులకంటెనాగరులు వివేకులు.

III. పట్టి : హేతువు : 'పట్టివర్ణకంబు హేతువు లగుగుణక్రియల కగు' హేతువయినగుణము, లేదా క్రియను తెల్పుశబ్దమునకు పట్టి ప్రత్యయము వచ్చును. 'జ్ఞానమునుబట్టి' ముక్తుండగు మొ॥

'కొన్నిచోట్ల హేతువులందత్క్రియలమీఁదను బట్టి వర్ణకంబు విభాష నగు' అను ప్రౌఢవ్యాకరణసూత్రముచే అన్వయము అయినను ద్వితీయాంతముపై పట్టిప్రత్యయము కొన్నిచోట్ల వచ్చును. 'కలఁగంగఁబట్టి' మొ॥

షష్ఠి :

కు యొక్క లోపల షష్ఠి. షష్ఠియందు కు, యొక్క లోపల అనునవి విభక్తులు. 'లోపల' అనునది ఆద్యక్షరశేషమై 'లో' అనియు ఉండును. ఇవి ఏకత్వబహుత్వములు రెంట నగును.

**1.** కు : అముఖ్యకర్మము : 'వస్త్వర్థాముఖ్యకర్మంబునకుం దోడకువర్ణకంబులు ప్రాయికంబుగా నగు' అను పలుకు మొదలగు

క్రియల అనుక్తకర్మమునకు 'కు' ప్రత్యయ మగును. చైత్రుండు మైత్రునకిట్లనియె.

**2. వీప్స, కాలపరిమితి :** 'వీప్సయందును, కాలపరిమితియందును నామంబులకుఁ గువర్ణకం బగు' అని ప్రౌఢవ్యాకర్త పేర్కొనెను. వీప్స- 'గ్రామానికి' గ్రామానికి వరికి, కాలపరిమితి- 'రేపటికి' వచ్చును.

**3. ఇతరవిభక్త్యర్థములు :** 'షష్ఠ్యర్థానికిం బగుకువర్ణకం బొక్కొక చో ద్వితీయాదివిభక్తులకు మాఱుగాఁ దత్తదర్థంబులం జూపట్టెడి'- వేటకుఁ బోయిరి (వేటను) మొ॥

తుల్యార్థయోగమున - చైత్రునకు మైత్రుండు తుల్యుండు.
సంప్రదానమున - రామునకు కన్య నిచ్చెను.
ఉద్దేశమాత్రమున - పురుషార్థమునకు యత్నింపవలె.
అపాదానమున - చోరునకు భయపడె.
అన్యార్థాదియోగమున - రామునకు నన్యంబు దైవంబు లేదు.
సంబంధమున - నాకు తమ్ముఁడు- మొ॥

II. **యొక్క : శేషము :** 'శేషషష్ఠికి యొక్కయు నగు' శేషం బనఁగా సంబంధంబు. సంబంధార్థమున సంబంధిపదమునకు యొక్క ప్రత్యయము వచ్చును. 'నాయొక్క' తమ్ముఁడు మొ॥

దీనికి అర్థవిశేషములును గల వంటాడు పట్టుపుట్టువు(యొక్క) వాఁడు- పట్టుపుట్టువు- గలవాఁడు మొ॥

III. **లోపల : నిర్ధారణము :** 'నిర్ధారణషష్ఠికి లోపలవర్ణకం బగు' జాతిగుణక్రియాసంజ్ఞలచేత సముదాయమునుండి ఏకదేశమును పృథక్కరణము నిర్ధారణము. 'గోవులలోపల' కపిల బహుక్షీర మొ॥

ఇది అధికరణార్థమునను గలదు. ధరణిలోపల=ధరణియందు.

**సప్తమి :**

అందు న సప్తమి. అందు, న. అనునవి సప్తమీవిభక్తులు. 'న' అనునది ఏకత్వమునను, 'అందు' ఏకత్వబహుత్వములు రెంటను నగును.

**1. అధికరణము :** 'అధికరణంబునకు సప్తమి యగు' అధికరణంబు నాధారంబు. 'ఘటమున'జల మున్నది. భక్తులయందు వాత్సల్యము.

**2. నిర్ధారణము :** నిర్ధారణమున లోపల వచ్చుస్థలములందును సప్తమి కలదు. 'గోవులందు' కపిల బహుక్షీర. గోసముదాయమున కపిల బహుక్షీర మొ॥

## 47. ఒక విభక్తికి మఱియొక విభక్తి

ఆయాఅర్థములందు విధింపబడిన ఆయావిభక్తులకు మాఱుగా వేఱొకవిభక్తి వచ్చుట తెలుగున కొన్ని యెడల కలదు.

**ప్రథమ :**

**ద్వితీయకు :** 'జడంబుద్వితీయకుం ప్రథమ బహుళంబుగా నగు' జడవాచకములకు పైనున్న ద్వితీయకు మాఱుగా ప్రథమ వచ్చును. 'పువ్వులు' దెచ్చె (పువ్వులను దెచ్చె).

"కొన్ని యెడల నజడంబు ద్వితీయకును ప్రథమ కానంబడి యెడి" అని ప్రౌఢవ్యాకర్త జడములుగానిశబ్దములపైం గూడ పయికార్యమును చేకొనెను. అప్పుదరాగ మెదిర్చె (మదనాగమును ఎదిర్చె.)

**తృతీయకు :** ఒకానొకచో నొకవిభక్తికి మఱి యొకవిభక్తియు నగు' - అనుసూత్రముచే సహార్థమున వచ్చిన తృతీయ (తోడ)కు ప్రథమ వచ్చుట కలదు. సుఖ మున్నారు (సుఖముతో నున్నారు.)

**సప్తమికి :** 'ఒక్కొకచో జడంబున సప్తమికిం బ్రథమయు నగు' అను ప్రౌఢవ్యాకరణసూత్రముచే జడములపైని సప్తమికి ప్రథమ వచ్చును. 'తీర్థమాడి' (తీర్థమం దాడి)

**ద్వితీయ :**

**1. తృతీయాసప్తములకు :** 'జడంబుతృతీయాసప్తములకు ద్వితీయ బహుళంబుగా నగు' జడవాచకములకు పైనున్న తృతీయకును, సప్తమికిని ద్వితీయ వచ్చుట కలదు. 'కోలం'గూల నేసె - కోలచేత (తోడ) కూల నేసె. 'లంకను' కలకలంబు (లంకయందు కలకలంబు) మొ॥

ఇచట ప్రౌఢవ్యాకర్త 'కొన్నియెడల నజడంబు తృతీయాసప్తముల కును బహుళంబున ద్వితీయ చూపట్టెడి' నని సూత్రించెను. 'చక్ర వాకముల'నలరు (చక్రవాకములతో నలరు.) 'మనుజుల' విప్రుండు మనుజులందు విప్రుండు.

**2. పంచమికి :** 'ఒకానొకవిభక్తికి మఱియొకవిభక్తియు నగు' అని వలనపంచమికి కొన్నియెడల ద్వితీయ వచ్చును. 'గృహమును' వెడలెను (గృహమువలన వెడలెను)

**3. షష్ఠికి :** క్రియాన్వయంబున రెండుపదంబులకు స్వస్వామి సంబంధము గలచో సంబంధిపదంబుషష్ఠికి ద్వితీయ యగు' అని ప్రౌఢ వ్యాకర్త ద్వితీయ కొన్నిచోట్ల షష్ఠికి వచ్చుటను పేర్కొనెను. నన్ను చెట్టపట్టినన్ (నాయొక్క చెట్టపట్టినన్) మొ॥
తృతీయ, చతుర్థి, పంచమీ విభక్తులు వేరొకదానికగుట గానరాదు.

**షష్ఠి :**

**ప్రథమకు-యొక్క :** 'ధాతుజవిశేషణభావార్థకపూర్వ వ్యవహితావ్యవహితకర్తృపదప్రథమకు నొక్క-షష్ఠి యగు' అను

ప్రౌఢవ్యాకరణలక్షణముచే ప్రథమకు యొక్క అనుషష్ఠీవిభక్తి అగును. మాపఠింపనిశాస్త్రము (మేము పఠింపని శాస్త్రము.)

**సప్తమి :**

**తృతీయకు :** 'ఉదంతజడంబుతృతీయకు సవర్ణకం బగు' ఉకారాంతము లగుజడము పైనితృతీయకు 'న' అనుసప్తమి వచ్చును. 'బాణమున' కూల్చెను. (బాణముతో కూల్చెను.)

ఇచట ప్రౌఢవ్యాకర్త 'ఒక్కచో నుదంతం బగునజడంబు తృతీయకును సవర్ణకంబు గానంబడియెడి' అని అజడములపై చెప్పెను. ఏనుగున ఏనుగు (ఏనుగుతో ఏనుగును) ఇట్టిప్రయోగ మింకొకటి లేదు.

ద్వితీయాద్యర్థములందు షష్ఠి, నిర్ధారణమున సప్తమి మొదలుగా తత్తద్విభక్త్యర్థములందు ఇతరవిభక్తు లగుట కలదు. కాని అవి తత్తద్విభక్తులస్థానమున విధింపబడినవి కాక తత్తదర్థములందు పేర్కొనబడిన వగుటచేత ఇచట ప్రస్తావింపదగినవి కావు.

## 48. విశేషణములు

'శబ్దములు విశేష్యములు విశేషణము లని ద్వివిధంబులు' అయ్య-అక్క మొద లగునవి విశేష్యములు. మిగిలినవి విశేషణములు. కేవలతత్పురుష మొ॥ చోట్ల కేవల మొదలగు కొన్ని విశేషణములు విశేష్యములు నగును. విశేషణములు కొన్నియెడల విశేష్యలక్షకములును అగును. అప్రియములు గావించి=అప్రియకార్యములు గావించి

**విశేషణము :** 'విశేషణము నా జాత్యాదివిశేషములను దెలుపునది' జాతి- గుణము- మొదలగువిశేషములను పేర్కొనునది విశేషణము. క్షత్రియుడు- క్షత్రియత్వము అనుజాతిరూప మగు విశేషమును తెలుపుటచే 'క్షత్రియుడు' అనునది విశేషణము.

విశేష్యములను భేద్యము లనియు విశేషణములను భేదకము లనియు వ్యవహరింతురు.

**విశేషణభేదములు** : 'విశేషణము జాత్యాదిభేదంబులచే షడ్విధంబు' జాతి మొదలగు విశేషములను దెలుపునదియె విశేషణము. కాగా విశేషణము తెలుపు ఈజాతి మొదలగు విశేషముల ననుసరించి ఇది ఆరువిధము లైయున్నది.

**1. జాతిప్రయుక్తవిశేషణము** : జాతి ననుసరించి ప్రయోగింపబడినవిశేషణము జాతిప్రయుక్తవిశేషణము. ఈవిశేషణము జాతి విశేషమును తెలుపును. ద్రోణుడు బ్రాహ్మణుడు. ఇచట బ్రాహ్మణుడు అనునది ద్రోణుడనువిశేష్యమునందలి బ్రాహ్మణత్వము అనువిశేషమును దెలుపుచు విశేషణ మయ్యె' బ్రాహ్మణత్వము జాతిరూప మయినది. కావున జాతినిబట్టి కూర్పబడిన 'బ్రాహ్మణుడు' అనునది జాతిప్రయుక్తవిశేషణ మగుచున్నది.

**2. క్రియాప్రయుక్తవిశేషణము** : క్రియ అనగా వ్యాపారము (పని). క్రియనుగూర్చి తెలుపువిశేషణము క్రియాప్రయుక్తవిశేషణము. వచ్చినవాడు ఫల్గుణుడు ఇచట వచ్చినవాడు అనునది ఫల్గుణుడు అనువిశేష్యమునందలి 'వచ్చియుండుట' అను విశేషమును దెలుపుచు విశేషణ మైనది. 'వచ్చుట' యను విశేషము క్రియారూప మైనది. క్రియారూప మయినవిశేషమును దెలుపుటచే 'వచ్చినవాడు' క్రియాప్రయుక్తవిశేషణము. (ధాతుజ విశేషణములె క్రియాప్రయుక్తవిశేషణములుగా గుర్తింపవచ్చును.)

**3. గుణప్రయుక్తవిశేషణము** : గుణమును తెలుపువిశేషణము. 'నల్లనివాడు రాముడు' ఇచట 'నల్లనివాడు' అనునది రాముడు అనువిశేష్యమునందలి నల్లగా ఉండుట అను విశేషమును దెలుపుచు విశేషణ మైనది. నలుపనునది గుణము. కావున గుణమూలక మైన 'నల్లనివాడు' అను ఈవిశేషణము గుణప్రయుక్తవిశేషణమగును.

**4. ద్రవ్యప్రయుక్తవిశేషణము :** ద్రవ్యము (వస్తువు-ధనము, మొ॥) ను అనుసరించి ప్రయోగింపబడినవిశేషణము. ధనవంతుడు. ధనము(గలిగియుండుట)అను ద్రవ్యరూప మైనవిశేషమును ప్రస్తావించు చున్నది గాన ఇది ద్రవ్యప్రయుక్తవిశేషణము.

**5. సంఖ్యాప్రయుక్తవిశేషణము :** 'సంఖ్యను దెలుపువిశేషణము సంఖ్యాప్రయుక్తవిశేషణము' ఒకఁడు, ఒక్క- అనుసంఖ్య నను సరించి ప్రయోగింపఁబడిన దగుటనే ఇది సంఖ్యాప్రయుక్తవిశేషణము.

**6. సంజ్ఞాప్రయుక్తవిశేషణము :** సంజ్ఞ(పేరు)ను దెలుపునట్టి విశేషణము సంజ్ఞాప్రయుక్తవిశేషణము. దేవదత్తుఁడు 'దేవదత్త' అనుసంజ్ఞనుగూర్చి ప్రయుక్త మైనది గావున ఇది సంజ్ఞాప్రయుక్త విశేషణము.

ఇట్లు విశేషణ మూరువిధములుగా ప్రౌఢవ్యాకరణము నిరూపించినది.

## 49. విశేషణము - లింగవిభక్తివచనములు

**విశేష్యానుగుణము :** 'విశేష్యంబునకుంబోలె విశేషణంబులకు లింగవిభక్తివచనంబు లగు' విశేష్యము ఏలింగము, ఏవిభక్తి, ఏవచనమునం దుండునో విశేషణమును అదే లింగము, అదే విభక్తి అదే వచనములం దుండును. రాముఁడు సుగుణాభిరాముఁడు. సీత సుగుణాభిరామ. సుగుణాభిరాములను సీతారాములను మొ॥

కొన్ని యెడల విశేషణముయొక్క లింగవిభక్తివచనములు విశేష్యముకంటె భిన్నముగా నుండుట కలదు.

I. **లింగవ్యత్యాసము :** విశేషణము విశేష్యలింగముకంటె భిన్న మగులింగమునం దుండుట.

**1. స్త్రీలింగము- క్లీబత్వము :** "మహతీతరంబు లగుస్త్రీలింగంబులవిశేషణంబులు క్లీబతుల్యంబులు విభాష నగు" స్త్రీవాచకములు

గాని స్త్రీలింగవిశేషణములకు వికల్పముగా క్లీబతుల్యత్వముగలుగును. 'హృద్యము' అగువిద్య, (హృద్య అగువిద్య)

**2. మహత్తు-అమహత్కార్యము** : 'మహద్విశేషణసంఖ్యా వాచకంబులకుం గొన్నియెడల నమహత్కార్యంబు చూపట్టెడి' అని ప్రౌఢవ్యాకరణము మహత్తగువిశేషణమునకు అమహత్కార్యమును ప్రస్తావించినది. అనుకులు 'అరువదివేలు' మొ॥

II. **విభక్తివ్యత్యాసము** : విశేష్యవిభక్తికంటె భిన్నముగా విశేషణమునకు విభక్తి యగుట కొన్నియెడల గలదు.

**1. షష్ఠికి - ప్రథమ** : 'ఒకానొకచో విశేషణంబులషష్ఠికిం బ్రథమ విభాష నగు' విశేష్యము ననుసరించి విశేషణమునకు షష్ఠీ విభక్తి రాగా దానికి వికల్పముగా ప్రథమ వచ్చును. సుగుణాభి రాముండు రామునకు. మొ॥

ఇచట ప్రౌఢవ్యాకర్త 'ఒక్కచో సమాసాంతర్గతవిశేష్యంబుల కగువిశేషణంబులషష్ఠికిని బ్రథమ చూపట్టెడి' అని పేర్కొనెను. షష్ఠ్యంతవిశేష్యము సమాసగతమైయుండగా విడిగా ఉన్నవిశేషణము యొక్క షష్ఠికిని ప్రథమ వచ్చుట కలదు. దేవుండు త్రివిక్రము సొమ్ములు.

**2. ద్వితీయ - ప్రథమ** : 'ఒక్కచో ద్వితీయాంతవిధేయ విశేషణంబునకుం బ్రథమయు నగు' అని ప్రౌఢవ్యాకరణము విధేయ విశేషణములయొక్క ద్వితీయావిభక్తికి ప్రథమావిభక్తి యగుటను జెప్పినది. 'ఎవ్వని' 'పురోహితుండు'గా చేకొనువారము. ప్రథమ రానిచో పురోహితునిగా.

**3. భావద్వర్థవ్యవధానము - ప్రథమ** : 'భవత్యర్థవ్యవహితంబు లగువిశేషణంబులకుం బ్రథమయగు.' అగు మొద లగువానితో ఎడము గలిగినపుడు విశేషణముయొక్క అన్నివిభక్తులకును ప్రథమ వచ్చును. సుగుణాభిరాముండు అగురాముని మొ॥

**4. ద్వితీయాదులు - ప్రథమ :** 'కొన్నియెడల విశేషణంబు ద్వితీయాదులకుం బ్రథమ చూపట్టెడి' అని ప్రౌఢవ్యాకరణము అగు మొదలగువానితో వ్యవధానము లేకున్నను విశేషణముయొక్క ద్వితీయాదివిభక్తులకు ప్రథమ వచ్చునని పేర్కొన్నది.

**ఉదా :** తల్లి ద్రౌపదితోడన్ మొ॥

**5. సర్వనామసంఖ్యలు - ప్రథమ :** సర్వనామసంఖ్యాభిధాన తద్విశేష్యంబులయం దెయ్యది ముందు ప్రయోగింపంబడు దాని ద్వితీయాదులకుం బ్రథమ బహుళంబుగా నగు'. సర్వనామములును, సంఖ్యావాచకములు నగువిశేషణములు విశేష్యమునకు పూర్వము నందు ప్రయోగింపబడునప్పుడు ఆవిశేషణములయొక్క ద్వితీయాది విభక్తులకును ప్రథమ వచ్చును. అన్ని గుజ్జములను, రెండు గుజ్జములకు మొ॥

విశేష్యమునకు తరువాత ప్రయోగించినచో ద్వితీయాదులట్లే యుండును. గుజ్జములను అన్నింటిని. గుజ్జములకు రెండింటికి- ఇట్టిచోట్ల విశేష్యముయొక్క ద్వితీయాదివిభక్తులకు ప్రథమావిభక్తి బహుళముగా వచ్చును. గుజ్జములు అన్నింటిని మొ॥

బహుళశబ్దముచే కొన్నింటికి ప్రథమ కాక యొక్కషష్ఠి వచ్చుట కలదు. మాయిద్దఱకు, మొ॥

III. **వచనవ్యత్యాసము :** కొన్నియెడల విశేషణమునకు విశేష్యముకంటె భిన్నమయినవచనము గల్గుట గలదు.

**1. స్త్రీసమాదులు - ఏకవచనము :** 'స్త్రీసమంబు లగువిశేషణంబులయు మువర్ణకాంతవిశేషణంబులయు బహువచనంబున కేకవచనంబు బహుళంబుగా నగు' స్త్రీసమములు, మువర్ణకాంతములు అయినవిశేషణములకు బహువచనమునకు బదులుగా ఏకవచనము బహుళముగ వచ్చును. మాటలు 'పెక్కు' (స్త్రీసమము) కులిశధారలు 'కుంఠితము' అయ్యె (మువర్ణకాంతము)

# 50. సమాసములు



**సమాసము** : 'సమర్థంబు లగుపదంబు లేకపదం బగుట సమాసంబు' అని బాలవ్యాకరణము సంస్కృతానుగుణముగా చెప్పినది. సామర్థ్యము గలిగినపదములు ఒకేపదముగా కూడుట సమాసలక్షణము. రామునియొక్క, బాణము అనుపదములు గలిసి యేర్పడిన రామునిబాణము అనునది సమాసము.

ప్రౌఢవ్యాకరణము 'సమాస మనఁగా సంయోగదశయందు గలిగెడు విభక్తిలోపాత్మకపదస్వరూపసంగ్రహము'- అని చెప్పుచున్నది. సమర్థము లయినపదములు అందలివిభక్తులు లోపించి సంగ్రహస్వరూపముతో (ఒకేపదముగా) చేర్పడుట సమాసముయొక్క లక్షణము. ఇది లుక్సమాసలక్షణ మని ప్రౌఢవ్యాకర్తయే స్పష్టము చేసెను.

**I. సమాసభేదములు** : కావున సమాసము ఏర్పడునట్టి తీరును బట్టి అది ముందుగా రెండువిధములు.

**1. లుక్సమాసములు** : సమాసమునందు విభక్తులు లోపించు నట్టి సమాసములు లుక్సమాసములు. రామునియొక్క+బాణము. ఇట యొక్క, ము అనువిభక్తులు లోపించి రామునిబాణ అని సమాస (ప్రాతిపదిక) మేర్పడగా పిదప ఆయావిభక్తులతో రామునిబాణము మున్నగువిధముగా ప్రయోగింపబడును. ఇచట సమా మున విభక్తులు లోపించినవి గావున ఇది లుక్సమాసము. ఇట్లే దొంగభయము మొ॥

**2. అలుక్సమాసము** : సమాసమునందు విభక్తిలోపింపనిచో అది అలుక్సమాస మగును. నీచేతన్+ప్రోవు-నీచేతిప్రోవు-ఇచట 'చేత' అను(తృతీయా)విభక్తి లోపింపలేదు గావున 'నీచేతిప్రోవు' అనునది (తృతీయా)అలుక్సమాసము. నాతోడిచెలిమి, నివలని భయము, నాయందలికరుణ అని, చేత,తోడ, వలన, అందు విభక్తుల అలుక్సమాసములను చిన్నయసూరి ప్రదర్శించెను.

'కొన్నియెడల సప్తమీతత్పురుషంబునందు నలుక్కంబు నగు'

అని సూత్రించి ప్రౌఢవ్యాకరణము 'న' విభక్తి లోపింపనిఅలుక్సమాసమును గూడ ప్రస్తావించినది. కువలయంబునన్ + వాడు-కువలయంబునవాడు.

ఇవార్థకము మొదలగువానితో రాముననట్లు, నన్నువలె అను విధము లైనసమాసములను అలుగలుక్సమాసములుగా ప్రౌఢవ్యాకరణము పేర్కొన్నది.

II. **సమాసభేదములు :** ఇట్లేర్పడుసమాసములలోనిశబ్దములనుబట్టి సమాసము మూఁడువిధములు.

'సాంస్కృతికాచ్ఛికమిశ్రభేదంబుచే సమాసంబు త్రివిధంబు'
1. సాంస్కృతికము, 2. ఆచ్ఛికము, 3. మిశ్రము.

**1. సాంస్కృతికము :** సంస్కృతమునకు సంబంధించినశబ్దములతో ఏర్పడినసమాసము సాంస్కృతికము. ఇది రెండువిధములు.

i. **సిద్ధము :** కేవలము సంస్కృతశబ్దములకు చేయబడిన సమాసము సిద్ధము. సంస్కృతమునె సమాసముగాసిద్ధమై పిదపసమాస ప్రాతిపదిక తెలుగులోనికి వచ్చును. సమాసము (పూర్వమె సంస్కృతమున) సిద్ధమైయుండుటచే ఇది సిద్ధ(సాంస్కృతిక) సమాసము. (రాజాజ్ఞా, యనుసంస్కృతసమాసము తెలుగులోనికి వచ్చి)-రాజాజ్ఞ.

ii. **సాధ్యము :** సంస్కృతసమశబ్దములకు తెలుగున చేయబడిన సమాసము సాధ్యము. రాజుయొక్క+ఆజ్ఞ-రాజునాజ్ఞ.

**2. ఆచ్ఛికము :** సంస్కృతసమముకంటె వేరయిన తెలుగు శబ్దము అచ్చతెనుగు. ఈఆచ్ఛికశబ్దములకు చేయబడినసమాసము ఆచ్ఛికసమాసము. తేనియొక్క ఆనతి=తేనియానతి. ఈసమాసమునం దున్నశబ్దము లెల్ల ఆచ్ఛికములే కావున ఇది ఆచ్ఛికసమాసము.

**3. మిశ్రము :** సంస్కృతసమశబ్దమును ఆచ్ఛికశబ్దమును కలిపి చేసిన సమాసము మిశ్రము. రాజుయొక్క+ఆనతి-రాజునానతి. ఇందు

రాజశబ్దము సంస్కృతసమము కాగా అనతి అనునది అచ్చికము. సంస్కృతసమమును అచ్చికమును మిశ్రమైయున్నది గావున ఇది మిశ్ర(సమాస)ము.

**గ్రామ్యసమాసము :** కేవలము సంస్కృతశబ్దమునకు అచ్చ తెనుఁగుశబ్దముతో సమాసము చేయరాదు. అనేకమంది, గర్భగుడి మొదలుగా వ్యవహారమునందు గలఇట్టిసమాసములు వ్యాకరణమునకు విరుద్ధములు. కావున గ్రామ్యములు. వీనిని కొందరు వైరిసమాసములు అందురు. ఇవి ప్రయోగింపదగవు. జీవగఱ్ఱ మున్నగు కొన్ని మాత్రము మహాకవులు ప్రయోగించుటచే గ్రహింపదగియున్నవి.

## 51. (తత్పురుషాది) సమాసభేదాలు

తెలుగునను సమాసము అర్థమునుబట్టి 1. తత్పురుషము, 2. బహువ్రీహి, 3. ద్వంద్వము అని మూడు విధములు. 'తత్పురుషాదులకు లక్షణంబు ప్రాయికంబుగా సంస్కృతోక్తంబ యగు' ఈసమాసములలక్షణము దాదాపుగా సంస్కృతమునందువలెనె తెలుగునను గ్రహింపవలెను.

**తత్పురుషము :**

ఉత్తరపద (సమాసముననుచివరిపదముయొక్క) అర్థము ప్రధానముగా కలిగినసమాసము తత్పురుషము. చివరిపదముయొక్క అర్థము క్రియతో అన్వయించును. రామునిబాణము (వే లయినది) మొ. ఇది రెండువిధములు.

I. **సమానాధికరణము :** విశేషణమునకువిశేష్యముతో చేసిన సమాసము సమానాధికరణము. పూర్వోత్తరపదములు రెండింటియొక్క అర్థమును సమానమైనఆధారము (ఒకే వస్తువునందుండుట) కలిగిఉండుటచే ఇవి సమానాధికరణములు. దీనినే కర్మధారయము అందురు. ఈసమాసమున పూర్వపదము త్రికము, త్రిసమము,

మువర్ణకాంతము, ధాతుజవిశేషణము, అనువానిలో ఏదో ఒకటి అగును. నల్లనియావు, ఇంపు కొన్నివిశేషములు గలవు.

i. **ఉపమానపూర్వపదకర్మధారయము :** విశేషణమగుపూర్వపదము ఉపమానమైనచో ఆకర్మధారయము ఉపమానపూర్వపదకర్మధారయము. ఇట్టి సమాసము సంస్కృతమున లేదు. చిగురుఁగేలు, జుంటిమోవి అనువిధముగా తెలుఁగున నిట్టిసమాసములు గలవు. అలరు + మేను = అలరుబోఁడి- అనువిధముగా బహువ్రీహులుగా నూరి పేర్కొన్నసమాసములను 'అలరుఁబోఁడీత్యాదు లుపమానపూర్వపదకర్మధారయంబులు' అని ప్రౌఢవ్యాకరణము అలరు+పోఁడి అలరుఁబోఁడి మున్నగునవి ఉపమానపూర్వపదకర్మధారయము లని చెప్పినది.

ii. **ఉపమానోత్తరపదకర్మధారయము :** కర్మధారయమునందు ఉత్తరపదము ఉపమానమైనచో అది ఉపమానోత్తరపదకర్మధారయము. మోవిపండు మొ॥

iii. **విశేషణోభయపదకర్మధారయము :** 'ఆయీూ త్యాదిఘటితంబులు విశేషణోభయపదకర్మధారయంబులు' అని ప్రౌఢవ్యాకరణము ఇట్టిసమాసములను పేర్కొన్నది. పూర్వపదమును ఉత్తరపదమును విశేషణములే కావలయు ననుఅర్థమున గాక రెండు మొదలుగా అనేకము లగువిశేషణములు గలిగినకర్మధారయము విశేషణోభయపదకర్మధారయ మని అభిప్రాయము. ఆయానేరములు. కన్నెపెంచినవారు మొ॥

iv. **విశేష్యపూర్వపదకర్మధారయములు :** 'తమ్మిఁగుజ్జులు చిలుకమొలకరి యిత్యాదులు విశేష్యపూర్వపదకర్మధారయంబు**లు**' అని ప్రౌఢవ్యాకరణము. దీనిచే ఉత్తరపదముగా నుండువిశేష్యము పూర్వపదముగా మారును. కుజ్జులైనతమ్ములు. తమ్మిఁగుజ్జులు. విశేష్యము పూర్వపద మగుటవలన విశేషణ ముత్తరపద మగును. అందుచే దీనిని విశేషణోత్తరపదకర్మధారయము లనియు అందురు.

V. **ద్విగువు :** కర్మధారయమునందు పూర్వపద మొకవిశేష ణము సంఖ్యను బోధించుచో దానికే తెలుగున ద్విగుసమాసము అందురు. నలుగడలు, ముజ్జగములు. మొ॥

II. **వ్యధికరణసమాసములు :** ద్వితీయ మొదలగువిభక్తులు చివర గలిగినశబ్దములకు సామానపదములతో చేసినసమాసము వ్యధికరణ సమాసము. పూర్వోత్తరపదములఅర్థము వేరువస్తువులయందు ఉండును. నెలను తాల్చినవాడు- నెలతాల్పు. మాటయందలి నేర్పు- మాటనేర్పు మొ॥ వీనికి ద్వితీయాతత్పురుషము తృతీయాతత్పురుషము మున్నగువిధముగా తత్పురుషశబ్దముతో వాడుక గలదు. తెలుగున షష్ఠీతత్పురుషసమాసములు అనేకముగా కనబడును.

బహువ్రీహి :

అన్యపదార్థప్రధాన మగుసమాసము బహువ్రీహి. సమాసమునందున్నశబ్దములకంటె వేరైనయర్థము ప్రధానముగా కలిగినసమాసమునకు బహువ్రీహి అని పేరు. 'తెలుగున బహువ్రీహిసమాసము అరుదు. సాధారణముగా స్త్రీపదములకే ఈసమాస మేర్పడును ముక్కంటి, నలువ, మచ్చెకంటి మొ॥ ఇవి యాచ్ఛిక సమాసములు మాత్రమె అగును.

ద్వంద్వము :

ఉభయపదార్థప్రధానమైనసమాసము. ద్వంద్వము. ద్వంద్వ సమాసమునందలిపదములు రెంటింటియొక్క అర్థములు ప్రధాన మై యుండును. స్త్రీపద మగుశబ్దమునకు ఆచ్ఛికశబ్దముతో తెలుగున సాధారణముగా ద్వంద్వసమాస మేర్పడును. ఆలుబిడ్డలు, అన్నదమ్ములు- అరుదుగా అందచందములు అనుఇతర స్థలములు గలవు. తెలుగున నేర్పడుద్వంద్వసమాసము ఆచ్ఛికసమాసమె. ప్రౌఢ

వ్యాకర్త 'ఒకానొకచో ద్వంద్వంబు మిశ్రంబును అందలిపూర్వ పదంబు క్లీబసమంబునుగా కానంబడియెడి' అని చెప్పెను. అవసర మక్కఱలు అనుబక్క ప్రయోగము గలదు.

నీలోత్పలము,(సమానాధికరణ) రాజపురుషుండు. (వ్యధికరణము) పీతాంబరుండు (బహువ్రీహి) రామలక్ష్మణులు(ద్వంద్వము). అను తీరుగా సంస్కృతమున నేర్పడినసమాసములు అనగా సిద్ధసమాసము లెల్ల తెలుగున కవిప్రయోగానుసారముగా గ్రహింపవచ్చును.

## 52. ప్రౌఢవ్యాకర్త పేర్కొన్న సమాసవిశేషములు

తత్పురుషము, ద్వంద్వము, బహువ్రీహి అనుసమాసములను వానిలక్షణములతోను, భేదములతోను చిన్నయసూరి బాల వ్యాకరణమున వివరించెను. అందు స్పష్టము చేయబడని మఱికొన్ని సమాసవిశేషములను ప్రౌఢవ్యాకర్త ప్రస్తావించెను.

తత్పురుష భేద మయినకర్మధారయమున.

**బిరుదాద్యుత్తరపదకర్మధారయము** : 'కర్మధారయంబు బిరుదాద్యుత్తరపదం బయ్యె నేని ద్వ్యక్షరానంతస్త్రీపుంసంజ్ఞావాచకం బగుపూర్వపదంబునంత్యాక్షరంబున కంతట దీర్ఘంబు బహుళంబుగా నగు' మున్నగులక్షణముచే రామాశాస్త్రి, సుబ్బిసెట్టి, నన్నపార్యుడు మొ॥ బిరుదాద్యుత్తరపదకర్మధారయములు ప్రస్తావింపబడినవి. 'కర్మధారయం బియ్యది మిశ్రంబు సిద్ధసమాసం బట్ల యగు',

**విశేష్యపూర్వపదకర్మధారయము** : 'తమ్ముంగుజ్జులు చిలుకమొకరి యిత్యాదులు విశేష్యపూర్వపదకర్మధారయంబులు' విశేషణమునకు విశేష్యముతో నయినసమాసము కర్మధారయము. ఇందు

విశేషణము పూర్వపదముగను విశేష్యముత్తరపదముగను నుండును. అట్టిసమాసములలో కొన్నింటిలో విశేష్యము పూర్వపదమై విశేషణ ముత్తరపద మగును. కల్లలైనతెమ్మెలు. తమ్మిగుత్తులు. విశేష్యము పూర్వపద మగుటచే వీనిని విశేష్యపూర్వపదకర్మధారయము లని ప్రౌఢవ్యాకర్త పేర్కొనెను. ఇవియె విశేషణోత్తరపదకర్మధారయము లనియు వ్యవహరింపబడుచుండును.

**విశేషణోభయపదకర్మధారయము:** 'అయ్యాత్వాదిఘటితంబులు విశేషణోభయపదకర్మధారయంబులు' అ- ఈ-మున్నగు విశేషణము లొకటికంటె ఎక్కువ కూడి విశేష్యముతో సమాసము నందుట గలదు. ఆ యీ నేరములు- తెలినునుసోగవెన్నెలలు మొ॥ అనేక విశేషణము లున్నకర్మధారయమె విశేషణోభయపదకర్మధారయముగా ఈలక్షణముచే ప్రౌఢవ్యాకర్త చెప్పబూనెను. 'పూర్వోత్తర పదములు' రెండును విశేషణము లయినప్పుడే యీ పేరు తగు ననిపించెడిని.

**క్లీబసమమునకు ద్వంద్వము:** 'అచ్ఛికశబ్దంబులతోడ స్త్రీసమంబు ప్రాయికంబుగ ద్వంద్వం బగు' అనుసూరిలక్షణముచే ద్వంద్వము నందు పూర్వపదము స్త్రీసమమె కావలెను.

'ఒకానొకచో ద్వంద్వంబునం బూర్వపదంబు క్లీబసమంబు నగు. అగుచో నాముపర్ణకంబునను లోపంబు నగు' అని క్లీబసమము నకు సైతము ద్వంద్వ మగుటను ప్రౌఢవ్యాకర్త పేర్కొనెను. అందచందములు- నెచ్చపచ్చములు. సూరిసూత్రమునందలిప్రాయికశబ్దముచే నిట్టిఅరు దగుసమాసములను సంగ్రహించుకొనుట కవకాశ మున్నను, ప్రౌఢవ్యాకరణము స్పష్టము చేయుట మేలె.

**మిశ్రద్వంద్వము :** 'ఒకానొకచో ద్వంద్వంబు మిశ్రంబును అంగాలిపూర్వకపదంబు క్లీబపదంబునుగఁ గానంబడియెడి'. అని ప్రౌఢవ్యాకర్త ద్వంద్వములో మిశ్రసమాసములను బాలవ్యాకరణముకంటె విశేషముగా ప్రతిపాదించెను. అవయవముక్కాలు. ఇట్టి ప్రయోగమింకొక్కటి గానరాదు. ఇదియు 'ముక్కోటి సామి' అనుసందర్భమునం దుండి యట్టిదిగా గ్రహింపఁదగియుండుట గమనింపవలెను.

**నవర్ణకాలుక్సమాసము :** 'చేత-కోడ-వలన-అంను' అలుక్సమాసములను బాలవ్యాకరణము సంస్కృతశేషమున జూపినది. 'కొన్నియెడల సప్తమీతత్పురుషమునందు నవర్ణకంబు నగు' అని ప్రౌఢవ్యాకర్త సప్తమీనవర్ణకము లోపింపనిసమాసములను మార్గాంతరమున పేర్కొనెను. కువలయంబునవాడు, మొ॥

**లుగలుక్సమాసములు :** అల్లు, కరణి, పోలె, బలె, వలె మొ॥ ఇవార్థకములతోను, 'అట్టి, పోని, బోటి, వంటి' అనువదర్థకములతోను లుగలుక్సమాసములను ప్రౌఢవ్యాకర్త విశేషముగ ప్రస్తావించెను. నారాయణునట్లు- నన్నువంటి మొ॥ (చూ. పట్టిక 165 పేజీ)

## 53. తద్ధితములు

**తద్ధితము :** తద్ధితము అనుమాటను (తస్మై=ప్రయోగాయ, హితమ్) ప్రయోగించుటకు హితమైనది అని అర్థము చెప్పుదురు. స్వార్థము, మత్వర్థము మొదలగుఅర్థములలో ప్రాతిపదికలు ప్రథమాంతములు మొదలగుశబ్దములపై చేరుప్రత్యయములు తద్ధితములు. బాలప్రౌఢవ్యాకర్తలు పేర్కొన్న తద్ధితము లిట్లు గుర్తింపనగును.

**త్వార్థము :** 'త్వ' అనుసంస్కృతప్రత్యయముయొక్క అర్థము

ఉపమేయము ప్రథమాంత మయినపుడు-

| ఇవార్థకములు | పదర్థకము | నామ | తద్ | అస్మద్ | యుష్మద్ | ఆత్మ |
|---|---|---|---|---|---|---|
| అట్లు | అట్టి | షష్ఠి | షష్ఠి | షష్ఠి | షష్ఠి | షష్ఠి |
| కరణి మొ॥ | | | | | | |
| | | 1. నారాయణునట్లు | వానియట్లు | నాయట్లు | నీయట్లు | తనయట్లు |
| | | రామునియట్టి | వానియట్టి | నాయట్టి | నీయట్టి | తనయట్టి |
| పోలె, బలె | పోని | ప్రథమ | ప్రథమ | ద్వితీయ | ద్వితీయ | ద్వితీయ |
| | | పేదపోలె | వాడువోలె | నన్నుబోలె | నిన్నుబోలె | తన్నుబోలె |
| | | వేల్పుబలె | వాడుబలె | నన్నుబలె | నిన్నుబలె | తన్నుబలె |
| | | సురకన్యవోని | వాడువోని | నన్నుబోని | నిన్నుబోని | తన్నుబోని |
| వలె | బోటి, వంటి | షష్ఠి | షష్ఠి | షష్ఠి/ద్వితీయ | షష్ఠి/ద్వితీయ | షష్ఠి |
| | | రామునివలె | వానివలె | నావలె/నన్నువలె | నీవలె/నిన్నువలె | తనవలె/ (తన్నువలెఇట ద్వితీయయు) |
| | | రామునిబోటి | వానిబోటి | నాబోటి నను‌బోటి | నీబోటి నినుబోటి | తనబోటి |
| | | రామునివంటి | వానివంటి | నావంటి నమవంటి | నీవంటి/నినువంటి | తనవంటి |

ఉపమేయము ద్వితీయాద్యంత మయినపుడు ఉపమాన విభక్తియె యగును, వీరులంబోలె మమ్ము- మొ॥

త్వార్థము. అనగా భావార్థము. ప్రకృతిజన్యబోధంబునందు ప్రకారంబు భావంబు.

| | శబ్దములు | ప్రత్యయము | తద్ధితాంతము |
|---|---|---|---|
| బాల. | అన్నిశబ్దములకు | తన | రామునితనము |
| | చిన్న మొదలగునవి | తిక | చిన్నతికము |
| | పేరు మున్నగునవి | ఇమి | పేరిమి |
| | నల్లాదులు | న | నల్లన |
| | అగ్గలప్రభృతులు | ఇక | అగ్గలిక |
| | మగ- మొ॥ | టిమిఁ- మొ॥ | మగఁటిమి, మొ॥ |
| ప్రౌఢ. | నాయఁక | ర | నాయఁకరము |
| | చెలి, నయము | కార | చెలికారము, నయగారము |

స్వార్థము : ప్రాతిపదికలకు అదేయర్థ (స్వ+అర్థ) మునందు కొన్ని ప్రత్యయము లగును.

| | | | |
|---|---|---|---|
| బాల. | అరమరాదులు | ఇక | అరమరిక |
| | చిఱుత, మొ॥ | ఉక | చిఱుతుక |
| | కొన్నిశబ్దములకు, | | |
| | పుంస్త్వమున | కాఁ | చెలికాఁడు |
| | ,, స్త్రీత్వమున | కత్తియ | చెలికత్తియ |
| | ,, పుంస్త్వమున | ఈ | కల్లరీఁడు |
| ప్రౌఢ. | వేఱు | అడ | వేఱడము |
| | వెల్ల | అడి | వెల్లడి |
| | తెలివి మొద లగునవి | ఇడి | తెలివిడి |
| | ఇంపు మొ॥ | ఇత | ఇంపితము |
| | ఒప్పు మొ॥ | ఇద | ఒప్పిదము |
| | వాఁపు | ఇరి | వాఁపిరి |

| | | |
|---|---|---|
| సుడి, కోలత | కార | సుడికారము, కోలగారము |
| చలి | మిరి | చలిమిరి |

**మతుబర్థము :-** మతుప్ అను సంస్కృత ప్రత్యయము యొక్క అర్థము (కల) నందు వచ్చు ప్రత్యయములు మతుబర్థకములు.

| | | |
|---|---|---|
| ఆట మొ॥ పుంస్త్వమున | కాఁ- | ఆటకాఁడు |
| అటమటము మొ॥ " | ఈఁ- | అటమటీఁడు |
| పగలు మొ॥ " | అ- | పగవాఁడు |
| ఆటాదులకు స్త్రీత్వమున | కత్తియ- | ఆటకత్తియ |
| కులవాచకములకు " | త- | కోఱవత |
| పగలు, మొ॥ | ఆఁడి- | పగలాఁడి |
| పెండ్లి | అము | పెండ్లము |
| అడపము | అ | అడప |
| జాల మొద లగువానికి | అరి - | జాలరి |
| ఓయారము " | ఇ - | ఓయారి |
| కొన్ని యెడల తిర్యగ్వాచకములకు | కాఁ | కొమ్మకాఁడు |
| అభావమున ముక్కు మొ॥ | ఇఁడి | ముక్కిఁడి |
| ప్రౌఢ. చెవుగు మొ॥ పుంస్త్వమున | అ | చెవుగఁడు |
| క్రొవ్వు బెట్టు | ఇద | క్రొవ్విదము |
| కొన్ని యెడల అరుదుగా | న | దివ్యతేజంబున వాఁడు |

**మానార్థము :**

| | | |
|---|---|---|
| బాల. పరిమాణవాచకములకు | ఎఁడు | మానెఁడు |

దఘ్నార్థము :

| | | |
|---|---|---|
| బాల. కొన్ని శబ్దములకు | బంటి | మోఁకాలిబంటి |
| " | కోలఁది | మోఁకాలికోలఁది |

**ప్రాచుర్యార్థము :**

| | | |
|---|---|---|
| ప్రౌఢ. కవిప్రయోగానుగుణముగా మయట్ | | తనమయము |

**తాచ్ఛీల్యార్థము :**

| | | |
|---|---|---|
| బాల. కొన్నిశబ్దములకు | మారి | మంటమారి |
| ,, | పోతు | తిండిపోతు |

## 54. సంస్కృతధాతువులు తత్సమము లగుపద్ధతి

**ధాతువులు :-** సంస్కృతమున 'భూ' మొద లగువానికి ధాతువు లని పేరు. ఇట్లె తెలుగున 'వండు' మొదలగువానికిని ధాతుసంజ్ఞ కలదు. నామములవలె ధాతువులు సయితము సంస్కృతమునుండి తెలుగులోనికి ప్రవేశించుచున్నవి. ఈ సంస్కృత ధాతువులనుండి ఏర్పడుక్రియాపదములే తత్సమక్రియలు.

**ప్వాదులు :-** 'అగతికంబు లగుప్వాదుల కిందు యోగంబు లేదు'. ప్ర, పరా, మొద లగు 'గతి' సంజ్ఞ గలిగినశబ్దములు పూర్వము నందు కలిగియున్నపుడు మాత్రమే భూ మొద లగుకొన్నిసంస్కృత ధాతువులు తెలుగులోనికి ప్రవేశించును. ప్రభవించెను, సాక్షాత్కరించెను మొ॥ ప్ర, ప రా, మొద లగునవి లేనిచో ఇవి తెలుగులో ప్రయోగింపబడవు. భవించెను, కరించెను, మొదలగు రీతి నుండవు.

ఇచ్చటి భూ మొద లగువానిలో పేర్కొనబడనిసంస్కృత ధాతువులు మరికొన్ని మాత్రము ప్ర మొద లగునవి కలిగి యున్నను లేకున్నను తత్సమముగా తెలుగులో ప్రయోగింపబడును. హరించెను ప్రహరించెను మొ॥.

ఇట్లు తెలుగులోనికి చేరునపుడు సంస్కృతధాతువులు పెక్కు మార్పులు పొంది తత్సమము లగును. ఆ మార్పులను ఇట్లు గమనింపవచ్చును.

**1. ఇంచుగాగమము :-** 'సంస్కృతంబున కంగరాదుల కించుక్కగు'. సంస్కృతమునుండి తెలుగులోనికి ప్రవేశించుధాతువులు

అన్నింటికిని చివర స్వార్థమునందు 'ఇంచు' అను ఆగమము వచ్చును. క్రియావిభక్తులు మున్నగునవి ఈ ఇంచుగాగమముపైన చేరును. భుజ్+ఇంచు భుజించు భుజించెను, భుజించుట మొ॥ 'ఇంచు' లేకుండ సంస్కృతధాతువు తెలుగులో ప్రయోగింపబడదు. భుజెను అనురీతి నుండదు. 'సిద్ధ నామంబుల కయుగాగమంబు గలుగదు' అను సూత్ర జ్ఞాపనముచే కొన్ని నామములను ధాతువులుగా వివక్షించునపుడు 'ఇంచు' అనునది ఆగమముగా వచ్చును. కరుణ - కరుణించు మొ॥

**2. గుణము :** 'సంస్కృతంబునకు లఘూపధంబునకించుక్కు పరంబగునపుడు గుణంబగు'. ఇంచుగాగమము పరముగా ఉన్నపుడు సంస్కృతధాతువులో ఉపధగా ఉన్న ఇ, ఉ, ఋ అనువానిస్థానము నందు వరుసగా ఏ, ఓ, అర్ అనునవి ఆదేశములుగా వచ్చును. భిద్+ఇంచు- భేదించు, కుప్+ఇంచు=కోపించు, వృష్+ఇంచు- వర్షించు

'స్పృశికి గుణంబు విభాష నగు'- స్పృశ్ అనుధాతువునకు గుణము వికల్పముగా వచ్చును. స్పర్శించు-స్పృశించు.

'సృజికి నిర్మితిని గుణంబు లేదు' నిర్మాణార్థమునందు సృజ్ ధాతువునకు గుణము రాదు. సృజించు, విసృజించు మొదలగు ఇతరార్థములలో గుణము వచ్చును- విసర్జించు.

'లిఖభుజరుచకృశంబులకు గుణంబు లేదు' లిఖ్ మొదలగు ఈ ధాతువులకు గుణము అసలు రాదు. లిఖించు మొ॥ కుచ్ అను ధాతువునకు గూడ గుణము రాదని అహోబలుడు అనులాంఛనకొరకు పేర్కొనెను. కాని అది సరి కాదు. సంకోచించు.

**3. అయుక్ - అవుక్ - అరుక్ - ఆగమములు :** 'ఇఉఋల కించుక్కు పరంబగునపుడయుగవుగరుక్కు లగు' i. ఇంచుక్కు పరముగా ఉన్నపుడు- సంస్కృతధాతువు చివర నున్న ఇకారమునకు అయ్ అనునది ఆగమముగా వచ్చును. జి + ఇంచు - జయించు.

ii. ఉకారమునకు అవ్ అనునది ఆగమ మగును. ప్రభూ + ఇంచు ప్రభవించు. iii. ఋకారమునకు అర్ అనునది ఆగమ మగును. తౄ+ఇంచు-తరించు, మొ॥

'నిర్జి నామంబుల కయుగాగమంబు గలుగదు' నిర్జికిని, నామ ధాతువులకును అయుగాగమము రాదు. నిర్జి + ఇంచు = నిర్జించు, నుతి+ఇంచు- నుతించు మొ॥

**4. ఇయుడాగమము :** 'గురువిరహితంబు లయి యయాంతంబు లయిన యేకస్వరద్విస్వరంబులయించుగ్వర్ణకంబుల కి యుడాగమంబు విభాష నగు' పయిలక్షణములు గలసంస్కృతధాతువులకు పయి నున్న 'ఇంచు'నకు పూర్వమునందు 'ఇయ్' అనునది ఆగమ ముగా వికల్పముగా వచ్చును.

భుజ్ + ఇంచు- భుజియించు- ఇయుడాగమము రానిపక్షము నందు భుజించు.

**5. ద్విరుక్తలకారము :** 'రంజాదులయించుక్చ్కారంబునకు సబిందుకంబున కప్రేరణంబున ద్విరుక్తలకారం బగు' రంజ్ మొదలగు ధాతువులకు పైనున్న 'ఇంచు' అనుదానిలోని 'ంచ్' అనుభాగమునకు 'ల్లు' అనునది ఆదేశ మగును. రంజ్ + ఇంచు - రంజిల్లు- ఇచట ద్విరుక్తమునం దొకలకారము లోపించుట గలదు. రంజిలు.

**ప్రేరణమున ఇంచుక్కు:** 'సర్వంబునకుం బ్రేరణంబునందించుకగు' సంస్కృతధాతువులమీఁద స్వార్థమునందు వచ్చినఇంచుగాగ మముపై ప్రేరణార్థమునం దింకొకయించుగాగమము వచ్చును. భుజించు+ఇంచు- భుజింపించు మొ॥ రంజ్ మొద లగువానిపై ప్రేరణార్థమునందు వచ్చినఇంచుక్కు పర మైనప్పుడు స్వార్థమునందు వచ్చిన మొదటియించుక్కు లోపించును. రంజించు.

ఇట్లేర్పడినధాతురూపములపై లకారాదికార్యము లయి తత్సమ క్రియాపదములు సిద్ధించును. భుజించుచున్నాఁడు. భుజించుట మొ॥

## 55. ధాతుజవిశేషణములు

**ధాతుజవిశేషణము :** విశేష్యమునందలివిశేషమును దెల్పునది విశేషణము. ధాతువునుండి ఏర్పడినవిశేషణములు ధాతుజవిశేషణములు. వీనిని ప్రౌఢవ్యాకర్త క్రియాజన్యవిశేషణములు అనియు వ్యవహరించెను. ఈవిధము లయినవిశేషణములలోను 'క్రియాప్రయుక్తవిశేషణము' అని పేర్కొనబడినది ధాతుజవిశేషణమె.

సంస్కృతములును, ఆచ్ఛికములును అయినధాతువులు అన్నింటి నుండి ఏడువిధములుగా విశేషణరూపములు ఏర్పడును.

**1. తద్ధర్మా(ద్య)ర్థకములు :** 'తృవర్ణకార్థంబునం దెడియెడు వన్నియు లగు'. 'తృచ్' అనుసంస్కృతప్రత్యయముయొక్క అర్థములో తెలుగున ఎడి, ఎడు అనుప్రత్యయములు రెండు వచ్చును. 1) పఠించు + ఎడి - పఠించెడు, 2) వండు + ఎడు - వండెడు.

ధాతువుపై చేరు ఎడి మొద లగు ఈప్రత్యయములు కృత్తులు. కాన నివి యంతమందు కలిగి (పఠించెడు మొ॥)నవి (కృత్తద్ధితసమాసాశ్చ) ప్రాతిపదిక లగును. ప్రాతిపదికత్వమువలన వీనిపై ప్రథమ మొద లగువిభక్తులు చేరును. "ధాతుజవిశేషణంబులకు విభక్తి వివక్షించునపుడు తచ్ఛబ్దం బనుప్రయుక్తం బగు' అనుసూత్రముచే ధాతుజవిశేషణములపై తచ్ఛబ్దము (అ)చేరును. మహత్తు అయినచో పఠించెడువాఁడు. అమహత్తయినచో పఠించెడునది. మొ॥ ఇట్లే యితరవిభక్తులలో పఠించువానిని, వండుదానికొఱకు మొ॥

'వాసికి లోపంబు బహుళంబుగా నగు' తద్ధర్మా(ద్య)ర్థము లందు వచ్చిన ఎడి,ఎడు అనుప్రత్యయములకు బహుళముగా లోపమును

వచ్చును. పఠించు- పఠించువాఁడు. వండు-వండునది. మొ॥ (కల) కలుగు అను ధాతువుపై, ఎడి,ఎడు అనువానికి లోపము నిత్యముగా వచ్చును. కలవాఁడు, కలుగునది మొ॥

ఇట్లు తద్ధర్మా(ద్య)ర్థకధాతుజవిశేషణము, ఎడి, ఎడు, వాని లోపము అను కార్యములతో మూఁడువిధము లయినరూపములతో ఉండును.

**2.** భవచ్ఛత్రర్థకము : 'ఉన్నకలజినవర్ణకంబులు భవద్భావి శతృక్తవదర్థంబులం దగు' వర్తమానార్థకశత్రర్థమునందు ధాతువుపై ఉన్న అనుప్రత్యయము వచ్చును. పఠించు+ఉన్న- పఠించుచున్న వాఁడు. వండుచున్నయది మొ॥

**3.** భావిశత్రర్థకము : 'ఉన్నకలజి'- అనుపయిసూత్రముచే భవిష్యదర్థకశత్రర్థమునందు 'కలజి' అనుప్రత్యయము వచ్చును. పఠించు+కల-పఠింపఁగలవాఁడు, వండు+కల- వండఁగలయది మొ॥

**4.** క్తవదర్థకము : 'క్తవత్' అనుసంస్కృతప్రత్యయము యొక్క అర్థమునం దనగా భూతార్థమునందు- 'ఉన్న కలజి'- అను పయిసూత్రముచే 'న' అనుప్రత్యయము వచ్చును.
పఠించు+న- పఠించినవాఁడు మొ॥

**5.** వ్యతిరేకతద్ధర్మా(ద్య)ర్థకము : 'వ్యతిరేకశతృవర్ణకార్థంబున నికి యగు' వ్యతిరేకార్థముతో కూడినతద్ధర్మా(ద్య)ర్థమునందు ని(జి) అనుప్రత్యయము వచ్చును. పఠించు+ని- పఠింపనివాఁడు మొ॥

ఇట్లు, 1. ఎడి, 2. ఎడు, 3. వానిలోపము, 4. ఉన్న, 5. కల, 6. న, 7. ని అనువానితో ఎల్లధాతువులనుండి విశేషణరూపములు ఏడు సాధారణముగా ఏర్పడును.

## 56. ధాతువున చకారమునకు పకారము వచ్చుస్థలములు



మధ్యమపురుష లగు ము, మజ్, అనువనియు, జివర్ణము ఇత్తుగా గలిగినవి మొదలగునవి పరముగా నున్నపుడు ధాతువునకు చివర ఉన్న చకారమునకు పకారము వచ్చుట గలదు. అట్టిస్థలములను బాలప్రౌఢవ్యాకరణములు ఇట్లు పేర్కొన్నవి

**1. ఆగమచకారము-ముత్పరకపత్వము :** 'ఆగమాస్యచకారంబుల కద్విరుక్తంబులకు ముత్తు పరం బగునపుడు పవ లగు'- ఆగమముగా వచ్చిచేరినచకారమునకు ముత్తు పర మయినపుడు పత్వము వచ్చును. పచించు-పచింపుము, అడంచు-అడపుము.

ఆగమముగా వచ్చినది కాక, ధాతువుతుదిని సహజముగా నున్నచకారమునకు ముత్తు పర మయినపుడు వకారము వచ్చును. పిలుచు-పిలువుము మొ॥ హెచ్చు, మెచ్చు- ఇత్యాదిగా ద్విరుక్తమగుచకార మట్లే యుండును. హెచ్చక- మెచ్చుము- మొ॥

విఱువుము మొ॥ కొన్నిచోట్ల ఆగమముగా వచ్చిన చకారమునకును వకారము వచ్చుట కన్పించుచున్నది.

**2. దుక్పరకపత్వము:** ఆగమచకారంబునకు, నెఱసున్న మీఁది దానికి దుక్కు పరం బగునపుడు పకారంబు విభాష నగు' దుగాగమము పరముగా నున్నపుడు ముందరి నిండుసున్నపై నున్నదియు, ఆగమముగా వచ్చినదియు నయినచకారమునకు వికల్పముగా పకారము వచ్చును. పచించు+ దురు- పచింపుదురు. ఇట్లే చింపుదురు మొ॥ పకారము రానిపక్షమునందు 'మవర్ణంబుతోడ దుగ్గకారంబు తకారం బగు' అనులక్షణము ననుసరించి తకారము వచ్చును. పచింతురు, చింతురు.

**3. శత్రర్థ(ము)పరకపత్వము:** ప్రౌఢవ్యాకరణము 'పకారంబు కొన్నియెడల శత్రర్థపరకచువర్ణకంబునకుం గానంబడియెడి' అని పేర్కొన్నది. శత్రర్థమునందు వచ్చిన 'చు' ప్రత్యయము పరముగా

ఉన్నపుడు ధాతువుతుది నున్న చకారమునకు పకారము వచ్చుట కవిప్రయోగములనుండి గ్రహింపవలెను. గర్జించు + చు-గర్జింపుచు, చేరుపుచు మొ॥

**4. సిద్ధకచకారము - ముత్పరకపత్వము :** ఖండించువుమీంది సిద్ధచకారంబునకు ముత్తు పరం బగునపుడు పకారంబు ప్రాయికంబుగ నగు' ముత్తు పర మైనపుడు అచ్చికధాతువులలో అరసున్న మీాద నున్నచకారమునకు పకారము తఱచుగా వచ్చును. తలంచు-తలంపుము, తలంపక మొ॥

'ఏంచు' అనుధాతువునందలి చకారమునకు పకారము, వికల్పముగా వచ్చును. ఏంచుము - ఏంపుము మొ॥

'నోంచు' అనుధాతువునందలి చకారమునకు పకారము రాదు. నోంచుము.

**5. ప్రేరణేంచుత్పరకపత్వము :** ప్రేరణార్థమునందు వచ్చిన ఇంచుకు పరముగా ఉన్నపుడు ధాతువుతుదినున్న ఆగమ మయిన దియి, సహజముగా నున్నదియు అయిన చకారమునకు పకారము వచ్చును. పచించు + ఇంచు - పచింపించు, పిలుచు + ఇంచు - పిలిపించు మొ॥

ద్విరుక్త మగుచకారమునకు పకారమును ద్విరుక్త మయియే వచ్చును. తెచ్చు-తెప్పించు. ఇచ్చు-ఇప్పించు మొ॥ మెచ్చుధాతువు లోనిచకారమునకు ఈ పత్వము వికల్పముగా వచ్చును. మెచ్చు + ఇంచు-మెప్పించు, మెచ్చించు. హెచ్చు అనుధాతువులోనిచకారము నకు పకారము రాదు. హెచ్చు + ఇంచు-హెచ్చించు.

**పత్వాభావము :** ప్రౌఢవ్యాకరణము 'కవిత్రయేతరప్రయో గంబులం గొన్నియెడల నిప్రత్యయాదులు పరంబు లగునపుడు పకారం బించుక్కాకారంబున కేనిం గానంబడదు' - అని ముత్పరకత

యందును పత్వము రాకుండుటను జేర్కొన్నది. పోరించనిక్షణము, తీర్చుము మొ॥

## 57. ప్రేరణార్థము - ఆగమములు

ప్రేరణార్థమునందు ధాతువులకు ఇంచుక్, చుక్, పుక్- అనునవి ఆగమములుగా వచ్చును.

I. **ఇంచుగాగమము :** సర్వంబునకుం బ్రేరణంబునం దించుక్కగు' తత్సమములును, ఆచ్ఛికములు నయిన అన్ని ధాతువులకును ప్రేరణార్థమునందు 'ఇంచు' అను ఆగమము వచ్చును. భుజించు-భుజింపించు, వండు-వండించు మొ॥

II. **చుగాగమము :** చుగాగమమును, పుగాగమమును ఆచ్ఛిక ధాతువులకు మాత్రమె అగును.

1. చుగాగమం బాచ్ఛికంబున కసంయుక్తనలడరాంతంబునకుం బ్రేరణంబున బహుళంబుగా నగు' ను, లు, డు, రు అను వర్ణములు చివర కలిగిన ఆచ్ఛికధాతువులకు ప్రేరణార్థమున చు(క్) ఆగమ మగును. పూనుచు, తేలుచు, మగుడుచు, కుదురుచు మొ॥ చుగాగమము రాని పక్షమునందు ఇంచుక్కు వచ్చును. పూనించు మొ॥ అను మొదలగు ధాతువులకు ఈచుగాగమ మసలు రాదు. అనిపించు, వినిపించు మొ॥

2. 'పడునకుం జుక్కును డా కలఘురేఫంబు నగు' పడుధాతువునకు చుగాగమ మొక్కటి వచ్చును. పఱచు. దీని కించుగాగమము లేదు కావున పడించు అని కాదు.

'శబ్దపల్లవం బగుపడున కించుక్కు విభాష నగు నగుచో డాకు లఘురేఫంబు నగు' శబ్దపల్లవ మయిన పడుధాతువునకు, ఇంచుగాగమమును, చుగాగమమును వచ్చును. వెలుపడు + ఇంచు వెలుపరించు వెలుపడు + చు వెలువఱచు.

3. 'అట్లు చుక్పుగాగమంబు లడంగ్వాదిమాయ్యాదుల కగు నగుచో వానికడ్రవాలు లోపించు' అడఁగు మొదలగుధాతువులకు చుగాగమము బహుళముగా అడఁగు+చు వచ్చును. - అడఁచు మొ॥ చుగాగమము రాని పక్షమునందు ఇంచుక్ వచ్చును. అడఁగించు.

III. **పుగాగమము** : 1. పూర్వసూత్రముచే మాయు మొదలగుధాతువులకు ప్రేరణార్థమున పుక్ అనుఆగమము వచ్చును. మాయు - పు - మాపు మొ॥ పుగాగమము రానిపక్షమునందు ఇంచుగాగమము వచ్చును. మాయించు.

ఆఁగు మొదలగునవి మాయ్యాదులలోను అడంగ్వాదులలోను గలవు కావున పుక్, చుక్ ఆగమములు రెండును వచ్చును. ఆఁచు, ఆఁపు-ఇవి రెండును రానిపక్షమునందు ఇంచుక్కు వచ్చును. ఆఁగించు.

2. అట్లు పుగాగమంబు మాన్వాదుల కగు' మాను మొదలగు ధాతువులకు 'పుక్' అను ఆగమము బహుళముగా వచ్చును. మానుపు-పుగాగమము రాని పక్షమునందు చు-ఇంచు ఆగమములు వచ్చును. మానుచు, మానించు. మనుధాతువునకు. పుగాగమ చుగాగమము లగును. మనుపు-మనుచు. ఇంచుగాగమము రాదు. కావున మనించు అని యుండదు.

3. 'చెఱుపకుం జుక్పుగాగమంబులును డా కలఘురేఫంబు నగు' చెఱు అనుధాతువునకు చుక్, పుక్ ఆగమములు రెండును వచ్చును. చెఱుచు, చెఱుపు. దీనికి ఇంచుగాగమము రాదు కావున చెఱించు అని కాదు.

**చుక్పుక్కులపై ఇంచుక్కు** : 'ప్రేరణంబునం దించుక్కుపై నించుక్కు లేదు' ప్రేరణార్థమునందు వచ్చిన ఇంచుగాగమముపై మరల (ప్రేరణార్థవివక్షయు) ఇంచుగాగమము రాదు. (భుజింపించు+ఇంచు) భుజింపించు, (వండించు+ఇంచు) వండింపించు అనురీతిరూపము

లుండవు. కాని చుగాగమముపైని, పుగాగమముపైని ప్రేరణార్థమును వివక్షించినచో ఇంచుక్కు వచ్చును. ప్రానుధాతువుపై ప్రేరణమున చుగాగమము వచ్చి, ప్రానుచు. దీనిపై ప్రేరణమున 'సర్వంబునకుం బ్రేరణంబున' అని ఇంచుక్కు వచ్చి ప్రానుచు+ఇంచు-ప్రానిపించు. చచ్చు ధాతువుపై ప్రేరణమున పుగాగమము వచ్చి (చచ్చు+పు) చంపు. దీనిపై ఇంచుక్కు వచ్చి చంపించు. ఈ ఇంచుక్కుపై ఇంచుక్కు లేదు కావున ప్రానిపింపించు, చంపింపించు అని కాదు. ప్రేరణార్థమున ఇంచుక్కు రాగా దానిపై చుక్పుక్కులకు ప్రాప్తియే లేదు. భుజింపించుపు, వండించుచు అను విధముగా కావు.

IV. **చేయు యోగము** : అన్నంతక్రియ చేయుయోగంబునం బ్రేరణార్థకం బగు' అని ప్రౌఢవ్యాకరణము పేర్కొన్నది. కొన్ని యెడల నుజీ చివర కలిగిన ధాతువుపై ప్రేరణార్థమున చేయుధాతువు వచ్చిచేరును. వండు-వండఁజేయు = వండించు. భుజించు-భుజింపఁజేయు = భుజింపించు మొ॥ 'చను' అనుధాతువునకు ఇంచుక్, చుక్, పుక్ అనుఆగమములు మూడును రావు. నుజ్యంతమై చేయుధాతువు చేరుటవలనని 'చను' ధాతువునయి ప్రేరణార్థము సిద్ధించును. చనఁజేయు-(పఁపు.)

## 58. ప్రేరణార్థకాగమములు-ధాతువువర మార్పులు

**ప్రేరణార్థకాగమములు** : సంస్కృత (సమ) ధాతువులకు ప్రేరణార్థమునందు 'ఇంచు' ఆగమ మగును. అచ్ఛికధాతువులకు ఇంచు, చు, పు అనుఆగమము లగును. ఈఆగమములు పరము లగునపుడు పూర్వమునందలిధాతువునకు చివర వర్ణవికారము లనేకవిధములుగా గానవచ్చును. అట్టివికారములు దేశ్యధాతువులం దెక్కువ. ఆగమ-ఆదేశ-లోప-రూపములుగా నున్న ఈవర్ణవికారము లను ఇట్లు గుర్తింపదగును..

i. **పుగాగమము** : 'అన్వాదుల కించుక్కు పరం బగునపుడు పుగాగమం బగు మాను నకు విభాష నగు' ప్రేరణమునం దయిన ఇంచుక్కు పర మగునపుడు అను-కను-తెను-తిను-అను ధాతువులకు నిత్యముగాను, 'మాను' ధాతువునకు వికల్పముగాను 'పు' గాగమము వచ్చును అను+ఇంచు అనిపించు. మానిపించు-మానించు మొ॥ కను ధాతువునకు మొదట దీర్ఘమును వికల్పముగా వచ్చును. కానిపించు, కనిపించు.

ii. **గుగాగమము** : 'అడ్డాదుల కించుక్కు పరం బగునపుడు గుగాగమం బగు నప్పాదులకు విభాష నగు' ప్రేరణార్థక మగు ఇంచుక్కు పర మగునపుడు అడ్డ మొదలగు ధాతువులకు గుగాగమము నిత్యముగా వచ్చును. అడ్డ + ఇంచు = మొ॥ 'అప్పడిప్ప-పల్లము, కోపము-అ వానికి గుగాగమము వికల్పముగా వచ్చును. అప్పగించు-అప్పించు మొ॥

iii. **ఇత్త్వమునకు ఉత్త్వము** : 'చుక్కుప్వర్ణంబులు పరంబులగునపు డిత్వంబున కుత్వం బగు' ప్రేరణార్థమునందు వచ్చు చుక్-పుక్ అను ఆగమములు పర మగునపుడు పూర్వమునందలి ఇత్త్వమునకు ఉత్త్వము వచ్చును. బిగియు+చు=బిగుచు, తెలియు+పు తెలుపు.

iv. **డకారము - లఘురేఫము** : 'అనోదుకూడుల డకారంబునకుం జుక్కు పరం బగునపుడు రేఫం బగు' చుగాగమము పర మగుచుండగా అడు ఓడు-కూడు అనుధాతువులందలి తుదిడకారము స్థానమున లఘురేఫము ఆదేశ మగును. అడు+చు-అరుచు మొ॥

'శబ్దపల్లవం బగుపదమున కించుక్కు విభాష నగు నగుచో దానికి లఘురేఫం బగు'. శబ్దపల్లవ మయినపదమునకు ఇంచుక్కు పర మగు నపుడు డకారమునకు లఘురేఫ మగును. వెలునడు + ఇంచు వెలువరించు. (వెలువడుచు)

V. **దకారము-అలఘురేఫము :** 'చెదునకుం జుక్పుగాగమంబులందు దా కలఘురేఫంబు నగు' చెదు అనుధాతువునకు ప్రేరణమునందు చు, పు ఆగమములు రాగా పూర్వమునం దున్న దకారమునకు అలఘురేఫము వచ్చును. చెదు = చెఱుచు-చెఱుపు. 'పదునకుం జుక్కునందు దా కలఘురేఫంబు నగు' పదు ధాతువునకు చుగాగమమును దకారమునకు అలఘురేఫమును వచ్చును. పఱచు.

vi. **చకారము-పకారము :** 'ప్రేరణేంచుక్కు పరం బగునపుడు పకారంబు చకారంబున కగు' ప్రేరణార్థక మగు ఇంచుక్కు పర మగుచుండగా పూర్వమునం దున్న ధాతువు తుది చకారమునకు పకార దేశ మగును. పిలుచు - పిలిపించు, వలచు - వలపించు. ఇది సంస్కృత(సమ)ధాతువులందును గలదు. పచించు-పచింపించు మొ॥

vii. **కడవ్రాల లోపము :** 'అల్లు చుక్పుగాగమంబు లడంగ్వాది మాయ్వాదుల కగు నగుచో వానికడవ్రాలు బహుళంబుగ లోపించు' ప్రేరణమున చుగాగమము పర మగు చుండగా అడఁగు మొద లగు ధాతువులలో చివరిఅక్షరము లోపించును. అడగు-అడచు. కలగు-కలచు మొ॥ ఇట్లే ప్రేరణార్థమున వచ్చుపుగాగమము పర మగు చుండగా మాయు మొద లగు ధాతువులలో చివరిఅక్షరము లోపించును. మాయు-మాపు, తెలియు-తెలుపు మొ॥

viii. **ఇంచులోపము :** 'ఇంచుక్కు పరం బగునపుడు రంజాదులయించుక్కునకు లోపం బగు' ప్రేరణార్థమం దయినఇంచు పర మగుచుండగా రంజ్ మొదలగు (సంస్కృత) ధాతువులకు స్వార్థమునందు వచ్చినఇంచుక్కు లోపించును. రంజ్ + ఇంచు + ఇంచు రంజించు మొ॥

ix. **బహువిధ వర్ణవికారములు :** 'ఇంచుక్చుక్పుగాగమంబులు పరంబు లగునపు డాగమాదేశలోపంబులు పెక్కుతెఱంగులం గానంబడియెడి' ప్రేరణార్థమునందు వచ్చు ఇంచు, చు, పు - అను

ఆగమములు పర మగునపుడు ఆచ్ఛికధాతువులకు ఆగమములు, ఆదేశములు, లోపములు అనేకవిధములుగా నగుచున్నవి.

1. ఆదేశము : విన్నపము - విన్నవించు. పకారమునకు వాదేశము
మొగుడు - మోడుచు. మొగు - 'మో' ఆదేశము
కొను - కొలుపు - నకారమునకు లాదేశము
2. ఆగమము : పలవ - పలవరించు - రేఫ మాగమము
3. లోపము : ఉండు - ఉంచు డులోపము
నిలుచు - నిలుపు చులోపము

ఇట్లు వచ్చు - రావించు - రప్పించు, పోవు - పుచ్చు, పంపు మొదలగువాట్ల ప్రేరణార్థకాగమములు పరము లగునపుడు ఆగమాదేశలోపములు అనేకవిధములుగా నుండుట లక్ష్యములనుబట్టి గ్రహింపవలెను.

## 59. క్రియలు

**క్రియ :** క్రియ లనగా వ్యాపారావబోధకము లయినవి అని ప్రౌఢవ్యాకరణము పేర్కొన్నది. క్రియ అనగా వ్యాపారము- పని. శబ్దశాస్త్రమున పనిని బోధించునట్టి శబ్దమునకు క్రియ అని సంజ్ఞ. క్రియా పరిచ్ఛేదము' వీనిని నిరూపించును.

**భేదములు :** వాక్యార్థమున ఆకాంక్షాపరిసమాప్తిని బోధించునవి సమాపకక్రియలు, అపరిసమాప్తిని బోధించునవి అసమాపకక్రియలు అని క్రియలు రెండు విధములు అయినట్లు చెప్పుదురు. ఈవిభజనము, పేరును ప్రాచీనులు చెప్పినవి కావు.

**సమాపకక్రియలు :** క్రియ లనగా వర్తమానాద్యర్థకము లయిన సమాపక క్రియలు అని ప్రౌఢవ్యాకరణము క్రియలనగా సమాపకక్రియలు మాత్రమే అన్నట్లుగా చెప్పెను. కావున అసమాపకక్రియలు - క్రియలు కావని ప్రౌఢవ్యాకర్తమతము. సమాపకక్రియలని క్రియాపదము లనియు అందురు,

**క్రియాపదములు :** ధాతువుపై వర్తమానము మొ॥ అర్థములలో లట్ మొదలగులకారములు వచ్చును. వానికి లకారంబునకు 'డుఙ్ప్రుసునుముఙ్గు' అనుసూత్రముచే డుఙ్ మొ॥ ప్రత్యయములగును. ప్రథమపురుష యందు(నీవు, మీరు, నేను, మేము అనువానికంటె వేరైనది కర్త అగునపుడో) ఏకవచనమున 'డుఙ్' బహువచనమున 'రు' వచ్చును. మధ్యమపురుషలో (నీవు - మీరు కర్తలైన) వు - రు అనునవియు ఉత్తమపురుషలో (నేను-మేము కర్తలైన) ను - ము అనునవియు వచ్చును. ఎను, దు, వు మొ. ఆయాస్థలములందు వీనిస్థానమున వచ్చును. ఈ 'డుఙ్' మొదలగు వానికి (క్రియా) విభక్తులని పేరు ఇవి, క్రియావిభక్తులు అంతమందు గలిగినశబ్దములు క్రియాపదములు.

**భేదములు :** వర్తమానము మొ, అర్థవిశేషములనుబట్టి యీ క్రియలు తెలుగున ఆరువిధములుగా నున్నవి.

**1. వర్తమానార్థకములు :** 'వర్తమానంబున లట్టగు' ప్రారంభింపబడి ఇంకను ముగియని పని వర్తమానము. అట్టి దానిని తెలుపు ధాతువుపై లట్ అనులకారమగును. చదువుచున్నాడు, పలుకుచున్నవి మొ॥

**2. భూతార్థకములు :** 'భూతంబున లిట్టగు' పూర్వముండి అప్పటికి లేనిది భూతము. ఈ అర్థమునందు ధాతువుపై 'లిట్' వచ్చును. వండెను, తింటిని, మొ॥

**3. భవిష్యదర్థకములు :** 'భావిని ౡట్టగు' అప్పటి కింకను పుట్టకుండ తరువాత ఏర్పడునది భావి. ఈఅర్థమున నున్న ధాతువుపై 'ౡట్' వచ్చును; చదువంగలను, చదువగలడు, మొ॥

**4. తద్ధర్మాద్యర్థకములు :** 'తద్ధర్మాదులందు లోట్టగు' తద్ధర్మము, తచ్ఛీలము సంప్రశ్నము సాతత్యము - మొదలగు అర్థము

లందు ధాతువునకు లొట్ వచ్చును. చదువును చదివెడిని చదువు దుము, చదివెదరు. మొ॥

**5. ఆశీరాద్యర్థకాలు :** 'ఆశీశ్శాపసంప్రార్థనవిధులందు లొట్టగు' ఆశీస్సు, శాపము, సంప్రార్థనము, విధి అనుఅర్థములలో ధాతువునకు 'టొట్' వచ్చును. ఆశీస్సు- మేలు కలిగెడును. ఇట్టివి ప్రథమ పురుషలో మాత్రమే ప్రయోగములందు కలవందురు. శాపము- రాక్షసుండ వగుము. సంప్రార్థనము- నన్ను రక్షింపుండు మొ॥ విధి- రక్షించునది. ఇట్టివి మధ్యమపురుషయందె కలవు. ఈ అర్థములందు ఉత్తమపురుషక్రియలు కానరావేను. ఉభయ (నీవు- నేను- మొ॥) ప్రార్థనమున చదువుదము అనురీతిని ఉత్తమపురుషబహువచనము గలదు.

**6. వ్యతిరేకార్థకములు:** 'వ్యతిరేకంబున లజీ యగు' వ్యతిరేకార్థముతో గూడి ఉన్నపుడు ధాతువుపై 'లజీ' అనునది వచ్చును. వండడు, తినవు. మొ॥ ఇట్లే ప్రార్థనమున వ్యతిరేకార్థము చెప్ప దలచినచో రక్షింపకుము మొ॥

**ఇతర భేదములు :** ఈసమాపకక్రియలు - అవిబోధించుఅర్థ విశేషమును బట్టి వేరొకవిధముగా విభజింప దగియున్నవి.

**1. కర్త్రర్థకాలు :** క్రియచేత కర్త బోధింపబడినచో అది కర్త్రర్థకము. (మైత్రి) వండెను. మనిసెను.

**2. కర్మార్థకాలు :** క్రియచేత కర్మ తెలియజేయబడినచో అది కర్మార్థకము. ఇవి సకర్మక (కర్మ కలిగిన) ధాతువులనుండి మాత్రమే ఏర్పడును. (వంటకము) వండబడెను.

**3. ఆత్మనేపదార్థకములు :** క్రియాఫలము కర్తను పొందినట్లు చెప్పునది ఆత్మనేపదము. ఇవియును సకర్మక (కర్మకలిగిన) ధాతువుల నుండి మాత్రమే ఏర్పడును. వండుకొనెను. వండుకొనబడెను.

**4. ప్రేరణార్థకములు :-** ఇతరులచే ప్రేరేపింపబడిన అర్థమును తెలుపునవి ప్రేరణాక్రియలు, వండించెను, మనిచెను. వండింపబడెను, మనుపబడెను. వండించుకొనెను, మనుచుకొనెను. వండించుకొనబడెను, మనుచుకొనబడెను.

ఇట్లు తెలుగులోనిక్రియాపదములు స్వీయ మగుప్రత్యేక లక్షణములతో పలువిధము లైయున్నవి.

## 60. అసమాపక క్రియలు

వాక్యార్థమున ఆకాంక్ష ముగియకుండుటను తెలుపుక్రియలు అసమాపకక్రియలు. క్త్వా, తద్వ్యతిరేక, శతృ, తుమున్, చే, దానంతర్యార్థకములు అసమాపకక్రియలు అని ప్రౌఢవ్యాకరణము పేర్కొన్నది. ఇందు మొదటి మూడు (సమాపక) క్రియతో సమాన మైన కర్త కలిగిన వనియు, మిగిలినమూడు ఇతర మైనది కర్తగా గలిగిన వనియు స్థూలముగ పేర్కొనెను. ఇవి అవ్యయములు. లక్షణము సాధించుటచే లాక్షణికావ్యయములు.

**1. ఇ-క్త్వార్థము :-** 'సమానాశ్రయంబులం బూర్వకాలంబునం దివర్ణకం బగు' - ఒకేదానిని (కర్తృ, కర్మ) ఆశ్రయించి యున్న రెండువ్యాపారములలో పూర్వకాలమునకు చెందినదానిని తెలుపు ధాతువునకు 'ఇ' అనుప్రత్యయము వచ్చును. చైత్రుండు వండి తినెను. చైత్రునిచేత మైత్రుండు కొట్టంబడి చచ్చెను. ఇందలి, - వండి, కొట్టంబడి అనుక్త్వార్థకములు అసమాపకక్రియలు.

**2. కజి-వ్యతిరేకక్త్వార్థము :-** 'కజి వ్యతిరేకక్త్వార్థంబునం దగు' వ్యతిరేకార్థముతో కూడినక్త్వార్థమునందు ధాతువుపై కజి అను ప్రత్యయము వచ్చును. క(జి) జిత్తు గావున 'జిత్తు పరం బగునపు డుత్వంబున కత్వం బగు, అనులక్షణముచే ధాతువు తుది యుత్వము

నకు అత్వము వచ్చును. చైత్రుండు వండక తినఁగోరెను. ఇందు 'వండక' అను వ్యతిరేకక్త్వార్థకము అసమాపక క్రియ.

**3. చును-శత్రర్థము :-** చువర్ణకంబు ద్రుతాంతంబు క్రియాన్వయంబున శత్రర్థంబునం దగు" శతృ అనుసంస్కృత ప్రత్యయము యొక్క అర్థము (వర్తమానార్థము) నందు ధాతువునకు 'చును' అను ప్రత్యయము వచ్చును. చైత్రుండు చూచుచుం జదివెను. ఇందు 'చూచుచును' అనుశత్రర్థకము అసమాపకక్రియ.

**4. నుజీ- i. తుమర్థము :-** 'తుమర్థభావలక్షణంబులందు నుజీ యగు' తుమున్ అనుసంస్కృతప్రత్యయముయొక్క అర్థము నందు తెలుగున 'నుజీ' అను ప్రత్యయము వచ్చును. ను(జీ) జిత్తు గావున ధాతువునకు అత్వము వచ్చును. చైత్రుండు వండఁబోయెను. వండుటకొఱకు పోయెను. ఇందు 'వండను' అనుతుమర్థకము అసమాపకక్రియ.

ii. **భావలక్షణము :** పయిసూత్రముచే భావలక్షణమునందును నుజీ వచ్చును. భావలక్షణము అనగా "అన్యక్రియలకు లక్షణభూతం బగుక్రియ" చైత్రుండు వండ నతిథి వచ్చెని. (అతిథి) వచ్చుట అనుక్రియను వండుట యనుక్రియ సూచించుచున్నది. ఇందు 'వండను' అను భావలక్షకము అసమాపకక్రియ.

**5. నను - i. చేదర్థము :-** చేదర్థంబునందును వృత్తం బగు భావలక్షణంబునందును నవర్ణకంబు ద్రుతాంతం బగు'- చేత్ -అను సంస్కృతావ్యయముయొక్క అర్థముతో నున్నపుడు ధాతువుపైని 'నను' అనుప్రత్యయము వచ్చును. ఇది భూతార్థవిశిష్టము గావున 'భూతంబునం దిగాగమం బగు' అనుసూ చే ధాతువునకు ఇగాగమము వచ్చును. వానలు కురిసినం బంటలు పండును. 'కురిసినను' (కురిసినచో) అను చేదర్థకము అసమాపకక్రియ.

ii. **వృత్తం బగుభావలక్షణము :** పయిసూత్రముచే భూతార్థమున నున్నభావలక్షణమునను ధాతువునకు 'నను' ప్రత్యయము వచ్చును. వాఁడు రమ్మనినఁ బోయితిని అనినను (అనినప్పుడు) అనునది వృత్తం బగుభావలక్షణక్రియ అసమాపకక్రియ.

**6. దును-అనంతర్యార్థము :** 'అనంతర్యంబున దువర్ణకంబు ప్రమత్తాంతం బగు' వెంటనె ఎడములేక అనుఅర్థమునందు ధాతువునకు 'దును, అను ప్రత్యయము వచ్చును. జాబిల్లి తోతెంచుదుం గువలయంబులు వికసిల్లు తోతెంచుదును (తోతెంచినవెంటనె) అనునది ఆనంతర్యార్థకము అసమాపకక్రియ.

ఇట్లు, ఇ, కజీ, చును, నుజీ, నను, దును అనుఆప్రత్యయములు చివర గలిగిన ధాతువులు అసమాపకక్రియ లగుచున్నవి.

## 61. కృత్తులు

**కృత్తు :** ధాతువుకంటె విధింపబడిన 'దుజ్ఞు' అనుదానికంటె భిన్న మయినప్రత్యయమునకు కృత్తు అని పేరు. భావము, కర్మము మొద లగుకియాఅర్థములం దివి యగుచుండును. ఆఅర్థము లక్ష్యములనుండియే తెలియవలసియున్నది.

**బాలవ్యాకరణము :**

టవర్ణకంబు భావంబునం దగు.

| | | |
|---|---|---|
| భావార్థమున అన్నిధాతువులకు | ట | వండుట |
| వ్యతిరేకభావంబున మిజీ యగు | | |
| వ్యతిరేకభావమున అన్నిధాతువులకు మిజీ | | వండమి |

కవర్ణకం బలుగ్వాదుల కగు.

| | | |
|---|---|---|
| అలుగు- మొ॥ | క | అలుక |

ఇమివర్ణకంబు కలుగ్వాదుల కగు.

| | | |
|---|---|---|
| కలుగు మొ॥ | ఇమి | కలిమి |

తజ్వర్ణకంబు చేయ్వాదుల కగు

| | | |
|---|---|---|
| చేయు మొ॥ | తజ్ | చేఁత |

కువవర్ణకం బడఁగ్వాదుల కగు

| | | |
|---|---|---|
| అడఁగు మొ॥ | కువ | అడఁకువ |

టవర్ణకం బాడ్వాదుల కగు నగుచో నంతలోపం బగు.

| | | |
|---|---|---|
| ఆడు మొ॥ | ట | ఆట |

టువర్ణకంబు పడ్వాదుల కగు నగుచో నవియాద్యక్షర శేషంబు
లయి దీర్ఘంబు నొందు.

| | | |
|---|---|---|
| పడు మొ॥ | టు | పాటు |

పవర్ణకంబు తిరియ్వాదుల కగు.

| | | |
|---|---|---|
| తిరియు మొ॥ | ప | తిరిపము |

తవర్ణకం బావులించు లోనగువాని కగు.

| | | |
|---|---|---|
| ఆవులించు మొ॥ | త | ఆవులింత |

పువర్ణకంబు మాయ్వాదుల కగు.

| | | |
|---|---|---|
| మాయు మొ॥ | పు | మాపు |

ఇకవర్ణకం బంజ్వాదుల కగు.

| | | |
|---|---|---|
| అంజు మొ॥ | ఇక | అంజిక |

అప్వాదులకు నజి యగు.

| | | |
|---|---|---|
| అప్పు మొ॥ | నజి | అప్పన |

బడి యేల్వాదుల కగు.

| | | |
|---|---|---|
| ఏలు మొ॥ | బడి | ఏలుబడి |

గడ చేర్వాదుల కగు.

| | | |
|---|---|---|
| చేరు మొ॥ | గడ | చేరుగడ |

ఇకి కోర్యాదుల కగు.

| | | |
|---|---|---|
| కోరు మొ॥ | ఇకి | కోరికి |

వువర్ణకంబు మన్వాదుల కగు.

| | | |
|---|---|---|
| మను మొ॥ | వు | మనువు |

అవర్ణకంబు గీఱ్వాదుల కగు.

| | | |
|---|---|---|
| గీఱు మొ॥ | అ | గీఱ |

మువర్ణకం బాఱ్వాదుల కగు నగునప్పుడు పకారంబు చయుల కగు.

| | | |
|---|---|---|
| దంచు... | ము | దంపుము |

ఉవర్ణకం బడుక్వాదుల కగు.

| | | |
|---|---|---|
| అడుకు మొ॥ | ఉ | అడుకు |

వడి ప్రభృతు లిట్లుండునవి

| | | |
|---|---|---|
| కొలుచు | వడి | కొలువడి |
| తనియు | వి | తనివి |
| నగు | అవు | నగవు |
| చేయు | ఇ | చేయి |
| కను | కలి | కనుకలి |

ప్రౌఢవ్యాకరణము :

దయ్యుదయ్యునొచ్చు పుచ్చుల కివర్ణకం బగు
నగుచో వానికడ హల్లులు పకారంబు లగు.

| | | |
|---|---|---|
| దయ్యు | ఇ | దప్పి |

రాయున కిడివర్ణకం బగు.

| | | |
|---|---|---|
| రాయు | ఇడి | రాయిడి |

ఊర్చుబ్బుకందుదుప్ప నడ్డించుల కైనవర్ణకంబగు — — —
[redacted], వడ్డించు నించు లుప్తం బగు.

| | | |
|---|---|---|
| ఊర్చు మొ॥ | ఎన | ఊర్చైన |

పువర్ణకంబు కాచుదాచుదాయ్యాదులకగు.

కాఁచు మొ॥ పుర కాఁపురము

ఎక్కుదిగులకుం బ్రేరణార్థంబున మతి వర్ణకంబగు
నగుచో ఎగు ఎక్కునకాదేశం బగు.

ఎక్కు మతి ఎగుమతి

దిగు మతి, వ దిగుమతి, దిగువ

పువర్ణకం బులియ్యాదుల కగు.

ఉలియు మొ॥ పు ఉలిపు

కాచుపీచులకు వలివర్ణకం బగు.

కాచు, పీచు వలి కావలి, పీవలి

## 62. పదము - తత్ప్రభేదములు

**పదము** : పదసంజ్ఞను సూరి వివరింపలేదు. 'సుప్తిఙంతం పదమ్' అనుసంస్కృతలక్షణమునుబట్టి తెలియవలయును. ప్రథమ-మొద లగునామవిభక్తి అంతమందు గలిగినది సుబంతము. రాముఁడు సీత మొ॥ డుఞ్, రు మొ॥ క్రియావిభక్తి అంతమందు గలిగినది తిఙంతము, ఘటించుచున్నాఁడు- ఘటించున్- మొ॥ దీనివలన సుప్తిఙంతములు కాని, ప్రాతిపదికలు, ధాతువులు ప్రత్యయములు మొద లగువానికి పదసంజ్ఞ ఉండదు. రామ, తిన్, డుఞ్ మొ॥ అవి అపదము లగును. 'అపదం న ప్రయుఞ్జీత' అనుటవలన పదము కానిది ప్రయోగించుట కర్హము కాదు. 'పద మనఁగాఁ బ్రయోగార్హంబు ననన్వితంబు నేకంబు నర్థబోధకంబు నైన వర్ణము లేక వర్ణసముదాయము. అని ప్రౌఢవ్యాకర్త చెప్పెను. ప్రయోగించుటకు అర్హమై, వేఱొకదానితో అన్వయము గలిగియుండక, ఒక్కటి యై అర్థవంత మై యున్నవర్ణము లేదా వర్ణములసమూహమునకు పద

మని పేరు. రాముఁడు. ఇది సుబంతము. కావున ప్రయోగించుటకు తగినది. అనన్వితము. ఏకము. దశరథాపత్య మనురీతిగా అర్థవంత మైయున్నది కావున ఈవర్ణసముదాయమునకు పదము అనుసంజ్ఞ గలుగుచున్నది.

రామ-డు మొద లగు ప్రకృతి, ప్రత్యయాదులు ప్రయోగింప దగవు. కావున వానికి పదసంజ్ఞ యుండదు. 'ఖంబు' ఘటంబున దోఁచెడి' అనుచో అన్వయము గలిగియుండుటచే దీనిమొత్తమునకు 'పద'సంజ్ఞ గలుగదు. ఖంబు- ఘటంబున- అనుసుబంతములు తోఁచెడి అనుతిజంతమును వేర్వేరుగా పదము లగును. 'ఖంబును, ఘటంబును'. అనేక మగుటచే ఇది మొత్తము కలిసి 'పదము' గాదు. ఖంబును, అని ఏక మై యున్నది పదము. ఇట్లే ఘటంబును. క-చ- మొదలుగా ఏఅర్థమును గలిగియుండనిశబ్దమునకు పదసంజ్ఞయుండదు.

'సుప్తిఙంతం పదమ్' అనులక్షణముయొక్క అభిప్రాయమె ఇందు వివరణాత్మకముగా నున్న దనవచ్చును. 'ప్రయోగార్హంబు అనుదళ మీలక్షణమును అనుసరించియున్నది.

**భేదములు :** 'పదము లవి నామంబులు క్రియ లవ్యయంబు లని త్రివిధంబులు' 1. నామములు 2. క్రియలు 3. అవ్యయములు అని పదములు మూఁడు విధాలు.

**1. నామములు :** 'నామములు నా వస్తువాచకశబ్దములు' ఏదేని వస్తువును బోధించుశబ్దమునకు నామ మని పేరు. ఇది ధాత్వర్థ వ్యాపారాశ్రయ మైనచో కర్త. ధాత్వర్థఫలాశ్రయ మైనచో కర్మ. రాముఁడు, రావణుఁడు మొ॥ ఇవి ఇంకను ఆయాలక్షణములను బట్టి విశేష్యములు, విశేషణములు ఇత్యాదిగా వ్యవహరింపబడును. ఇవి యెల్ల 'నామభేదములె. 'ప్రాతిపదిక' మగునామసంజ్ఞకంటె ఇది భిన్నముగా గ్రహింపదగును. ప్రౌఢవ్యాకరణమునందలి ఈపదవిభాగ

మున ఆంగ్లవ్యాకరణప్రభావము కొంత యున్నట్లు విమర్శకులు పేర్కొందురు.

**2. క్రియలు :** క్రియలనఁగా వ్యాపారావబోధకము లయినవి. వ్యాపారము నఁగా పనిని బోధించునవి క్రియలు. ఇవి రెండు విధములు.

i. **సకర్మకము :** కర్మము గలది సకర్మకము. కర్మను గూర్చిన యాకాంక్ష లేనిక్రియ సకర్మక మగును. (అన్నమును) తిను, (పుస్తకమును) చదువు మొ॥

ii. **అకర్మకము :** కర్మము లేనిది యకర్మకము. కర్మను గూర్చిన యాకాంక్ష లేనిక్రియ యకర్మకక్రియ యగును. పోవు, సంతోషించు మొ॥

**3. అవ్యయములు :** అవ్యయము లనఁగా లింగవిభక్తివచన శూన్యములు. అన్నిలింగములందును (మహదమహదర్థములందును) అన్నివిభక్తులయందును, అన్నివచనములయందును ఎట్టిమార్పును బొందక నిలిచియుండునట్టిశబ్దము అవ్యయము, ఆహా, పలికి మొ॥ ఈఅవ్యయములు రెండువిధములు.

i. **ప్రతిపదోక్తములు :** ప్రకృతిసిద్ధములు ప్రతిపదోక్తములు. ప్రకృతిచేతనె అనగా పుట్టుకచేతనె అవ్యయములైన శబ్దములు ప్రతిపదోక్తావ్యయములు. ఆహా, ఓహో, మొ॥

ii. **లాక్షణికములు :** 'లక్షణసిద్ధములు లాక్షణికములు, శబ్దశాస్త్రముచే సిద్ధించినఅవ్యయములు లాక్షణికములు. క్త్వా తద్వ్యతిరేకార్థకము లగుఅసమాపకక్రియలు మొద లగునవి వ్యాకరణముచే సాధింపబడినవి. అవి లాక్షణికావ్యయములు. పలికి, నచించుచున్ మొ॥

# 63. వాక్యము - తత్ప్రభేదములు



**వాక్యము :** వాక్యముయొక్క లక్షణమును చిన్నయసూరి పేర్కొనలేదు. ఆలంకారికమతానుసారముగా ప్రౌఢవ్యాకర్త పేర్కొనెను.

**1. పదసముదాయము :** 'వాక్యము నా యోగ్యతాకాంక్షా సహితం బగునర్థము గలయాసత్తియుక్తపదసముదాయంబు'. పదముల సముదాయము వాక్యము. ఆపదములు శబ్దార్థస్వరూపములందు కొన్ని నియమముల కనుగుణముగా ఉండవలయును.

ఆసత్తి : పదముల(శబ్ద)స్థితియందు ఆసత్తి ఉండవలయును. ఆసత్తి అనగా పదములచేరిక. పదము లెల్ల ఒకదానివెంట ఒకటి చేరియుండవలయును. దేవదత్తుండు పోవుచున్నాడు. 'దేవదత్తుండు' అని ఒకప్పుడు చెప్పి ఆపిదప ఎప్పుడో 'పోవుచున్నాడు' అని చెప్పిన ఈపదములకు 'ఆసత్తి' యుండదు గావున అపుడది వాక్యముగా నేరదు.

ఈపదములఅర్థమునందు యోగ్యత, ఆకాంక్ష అనులక్షణము లుండవలయును.

**యోగ్యత :** యోగ్యత యనగా పదార్థములకు పరస్పరసంబంధమునందు బాధగలుగకుండుట. పదసముదాయమున వానిఅర్థములు పరస్పర మొకదానితో నొకటి అన్వయించుటలో బాధ లేకుండవలెను. నిప్పుతో కాల్చుచున్నాడు. 'నిప్పుతో తడుపుచున్నాడు' అనుచో నిప్పునకు తడుపుట అనులక్షణము లేకపోవుటచే ఈపదముల అర్థమునకు అన్వయమునందు బాధ గలుగుటచే ఇచట యోగ్యత లేదు. కావున ఇది వాక్యము గాదు.

**ఆకాంక్ష :** ఆకాంక్ష అనగా నిలుపుదల లేక పయి పయి బోయెడిపదార్థములమీదిఆదరము. ఒకపదముయొక్క అర్థము తెలిసిన వెంటనె ఆతరువాతిఅర్థమును తెలియవలయు ననెడికోరిక ఆకాంక్ష.

'గోవు-గుఱ్ఱము.' మున్నగురీతిగా అర్థమునకు పరస్పరము సంబంధము లేకుండ పదములను కూర్చినచో ఆకాంక్ష లేకపోవుటవలన ఆపద సముదాయము వాక్యము గాదు. గోవు వచ్చెను, గుఱ్ఱము పోయెను అనురీతిగా ఆకాంక్ష తీరు నట్లుగ కూడిన పదసముదాయము వాక్యమగును.

ఎవరు వచ్చిరి? రాముడు. అనుచో 'రాముడు' అని ఒక్క పదమె ఉన్నను 'వచ్చెను' అను క్రియ అధ్యాహరింపబడును. అట్లే రాముడు వచ్చెనా? వచ్చెను. దేవదత్తు డేమి వండెను. అన్నము. మొద లగుస్థలములందు కర్తృకర్మాదు లధ్యాహృతము లగును. కావున 'పదసముదాయము' వాక్యముగా చెప్పబడినట్లు తెలియ వచ్చును.

**2. విషయబోధకము :** 'విషయబోధకము వాక్యము' అని వాక్యమునకు ప్రౌఢవ్యాకర్త మఱి యొకలక్షణము పేర్కొనెను. విషయమును బోధించునది వాక్యము.

**విషయము :** ఉద్దేశ్యవిధేయభిన్నంబు విషయంబు'. ఉద్దేశ్య విధేయములతో గూడినది విషయము. దేనినిగూర్చి చెప్పబడునో అది ఉద్దేశ్యము. అవి విశేష్యాదులు. (దానినిగూర్చి) ఏమి చెప్ప బడునో అది విధేయము. అవి క్రియాదులు. ఈ రెండును గలిసినది విషయము. దానిని బోధించునది వాక్యము.

'వాగ్భూషణమే సుభూషణము'. ఇందు 'వాగ్భూషణము'ను గూర్చి చెప్పబడుచున్నది. కావున అది ఉద్దేశ్యము. దానినిగూర్చి 'సుభూషణము' అని చెప్పబడుచున్నది. కావున ఇది విధేయము. ఈ రెండింటితో గూడిన 'పైపదసముదాయము 'వాగ్భూషణమె సుభూషణము' అనునది వాక్యము అగుచున్నది.

**వాక్యభేదములు :** వాక్యములందు కొన్ని క్రియాన్వయము

కలవి, కొన్ని తదితరాన్వయము కలవి. అని ప్రౌఢవ్యాకరణము ముందుగా నొకభేదము చేసికొన్నది.

**1. క్రియాన్వయవాక్యములు :** క్రియలు అనగా లట్ మొ॥ లకారము లంతమందు గలిగిన వర్తమానము మొ॥ అర్థములం దున్న సమాపక క్రియలు. ఇట్టి సమాపకక్రియలతో అన్వయము గలిగిన వాక్యము క్రియాన్వయ వాక్యము. అవివేకి చెడున్. చెడున్ అనుసమాపక క్రియతో అన్వయము కలిగియుండుటచే ఇది క్రియాన్వయవాక్యము.

అసమాపకక్రియలను క్రియాభేదముగా గుర్తించినచో క్రియాన్వయవాక్యము రెండువిధము లగును.

సంపూర్ణ మసంపూర్ణ మని వాక్యంబు ద్వివిధంబు'.

i. **సంపూర్ణవాక్యము :** 'సమాపకక్రియలు గలవాక్యము సంపూర్ణవాక్యము'. లడాదిలకారము లంతమందు గలవి సమాపక క్రియలు, అవి కలిగినవాక్యము సంపూర్ణవాక్యము. నలుఁడును దమయంతిఁ దోడ్కొని వెలువడియె. 'వెలువడియె' అని లిడంత మగుక్రియాపదము గలయీ వాక్యము సంపూర్ణవాక్య మనబడును.

ii. **అసంపూర్ణవాక్యము :** 'అసమాపకక్రియలు గలవాక్యము అసంపూర్ణము'. క్త్వార్థకములు మొదలగునవి అసమాపకక్రియలు. ఇట్టిక్రియలు గలిగినది అసంపూర్ణవాక్యము. నలుఁడును దమయంతిఁ దోడ్కొని. 'తోడ్కొని' అనుఅసమాపకక్రియ గల యిది అసంపూర్ణవాక్యము.

**2. క్రియేతరాన్వయవాక్యము :** క్రియలకంటె వేరైన విశేష్యము, విశేషణము మొ॥ నామపదములతో, అన్వయము గలిగినవాక్యము క్రియేతరాన్వయవాక్యము. 'వాగ్భూషణ మే సుభూషణము'. 'సుభూషణము' అనువిశేష్య(క్రియేతర)ముతో అన్వ క్రియేతరాన్వయవాక్యము.

**మహావాక్యము** : 'వాక్యసముదాయము మహావాక్యము నాఁబడు. అయ్యది రామాయణాదికము'. మహావాక్యము వాక్యములలో భేదము కాదు. ఇంక వాక్యములసమూహమునకు మహావాక్య మని పేరు. రామాయణము మొ॥ ఇట్లు మహావాక్యము గలది కావున ఇది మనుసంజ్ఞ గలిగినవి.

## 64. అన్వయము - తద్విశేషములు

**అన్వయము** : 'పదములకుఁ బరస్పరము గలసంబంధ మన్వయ మనంబడు' వాక్యమునం దున్న పదముల కొకదానికి మరియొకదానితో గలసంబంధమును అన్వయము అందురు. 'రాముడు రావణుని చంపెను - ఇందు **రాముడు** అనునది కర్తగాను, రావణుని అనునది కర్మగను- మొదలుగా పదము లెల్ల పరస్పరము సంబంధము గలిగి యున్నవి. ఇట్టిసంబంధమునె అన్వయ మందురు.

**సమాసము-అన్వయవిశేషములు** : సమాసమునం దిట్టి అన్వయములో కొన్నివిశేషములను ప్రౌఢవ్యాకర్తయిట్లు చెప్పెను.

i. **సమస్తమునకు-వ్యస్తముతో** : 'ఒక్కొకచో సమాసగత పూర్వపదంబు వ్యవహితోత్తరపదం బొంటితోడను వానిపెక్కింటితోడను నన్వయించెడి'. 'రాహుకంఠము దెగి దేహము ధరణి బడియె. **రా**హుకంఠము అనుసమాసమున పూర్వపద **మగురాహు** (యొక్క) అనునది, ఆసమాసమునకు పిదప 'తెగి' **అనుదానితో** వ్యవధానము గలిగి ఉన్న దేహము అనుదానితో అన్వయించి రాహు(యొక్క)దేహ మని అర్థ మిచ్చును. ఈఉదాహరణము 'గొంతిసంకటపాటు కోడలిబన్నంబు' (గొంతికోడలి) **అనుదానితో** పోలిక గలిగియున్నది.

ii. **వ్యస్తమునకు-సమస్తముతో** : 'కొన్నియెడల సిద్ధసమాస మధ్యగతపదంబులతోఁ దద్భిన్నపదంబుల కన్వయంబు చూపట్టెడి'

'అం దొకటిచే జనితాధరపీడన్రై'- జనితాధరపీడ అనుసిద్ధసమాసమందలి (పీడతో కాక) జనిత అనుశబ్దముతో ఆసమాసమునందు గాక విడిగా ఉన్న 'ఒకటిచే' అనుశబ్దమునకు అన్వయము. 'వారి అస్మదీయోరుచమూసమూహములు' అనుచో వారి - ఉరుచమూసమూహములు, అస్మదీయ - ఉరుచమూసమూహములు అని అన్వయము. పార్థివప్రాగ్రసరుండు ధర్మసుతుపన్ను ఇత్యాదులలోను ఇట్టిఅన్వయము గుర్తింపదగును.

**కులకము** : 'కులకం బనగా పద్యమునకు పద్యాంతరముతో అన్వయము' పద్యమునందలివాక్యార్థము (అన్వయము) అక్కడ ముగియక తరువాతిపద్యము(ల)లోనికి కొనసాగినచో అది తెలుగున కులకము అనబడును.

తా నొకపండు చెచ్చెరన్, కొని వచ్చుడు'-'చెచ్చెరన్' అను పద్యము ముగియగా కొనివచ్చుడు అనుతరువాతిపద్యములోని కన్వయము గల్గుటచే ఇది కులకము. రెండుపద్యములకే 'కులక' మనబడుట సంస్కృతముకంటె తెలుగున విశేషము.

## అధ్యాహారము-తద్విశేషములు

**అధ్యాహారము** : 'ఆకాంక్షావిషయపదానుసంధానము అధ్యాహారము' వాక్యమునందు ఆకాంక్షిత మయినఅర్థము నిచ్చుపదము ప్రయుక్తము గానపుడు దానిని తెచ్చుకొనుట అధ్యాహారము. 'నన్ను జూచి నగరే?' ఎవరు? అని ఆకాంక్షిత మయిన కర్తృపదము ఈవాక్యమున ప్రయోగింపబడలేదు. కాగా దానిని (జనులు) తెచ్చుకొని అన్వయింపవలెను. ఇట్లు అన్వయమునకై వాక్యమున లేనిపదమును తెచ్చుకొనుట అధ్యాహారము. ఇట్లు తెచ్చుకొనవలసిన పదములు అధ్యాహార్యములు.

ఇట్టివానిని కొన్నింటిని ప్రౌఢవ్యాకర్త నిరూపించెను.

**తదాదులు :** 'కొన్నియెడలఁ దదాదులు విశేషణంబు లధ్యాహార్యంబు లగు' కొన్నివాక్యములందు ఆ-ఈ మొదలగు విశేషణ రూపములు అధ్యాహారము చేసికొనవలయును. కలకంఠకంఠి కన్నీరొలికిన సిరి యింట నుండ నొల్లదు' ఇచట 'ఇంట నుండ నొల్లదు' అనుచో 'ఆఇంట నుండ నొల్ల' దని 'ఆ' యనువిశేషణము అధ్యాహారము చేసికొనవలె. ఇట్లె 'ఈ' మొ॥.

ii. **సంబంధిపదములు :** 'కొన్నియెడల సంబంధంబునం బూర్వవాక్యంబునందలిపదం బధ్యాహార్యం బగు' కొన్నివాక్యములందు సంబంధార్థమునందు అంతకు పూర్వము ప్రయుక్తమైన సంబంధిపదము ఆతరువాతిచోట అధ్యాహారము చేయవలసియుండును. దానవేశ్వరునకు, తమ్ములకు. ఇట రెండవచోట 'తమ్ములకు' అనుచో ఎవరితమ్ములకు అనుఆకాంక్షయుండు. అంతకుముందు ప్రయోగింపబడిన దానవేశ్వరునకు అనుదానినిబట్టి దానవేశ్వరుని(యొక్క) తమ్ములకు. అని అన్వయము. దానవేశ్వరునకు, అతనితమ్ములకు అని యర్థము.

iii. **న్యూనవచనములు :** 'న్యూనవచోవాక్యంబునఁ దద్వచనంబు లధ్యాహార్యంబు లగు' ఐన- ఏని మున్నగునవి న్యూనవచనములు. ఇవి అవసరమైయుండియు ప్రయోగింపబడనివాక్యమునం దీశబ్దము లధ్యాహారము చేసికొనవలయును. 'ఎత్తెఱంగున ధర్మక్రియఁ జిత్తంబునఁ జేర్పవలయు'. 'ఎత్తెఱంగున నైన, లేదా ఎత్తెఱంగున నేని' అనుతీరుగా ఈవాక్యమునందు ఐన లేదా ఏని అనుశబ్దము అధ్యాహార్యము.

iv. **కర్త-కర్మ-క్రియ :** 'కొన్నియెడలఁ గర్తృకర్మక్రియ లధ్యాహార్యంబు లగు' కొన్నివాక్యములందు కర్తయు, కొన్నింట

కర్మమును, మఱి కొన్నివాక్యములలో క్రియయును అధ్యాహారము చేసికొనవలసియుండును. 'నన్ను జూచి నగరె'- ఇచట 'జనులు నగరు' అనుతీరుగా 'జనులు' అనుకర్త అధ్యాహార్యము. 'దవదహనం బుదగ్రతరుదాహము చేయుచున్నఁ జూచి' ఇచట 'దాహము చేయుటను జూచి' అనువిధముగా 'కర్మ' అధ్యాహార్యము. అక్కడ నెవ డున్నాఁడు- రాముఁడు. ఇచట రాముఁడు 'ఉన్నాఁడు' అనుతీరుగా క్రియ అధ్యాహార్యము.

ఇట్లు ఆయాసందర్భములందు కవిప్రయోగానుగుణముగా అధ్యాహార మనసర మగుటచే అధర్వణు డంగీకరింపకున్నను వీనిని ప్రౌఢవ్యాకర్త కవిప్రయోగానుగుణముగా నిరూపించెను.



# అకారాదిముఖ్యపదవివరణము

## ( బాలవ్యాకరణము )

**1, అంతాగమము** : (తత్స. 15) అంతమునందు (చివర) ఆగమ మగునది అంతాగమము. ఆగమ మనగా అధికముగా వచ్చి చేరువర్ణము(లు). 'ఓశబ్దంబునకుం బుంపునీచ స్త్రీపురుషామంత్రణంబులందు యుసిరివర్ణంబులు విభాష నంతాగమంబు లగు'. ఓశబ్దమునకు చివర 'యు'వర్ణము చేరగా ఓయు. ఇట్లె భర్తృండవు. యు,సి,రి వు,ను మొ॥ అంతాగమములు.

**2. అకర్మకము** : (క్రియ. 46) అవిద్యమానం కర్మ యేషాం తే అకర్మకాః) 'అకర్మకంబు నాఁ గర్మాకాంక్షానుత్థాపకంబు' కర్మను గూర్చినఆకాంక్ష లేని (కర్మలేని) ధాతువు అకర్మకము, రాముడు వచ్చెను. ఇట దేనిని వచ్చెను అనుతీరుగా కర్మను గూర్చిన ప్రశ్నము కల్గింపదు కావున వచ్చుధాతువు అకర్మకము.

(ఫలవ్యాపారయో రేకతా నిష్ఠతాయా మకర్మకః. ధాతువు యొక్క అర్థము లైనవ్యాపారమును, ఫలమును ఒక్క(కర్త)నే ఆశ్రయించి ఉన్నచో ఆధాతువు అకర్మకము. రాముడు 'వచ్చెను'. నడచుట మొ॥ రూప మైనవ్యాపారము, ఆచోటికిచేరుకొనుట మొ॥ రూప మైనఫలమును రాముని(కర్త) ఒక్కరినే ఆశ్రయించియుండుటచే వచ్చుధాతువు అకర్మకము.)

**3. అగతికము:** (క్రియ.131) (గతిశ్చ, ఊర్యాదిచ్విడాచశ్చ సాక్షాత్ప్రభృతీని చ) క్రియతో సంబంధము కలిగియున్న ప్ర, పరా, మొద లగునవియును, ఊరీప్రభృతులును, సాక్షాత్- మొ॥ 'గతి' అనుసంజ్ఞ కలిగినవి. ఇవి చేరక ప్రత్యేకముగా ఉన్నధాతువు అగతికము. భూ,కృ. మొ॥.

**4. అచేతనము :** చూ. జడము.

**5. అచ్చు :** (సంజ్ఞ. 1) అకారాదు లచ్చులు. వర్ణమాలలో అకారము మొదలుకొని కకారమునకు పూర్వము వర కున్నవర్ణములకు అచ్చులు అని సంజ్ఞ. (సంస్కృతమందలి 'అచ్' అను ప్రత్యాహారమునుండి ఇది గ్రహింపబడినది) అ, ఆ, ఇ, ఈ, ఉ, ఊ, ఋ, ౠ, ఌ, ౡ, ఎ, ఏ, ఐ, ఒ, ఓ, ఔ, అరసున్న (అఁ) నిండుసున్న (అం) విసర్గ (అః) అనునవి అచ్చులు.

**6. అచ్చ :** (ఆచ్ఛి. 1) 'సంస్కృతసమేతరం బయినయాభాష యచ్చ యనంబడు'. సంస్కృతసమముకంటె వేరయిన తెలుగుభాషకు అచ్చ అని పేరు. i. ప్రాకృతసమము (అగ్గి), ii. తద్భవము-(ఆకసము, ఇంగలము) దేశ్యము-(ఊరు) అయిన తెలుగుశబ్దములు అచ్చ అనుసంజ్ఞ గల వగును.

**7. అతిచారము :** (క్రియ. 60) (అతిక్రమ్య చారః) అతిక్రమించి చరించుట. లక్షణముచే చెప్పబడినస్థలములకంటె ఇతరములగుస్థలములందు (అతిక్రమించి) గూడఁ కార్యము వర్తించుట అతిచారము. 'ముఙ్ఞు పరం బగునపుడు కోశబ్దంబు కొనునకు బహుళంబుగా నగు' ముఙ్ఞు పరం బగుచోట్ల చెప్పిన ఈ కార్యము బహుళశబ్దముచే చదువుకొంము, చదువుకొను మొ॥ ఇతరస్థలములందును వర్తించినది. కావున అది అతిచారము.

**8. అతిదేశము :** (తత్స. 75) (అవిద్యమానధర్మప్రాపకం శాస్త్ర మతిదేశః) లేనిధర్మమును కలుగజేయునట్టిశాస్త్రము అతిదేశము. 'విశ్వకర్మాదులకు స్త్రీత్వం బగు' (పుంలింగములైన) విశ్వకర్మ మొ॥ శబ్దములలో లేనిస్త్రీలింగత్వము అనుధర్మము ప్రాప్తింపజేయుటచే ఇది అతిదేశము. దీనివలన అతిదేశింపబడినధర్మమువలని కార్యములు కలుగును. విశ్వకర్మ.

**9. అతివ్యాప్తి :** (అలక్ష్యే లక్షణప్రవృత్తిః అతివ్యాప్తిః) లక్ష్యము కానిదానియందును (ఉద్దేశింపనిస్థలమునందు గూడ) లక్షణము ప్రవర్తించుట అతివ్యాప్తి. 'భూతంబునం దిగాగమం బగు' లిట్టులో ప్రథమపురుషఏకవచనస్థలమున ఇగాగమము ఉద్దేశింపబడలేదు. నగు+ఎను-నగెను- మొ॥. కాని 'భూతంబునందు' అని సామాన్యముగా చెప్పుటచే లక్ష్యము కాని-లిట్ ప్ర.పు.ఏ.స్థలముననుఈలక్షణము వర్తించుచున్నది. కావున ఇది అతివ్యాప్తి.

(అవసరమైనస్థలమున అవకాశము (ప్రాప్తి) లేకపోయినను లక్షణము ప్రవర్తించుట అతిచారము. అవసరము కానిస్థలమున అవకాశము (ప్రాప్తి) ఉండుటవలన లక్షణము ప్రవర్తించుట అతివ్యాప్తి. ఇట్లు ఇవి రెండు భిన్నములు. (వ్యా.సం.స. 1583)

**10. అధికరణ(కారక)ము :** (కార. 17) (ఆధారో ఽధికరణమ్) అధికరణంబు నా నాధారంబు. కర్త, కర్మలద్వారాన 'వానియందలి క్రియకు ఆశ్రయమైనది అధికరణము. ఘటమందు జలమున్నది. జలము(కర్త) ఉండుట కాశ్రయము కావున ఘటము అధికరణము. ఘటమందు జలము నింపెను. జలము(కర్మ)న కాశ్రయము ఘటము, అధికరణము.

**అనభిహితకర్త :** (క్రియ. 124) (తిఙ్కృత్తద్ధితసమాసైః (క్వచి న్నిపాతేన చ) అభిధానమ్ అభిహితత్వమ్) క్రియావిభక్తులు కృత్తులు మొ॥వానిచే చెప్పబడినది అభిహితము. చెప్పబడనిది అనభిహితము. అనభిహిత మగునట్టికర్త అనభిహితకర్త. రామునిచేత రావణుడు చంపబడెను. 'చంపబడెను' అనుచో క్రియ రాముని (కర్త) తెలుపుట లేదు (కర్మ యగు రావణుని చెప్పుచున్నది) కావున రాముడు అనభిహితకర్త.

**12. అనింద్యగ్రామ్యము :** (సంజ్ఞ. 23) లక్షణవిరుద్ధం బగు

భాష గ్రామ్యంబు' ఈభాష ప్రయోగంబున కనర్హంబు. కావున గ్రామ్యము నింద్యము. 'ఆర్యవ్యవహారంబుల దృష్టంబు గ్రామ్యంబు' పెద్దలు వ్యవహరించిన మాట గ్రామ్య మైనను గ్రహింపదగును. కఱకంఠుడు మొ॥ గ్రామ్యములు మహాకవిప్రయుక్తము లగుటచే నింద్యములు కావు. కావున ఇట్టివానిని అనింద్యగ్రామ్యములు అని కొంద రందురు. కపిలగడ్డము, జీవగఱ్ఱ మొ॥

**13. అనుకరణము-అనుకృతి :** (సంధి. 50, 51) అను-సదృశముగా, కరణమ్-చేయుట. శబ్దశాస్త్రమునందు ఇతరులవాక్య(పద)ములను అట్లు గ్రహించి చెప్పుట అనుకరణము. (ఇది శబ్దానుకరణము. అర్థము మాత్రము పోలునట్లుగ చెప్పిన అర్థానుకరణము) తుభ్యం నమో యనె. కనకన మను. తటాలున లేచె.

(ఈసందర్భమున తెలుగున 'అను'ధాతురూపములు చేర్పబడుటచే అనుధాతురూపములను చేర్చుట తెలుగున అనుకరణము అని కొందరు చమత్కరింతురు.)

**14. అనుప్రయోగము :** (కార.10) (అనుప్రయుజ్యతే ఇత్యనుప్రయోగః) అనుసరించి ఎడము లేకుంచు, తరువాతగా ప్రయోగించుట అనుప్రయోగము. 'ఉండిపదం బొకానొకచో వలనవర్ణకంబున కనుప్రయుక్తం బగు' నాకంబువలననుండి నారదుండు వచ్చెను. ఉండి అనుపదము ఇచట అనుప్రయోగము ఐనది. ఇది లేకుండ గూడ అర్థమునకు భంగము లేదు. నాకంబువలన వచ్చె.

**15. అనుబంధము :** (క్రియ. 13) (అనుబధ్యతే ఇత్యనుబన్ధః) సంస్కృతమున అనుబంధ మనగా ఇత్తు. కాని తెలుగున అనుసరించి (వెంట) కూడియుండు (ప్రకృతి, ప్రత్యయము మొ॥ రూపమైనది అని మాత్రమె అర్థము. 'ఉదంతంబునకు లట్టు పరంబగునపు డున్నానుబంధం బగు' వండు+ఉన్న=వండుచున్నాడు.

ఇచట ఉన్న అనునది ధాతువునకు అనుబంధము. ఇట్లె కలజి, పడుజి-మొ॥ అనుబంధము లేక ప్రకృతి ఈఅర్థమున నుండదు.

(అనుబంధము లేసిచో అర్థభంగ మగును. అన్యప్రయోగము అట్లు కాదు. వండఁబడెను. ఇట పడు లేక కర్మార్థ ముండదు. అందుచే పడుజి లేక ఈఅర్థమున ధాతువు ప్రయోగింపబడదు. కాన ఇది అనుబంధము. నిలువఁబడు (క్రియ. 109) ఇట పడు లేకున్నను ఉన్నప్పటిఅర్థమునకు భంగము లేదు. నిలువబడెను= నిలిచెను. అందుచే 'పడు' లేకుండ కూడ ధాతువు ఈఅర్థమున ప్రయోగింపబడును. కావున ఈ'పడు' అన్యప్రయుక్తము, శబ్దపల్లవములు వి శేషవిధానస్థలములు.)

**16. అనువృత్తి** : (పూర్వసూత్రస్థితపదస్య పరసూత్రే షూపస్థితిః) వెనుకటిసూత్రమునందలిపదము(లు) అన్వయమునకై తరువాతిసూత్రమునందు వచ్చి చేరుట అనువృత్తి. 'ఉత్తున కచ్చు పరం బగునపుడు సంధి యగు' అనుపూర్వసూత్రమునం దున్న 'అచ్చు పరం బగునపుడు' అనుపదములు ప్రథమేతరవిభక్తి- అను తరువాతిసూత్రములోనికి వచ్చి ప్రథమేతర- ఉకారమునకు 'అచ్చు పరమగునపుడు' సంధి వైకల్పికముగా నగును అని అన్వయమును కూర్చును. కాన ఇది అనువృత్తి.

**17. అనౌపవిభక్తికము** : (అచ్చి. 16) ఔపవిభక్తికములు కానివి అనౌపవిభక్తికములు. ఔపవిభక్తికము లైన, ఇ-టి-తి అనువర్ణములు చేరుప్రాతిపదికలును ఔపవిభక్తికకములు. కాన చేరని ప్రాతిపదికలు అనౌపవిభక్తికములు. కల్లు(మద్యము) పల్లు(నిమ్నము) చిలుక మొ॥

**18. అపదము** : (సంధి. 11). పదము గానిది అపదము. సుప్తిఙంతం పదమ్. నామవిభక్తులు చివర నున్న, (సుబంతములు) క్రియావిభక్తులు చివర గల, (తిఙంతములు) వానికంటె ఇతరము

లైనశబ్దములు అపదములు. ప్రకృతి, ప్రత్యయము, ఆగమము- మొ॥ అపదములు. రామ, న, ఇంచు- మొ॥

**19.** అపవాదము : (క్రియ. 72) (యేన నాప్రాప్తే యో విధి రారభ్యతే స తస్య బాధకో భవతి-) అప(తొలగించునట్లుగా) వాద=(చెప్పుట) మనగా 'ఒకవిధి తప్పక ప్రవర్తింపవలసియుండగా అచటనే ప్రారంభింపబడిన వేరొకవిధి దానికి బాధకము (అపవాదము) అగును. రంజించు+ఇంచు అనుచోట 'రంజాదులయించుక్ప్రకారంబునకు సబిందుకంబున క్ప్రేరణంబున ద్విరుక్తలకారం బగు' అనువిధిచే ద్విరుక్తలకారము ప్రాప్తించుచుండగా, 'ఇంచుక్కుపరం బగునపుడు రంజాదులయించుక్కునకు లోపం బగు' అని ఆరంభింపబడినవిధి లకారాదేశమును బాధించుచు 'అపవాద' మగుచున్నది.

**20.** అపాదాన(కారక)ము : (కార. 9) (ధ్రువ మపాయేఽపాదానమ్. అపాయో విశ్లేషః తస్మిన్ సాధ్యే ధ్రువ మవధిభూతం కారక మపాదానం స్యాత్) అపాయము అనగా ఎడబాటు (వియోగము) దేనినుండి కలుగునో దానికి అపాదానము అని సంజ్ఞ. దానికి తెలుగున వలన ప్రత్యయ మగును. వృక్షమువలన ఆకు పడెను. ఇట (ఆకునకు వృక్షమునుండి వియోగము కావున)వృక్షము అపాదానము.

**21.** అభివ్యాపకము : (కార. 17) (సకలావయవవ్యాప్తి కృతఆధారః అభివ్యాపకః) ఎల్లయెడలను ఆశ్రయించియుండునట్టి ఆధారము అభివ్యాపకము. సర్వంబునం దీశ్వరుండు గలండు. ఈశ్వరునకు(జగత్తు) 'సమస్తము' ఆధారము. కాన ఇది అభివ్యాపకము అగు ఆధారము.

**22.** అమహత్తు: (తత్స.17) 'స్త్రీతిర్యగ్జడభిన్నంబులును వాని విశేషణంబులును మహత్తు లనంబడు' స్త్రీలను, పశువులు, పక్షులు

మొదలగు, తిర్యక్కులను, అచేతనములను బోధించుశబ్దములును వానివిశేషణములును అమహత్తులు. రమ-చిలుక- మేడ ఉన్నతము.

**23. అముఖ్యకర్మ :** (కార. 6) (అకథితం చ. అపాదానాది విశేషై రవివక్షితం కారకం కర్మసంజ్ఞం స్యాత్.) సంస్కృతమున దుహ మొ॥ ధాతువులప్రధాన మగుకర్మకు, (అనగా ఈ ధాతువులకు కర్మలు రెండుండును. ఇవి ద్వికర్మకధాతువులు.) సంబంధించినదయి, అపాదానము, అధికరణము, ఇత్యాదిగా చెప్పబడనిది అకథితకర్మ. అదే అముఖ్యకర్మ. 'వచ్యర్థాముఖ్యకర్మంబునకుం దోడకువర్ణకంబులు ప్రాయికంబుగ నగు' చైత్రుడు మైత్రునితో ఇట్లనియె 'ఇట్లు' ముఖ్యకర్మ, మైత్రుడు అముఖ్యకర్మ.

**24. అరిసమాసము :** చూ. వైరిసమాసము.

**25. అలఘువు :** చూ. లఘువు.

**26. అలుక్సమాసము :** (సంధి. 43) చూ. 157పుట.

**27. అవసానము :** (సంధి. 20) (విరామో ఽవసానమ్. వర్ణానా మభావః అవసానసంజ్ఞం స్యాత్.) పిదప వర్ణములు లేకుండుట అవసానము. (వాక్యాదులందు) చివర అని అర్థము. వాడు వచ్చెను. ఇచ్చట 'ను'వర్ణమునకు పిదప వర్ణములు లేవు కావున దానిస్థానము అవసానము.

**28. అవ్యాప్తి :** (సంధి. 6) (లక్ష్యైకదేశే లక్షణాప్రవృత్తి రవ్యాప్తిః లక్ష్యమునం దొకభాగమున లక్షణము ప్రవర్తింపకపోవుట అవ్యాప్తి. 'క్త్వార్థం బైనయిత్తునకు సంధి లేదు'- అనులక్షణము క్త్వార్థకేకారమునకు సామాన్యముగా జెప్పినసంధినిషేధము, ఎఱింగెఱింగి అను కొన్నిచోట్ల వర్తించుట లేదు. కావున అట ఈలక్షణమునకు అవ్యాప్తి.

**29. అసంయుక్తము :** చూ. సంయుక్తము.

**30. ఆకృతిగణము :** (ఆకృత్యా ఏవం జాతీకయా నిర్దేశ్యో గణః ఆకృతిగణః. లోకప్రయోగానుసారేణ ఏవం జాతీయకాః శబ్దాః అస్మిన్ గణే నివేశనీయాః) కవిప్రయోగములందు సమానమైనఆకృతి (లక్షణము) కలిగిన వానిని చేర్చుకొనదగినగణము ఆకృతిగణము సంధి వికల్పముగా నగుట అను(ఏమిశబ్దముతో) సామ్యము ప్రయోగములందున్నట్టిశబ్దము ఏమ్యాదులలో చేర్పదగును. కావున అది ఆకృతిగణము. 'మగని'+ఆలు మగనాలు మగనియాలు. మగని ఏమ్యాదులలో చేరును.

**31. ఆఖ్యాతము :** (కార.1) (క్రియాప్రధాన మాఖ్యాతమ్ ఆఖ్యాత మనగా తిఙంతము (తిఙ్) అని యర్థము. క్రియావిభక్తి లేదా, క్రియావిభక్తి చివర గలిగినపదము ఆఖ్యాతము. వచ్చుచున్నాఁడు మొ॥

**32. ఆగమము :** (సంధి. 3) 'ఆగమం బనఁగా వర్ణాధిక్యంబు' ఉన్న వర్ణము లన్నియు అట్లె ఉండగా అధికముగా వచ్చి చేరు వర్ణము(లు) ఆగమము. మా+అమ్మ. మాయమ్మ ఇచట యకారము ఆగమము వచ్చెను, ఇట "యడు" ఆగమము

**33. ఆచ్ఛికము :** (ఆచ్ఛి. 2) అచ్చతెనుగే ఆచ్ఛికము. చూ.అచ్చ.

**34. ఆచ్ఛికసమాసము :** (సమా. 2) సంస్కృతసమము కంటె తక్కిన తెనుఁగులసమాసం బాచ్ఛికం బనంబడు. అచ్చతెనుగు శబ్దములకు అయిన సమాసము ఆచ్ఛికసమాసము. తేనియానతి. ఈ సమాసమున తేని(యొక్క) ఆనతి అనుశబ్దములు రెండును ఆచ్ఛికములే అగుటచే ఇది ఆచ్ఛికసమాసము.

**35. ఆత్మనేపదకర్త్రర్థము :** (క్రియ. 122) క్రియాఫలము కర్తృగామి యగుట ఆత్మనేపదార్థము. క్రియాపదముచే కర్త తెలియబడిన అది కర్త్రర్థము. మైత్రుడు వంటకము వండుకొనెను,వండుకొను

అనునది క్రియాఫల మైన వంటకము కర్త యగుమైత్రుని పొందుట తెల్పును. కాన ఆత్మనేపదము. ఈక్రియ కర్త యగుమైత్రుని బోధించుచున్నది. కావున కర్త్రర్థము. అందుచే వండుకొనెను- ఆత్మనేపదకర్త్రర్థము.

**36. ఆత్మనేపదకర్మార్థము :** క్రియాఫలము కర్తృగామి యగుచో ఆత్మనేపదార్థము. క్రియాపదముచే కర్మ తెలియబడినచో కర్మార్థము 'మైత్రునిచే వంటకము వండుకొనబడెను'. వండుకొను అనునది క్రియాఫలము కర్తను పొందుటను తెలుపుటచేఆత్మనేపదము. వండుకొనబడు అనునది కర్మను తెలుపుటచే కర్మార్థము. కావున వండుకొనబడెను- ఆత్మనేపదకర్మార్థము.

**37. ఆత్మనేపదార్థము :** (క్రియ. 52) క్రియాఫలము కర్తృగామిఅగుట. ఆత్మనేపదార్థము. ఈఅర్థమున ధాతువుపై తెలుగున కొను అనుధాతువు చేరును. దేవదత్తుడు వండుకొనెను. ఇచట వండుట అనుక్రియకు ఫలము అయినవంటకము వండువ్యాపారమునకు కర్త అయినదేవదత్తునే పొందుచున్నది. కావున ఇది ఆత్మనేపదార్థము.

**38. ఆదేశము :** (తత్స. 35) (వర్ణస్థానే వర్ణాంతరోత్పత్తిరాదేశః వర్ణము(ల) యొక్క చోట వచ్చిన వేరు వర్ణము(లు) ఆదేశము. 'ఉదంతసంస్కృతనాంబుసంబుద్ధిమ్జునకు నూకారంబు ప్లుతంబా దేశంబు విభాష నగు' విష్ణు+మ్జ్-విష్ణు+ఊ3 =విష్ణూ3- మ్జ్ అనువర్ణముస్థానమున వచ్చిన దగు ఇచ్చటిప్లుత మైనఊకారము ఆదేశము.

**39. ఆనంతర్యము :** (క్రియ. 43) అంతరము లే(కా)నిది అనంతరము, అనంతరము భావము ఆనంతర్యము అంతరము అనగా ఎడము- వ్యవధానము. ఇచట - కాలమునకు సంబంధించిన దగువ్యవధానము లేకుండుట అనంతర్యము. వెంటనే అని అర్థము. 'ఆనంత

ర్యంబున డువర్ణకంబు ద్రుతాంతం బగు' జాబిల్లి తో తెంచుడుం గువలయంబులు వికసిల్లు. తో తెంచుడున్ = ఉదయించినవెంటనే.

**40. ఆమంత్రణము :** (తత్స. 14) చూ. సంబోధనము.

**41. ఆమ్రేడితము :** (సంధి. 10) (తస్య పర మామ్రేడితమ్. ద్విరుక్తస్య పరం రూప మామ్రేడితసంజ్ఞం స్యాత్) ఒకశబ్దము రెండు సార్లు ఉచ్చరించినపుడు అందు రెండవ (సారిఉచ్చరించిన) రూపము నకు ఆమ్రేడితము అని పేరు. ఏమి 'యేమి'.

**42. ఇత్తు :** (తత్స. 19) కార్యార్థము ప్రత్యయాదులందు నిబద్ధ మయి ప్రయోగించునపుడు మానంబడువర్ణ మిత్తు నాబడు'. డుఙ్. ఇందు ఙకారము (డువర్ణమునకు) పూర్వమునందు, బిందువు వచ్చుట అను ప్రయోజనముకయి, డు అను ప్రత్యయముతో కూర్పబడి 'రాముఁడు' అనువిధముగా ప్రయోగించుసమయమున లేదు (విడిచి పెట్టబడినది.) కావున ఇచట ఙకారము ఇత్తు.

**43. ఉక్తార్థము :** (కార. 1) ఉక్తము అనగా చెప్పబడినది. తిఙ్ (క్రియావిభక్తి) కృత్, తద్ధిత, సమాసములచే చెప్పబడునట్టి అర్థము ఉక్తార్థము. రాముడు మెచ్చెను ఇచట క్రియావిభక్తి. (పదము)చే రాముడు అనుకర్త చెప్పబడినది. ఇది ఉక్తార్థము ఇట్లె రాముడు రక్షించెడువాడు (కృత్) రాముడు సొగసరి (తద్ధిత) మొ॥.

**44. ఉత్తమము :** (తత్స. 46) (త్ర్యాదీనా మన్త్య ముత్తమమ్) మూడు గాని అంతకంటె ఎక్కువ గాని అక్షరము లున్నశబ్దములో చివరిఅక్షరమునకు ఉత్తమము అని సంజ్ఞ. కలికి ఇందు 'కి' ఉత్తమము. పిడికిలి- ఇందు 'లి' ఉత్తమము.

**45. ఉత్తమ (పురుష)ము :** (క్రియ. 9) 'లకారంబునకు ముజ్జువురుసము ఙ్గగు' అనుసూత్రమున విధింపబడినప్రత్యయములలో 'అందు వరుసను రెండేసి ప్రథమమధ్యమోత్తమంబు లనంబడు'

అనుసూత్రముచెప్పిన చివరి 'ను-ము' అను రెండింటికి ఉత్తమము అని సంజ్ఞ. అస్మదర్థమును బోధించునప్పుడు ఏకత్వమున (నేను) నువర్ణమును, బహుత్వమున (మేము) మువర్ణమును వచ్చును. (నేను) చదువుచున్నాను (మేము) చదువుదుము.

**46. ఉత్తరపదము :** (సమా. 11) (ఉత్తరపదత్వం చ సమాస చరమావయవే రూఢమ్.) సమాసమునందలిచివరిపదమునకు ఉత్తర పదము అని ప్రసిద్ధి. నీకరుణ. ఈసమాసమునందలి (నీయొక్క) 'కరుణ' అనుపదము చివరిది కావున ఉత్తరపదము.

**47. ఉత్సర్గము :** (తద్ధి. 2) (ఉత్సృజ్యతే ఇతి ఉత్సర్గః) విశేషవిధులవలన ప్రవర్తింపజేయక విడిచిపెట్టబడునది. ఉత్సర్గము. అనగా సామాన్యవిధి అని అర్థము. 'చిన్నాదులకు తికవర్ణకం బగు' అను అపవాద(విశేష)విధివలన 'తనవర్ణకంబు త్వార్థంబునందగు' అనువిధి వర్తింపక విడిచిపెట్టబడును. కావున అది (తనవర్ణకంబు ...) ఉత్సర్గ (సామాన్య)విధి. చిన్నతికము. (తద్ధి 3 చే చిన్నతనము).

**48. ఉపధ :** (సంజ్ఞ.10) (అలోఽన్త్యాత్ పూర్వ ఉపధా) ఉపధ యనగా తుదివర్ణమునకు ముందువర్ణము. శబ్దమునందు చివరి నుండి రెండవవర్ణమునకు ఉపధ అని పేరు. వాజి (వాజ్+ఇ) ఇందు జకారము ఉపధ.

**49. ఉపమానపూర్వపదకర్మధారయము:** (సమా. 8) విశేషణ మునకు విశేష్యముతో సమాసము కర్మధారయము ఉపమానము పూర్వ (సమాసమున మొదటి) పదముగా కలిగినకర్మధారయము ఉపమానపూర్వపదకర్మధారయము. 'చిగురుఁగేలు'-చిగురువంటి కేలు అను చెప్పిన ఈసమాసమున ఉపమానము (చిగురు) పూర్వపద మైయున్నది. కావున ఇది ఉపమానపూర్వపదకర్మధారయము. ఇట్టి జుంటిమోవి మొ॥

**50. ఉపమానోత్తరపదకర్మధారయము :** (సమా. 3) విశేషణమునకు విశేష్యముతో సమాసము కర్మధారయము. ఉపమానము ఉత్తర (సమాసమున చివరి) పదముగా కలిగినకర్మధారయము ఉపమానోత్తరపదకర్మధారయము. మోవిపండు- పండువంటిమోవి అనుచెప్పుచు ఈసమాసమున ఉపమానము (పండు) ఉత్తరపదముగా నున్నది కావున ఇది ఉపమానోత్తరపదకర్మధారయము.

**51. ఉపయోగము :** (కార.7) (నియమపూర్వకవిద్యాస్వీకారః) (బ్రహ్మచర్యము మొదలగు)నియమపూర్వకముగ విద్యను స్వీకరించుటకు ఉపయోగము అని ఇచ్చట సంజ్ఞ. 'ఉపయోగంబునందాఖ్యాతకుం దోడపర్ణకం బగు' రామకృష్ణులు 'సాందీపనితోడ' వేదంబులు చదివిరి.

**52. ఉపవిభక్తి :** చూ. ఔపవిభక్తికము.

**53. ఉపసర్గ(ము) :** (క్రియ.121) (ఉపసర్గాః క్రియాయోగే) క్రియతో సంబంధ మున్నపుడు ప్ర, పరా, అను మొద లగువాని (23)కి ఉపసర్గ(ము)లు అని సంజ్ఞ. ప్రభవించు. ఇందు 'భూ' అను ధాతువుతో యోగ ముండుటవలన 'ప్ర' అనునది ఉపసర్గ(ము).

**54. ఉపోత్తమము :** (తత్స.46) (త్ర్యాదీనా మన్త్య ముత్తమమ్, తస్య సమీప ముపోత్తమమ్) ఉత్తమమునకు సమీపమునందున్నది ఉపోత్తమము. మూడు, లేదా అంత కెక్కువ అక్షరములున్నశబ్దములో చివరి (అక్షరము ఉత్తమము) నుండి రెండవఅక్షరమునకు ఉపోత్తమము అని పేరు. కలికి- ఇందు 'లి' ఉపోత్తమము. పిడికిలి- ఇందు 'కి' ఉపోత్తమము.

**55. ఊష్మము :** (సమా. 14) (శషసహా ఊష్మాణః) 'శషసహ' అనునాలుగువర్ణములకు ఊష్మము లని సంజ్ఞ. ఊది (గాలిఅవిడువబడుచు) పలుకబడునవి గాన ఊష్మము లందురు.

**56. ఏకవచనము** : (తత్స.11) 'ఏకత్వసంఖ్యను బోధించు ప్రత్యయం బేకవచనంబు'. రాము'డు'. ఇచట 'డు' అనునది రాము 'డొక్కడు' (ఒకసంఖ్యకు ఆధారము) తెలుపుచున్నది కావున ఏకవచనము. ఇట్లే వచ్చుచున్నా'వు'- మొ॥

**57. ఔపవిభక్తికము** : (అచ్చ.28) విభక్తినిమిత్తకము లయి యాదేశాగమాత్మకంబు లయిన 'ఇ-టి-తి' అనువర్ణంబు లౌపవిభక్తికంబు లనంబడు. విభక్తిని నిమిత్తముగా చేసికొని ప్రాతిపదికకు చివర ఆదేశముగను, ఆగమముగను వచ్చునట్టి ఇ-టి-తి అనువర్ణములను ఔపవిభక్తికము లని పేరు. విభక్తికి సమీపమునందగుటచే వీనిని ఉపవిభక్తు లనియు అందురు. ఇ-ఊరిని, టి- రెంటికి, తి-గోతులు మొ॥ ఈఔపవిభక్తికములు చేరు ప్రాతిపదికలకును ఔపవిభక్తికములు అని వ్యవహారము. ఊరు- మొ॥

**58. ఔపశ్లేషికము**:(కార.17)(సంయోగాదిసంబంధప్రయోజ్య ఆధారః ఔపశ్లేషికః) సమీప(సంయోగ)సంబంధ రూప మైనఆధారము ఔపశ్లేషికము. ఏకదేశసంబంధము గలఆధారము. ఘటమందు జల మున్నది. ఇచట జలమునకు ఆధారము కుండలో కొంత(లోపలి) భాగము, అనగా కుండయం దేకదేశము. కాన జలమునకు ఘటము ఔపశ్లేషిక మగుఆధారము.

**59. కరణ(కారక)ము** : (కార.4) (క్రియాసిద్ధౌ ప్రకృష్టోపకారకం కారకం కరణసంజ్ఞం స్యాత్) క్రియాసిద్ధిం బ్రకృష్టోపకారకంబు కరణంబు. క్రియ సిద్ధించుటలో (ఇతరములకంటె) అధికముగా ఉపకరించునట్టి సాధనమునకు కరణము అని సంజ్ఞ. కోలచేత కూల్చె కూల్చుట అను క్రియ జరుగుటకు ప్రకృష్టసాధన మగుటచే ఇట 'కోల' కరణము.

**60. కర్త** : (కార.3) 'ధాత్వర్థవ్యాపారాశ్రయంబు కర్త నాఁబడు'. ధాతువునకు అర్థ మయినవ్యాపారము దేనిని ఆశ్రయించి

యుండునో (పనిచేసినవాడు) అది కర్త. దేవదత్తునిచేత వంటకము వండఁబడెను. 'వండు' ధాతువునకు అర్థమైన వంటచేయుట అను వ్యాపారము దేవదత్తుని ఆశ్రయించియున్నది (వంటచేసినవాడు). కావున ఇచట దేవదత్తుడు కర్త.

**61.** **కర్మధారయము :** (సమా.3) విశేషణంబునకు విశేష్యంబుతోడ సమాసంబు కర్మధారయంబు నాఁబడు. నల్లనియావు. నల్ల అనువిశేషణమునకు, ఆవు అనువిశేష్యముతో సమాస మయినది కావున ఇది కర్మధారయము.

**62.** **కర్మము :** (కార.2) 'ధాత్వర్థఫలాశ్రయంబు కర్మము నాఁబడు'. ధాతువునకు అర్థమైనఫలము దేనిని ఆశ్రయించియుండునో అది కర్మము. దేవదత్తుఁడు వంటకమును వండెను. 'వండు' అను క్రియకు ఫలము వండబడినపదార్థము. అది వంటకమును ఆశ్రయించి యున్నది. కావున ఇట వంటకమునకు కర్మ అని సంజ్ఞ.

**63.** **కళ :** (సంజ్ఞ.13) 'ద్రుతప్రకృతులు గానిశబ్దంబులు కళ లనంబడు' నకారము ద్రుతము. చివర ద్రుతము కలిగినపదములు ద్రుతప్రకృతులు. కావున చివర ద్రుతము లేని ద్రుతప్రకృతులు కాని, పదములకు కళలు అని సంజ్ఞ. రాముఁడు, వనము మొ॥

**64.** **కారకము:** (కార.1) (కారకే. క్రియాజనకమ్ కారకమ్, కరోతి క్రియాం నిర్వర్తయతి ఇతి కారకమ్) కర్మ, కర్త మొ॥వానికి కారకము అని సంజ్ఞ. క్రియాజనకము కారక మని కారకశబ్దము యొక్క అర్థము. అనగా క్రియను గూర్చినఆకాంక్షను కలిగించునది కారకము. 'దేవదత్తుఁడు' అనగా ఏమి చేసెను ఇత్యాదిగా క్రియను గూర్చినఆకాంక్ష కల్గును కావున అది కారకము. (ఇదికర్తృకారకము) రామునియొక్క అనుచో ఇల్లు క్రియాకాంక్ష లేదు కావున ఆషష్ఠి కారకము కాదు.

**65. కిత్తు :** (సంధి. 35) కకారము ఇత్తు (ఇద్వర్ణము)గా కలిగినది కిత్తు. దు(క్), టు(క్), మొ॥ 'ఆద్యన్తౌ టకితౌ' అనుసంస్కృత పరిభాషను అనుసరించి కిత్తగువర్ణము విధింపబడినదానికి అంత్య అవయవము (చివర)గా వచ్చి చేరును. నీ+కరుణ. పూర్వపదమునకు చివర దు'క్ వచ్చి నీదు (కరుణ) అని అగును. ఇట 'దు' కిత్తు.

**66. కృత్తు. 67. కృదంతము :** (కృత్. 1) (కృదతిఙ్) ధాతువునకు విహితం బగుచుఞ్భిన్నప్రత్యయంబు కృత్తు నాబడు', ధాతువుపై విధింపబడిన చుఞ్, రు, మొ॥ క్రియావిభక్తులకంటె వేరైన ప్రత్యయమునకు కృత్తు అని సంజ్ఞ. కృత్ ప్రత్యయము అంతమందు గలిగినశబ్దము కృదంతము. వండుట. వండుధాతువుపై చుఞ్కు భిన్నముగా విధింపబడిన ప్రత్యయ మగు'ట' కృత్తు. అది చివర గలదు గావున 'వండుట' కృదంతము.

**68. క్తవదర్థము :** (క్రియ. 46) క్తవత్ అనుదానియొక్క అర్థము క్తవదర్థము. భూతార్థముసం దున్న ధాతువునకు కర్త్రర్థము నందు సంస్కృతమున 'క్తవత్' ప్రత్యయము విధింపబడినది. ఆఅర్థమునందు తెలుగున 'ఉన్నకలఙనవర్ణకంబులు భవద్భావిశత్రుక్తవదర్థంబులం దగు' అని న ప్రత్యయ మగును. చదివినవాడు. క్తవత్ ప్రత్యయార్థము గలది కావున ఇది క్తవదర్థము.

**69 క్త్వార్థము :** (క్రియ. 38) క్త్వా అనుసంస్కృత ప్రత్యయము యొక్క అర్థము క్త్వార్థము. 'సమానాశ్రయంబులం బూర్వకాలంబునం దివర్ణకం బగు' ఇదియె క్త్వార్థంబు నాబడు. రాముడు వచ్చి ఇచ్చెను. రాముని ఒక్కనే ఆశ్రయించిన (సమానాశ్రయములగు) వచ్చుట ఇచ్చుట అనుక్రియలలో ఇచ్చుటకంటె వచ్చుట పూర్వకాలమునకు చెందినది కావున దానికి ఇ ప్రత్యయము. ఇది క్త్వార్థము.

**70. క్రియావిశేషణము :** (క్రియ. 115) క్రియయొక్క

విశేషణము క్రియావిశేషణము. విశేషమును తెల్పునది విశేషణము. గట్టిగా చదివెను. చదువుట అనుక్రియలోనివిశేషమును తెలుపుచు ఆక్రియతో అన్వయించుచున్నది. కావున గట్టి(గా) అనునది క్రియా విశేషణము.

**71. క్లీబతుల్యము :** (తత్స. 66) క్లీబము అనగా నపుంసక లింగము క్లీబముతో తుల్యమగు (సహజముగా క్లీబము గాని) సంస్కృత (సమ) ప్రాతిపదికము క్లీబతుల్యము. 'కంధరాదులు క్లీబ తుల్యంబులు బహుళంబుగా నగు' కంధర విధ మొ॥ స్త్రీలింగములైనను క్లీబతుల్యతచే వీనికి క్లీబకార్యము లగును. కంధరము, విధము మొ॥

**72. క్లీబసమము :** (అచ్చ. 2) క్లీబము అనగా నపుంసక లింగము. క్లీబముతో సమము అగు (క్లీబము, ఏలింగమును కాని) అచ్చతెనుగు ప్రాతిపదికము క్లీబసమము. 'అచ్చశబ్దంబు లెల్లం దఱుచుగ స్త్రీసమంబులు క్లీబసమంబులు నయియుండు సున్న-సన్న-మొ క్లీబసమత్వముచే క్లీబములకువలె కార్యము లగును. సున్నము. సన్నము మొ॥

**73. గుణము :** (క్రియ. 66) (అదేఙ్ గుణః) అ,ఏ,ఓ అను మూడు వర్ణములకును గుణము అని సంజ్ఞ. భిద్+ఇంచు- భేదించు కుప్+ఇంచు కోపించు (ఇ-ఏ, ఉ-ఓ) ఋకారమునకు వచ్చుగుణమగు అకారము రేఫము పిదప కలిగి 'అర్' అనుఆకృతితో నుండును. వష్+ఇంచు- వర్షించు.

**74. గ్రామ్యము :** (సంజ్ఞ. 22) లక్షణవిరుద్ధం బగుభాష గ్రామ్యంబు. వ్యాకరణమునకు విరుద్ధముగా ఉన్నశబ్దమునకు గ్రామ్యము అని పేరు. వస్తాను (రాఁగలఁను అనునది వ్యాకరణ బద్ధము) ఇట్టిది కావ్యములందు ప్రయోగింపరాదు. కావున ఇట్టి వానిని కొందరు నింద్యగ్రామ్యము లందురు.

**75. జిత్తు :** (తత్స. 10) జగారము ఇత్తుగా గలిగినది జిత్తు. డుజ్, పజ్ - మొ॥ వానిలో జకారము ఇత్తు. కావున అచ్చటి, డు, ప, మొదలగునవి జిత్తులు. 'జిత్తు బిందుపూర్వం బగు' అనుసూత్రముచే జిత్తులకు ముందు సున్న వచ్చును. రాము+డుజ్, రాముఁడు, రాముండు మొ॥

**76. జీత్తు :** (క్రియ. 20) జి అనునది ఇత్తుగా కలిగినది జీత్తు. కజి, కలజి, పడుజి మొదలగువానిలోని జివర్ణము ఇత్తు. కావున ఇచ్చటికల, పడు మొదలగునవి జీత్తులు. 'జీత్తు పరంబగునపు డుత్వంబున కత్వం బగు' అనుసూత్రముచే ఇవి పర మగునపుడు ధాతువు చివరిఉత్వమునకు అత్వము వచ్చును. చేయు+క- చేయక మొ॥

**77. చేదర్థము :** (క్రియ. 41) చేత్ అనునది సంస్కృతమున అవ్యయము ఈ శబ్దముయొక్క అర్థము చేదర్థము. అయినచో, ఏని అనువిధముగా నున్న అర్థము చేదర్థము. ఈ అర్థమునందు ధాతువునకు 'నను' అనుప్రత్యయము వచ్చును. వచ్చినన్ =వచ్చినచో మొ॥

**78. జడము :** (తత్స. 17) జడములు అనగా అచేతనములు. చేతన అనగా జ్ఞానము, లేనిది చేతనము. సంకల్పాదిరూపమైన తెలివి లేనిది జడము. చెట్టు, రాయి మొ॥ చేతన మనగా ప్రాణి కావున అచేతనము = జడము అనగా ప్రాణము లేనిది (అప్రాణి) అనియు అర్థము.

**79. జడ్డ :** (ప్రకీ.8) ఒకే హల్లు ద్విరుక్తమైనపుడు అందలి రెండవసారిఉచ్చరింపబడినహల్లు జడ్డ అని ఇచ్చట అర్థము. 'అక్కట' క్క అనుచో రెండవకకారము జడ్డ.

(జడ్డయంచనగను సంయుక్తము అని వేరుహల్లులకూడికయు జడ్డయగునని కొందరు భావించిరి. ఈపక్షమున కూడినహల్లుల మొత్తము జడ్డ యగును. సంయుక్తము. 'క్త' అనునది జడ్డయన్నమాట. ఇది విచారింపదగినది.)

**80.** జడ్డక్కరము : (ప్రకీ.9) ఒకే హల్లు ద్విరుక్తమైనపుడు అందలి రెండవహల్లునకు జడ్డ యని పేరు. అక్కట, (క్కలో రెండవ కకారముజడ్డ) జడ్డకలిగినఅక్షరము జడ్డక్కరము. అక్కట- అనుచో 'క్క' అనునది జడ్డక్కరము. ఇట్లే అడ్డులో డ్డు.

**81.** జ్ఞాపకము : (క్రియ.65) (అనుమానాత్ బోధనమ్) పొగను చూచి నిప్పు ఉండుటను నిశ్చయించినవిధముగా లక్షణమును బట్టి లక్ష్యము స్థితిని- (లక్షణము ద్వారాన) తెలుపునది (శాస్త్రము) జ్ఞాపకము- 'నిర్జినామంబుల కయుగాగమము కలుగదు'. అనుచో నామములకు అయుగాగమము నిషేధించిన లక్షణముచే అది ఇంచుగాగమము పరమైనపుడే అగును గావునను, ఇంచుక్కు ధాతువులకే అగును గావునను నామములకు ధాతుత్వవివక్షలో ఇంచుగాగమము వచ్చును అను అర్థమును బోధించును. కావున ఇది నామముల ఇంచుక్కునకు జ్ఞాపక(విధి)ము అగును. ముందుగా వ్యర్థమైనవిధి వేరొకఅర్థమును తెలుపుచు జ్ఞాపక మగును.

**82.** టిత్తు : (సంధి.3) టకారము ఇత్తు (ఇద్వర్ణము)గా గలిగినది టిత్తు. యుట్, లట్, ఇయుట్ అనుచోట్ల టకారము ఇత్తు. కావున, ఈచోటి, యు, ల, ఇయు అనునవి టిత్తులు. 'ఆద్యన్తౌటకితౌ' అనుసంస్కృతపరిభాషచే టిత్తగువర్ణము విధింపబడినదానికి ఆద్యవయవము(మొదట)గా వచ్చి చేరును. మా+అమ్మ అనుచో పరస్వరమునకు యుట్ రాగా మా+య్అమ్మ-మాయమ్మ.

**83.** డుఞ్ఞు : (క్రియ.15) 'లకారంబునకు డు్రువురునుము ఞ్ఞగు' అనుసూత్రమునందలి డువర్ణమును చివరిఞకారముతో కూర్చి చేసినప్రత్యాహారము 'డుఞ్ఞు'. ఈప్రత్యాహారముచే, 'డు్రువురునుము' అను ఇచ్చటివర్ణములు బోధింపబడును. వీని కాదేశములుగా వచ్చు డు, వు, ము, డుఞ్ఞు, మొదలగు నవియును 'డుఞ్ఞు' అనుదానిచేత గ్రహింపబడును. చదువుచున్నాడు- మొ॥

**84.** డుమంతము : (తత్స.20) 'డుజ్వర్ణకంబునకుం బ్రకృతి

యయినది డుమంతం బనంబడు' (ప్రథమావిభక్తి ఏకవచనమున) డుజ్ అను ప్రత్యయము చేరు (నిలుచు) నట్టి ప్రాతిపదికమునకు డుమంతము అని సంజ్ఞ. (రాముఁడు, శంభుఁడు.) రామ, శంభు, విధాతృ మగ మొ॥ డుమంతములు.

**85. తత్పురుషము :** (సమా.3) ఉత్తరపదార్థప్రధాన మగు సమాసము తత్పురుషము. ఇది సమానాధికరణము, వ్యధికరణము నని రెండువిధములు. నల్లకలువ, రాముని బాణము. ఇచ్చట సమాసములందు పూర్వపదము ఉత్తరపదముతో అన్వయించుచుండఁగా, ఉత్తరపదముయొక్క అర్థమె వాక్యమున తరువాతిపదములతోను, క్రియతోను అన్వయించుచు ప్రధాన మగుటచే ఇవి తత్పురుష సమాసములు.

**86. తచ్ఛీలము :** (క్రియ.6) (తస్య శీలమ్. తచ్ఛీలమ్) తత్ = ఆక్రియకు కర్తయొక్క, శీలమ్, స్వభావము అని యర్థము. జ్వలనజ్వాల లుప్పరం బెగయును. ఎగయుధాతువుపై జ్వాలనుని(కర్త) యొక్క శీలమను అర్థమున 'తద్ధర్మాద్యలందు లా ట్టగు' అని లాట్టు అయినది. జ్వాల లెగయుట జ్వలనునిశీలము.

**87. తత్సమము :** (సంజ్ఞ.19) 'సంస్కృతప్రాకృతతుల్యం బగుభాష తత్సమంబు' సంస్కృతముతో లేదా ప్రాకృతముతో తుల్యమైన(తెలుగు)శబ్దములు తత్సమములు. సంస్కృతముతో తుల్యమైనశబ్దము సంస్కృతసమము. (రామః) రాముఁడు. ప్రాకృతముతో తుల్యమైనది ప్రాకృతసమము. (సిరీ). సిరి ఈరెండింటిని కలిపి తత్సమము అందురు. సమము, తత్సమముఅనునవి సంస్కృత సమము అనుఅర్థమునను ఉపయోగించుట కలదు.

**88. తద్ధర్మము :** తస్య ధాతోః (కర్తుః) ధర్మః తద్ధర్మః ధాతువు కర్తయొక్కధర్మము తద్ధర్మము వర్తమానము మొదలగు కాలములకు పరిమితము కాక, కర్తృధర్మముగా ధాతువుయొక్క

అర్థమును మాత్రమే తెలుపునది తద్ధర్మము. సూర్యుఁడు ప్రకాశించును. ప్రకాశించుట సూర్యుని-కర్తృ-ధర్మము.

**89. తద్ధర్మార్థవిశేషణము :** (సంజ్ఞ. 32) ధాతువు(కర్త)యొక్క ధర్మము తద్ధర్మము. తద్ధర్మార్థమునం దున్నధాతువుపై కర్త్రర్థమున ఎడి, ఎడు ప్రత్యయములును వానికి లోపమును వచ్చును, తద్ధర్మార్థకములైన యీ విశేషణము తద్ధర్మార్థవిశేషణము. చదివెడివాఁడు, చదివెడువాఁడు, చదువువాఁడు.

**90 తద్ధితము :** 'తస్మై ప్రయోగాయ హితమ్ తద్ధితమ్' అని దీనివ్యుత్పత్తి. స్వార్థము, మతుబర్థము మొదలగుఅర్థములలో ప్రథమ మొదలగువిభక్తులు చివరగల శబ్దములపై చేరుప్రత్యయములు తద్ధితములు. చిఱుతుక. చిఱుత అనుశబ్దముపై స్వార్థమునం దయిన 'ఉక' తద్ధితము.

**91. తద్భవము :** (సంజ్ఞ. 20) 'సంస్కృతప్రాకృతభవం బగుభాష తద్భవంబు' సంస్కృతమునుండియు, ప్రాకృతమునుండియు పుట్టినశబ్దములు తద్భవములు. సంస్కృతశబ్దమునుండిపుట్టినది సంస్కృతభవము. (ఆకాశః) ఆకసము. ప్రాకృతమునుండిపుట్టినది ప్రాకృతభవము. (ఇంగాలో) ఇంగలము. ఈ రెంటిని గలిపి తద్భవము అందురు.

**92. తపరకరణము :** (తత్స. 45) (త) తకారమును (పర) తరువాతగా (కరణ) చేర్చు(యు)ట - తపరకరణము. 'ఇత్తునకు బహువచనంబు పరం బగునపు డుత్వం బగు' ఇచట ఇత్తు-ఇత్- అనుచో హ్రస్వ మగుఇకారమునకు తరువాతగా తకారము చేర్పడినది. ఇట్లు చేయుటయే తపరకరణము. 'తపర స్తత్కాలస్య' అను ఆద్యపరిభాషచేతపరకరణమువలన ఇత్ అనునది హ్రస్వమగుఇకారము నొక్కదానినిమాత్రమే బోధించును. హరి+లు హరులు. (లకోరీలు).

**93. తాచ్ఛీల్యము :** (తద్ధి. 28) (తత్ శీలం యస్య సః తచ్ఛీలః, తచ్ఛీలస్య భావః, తాచ్ఛీల్యమ్- తాచ్ఛీల్యమ్ తత్ స్వభావతా) తాచ్ఛీల్యము అనగా ఆస్వభావము కలిగినవానితన మని యర్థము. ఈ అర్థమున మారి, పోతు అనుతద్ధితప్రత్యయము లగును. తిండిపోతు. తిండి (తినుట) స్వభావముగా కలిగివాఁడు. మంటమారి మొ॥

**94. తాలవ్య(చజ)ములు :** (సంజ్ఞ. 7) తాలువునుండి పుట్టినది అనగా ఇచట తాలువుసహాయముచే ఉచ్చరింప బడునది తాలవ్యము. తాలు వనగా నోటియందు పైభాగమున ముందరిదంతములకు కొంచెము వెనుకనున్న భాగము. ఇ,చ,శ, మొ॥ 'ఇఈఎఏలం గూడినచజలు తాలవ్యంబులు' చిలుక, జేజె. మొ॥ తాలువుసహాయముచే పలుకబడుటవలన ఇఈఎఏలతో గూడినచజలు తాలవ్యచజలు.

**95. తాలవ్యవక్రము :** (ప్రకీ. 3) ఎఏఒఓలు వక్రంబు లని ప్రాచీనులు వ్యవహరింతురు. తాలువు స్థానముగా కలిగిన వక్రములు తాలవ్యవక్రములు. ఏదైతోః కంఠతాలు అనుటచే వక్రములలో ఎఏలు తాలవ్యములు కావున అవి తాలవ్యవక్రములు. (ఓదౌతోః కంఠోష్ఠ్యమ్ అనుచోప్పున ఒఓలు ఓష్ఠ్యవక్రము లగును.)

**96. తిజంతము :** తిజ్ అంతమందు కలది తిజంతము. తిఙ్లు సంస్కృత (క్రియా) విభక్తులు. వానికి పర్యాయముగా తెలుగున లకారంబునకు మధ్యమపురుషము ఙను' అనుసూత్రముచే విధింప బడిన 'మధ్' ప్రత్యయములు అంతమందు గలవానిని (మధ్యంతము) తిజంతము లని చెప్పనగును. క్రియావిభక్తులు చివరగలవి క్రియా పదములు. అవే తిజంతములు. వచ్చుచున్నాఁడు. రాదు మొ॥

**97. తిర్యక్కు :** (తత్స. 17) తిర్యక్కు లనగా పశుపక్ష్యాదులు. (తిర్యక్కుగా=అడ్డముగా, తిరుగునవి) పశువులు, పక్షులు,

కీటకము మొ॥ వానిని బోధించుశబ్దములు తిర్యక్కులు. స్త్రీపురుషులు జడములు కాక మిగిలినవి. ఏనుగు, చిలుక, చీమ మొ॥

**98.** తుమర్థము : (క్రియ. 40) తున్-తుమున్ అను ప్రత్యయముయొక్క అర్థము తుమర్థము (తుమున్నర్థము) తుమున్ ణ్వులౌ క్రియాయాం క్రియార్థాయామ్' అని వేరొకక్రియ ప్రయోజనముగాఁగలిగినక్రియ ఉపపదమై యుండఁగా ధాతువునకు భవిష్యదర్థమున సంస్కృతమున తుమున్ ప్రత్యయ మగును. 'తుమర్థభావలక్షణంబులందు నుజీ యగు' చైత్రుండు వండనుబోయెను. పాకక్రియార్థము పోయె నని యర్థము. పోయెను అను (క్రియాంతరము)నది ఉపపదముగా నుండఁగా వండుధాతువునకు భవిష్యదర్థము(చేయబోవువంట) నుజీప్రత్యయమైనది' ఇది తుమున్ ప్రత్యయార్థము కాన తుమర్థము. తదర్థము (దానికొఱకు) అని తుమర్థము. వండన్ = వండుటకొఱకు.

**99.** తృవర్థకార్థము ; **100** త్రర్థము : (క్రియ. 44, 106) తృ(చ్) అనుసంస్కృతప్రత్యయముయొక్క అర్థము తృవర్ణకార్థము. 'ణ్వుల్ తృచౌ' యని తృచ్ ప్రత్యయము ధాతువునకుతద్ధర్మాదులందు కర్త్రర్థమున వచ్చును. ఇదే (తృచ్ + అర్థ)తృజర్థ. (తృ+అర్థ) త్రర్థము అనియు చెప్పబడును. 'తృవర్ణకార్థంబున డెడియెడు వన్నియ లగు' చదివెడివాఁడు. చదివెడువాఁడు, చదువువాఁడు. తద్ధర్మాద్యర్థము లందు కర్త్రర్థకము లగుటచే ఇవి తద్ధర్మా(ద్య)ర్థక విశేషణములు.

**101.** త్రికము : (సమా. 4) 'ఆ ఈ ఏ యనుసర్వనామంబులు త్రికంబు నాఁబడు' సర్వనామము లైన ఆ-ఈ-ఏ- అనుమూఁడు శబ్దములకును త్రికము అని సంజ్ఞ. ఆకన్య- ఈదేశము-ఏవిధము. మొ॥

**102.** త్వార్థము : (తద్ధి. 1) 'త్వ' అనుసంస్కృతప్రత్యయము యొక్క అర్థము త్వార్థము. 'తస్యభావ స్త్వతలౌ' యని సంస్కృతమున త్వప్రత్యయము భావార్థమున విధింపబడినది. ప్రకృతి

జన్యబోధంబునందు ప్రకారంబు భావంబు. ప్రాతిపదికవలన తెలియబడు వస్తువుయొక్క ధర్మము భావము. తెలుగున 'తనవర్ణకంబు త్వార్థంబునం దగు' అని ఈయర్థమున తనప్రత్యయము వచ్చును. రామునితనము. 'రామ' అను ప్రకృతిచే బోధింపబడు రాముఁడు అను వ్యక్తియొక్క ధర్మము రామునితనము.

**103.** **దంత్యము:దంత్యచజలు :** (సంజ్ఞ. 9) దంతస్థానము నందు పుట్టినది, అనఁగా దంతముల సహాయముతో ఉచ్చరింపబడునది అయిన వర్ణము దంత్యము. ౡ,త,స, మొ॥ అట్లు పలుకబడుచజలు దంత్యచజలు. 'అఆఉఊఒఓఔలం గూడినచజలు దంత్యంబులు'. చలి, జాలి, మొ॥ ఇవి తెలుగున విశేషము.

**104.** **దఘ్నార్థము :** (తద్ధి. 27) దఘ్నచ్ అనుసంస్కృత ప్రత్యయముయొక్క అర్థము దఘ్నార్థము. 'ప్రమాణే ద్వయసచ్ దఘ్నఞ్ మాత్రచః' అని యిది ప్రమాణార్థమున విధింపబడినది. అధోమానమును తెలుపు, దఘ్నచ్ ప్రత్యయముయొక్క అర్థమున తెలుగున 'దఘ్నార్థంబున బంటికోలఁదు లగు' అని బంటి, కోలఁది అను ప్రత్యయములు వచ్చును. మోఁకాలిబంటి, మోఁకాలికోలఁది, మోఁకాలినంటు (లోతు) ప్రమాణము కలది అని అర్థము.

**105.** **దేశ్యము :** (సంజ్ఞ. 21) త్రిలింగదేశవ్యవహారసిద్ధం బగుభాష దేశ్యంబు' శ్రీశైలకాళేశ్వర,దక్షారామములను త్రిలింగములు గల దేశము నందలిజనులవ్యవహారము మూలముగా ఏర్పడిన శబ్దము నకు దేశ్యము అని సంజ్ఞ. ఊరు, పేరు. మొ॥

**106.** **ద్రుతప్రకృతికము** :(సంజ్ఞ. 13)-ద్రుతాంతము లయిన పదములు ద్రుతప్రకృతికములు' నకారమునకు ద్రుత మని సంజ్ఞ. ద్రుతమగునకారము చివర గలిగినపదములకు ద్రుతప్రకృతికములు అని పేరు. నన్నున్. వలెన్ మొ॥

**107. ద్రుతము :** (సంజ్ఞా.11) 'నకారంబు ద్రుతంబు' నకారమునకు ద్రుత మని సంజ్ఞ. ద్రుతము నకార మని సాధారణముగా చెప్పినను, ప్రత్యయమును, ఆగమమును, అవ్యయమును అయి, కొన్ని అవ్యయములతుది నున్న 'ను' అనువర్ణమె ద్రుత మని ద్రుతప్రకృతికములనుబట్టి గ్రహింపవలెను. వనమును, రాముని చేతను, అన్నయును వలెను. మొ॥

**108. ద్వంద్వము :** (సమా.3) ఉభయపదార్థప్రధాన మగు సమాసము ద్వంద్వము. సమాసమునం దున్న పూర్వఉత్తరపదములు రెండింటియొక్క అర్థమును ప్రధానమై విభక్త్యాదిపదములతోను, క్రియతోను అన్వయించునట్టిసమాసము ద్వంద్వ మగును. తల్లిదండ్రులు (మెచ్చిరి) మొ॥

**109. ద్విగువు :** (సమా.3) (సంఖ్యాపూర్వో ద్విగుః) విశేషణమునకు విశేష్యముతో చేసినసమాసము కర్మధారయము. ఇది సంఖ్యాపూర్వంబు ద్విగువు నాఁబడు' కర్మధారయసమాసమున విశేషణ మగుపూర్వపదము సంఖ్యావాచక మైనచో దానికి తెలుగున ద్విగుసమాసము అని పేరు. ముల్లోకములు, నలుగడలు మొ॥

**110. ద్విత్వము :** (సంధి. 38) (ద్వయోః భావః ద్విత్వమ్) రెండింటితనము. ఒకేవర్ణము రెండు పర్యాయములు ఉచ్చరింపబడి రెం డగుట ద్విత్వము. దీనిచే ద్విత్వము విధింపబడినచోట అదే వర్ణము ఇంకొకటి చేరును. (రెం డగును) క్రొ+కారు. ఇచట మీఁది హల్లు క కారమునకు ద్విత్వము విధించుటచే మరొక(రెండవ)క కారము చేరి క్రొక్కారు అగును. ఇది తెలుగున సాధారణముగ హల్లునకె చెప్పుట కానవచ్చును.

**111. ద్విరుక్తము :** (సంధి. 13) ద్విః ఉక్తమ్ రెండుసార్లు ఉచ్చరింపబడినది. (చెప్పబడినది) ట్+ట్=ట్ట్. ఇచట టకారము ద్విరుక్తము అయినది. గడగడ- ఇట గడ అనుశబ్దము ద్విరుక్తము.

**112. ద్విరుక్తి:** (సంధి.53) **113. ద్విర్వచనము :** (సంధి.53) ద్విః ఉక్తిః. ద్విరుక్తిః, ద్విః వచనమ్-ద్విర్వచనమ్) ఒకేవర్ణము, లేదా శబ్దము మొ॥ 'రెండుసార్లు చెప్పుట ద్విరుక్తి, ద్విర్వచనము. ఇది విధింపబడిన దానికి అట్టిదగునొకటి రెండవది వచ్చిచేరును. దానో ఒహో మ్మనె- ఇట మకారమునకు ద్విరుక్తి. కృష్ణ కృష్ణ ఇట కృష్ణ అనుశబ్దమునకు ద్విర్వచనము.

**114. ధాతుజవిశేషణము :** (క్రియ. 47) 'ఎడిప్రభృతివర్ణకాంతంబు లేదును ధాతుజవిశేషణము లని ప్రాచీనులు వ్యవహరింతురు' ధాతువునుండి యేర్పడినవిశేషణరూపము ధాతుజవిశేషణము. ఎడి, ఎడు, వానిలోపము, ఉన్న, కలది, న, ని అనునవి చివర గలిగి ఎల్లధాతువులనుండి విశేషణరూపములు 7విధములుగ ఏర్పడును. చదివెడివాఁడు. చనునవివాఁడు. మొ॥

**115. నామధాతువు :** (క్రియ.65) నామం బనగా ప్రాతిపదికము. 'నిర్జినామంబులకయు గాగమంబు గలుగదు' అనుసూత్రజ్ఞాపనముచే ధాతువులుగా వివక్షింపబడినపుడు కొన్ని నామములు ధాతువులై ఇంచుగాగమమును, దానిపై లడాదిలకారములను పొందును. నామములనుండి యేర్పడినధాతురూపములు గావున వీనిని నామధాతువు లని వ్యవహరింతురు. శయన(ము) శయనించు- శయనించెను మొ॥

**116. నామము :** (తత్స. 2.) (ప్రాతిపదికం హి నామ) నామం బనగా ప్రాతిపదికము. సంస్కృతవ్యాకరణము ననుసరించి ప్రాతిపదికము అనుసంజ్ఞ గలిగినశబ్దమునకు తెలుగున ప్రాతిపదికసంజ్ఞతోపాటు నామము అనుసంజ్ఞయును గలదు. (ధాతువును, ప్రత్యయమును గాని అర్థవంతమగుశబ్దము) డిద్ధ, (కృదంతము)- రామ, (తద్ధితాంతము)- భార్గవ- (సమాసము) రాజపురుష- మొ॥

**117. నింద్యగ్రామ్యము :** చూ. గ్రామ్యము.

**118. నిత్యము :** (క్రియ. 50) (కృతాకృతప్రసంగి నిత్యమ్. 'కృతాకృతప్రసంగి నిత్యంబు నాఁబడు'. రెండువిధులు ప్రవర్తించుట కవకాశము కలుగుచోట, ఆ రెండింటిలో ఒకటి ప్రవర్తింపజేసినను' చేయకున్నను ఏది తప్పక ప్రవర్తించునో ఆవిధి నిత్యము. జి+ఇంచు అనుచో, ధాతువున కయుగాగమమును, ఇంచుకు-నకు ఇయుడాగమమును ప్రవర్తింపవలసియున్నవి. అయుగాగమము చేసినచో ధాతువు యకారాంత మగుటచే (జయ్+ఇంచు) ఇయుడాగమము రాదు. కాని, ఇయుడాగమము చేసినను చేయకున్నను అయుగాగమము వచ్చును. కావున అయుగాగమవిధి నిత్యమై అదియె వర్తించును.

**119. నిపాతము :** (తత్స. 51) 'శాస్త్రేణ అన్యథా ప్రాప్తే అన్యథా నియమనం నిపాతః' శాస్త్రము ననుసరించి ఒకతీరుగా నేర్పడవలసినశబ్దములు (లక్ష్యానుగుణముగా) వేరొకతీరుగా నుండు నట్లు నియమము చేయుటను 'నిపాత' అందురు. 'కద్రువ నాగమాత' కద్రూశబ్దమునకు వువర్ణకమువచ్చి కద్రువు అనువిధముగా సామాన్య శాస్త్రముచే రూప మేర్పడు చుండగా 'కద్రువ' అని యుండునట్లు నియమించుటచే ఈ (అపవాద)విధి'నిపాత' అగుచున్నది.

**120. నియమము :** చూ. పుట. 23

**121. నిరవకాశవిధి :** (సంధి. 9) (లక్ష్యాంతరచరితార్థతా అవకాశఃతచ్ఛూన్యత్వంనిరవకాశత్వమ్). వేరొక ఉదాహరణమునలక్షణముప్రయోజనవంత మగుటఅవకాశము. ఆఅవకాశములేనివిధి నిరవకాశవిధి. ఇఁకాదులకుఁ దప్ప-అనువిశేషవిధిచే సంధి వారింపబడినచో ద్రుతప్రకృతికములు మాత్రమే లక్ష్యమైన'ప్రథమేతరవిభక్తి- అను సూత్రమునకు వేరొకలక్ష్య ముండదు. కావున అది నిరవకాశవిధి)

**122. నిర్ధారణపంచమి :** (కార. 16) (పంచమ్యార్థే నిర్ధార్యమాణస్య యత్ర భేద ఏవ తత్ర పంచమీ) నిర్ధారణమునందు వచ్చుపంచమి నిర్ధారణపంచమి. జాతి, గుణము, క్రియ, సంజ్ఞ, అను

వానినిబట్టి కేవలము భేదముతో దేనినుండి వేరుచేయుట జరుగునో ఆనిర్ధారణావధికి పంచమీవిభక్తియు, దానికి తెలుగున కంటె ప్రత్యయమును వచ్చును. జానపదులకంటె నాగరులు వివేకులు. జానపదులకంటె. అనుచోటిపంచమి నిర్ధారణపంచమి.

**123. నిర్ధారణము - 124. నిర్ధారణషష్ఠి :** (కార. 16) (జాతిగుణక్రియాసంజ్ఞాభి స్సముదాయా దేకదేశస్య పృథక్కరణం నిర్ధారణమ్) జాతిగుణక్రియాసంజ్ఞలచేత సముదాయంబునుండి యేకదేశంబునకుం బృథక్కరణంబు నిర్ధారణం బనంబడు' సమూహము నుండి అందలి ఒకభాగమును జాతి, గుణము, క్రియ, సంజ్ఞ అనువానిని బట్టి వేరుచేసిచెప్పుట నిర్ధారణము ఈఅర్థమున. దేనినుండి వేరుచేయబడునో దానిని తెల్పు(సమూహార్థక) శబ్దమునకు షష్ఠియు, దానికి తెలుగున లోపలవిభక్తియు వచ్చును. ఛాత్రులలోపల మైత్రుండు సమర్థుండు. ఛాత్రులలోపల అనుచోట లోపల నిర్ధారణషష్ఠి.

**125. పరరూప(సంధి)ము :** (పరస్య రూప మివ రూపమ్ పరరూపమ్) పరము (తరువాత)గా ఉన్నదానిని పోలినరూపము కలుగుట పరరూపము. రాముడు+అతడు. ఇచట'ఉ+అ' అనుచో పరమైన 'అ' వంటి దగు వేరొక 'అ' పూర్వపరస్వరముల స్థానమున వచ్చి రాముడతడు అని యగును. పరరూపము ఐన, సంధి కావున ఇది పరరూపసంధి.

**126. పరిభాష :** చూ. పుట. 23.

**127. పరుషము :** (సంజ్ఞ. 5) 'కచటతపలు పరుషంబు లని గజడదబలు సరళంబు లని చెప్పంబడు.' 'దంత్యతాలవ్యంబు లయిన చజలు సవర్ణంబులు' అనుసూత్రము ననుసరించి యిచ్చట తాలవ్య చకారముచే దంత్యచకారమును గ్రహింపబడును. కావున హల్లు లగు కచచటతప, అను ఆరువర్ణములకును పరుషము లని పేరు.

**128. పర్యుదాసము :** (తత్స. 24) పర్యుదాస స్స విజ్ఞేయో యత్రోత్తరపదేన నఞ్' నిషేధము అప్రధాన మగునట్లుగా నఞ్ శబ్దమునకు మీఁదిపదముతో కలిగిన సమాసమునకు పర్యుదాసము అని పేరు. అనుదంతం బగు తెనుఁగుపదమంతమునకు నిగాగమము నిత్యముగా నగును. నిగాగమము నిత్యముగా నగుట అనుస్థితి ఉదంతములకు లేకపోవుటచే 'న+ఉదంత'- అను తీరుగా నశబ్దముతో ఈ కార్య ముదంతములకు నివారింపబడినది. ఇచట నఞ్నకు ఉదంత అనుమీఁదిపదముతో సమాసము చేయబడినది కావున అనుదంత మనునది పర్యుదాసము.

**129. పుంలింగతుల్యము :** (తత్స.18. అచ్ఛి.3) పుంలింగము (పులింగమును) కాక పుంలింగముతో తుల్యముగా చెప్పబడినసంస్కృత (సమ) అచ్ఛికశబ్దములు పుంలింగతుల్యములు. 'క్లీబంబులు మిత్రాదులు మహద్వాచకంబులు విభాషం బుంలింగతుల్యంబులగు' మిత్ర మొ॥ సంస్కృతశబ్దములు, చంవుర, కోవుర మొ॥ అచ్ఛికశబ్దములును పుంలింగతుల్యములు. పుంలింగతుల్యతవలన పుంలింగములకువలె కార్యము లగును. మిత్రుఁడు, చంవురుఁడు. మొ॥

**130. పూరణార్థము :** (అచ్ఛి.26) (పూర్యతే అనేనేతి పూరణః) దేనిచే పూరింప(నింప)బడునో అది పూరణము. ఆ అర్థము పూరణార్థము. 'సంఖ్యకుం బూరణార్థంబునం దవాగమం బగు' భీముఁడు రెండవవాఁడు. దీనిచే రెండుసంఖ్య పూరింపబడుచున్నది అనుఅర్థమున రెండుశబ్దముపై 'అవ' చేరినది.

**131. పూర్ణబిందువు :** చూ. బిందువు.

**132. పూర్వపదము :** (సమా.3) (పూర్వం పదం పూర్వపదమ్) పర- ఉత్తరపదమునకు పూర్వమునందు వర్తించునట్టిపదము పూర్వపదము. సమాసమునందు ప్రథమావయవము మొదటిపదము

అనుఅర్థమున ఇచట వ్యవహరింపబడుచున్నది. ఆకన్య. ఇందు 'ఆ' అనుత్రికము పూర్వపదము.

**133. ప్రకృతి :** (తత్స.20) (ప్రకృతి ర్నామ అర్థావబోధ హేతుః ప్రత్యయవిధాన అవధిభూతః శబ్దవిశేషః) నామ, (సుప్) క్రియా(తిఙ్)విభక్తులు (ప్రత్యయములు) ముందు లేదా వెనుక చేరుటకు అర్హమైనశబ్దము ప్రకృతి. ప్రాతిపదికములును ధాతువులును ప్రకృతులు. రామ- కాచు మొ॥

**134. ప్రత్యయము :** (తత్స.10) (ప్రతీయతే ఇతి ప్రత్యయః ప్రకృతిమవధీకృత్య విధీయమానః స్వార్థబోధకః శబ్దవిశేషః) విధింపబడునవి, ప్రకృతికి ముందు వెనుకలుగావచ్చి చేరునవి అర్థవంతములైనవి, ప్రత్యయములు. డుజ్ మొదలగు నామ(సుప్)విభక్తులు. (తిఙ్) విభక్తులు. కృత్, తద్ధితములు మొ॥ ప్రత్యయములు.

**135. ప్రత్యవసానార్థకము :** (క్రియ.123) 'ప్రత్యవసానం చ భక్షణమ్'- భుజించుట అనుఅర్థము నిచ్చు ధాతువులు ప్రత్యవసానార్థకములు. తిను, మొదలగునవి.

**136. ప్రత్యాహారము :** (క్రియ.8) 'ఆదిరన్త్యేన సహేతా' అనులక్షణమున కనుగుణముగ నేర్పడియున్నవానికి ప్రత్యాహారములని వ్యవహారము. డుఙ్. 'డు త్రు వు రు ను ము ఙ్' అనుచో డువర్ణమును ఆదిదప నున్న ఇత్తయిన ఙ కారముతో గూర్పగా ఏర్పడిన 'డుఙ్' ప్రత్యాహారము. ఇది ఇందలి మొదటి దగు డువర్ణమునకును డు-ఙ కారములకు నడుమ నున్న రువురునుము అనువానికిని సంజ్ఞయగును. ఇట్లే వుఙ్, రుఙ్ మొ॥

**137. ప్రథమ(పురుష)ము :** (క్రియ.9) అందు వరుసను రెండేసి ప్రథమమధ్యమోత్తమంబు లనంబడు. 'లకారంబునకు డు త్రు వు ను ము ఙ్గు అనుసూత్రముచే విధింపబడినవానిలో మొదట నున్న డుజ్ రు అను రెండింటికి ప్రథమము అని సంజ్ఞ. యుష్మదస్మ

దర్థములు రెండింటికంటె వే రయినది కర్తగా నున్నపుడు ఏకత్వమున డుజ్ఞును, బహుత్వమున రువర్ణకమును వచ్చును. చదువుచున్నాఁడు, చదువుదురు, మొ॥

**138. ప్రయోజ్యకర్త :** (క్రియ,124) ప్రయోగింపబడినకర్త. అనగా ప్రేరేపింపబడిన కర్త ప్రయోజ్యకర్త. ధాత్వర్థవ్యాపారాశ్రయ మగుకర్త, ఆవ్యాపారమునందు వేఱొక(ప్రేరణ)కర్తచే ప్రయోగింప బడినచో ప్రయోజ్యకర్త యగును. విశ్వామిత్రుఁడు రామునకు మిథిలం గానిపించెను. కానిపించు అనుప్రేరణాక్రియకు కర్త అయిన విశ్వామిత్రునిచే కనుట అనువ్యాపారమునందు ప్రయోగింపబడుటచే (కనుటకు కర్త అయిన) రాముడు ప్రయోజ్యకర్త యయ్యెను.

**139. ప్రాకృతభవము :** (సంజ్ఞ.19) సంస్కృతప్రాకృతభవం బగుభాష తద్భవంబు' ప్రాకృతమునుండి పుట్టిన తెలుగుశబ్దము తద్భవము. ప్రాకృతప్రకృతియందు వర్ణవికారములు గలిగి తెలుగు విభక్తులను పొందునట్టిశబ్దము ప్రాకృతభవ మని గ్రహింపవచ్చును. పృథవీ-పుడమి. మొ॥

**140. ప్రాకృతసమము :** (సంజ్ఞ.19) 'సంస్కృతప్రాకృత తుల్యం బగుభాష తత్సమంబు' ప్రాకృతముతో సమముగా నున్న తెలుగుశబ్దము ప్రాకృతసమము. తెలుఁగువిభక్తులను విభక్తి నిమిత్తక వర్ణవికారములును పొందుప్రాకృతప్రకృతి ప్రాకృతసమ మని స్థూల ముగా గ్రహింపవచ్చును. సిరీ-సిరి మొ॥

**141. ప్రాతిపదికము :** (తత్స.21)['అర్థవ దధాతు రప్రత్య యః ప్రాతిపదికమ్. ధాతువును, ప్రత్యయమును కాక అర్థవంత మైన శబ్దము ప్రాతిపదికము (డిద్ధ.) 'కృత్తద్ధితసమాసాశ్చ' అని కృత్ప్రత్య యాంతమును (రామ) తద్ధితప్రత్యయాంతమును (భార్గవ) సమాస మును(రాజపురుష) ప్రాతిపదికసంజ్ఞను పొందును. తండ్రి, మగ, చదువుట, చదువరి, మాటనేర్పు, మొ॥

**142. ప్రాతిపదికార్థము :** (కార.1) (నియతోపస్థితికః ప్రాతిపదికార్థః) నియతోపస్థితికము ప్రాతిపదికార్థము. ప్రాతిపదికమును ఉచ్చరించినవెంటనే ఏఅర్థము తప్పక ఉపస్థిత మగునో (తోచునో) ఆఅర్థము ప్రాతిపదికార్థము. తండ్రి. ఈశబ్దముచే స్ఫురించు జన్మ నిచ్చినవాడు అనురీతిది ఇచట ప్రాతిపదికార్థము.

**143. ప్రాదులు :** (క్రియా.121) ప్ర అనునది మొద లగునవి ప్రాదులు. ప్ర-పరా-అప-సమ్-అను-అవ-నిస్-నిర్-దుస్-దుర్-వి-ఆఙ్-ని-అధి-అపి-అతి-సు-ఉద్-అభి-ప్రతి-పరి-ఉప- అనునవి ఇరువది రెండు ప్రాదులు.

**144. ప్రాధాన్యవివక్ష :** (సమా. 26) (ప్రాధాన్యం చ క్రియాన్వయిత్వమ్) వాక్యమున క్రియతో అన్వయము గలిగినది ప్రధానము. అది విశేష్యము మొ॥ ప్రధానముయొక్క భావము ప్రాధాన్యము. (ప్రధానము కానిదానిని) ప్రధానముగా చెప్ప దలచుట ప్రాధాన్యవివక్ష. రాముడు బాణముతో ఏసెను. ఇచట కర్త(రాముడు ప్రధానము)బాణము అనునట్టికరణమునకు ప్రాముఖ్య మీయదలచిన రాముడు ఏసినబాణము వాలిని కూల్చెను. ఇట బాణము క్రియతో అన్వయించుచు ప్రధాన మగుచున్నది.

**145. ప్రాయికము :** (ప్రాయేణ భవః) ప్రాయిక మనగా తఱుచు. ప్రాయికశబ్దముచే విధింపబడినకార్యము సాధారణముగా నిత్యముగనె యగుచుండును. అరుదుగా కాకుండవచ్చు. కొన్ని యెడల నసలు కాకుండుట, కొన్నియెడల ఒకపక్షమున కాకుండుట జరుగును. 'ఖండబిందువుమీఁదిసిద్ధచకారంబునకు ద్విత్వ పరం బగు నపుడు సకారంబు ప్రాయికంబుగ నగు' త్రేంపక ఇత్యాదులలో నిత్యము. ఏంచక, ఏంపక అనుచో నొకపక్షమున లేదు. తోంచక-అనుచో అసలు లేదు.

బహుళకము- ప్రాయికము అనువానికి విధానమున నొక

భేదము గోచరించెడిని. విధింపబడు కార్యము లక్ష్యములందు విభాషగ నగుట సాధారణమై-అగుట, కాకుండుటలు విశేష స్థలము లైనచో బహుళము. ప్రాయికము లేదా తఱుచు అన్నచో ఆకార్య మగుట సామాన్య మై- కాకపోవుట, విభాషాస్థితి అరుదగును. ప్రాయిక స్థలముల అన్యకార్యమున కవకాశము లేదు.

**146.** ప్రాసము : (ఛ.కీ.23) 'పాదంబునం బ్రథమద్వితీయాక్షరంబులు వళిప్రాసంబులు నాఁబడు'. పద్యమున ఎల్లపాదములందును రెండవ అక్షరమునకు ప్రాస(ము) అని పేరు. 'శ్రీలతకుం బ్రాఁకయి'. ఇందు 'ల' అనుఅక్షరము ప్రాస.

**147.** ప్రేరణము (ప్రేరణార్థము) : (క్రియ.70) (నికృష్టస్య భృత్యాదేః కార్యాదౌ నియోగః) ముఖ్య (ప్రయోజ్య) కర్తను క్రియ(వ్యాపారము=పని)యందు (ప్రయోజకకర్త) నియోగించుట ప్రేరణము. అనగా ధాతువున కర్థమైనవ్యాపారము(పనిని) ఒకరు చేయునట్లుగా ఇంకొకరు ప్రేరేపించుట. చైత్రుడు మైత్రునిచేత చదివించెను చదువుట అనుపని ఒకరు (మైత్రుడు) చేయునట్లుగా నింకొకరిచే (చైత్రుడు) ప్రేరేపింపబడినట్లు చెప్పుటచే ఇది ప్రేరణార్థము.

**148.** ప్రేరణకర్త్రర్థము : (క్రియ.124) ధాత్వర్థ మగు వ్యాపారమును చేయుటలో ఇతరులను ప్రేరించుఅర్థము ప్రేరణార్థము. క్రియాపదముచే కర్త బోధింపబడుచో కర్త్రర్థము. 'చైత్రుండు మైత్రుని మనిచెను' మనుధాతువు. మనుచు=మనునట్లు చేయు=ప్రేరణము, 'మనిచెను'అనునది ప్రేరణకర్త యగుచైత్రుని బోధించుచున్నది కావున ఇది ప్రేరణకర్త్రర్థము.

**149.** ప్రేరణకర్మార్థము : (క్రియ. 124) ధాత్వర్థ మగు వ్యాపారమును చేయుటలో ఇతరుని(ముఖ్యకర్తను) ప్రేరేపించు అర్థము ప్రేరణార్థము. క్రియాపదముచే కర్మ తెలుపబడినచో కర్మార్థము.

చైత్రునిచేత మైత్రుండు మనుపఁబడెను. మను+చు (మనునట్లుచేయు) ప్రేరణార్థకము 'మనుపఁబడు' అనుచో కర్మ (అకర్మకధాతువునకు అప్రేరణమున కర్తయే ప్రేరణమున కర్మ) యగుమైత్రుని తెలుపుచున్నది. కావున 'మనుపఁబడెను' ప్రేరణకర్మార్థము.

**150.** **ప్రేరణాత్మనేపదకర్త్రర్థకము :** (క్రియ. 124) ధాత్వర్థ మగు వ్యాపారమునందు ఇతరులను నియోగించునట్లు చెప్పుట ప్రేరణము. క్రియాఫలము కర్తను పొందునట్లు చెప్పిన ఆత్మనేపదార్థము. క్రియాపదముచే కర్త తెలుపబడిన కర్త్రర్థము. 'చైత్రుండు మైత్రుని మనుచుకొనియె' మను+చు=ప్రేరణము, మనుచు+కొను= ప్రేరణాత్మనేపదము. 'మనుచుకొనియె' అనుక్రియ ప్రేరణకర్తను (చైత్రుని) తెలుపుటచే ఇది ప్రేరణాత్మనేపదకర్త్రర్థము.

**151.** **ప్రేరణాత్మనేపదకర్మార్థము :** ధాత్వర్థ మగువ్యాపారమున ఇతరులను ప్రేరేపించినట్లు చెప్పుట ప్రేరణము. క్రియాఫలము కర్తను పొందునట్లు చెప్పిన ఆత్మనేపదార్థము. క్రియాపదముచే కర్మ తెలుపబడిన కర్మార్థము. 'చైత్రునిచేత మైత్రుడు మనుచుకొనఁబడెను. మను+చు -ప్రేరణము. మనుచు+కొను ప్రేరణాత్మనేపదము. మనుచుకొను+పడు. (మనుచుకొనఁబడె) ప్రేరణాత్మనేపద కర్మార్థము.

**152.** **బహుళము :** (సంధి. 4) క్వచిత్ ప్రవృత్తిః క్వచిదప్రవృత్తిః క్వచిద్విభాషా క్వచిదన్యదేవ (విధేర్విధానం బహుధా సమీక్ష్య చతుర్విధం బాహుళకం వదన్తి) విధించిన కార్యము కొన్నిస్థలములందు నిత్యముగా వర్తింటయు, కొన్ని యెడల అసలు వర్తింపకుండుట, కొన్ని యెడల వర్తించుట, వర్తింపకుండుట యనువైకల్పికస్థితి,యు కొన్ని యెడలవిధించినదానికంటె వేఱుగ నగుటయు నని నాల్గువిధములుగా నగుట బహుళము. 'అత్తునకు సంధిబహుళము' 1. వచ్చుచున్న+అఁడు వచ్చుచున్నాఁడు. (ప్రవృత్తి) 2. వెల+ఆలు=వెలయాలు. (అప్రవృత్తి)

3. పుట్టిన+ఇట్టు-పుట్టినిల్లు (విభాష) 4, తామర+ఆకు- తామరపాకు (అన్యకార్యము.)

**153. బహువచనము :** (తత్స. 12) బహుత్వసంఖ్యను బోధించు ప్రత్యయంబు బహువచనంబు. తెలుగున ఒకటికంటె ఎక్కువసంఖ్య గలవిగా బోధించునట్టి ప్రత్యయము బహువచనము. రాములు ఇందు లువర్ణము రాములందలి అనేకత్వసంఖ్యను తెల్పుచున్నది గావున అది బహువచనము.

**154. బహువ్రీహి :** (సమా. 3) అన్యపదార్థప్రధాన మగు సమాసము బహువ్రీహి. సమాసమునం దున్నపదములఅర్థముకంటె వేరయినపదార్థమును బోధించునట్టిసమాసము బహువ్రీహి. ముక్కంటి. ఈ సమాసమునం దున్న మూఁడు, కన్ను- అనుపదముల కంటె వేరుగా మూఁడు, కన్నులు అనుపదములు 'శివుఁడు' అనుఅన్య పదార్థమును తెలుపుటచే ఇది బహువ్రీహిసమాసము.

**155. బాధకము :** (బాధించునది = తొలగించునది) చూ. అపవాదము.

**156. బిందువు :** (సంజ్ఞ. 17) (బిందు రనుస్వారః) అనుస్వారమునకే అనగా సున్నకె బిందువు అనియు సంజ్ఞ. ఇది తెలుగున నిండుసున్న (అం) అరసున్న (అఁ)అని రెండువిధములు. నిండు సున్ననే, పూర్ణబిందువు, పూర్ణము, నెఱసున్న ఇత్యాదిగను అరసున్నను ఖండబిందువు, ఖండము ఇత్యాదిగను వ్యవహరింతురు. బంతి, వాఁడు మొ॥

**157. భవచ్ఛత్రర్థము :** (క్రియ. 46) భవత్+శతృ+అర్థ. భూధాతువుపై సంస్కృతమున శతృప్రత్యయము చేర్చుటచే ఏర్పడిన 'భవత్' అనుశబ్దమునకు వర్తమానార్థ మని అర్థము. వర్తమానార్థకము అగుశతృప్రత్యయము యొక్క అర్థము ('లట శ్శతృశానచౌ' అని లట్టున కగు శతృప్రత్యయముయొక్క అర్థము) భవచ్ఛత్రర్థము.

'ఉన్నకలఙ్వవర్ణకంబులు భవద్భావిశతృ క్తవంర్థంబులం దగు' చదువు చున్నవాడు. శత్రర్థక మగు ఇది విశేషణరూపమై విశేష్యముతో అన్వయించును.

**158. భవత్యర్థము :** (కార. 28) భవతి+అర్థ=భవత్యర్థ మనుచో 'ఇక్ శ్తిపౌ ధాతునిర్దేశే' యని భూధాతువు 'శ్తిప్' అంతము గా నిర్దేశింపబడినది. భూ అనుధాతువుయొక్క అర్థము భవత్యర్థము. అగు మొ॥ భవత్యర్థకములు.

**159. భవిష్యదర్థము** చూ. భావి.

**160. భావము :** (క్రియ. 35) 'భావం బనగా ధాత్వర్థంబు' ధాతువు యొక్క అర్థము (వ్యాపారము) భావము. 'టవర్ణకంబు భావంబునం దగు' చదువుట. పఠనరూప మగువ్యాపారము ఇట భావము. ఇట్లే అలుక, కలిమి మొ॥

**161. భావలక్షణము :** (క్రియ. 40) భావలక్షణంబు నా నన్యక్రియకు లక్షణభూతం బగుక్రియ : భావము అనగా క్రియ. వేరొకవ్యాపారమునకు లక్షణ మైన-సూచక మైన (తెలుపు నట్టి) వ్యాపారము(క్రియ) భావలక్షణము. 'చైత్రుడు వండ నతిథి వచ్చెను. వండన్ - వండుచుండగా అతిథి వచ్చుట అను వేరొకవ్యాపారము యొక్క కాలమును ఇచ్చట 'వండుట' అను వ్యాపారము సూచించుచున్నది. కావున ఇది భావలక్షణము. 'తుమర్థభావలక్షణంబు లందు నుఙ్ యగు' అని యీఅర్థమున ధాతువునకు నుఙ్ అగును.

**162. భావి :** (క్రియ. 4) భావి నా విద్యమాన ప్రాగభావ ప్రతియోగి. అప్పటికి పుట్టకుండుటకు విరోధి అయినది. అనగా ఇక పై పుట్టునట్టిక్రియ 'చదువగలడు' ఇచట చదువుట అనుక్రియ అప్పటికి లేదు. కాని తరువాత నుండును. కావున ఇది భావ్యర్థము భవిష్యదర్థము.

**163. భావిశత్రర్థము :** (క్రియ.46) లృటస్స ద్వా- అని సంస్కృతమున భవిష్యత్ (భావి)అర్థమునం దయినశతృ అను ప్రత్యయముయొక్క అర్థము భావిశత్రర్థము. 'ఉన్నకలజేనవర్ణకంబులు భవద్భావిశతృ క్తవదర్థంబులం దగు'- చదువఁగలవాఁడు. భవిష్యత్కాలమునకు సంబంధించినవి శేషణరూప మగుచు నది విశేష్యముతో అన్వయించును. భావిని చదువబోవువాఁడు.

**164. భూతము :** (క్రియ.3) 'భూతంబు నా విద్యమానధ్వంస ప్రతియోగి' విద్యమాన=కనబడు చున్న, ధ్వంస=లేకపోవుటకు, ప్రతియోగి=విరోధి. ప్రస్తుతము లేకపోవుటకు విరోధి అయినది. అనగా అంతకు పూర్వ ముండి అప్పటికి లేకుండునది భూతము. వండెను. ఇట వండుట యను క్రియ ఇపుడు లేదు. కాని అంతకు పూర్వ మున్నది కాన నిది భూతార్థము.

**165. మతుబర్థము, 166 మత్వర్థము :** (తద్ధి. 11, 22) మతుప్ అనుసంస్కృతప్రత్యయముయొక్క అర్థము (మతు+అర్థ) మతుబర్థము లేక(మతు+అర్థ)మత్వర్థము. 'తదస్యాస్త్యస్మి న్నితి మతుప్'. అని యిది సంస్కృతమున అస్త్యర్థమున చెప్పబడినది. కలది, కలవాఁ డని స్థూలముగా దీనియర్థము. అందగత్తియ (అందము గలది) అందగాఁడు. మొ॥

**166. మధ్యమ(పురుష)ము :** (క్రియ.9) 'లకారంబునకు ముప్పురుషులు నగు' అనుసూత్రమునందు విధింపఁబడినవానిలో 'అందు వరుసను రెం డేసి ప్రథమమధ్యమోత్తమంబు లనబడు' అను సూత్రముచే నడుమ నున్న 'పురు'లకు మధ్యమ(పురుష)ము అని సంజ్ఞ. యుష్మదర్థము (నీవు, మీరు) కర్తగా నున్నపుడు ఏకత్వమున వు, బహుత్వమున రు అనునవి వచ్చును. (నీవు)చదువుచున్నావు (మీరు) చదువుచున్నారు.

**168. మహతి :** (తత్స.86) మహతి యనగా స్త్రీవాచకము. 'స్త్రీ తిర్యగ్జడభిన్నంబులును వానివిశేషణంబులును మహత్తు లనం బడు' ఇందు స్త్రీవాచకము లగుశబ్దములకు అమహత్తు, అనుదానితో పాటు, మహతి అను సంజ్ఞతోను వ్యవహారము గలదు. లక్ష్మి. అమ్మ మొ॥ ఇట్లె వీనివిశేషణములను 'మహతి' యగును. గుణవతి యగు పెండ్లము మొ॥

**169. మహత్తు :** (తత్స.17) 'స్త్రీతిర్యగ్జడభిన్నంబులును వానివిశేషణంబులును మహత్తు లనంబడు' స్త్రీలును, పశువులు పక్షులు మొద లగు తిర్యక్కులును, అచేతనములును కానివస్తువును బోధించుశబ్దములకును వానివిశేషణములకును 'మహత్తు' అని సంజ్ఞ. 'గుణవంతుడు' అగు 'రాముడు' మొ॥

**170. మహత్త్వము :** (తత్స.78) మహత్తుయొక్క భావము మహత్త్వము. 'స్త్రీతిర్యగ్జడభిన్నంబులును వానివిశేషణంబులును మహత్తు లనంబడు'. స్త్రీలు, పశుపక్ష్యాదులు, అచేతనములు అగు వానికంటె వేరైనధర్మము మహత్త్వము. 'రాముడు'మహత్తు. అందలి రామత్వము మహత్త్వము. ఇట్లె స్త్రీతిర్యగ్జడముల ధర్మము అమహత్త్వము. రమ(అమహత్తు) అందలిరమాత్వము అమహత్త్వము.

**171. మానార్థము :** (తద్ధి.25)మానము అనగా పరిమాణము. అనగా కొలత. కొలత(మానము)ను తెలుపుశబ్దము మానార్థ(క)ము. జేన, మూర మొ॥ వీనిపై 'మానార్థంబున కేకత్వంబునం డేండు వర్ణకం బగు. అని'ఎండు' అనుతద్ధితప్రత్యయము వచ్చును. జేనెండు, జేనపరిమాణము (గలది) మొ॥

**172. మిశ్ర(సమాస)ము :** (సమా.2) 'ఉభయంబులు గూడినది మిశ్రం బనంబడు' సంస్కృతసమమును, ఆచ్ఛికమును గలిపి చేసినసమాసమునకు మిశ్ర(సమాస) మని సంజ్ఞ. విధాత్ర

నానతి. విధాతృయొక్క అనుసంస్కృతసమమైన, 'ఆనతి' అను ఆచ్ఛికమును మిశ్రమైయున్నవి గావున ఇది(మిశ్ర(సమాస)ము.

**173.** ముజ్ఞు : (క్రియ.31) 'మధ్యమముమ్జ్ఞులు ముజ్ఞు నాఁబడు'. 'లూణ్మధ్యమపురులకు ముమ్జ్ఞు లగు' అనుసూత్రముచే విధింపఁబడిన ము, మ్జ్, అనుమధ్యమపురుషప్రత్యయములు రెంటికి ముజ్ఞు అని సంజ్ఞ. (నీవు) చదువుము (మీరు) చదువుఁడు.

**174.** ముత్తు : (క్రియ.86) 'మధ్యమముమ్జ్ఞులు ముజ్ఞు నాఁబడు' జీవర్ణము ఇత్తుగా కలిగినవి జీత్తులు. కలజీ, పడుజీ మొ॥ 'ముజ్జీత్తులు ముత్తు నాఁబడు', ముజ్ఞునకును, జీత్తులకును 'ముత్తు' అని సంజ్ఞ. చదువు'ము' చదువఁ'క' మొ॥

**175.** రుజ్ఞు : (క్రియ.32) 'లకారంబునకు మ్రుపురునుము జ్ఞగు' అనుసూత్రమునందలి(మొదటి)రువర్ణమును చివరిజ్ఞకారము తోఁగూర్చి చేయబడినప్రత్యాహారము 'రుజ్ఞు'. ఈప్రత్యాహారము అందలి 'రు,వురు,ను,ము' అనుప్రత్యయములను బోధించును.

**176.** లఘువు-అలఘువు : (సంజ్ఞ.18) "యస్యోచ్చారణే జిహ్వాగ్రోపాగ్రమధ్యమూలానాం శైథిల్యం జాయతే స లఘూచ్చారణః" ఏవర్ణముయొక్క ఉచ్చారణలో నాలుక అంతయు శిథిల మగునో ఆవర్ణము లఘువు. తెలుగున యరలవల కిట్టి ఉచ్చారణ భేదము గలదు. హరియతఁడు, పెరుగు మొ॥ అట్టి శైథిల్యము లేనిది అలఘువు కాయ, విఱుగు మొ॥

**177.** లఘూపధము : (క్రియ.66) (అలోఽన్త్యాత్పూర్వ ఉపధా, హ్రస్వం లఘు) ఉపధ యనగా తుది వర్ణమునకు ముందు వర్ణము. హ్రస్వము (గురువు కానిది) లఘువు. లఘువైనవర్ణ ముపధగా కలిగినది లఘూపధము. 'ఛిద్'- ఛ్ ఇద్- తుదివర్ణము (ద్)నకు ముందున్న ఉపధ యగు 'ఇ' లఘువు (హ్రస్వము) కావున ఇది లఘూపధము.

**178.** **లజీ :** (లజ్యంతము) (క్రియ.104) 'వ్యతిరేకంబున లజీ యగు' వ్యతిరేకార్థముతో గూడిన వ్యాపారమును తెలుపు ధాతువు నకు లజీ అను ప్రత్యయము వచ్చును. ఇది ప్రత్యయము. లజీ- అంత మందు గలది లజ్యంతము. భుజింపదు, రాదు మొ॥

**179.** **లట్టు-లడంతము, లడర్థము :** (క్రియ. 2) 'వర్తమానంబున లట్టగు. అప్పటికింకను ముగియని(వర్తమాన) వ్యాపారమును తెలుపుధాతువుపై లట్ వచ్చును. లట్టుయొక్క అర్థము లడర్థము. అనగా వర్తమానము. ఇది అంతమందు కల్క్రియ లడంతము. చదువుచున్నాడు.

**180.** **లాట్టు-లాడంతము.లాడర్థములు :** (క్రియ. 5) 'తద్ధర్మాదులందు లాట్టగు' తద్ధర్మము(ఆధాతువుకర్తయొక్క ధర్మము) మొ॥ అర్థములందు వర్తించువ్యాపారమును తెలుపుధాతువుపై 'లాట్' ప్రత్యయ మగును. లాట్ అంతమందు కలిగినదిలాడంతము. చదువును మొ॥ లాట్టుయొక్క అర్థము లాడర్థము. తద్ధర్మము, తచ్ఛీలము, సంభావన, సంప్రశ్నము, సాతత్యము, వర్తమానము, భావి, ఆశీస్సు మొదలగునవి లాట్ అర్థములు. జ్వలనజ్వాల లెగయును మొ॥

**181.** **లిట్టు-లిడంతము లిడర్థము :** (క్రియ. 3) 'భూతంబున లిట్టగు' అంతకుముందుండి అప్పటికి లేని- అనగా ముగిసిన (భూతము) వ్యాపారమును తెలుపుధాతువుపై లిట్టు వచ్చును. లిట్టుయొక్క-అర్థములిడర్థ మనగా భూతము. లిట్టు అంతమందు కలిగిన క్రియలిడంతము. తినెను,

**182.** **లూట్టు, లూడంతము లూడర్థము :** (క్రియ. 6) 'ఆశీశ్శాపసంప్రార్థనవిధులందు లూట్టగు' ఆశీస్సు, శాపము, సంప్రార్థనము (వేడుకొనుట) విధి (ఆజ్ఞాపనము మొ॥) అనుఅర్థములందు వర్తించువ్యాపారమును తెలుపుధాతువుపై లూట్ప్రత్యయ మగును.

లూట్టుయొక్క అర్థము లూడర్థము. అవి ఆస్స్న, శాపము, సంప్రాశ్నము విధి అనునాలుగు. లూట్ లకారము అంతమందు కలిగిన క్రియ లూడంతము. (మేలు) గలుగుత, (రాక్షసుడవు) అగుము, రక్షింపుము. (నీవు) చేయునది. మొ॥

**183. ఌట్టు - ఌడంతము - ఌడర్థము :** (క్రియ. 4) 'భావిని ఌ ట్టగు' అప్పటికింకను పుట్టని ఆపైని పుట్టబోవునట్టి వ్యాపారమును బోధించు (భావి)ధాతువుపై ఌట్ అను ప్రత్యయ మగును. ఌట్టుయొక్క అర్థము ఌడర్థ మనగా భవిష్యదర్థము. ఌట్టు అంతమందు కలిగినక్రియ ఌడంతము చదువగలడు.

**184. లోపము :** (సంధి.18) (అదర్శనం లోపః) కనిపింపకుండుట- అనగా తొలగిపోవుట లోపము. దేని కికార్యము విధింపబడునో అది తొలగిపోవును. "ద్రుతంబునకు సరళస్థిరంబులు పరంబులగునపుడు లోపసంశ్లేషంబులు విభాష నగు' అనుచో ద్రుతమునకు లోపము కలుగునపుడు- వచ్చెను+గోవులు- ద్రుతము(ను) తొలగిపోయి 'వచ్చె గోవులు'.

**185. వక్రతమము ;** (సంజ్ఞ 2) (వక్రతమ ఐచ్.) ఐఔలు వక్రతమంబు లని ప్రాచీనులు వ్యవహరింతురు. ఐ,ఔ అను రెండు వర్ణములకును వక్రతమములు అని పేరు.

**186. వక్రము :** (సంజ్ఞ.2) (ఏ ఐఛో వక్రః) ఎఏఒఓలు వక్రము లని ప్రాచీనులు వ్యవహరింతురు ఎ,ఏ,ఒ,ఓ అను నాలుగు వర్ణములకును వక్రములు అని పేరు.

**187. వచనము :** (కార.19) (వచనం సంఖ్యా) (ప్రాతిపదికాదులయందలి) సంఖ్యను బోధించు నామ(సుప్)క్రియా(తిఙ్)విభక్తి ప్రత్యయము వచనము, తెలుగున ఏకవచనము, బహువచనము అని యివి రెండు. రాముడు, రాముని యందలి (ఏకత్వ) సంఖ్యను బోధిం

చుటచే 'ము' (ఏక)వచనము. ఇట్లె వత్తురు అనుచో అనేకత్వసంఖ్యను బోధించుచు 'రు' (బహువచనము) మొ॥

**188.** వచ్యర్థము : (కా.ర.6) (వచి+అర్థ) వచధాతువు 'ఇక్ స్తిపౌ ధాతునిర్దేశే' యని ఇగంతముగా నిర్దేశింపబడినది. వచ ధాతువుయొక్క అర్థము వచ్యర్థము. అను, పలుకు మొ॥వచ్యర్థములు.

**189.** వర్గయుక్కు : వర్గయుగ్మము (సంధి.19)కచటతప అనుఅయిదు వర్గలలోను సరిసంఖ్యకు చెందినవర్ణములు వర్గయుక్కులు. అనగా వర్గలలో 2. మరియు 4. వర్ణములు. ఖఘఛఝఠఢథధఫభఅనుపదింటికి వర్గయుక్కులు. వర్గయుగ్మములు అని పేరు.

**190.** వర్గము : (వృజ్యతే ఇతి వర్గః. సమానధర్మిభిః ప్రాణిభి రప్రాణిభి రుపలక్షితం బృందమ్ వర్గః) సమానధర్మము గలిగిన ప్రాణులు అప్రాణులు నైనవానిచే తెలియబడుసమూహము. హల్లులలో క,కారము మొదలు కొని మకారమువర కున్న(స్పర్శ) వర్ణములలో స్థానసామ్యమునుబట్టి ఐదైదు ఒక వర్గ మగుచున్నవి. ఉదా- కవర్గ- కఖగఘఙ. అట్లె చవర్గ మొ॥

**191** వర్ణము : (సం. 1) (వర్ణ్యన్తే వ్యక్తం ధ్వన్యన్తే ఇతి వర్ణాః) ధ్వనులను వ్యక్తము చేయునవి, ధ్వనులన వర్ణించునవి వర్ణములు. అచ్చును, పొల్లయిన(ఏక) హల్లును వర్ణముగా గ్రహింపబడును. అ, క్. మొ॥

**192.** వర్ణకము : (తత్స. 10) (ప్రత్యయ ఇహ వర్ణకః) ప్రత్యయంబు వర్ణకం బని ప్రాచీనులు వ్యవహరింతురు. సంస్కృతము ననుసరించి ప్రత్యయ మనదగుదానికి తెలుగున 'వర్ణకము' అనియు సంజ్ఞ.నామవిభక్తులు,క్రియావిభక్తులు ( మొ).డుజ్,ము, మొ॥

**193.** వర్ణసమామ్నాయము : (సంజ్ఞ. 18) (సమామ్నాయ స్సమామ్నాతః వర్ణానాం సమామ్నాయః వర్ణసమామ్నాయః)

వర్ణములకూర్పు. ఒకచోట కూర్పబడినవర్ణములు, మొత్తము (సముదాయము) వర్ణసమామ్నాయము. 'సంస్కృతమునకు వర్ణంబులేఁబది' అనుచో ఆఏబదివర్ణము లేవియో అవి యెల్ల ఒకచోట కూర్ప (ప్రదర్శింప) బడినవి. అఆఇఈ - ఇది వర్ణసమామ్నాయము. ఇట్లే ప్రాకృతమునకు వర్ణములు నలువది మొ॥ కావులందును కూర్చిన వర్ణసమూహము వర్ణసమామ్నాయము.

**194. వర్తమానము** : (క్రియ. 2) వర్తమానంబు నాఁ బ్రారబ్ధాపరిసమాప్తంబు. మొదలు పెట్టబడి యింకను (వాక్య ప్రయోగసమయమునకు) క్రియ(వ్యాపారము) ముగియకుండుట వర్తమానము. 'చదువుచున్నాడు' చదువుట అనుపని ప్రారంభింపబడినది, యింకను ముగియలేదు. కావున ఇది వర్తమానార్థము.

**195. వళి** : (ప్రకీ. 23) 'పాదంబునం బ్రథమద్వితీయాక్షరంబులువళిప్రాసంబులు నాఁబడు' పద్యమునందు (ప్రతి) పాదమునను మొదటిఅక్షరమునకు 'వళి' అని సంజ్ఞ. 'శ్రీలతకుం బ్రాఁకయి' ఈపాదమున 'శ్రీ' అనుఅక్షరము మొదటిది కాన వళి.

**196. వికల్పము : అనిత్యము** ; (విధే రనిత్యత్వం వికల్పత్వమ్) కార్యమును అనిత్యముగా చెప్పునది వికల్పము. ఒకపక్షమున అగునట్లును, (వచ్చుట) ఇంకొకపక్షమున రాకుండునట్లును(రాకుండుటయు) కార్యమును విధించుశాస్త్రము వికల్ప(విధి)ము. 'కలన్వాదులనువర్ణంబు కు జ్జను' బహువచనంబు పరం బగునపుడు నిత్య మనుటచే ఏకవచనమున అనిత్యము-వికల్పము. కలను-కలఁకు. కావున కలన్వాదులనువర్ణంబు కు జ్జగు- అనునది వికల్ప (అనిత్య) విధి-ఒండె యన్నను వికల్పమే.

**197. వికృతి** : (తత్స. 46) 'ఇచట వికృతిశబ్దముచే సంస్కృతసమేతరంబు గ్రహింపవలయు. సంస్కృతసమముకంటె వే రయిన

ఆంధ్రభాష మొత్తమునకు అనగా ఆచ్ఛికమునకు వికృతి అని వ్యవహారము. ప్రాకృతసమ,తద్భవదేశ్యములు (అచ్ఛ) వికృతి సిరి-ఆకసము - ఊరు మొ॥ వికృతికి సంబంధించినది (వికృతియే) వైకృతము.

**198.** విగ్రహము :(వృత్త్యర్థావబోధకం వాక్యం విగ్రహః) వృత్తియొక్క అర్థమును తెలుపువాక్యము విగ్రహము. రాముని బాణము అనుసమాసవృత్తిలో రామునియొక్క బాణము అనునది విగ్రహము. ఇట్లె దొరతన మనుచో తద్ధితవృత్తిలో దొర యొక్క భావము విగ్రహము. పలిక = పలుకునట్టివాడు. కృద్వృత్తి.

**199.** విధానము : (అప్రాప్యప్రాపణం విధానమ్) (వివక్షింపక పోవుటచే ప్రాప్తింపని కార్యమును ప్రాప్తించునట్లు చెప్పుట విధానము. 'ఉత్తున కచ్చు పరంబగునపుడు సంధి యగు' ఇచట పరస్వరైకాదేశము గలుగునట్లు చెప్పుట విధానము. ఇట్లె 'క్త్వార్థంబైనయిత్తునకు సంధి లేదు' పరరూపము లేకుండ జేయుట విధానము.

**200.** విధానసామర్థ్యము : (అప్రాప్యప్రాపణం విధానమ్, నైయర్థ్యాభావ స్సామర్థ్యమ్) కలుగనిదానిని కలుగునట్లు చెప్పుట విధానము. విధానము వ్యర్థము గాకుండుట విధానసామర్థ్యము. 'సమాసంబుల నుదంతంబు లగు నుగాగమం బగు' అను చెప్పబడిననుగాగమము (విధానము)నకు 'సమాసంబునయందు ద్రుతంబునకు లోపంబగు' అనుసూత్రముచే లోపము వచ్చును. అట్లు లోపించుచో నుగామమును విధించుటయే (విధానమే) వర్థ మగును. అట్లుగాకుండుటకై అనగా విధానసామర్థ్యముచేత నుగాగమము లోపింపదు. చిగురుంగైదువు.

**201.** విధి : చూ. పుట 33.

**202.** (విధి) విధ్యర్థము : క్రియ. 35). (విధిః ప్రేరణమ్.

భృత్యాదేర్నికృష్టస్య ప్రవర్తనమ్) సేవకులు మొదలగువారిని క్రియ(పని)యందు ప్రవర్తించునట్లు చేయుట (ఆజ్ఞాపించుట) విధి. నీవు ఈకార్యంబు 'చేయునది' చేయునట్లుగా నియోగించుటచే 'చేయునది' విధ్యర్థము.

**203. విభాష :** (సంధి. 39) (న వేతి విభాషా. నిషేధ వికల్పయో ర్విభాషా సంజ్ఞా స్యాత్) నిషేధమును, వికల్పము (వచ్చుటయు, రాకుండుటయు)ను విభాష. ఇది వైకల్పిక మను అర్థమునను కనవచ్చును. కావున లక్ష్యమునం దొకసారి వర్తించుటయు ఒకపక్షమున వర్తింపకుండుటయు విభాష. 'కర్మధారయంబునందుఁ బేర్వాదిశబ్దంబుల కచ్చు పరం బగునపుడు టుగాగమంబు విభాష నగు' వచ్చిన- చిగురుటాకు, రాకున్న- చిగురాకు.

**204. విశేషణపూర్వపదకర్మధారయము :** (సమా. 8) విశేషణమునకు విశేష్యముతో నయిన సమాసము కర్మధారయము. ఇందు విశేషణము పూర్వపద మనగా సమాసమున పూర్వ(మొదటి) పదముగా నుండుటచే దీనినే విశేషణపూర్వపదకర్మధారయ మందురు. నల్లనియావు. నల్ల అను విశేషణము పూర్వపదముగా గలిగిన దగుటచే 'నల్లనియావు' అను(సాధారణ)కర్మధారయము, విశేషణ పూర్వపదకర్మధారయము.

**205. విశేషణము :** (కార.19) (విశిష్యతే అనేన- ఇతి. విశేషణమ్) వస్తువు(విశేష్యము)నందలి గుణము జాతి. మున్నగు (దృష్ట)ధర్మములను(బట్టి) వేరు చేయునది విశేషణము. 'విశేషణము నా జాత్యాదివిశేషములను దెలుపునది' 'నల్లనిఆవు' ఆవు అనువస్తువు నందలి నలుపు అనుగుణమును(బట్టి) (గోసముదాయమునుండి) వేరుచేయుచు (విశేష్యమందలి) గుణమును తెలుపుచున్నది కాన 'నల్ల' విశేషణము. జాతి, గుణ, క్రియా, ద్రవ్య, సంఖ్యా, సంజ్ఞలచే ఇది ఆరువిధములు.

**206. విశేషణోత్తరపదకర్మధారయము** : చూ. విశేష్య పూర్వపదకర్మధారయము.

**207. విశేషణోభయపదకర్మధారయము** : చూ. పుట 160

**208. విశేషవిధి** : (అల్పః స్యా ద్విషయో యస్య స విశేష విధి ర్భవేత్) ఏలక్షణమునకు లక్ష్యము కొంచె మైయుండునో అది విశేషవిధి. 'మధ్యమపురుషక్రియలయం దిత్తునకు సంధి యగును.' క్రియాపదములలో మధ్యమపురుషక్రియ లనుకొంచెము భాగము మాత్రమె లక్ష్య మై వర్తించున దగుటచే ఇది విశేషవిధి.

**209. విశేష్యపూర్వపదకర్మధారయము** : విశేషణమునకు విశేష్యముతో సమాసము కర్మధారయము. విశేష్యము పూర్వ (మొదటి)పదముగా గలిగినకర్మధారయము విశేష్యపూర్వపదకర్మ ధారయము. 'తమ్ముగుజ్జులు చిలుకమొకరీత్యాదులు విశేష్యపూర్వ పదకర్మధారయంబులు' తమ్ముగుజ్జులుతమ్మ(లు)విశేష్యము.పూర్వము విశేష్యము ఇట్లు పూర్వపద మైనచోట విశేషణము ఉత్తరపద మగును. (కుజ్జులు- విశేషణము- ఉత్తరపదము) కావున వీనినే విశేషణోత్తర పదకర్మధారయము లందురు.

**210. విశేష్యము** : (కార.19) (విశిష్యతే గుణాదిభిః ఇతి విశేష్యమ్) 'విశేష్యము నా విశేషణముచేఁ దెలుపఁబడు విశేషము గలది' గుణము జాతి మొద లగువిశేషము గలది విశేష్యము. 'నల్లని ఆవు' నలు పనుగుణము గల'ఆవు' విశేష్యము. విశేష్యము లనగా నామవాచకము లని కొందరు పేర్కొనిరి.

**211. విసర్గ(ము)** : **విసర్జనీయము** : విసర్జనీయమునకు విసర్గ(ము) అని వ్యవహారము. విసర్జనీయము(విడువదగినది) విసర్గము (విడువబడునది) అనుఅర్థములనుబట్టి కంఠమునుండి గాలి విడువ బడుటచే ధ్వనించునది. అః ఇత్యాదిగా స్వరమును అనుసరించి ఒకదానిమీఁద ఒకటిగా రెండుసున్నలుగా వ్రాయబడువర్ణము.

**212.** వుఞ్ఞు : (క్రియ.18) 'లకారంబునకు మధ్యమపురుషమును ఞాసు' ఇందలి వువర్ణమును ఇత్తుగుతరువాతిఞకారముతో కూర్పగా (వుఞ్) ఏర్పడిన వుఞ్ఞు ప్రత్యాహారము. ఇది వుసు (మధ్యమపురుష)ను ము (ఉత్తమపురుష) ప్రత్యయములను బోధించును.

**213.** వృత్తం బగుభావలక్షణము: (క్రియ.41) భావలక్షణంబు నా నన్యక్రియకు లక్షణభూతం బగుక్రియ. భావ మనగా క్రియ. వేరొకక్రియ(కాలాదులను)సూచించునది భావలక్షణము. 'వృత్తము' అనగా జరిగిపోయినది. అనగా భూతము. జరిగిపోయిన వేరొకక్రియకు సూచక మైనది. 'వాడు రమ్మనినఁ బోయితిని- అనినన్- వృత్తం బగుభావలక్షణము.

**214.** వృత్తి : (సంధి.45) పరార్థాభిధానం వృత్తిః పరార్థస్య స్వార్థాభిధాయకత్వమ్ అట నున్నశబ్దములకంటె విశేష మగునర్థమును తెలుపుట వృత్తి. రామునిబాణము. ఇట రామునియొక్క, బాణము అను రెండుశబ్దములు సమాసముగా ఏర్పడి రామునికి సంబంధించినబాణ మనుతీరుగా అర్థమున విశేషమును బోధించుచున్నది. ఇది సమాసమువలన గలిగిసమాసవృత్తి యగును. ఇట్లె తద్ధితవృత్తి, మొ॥ (వృత్తి రేకార్థీభావః- ఏకార్థీభావము వృత్తి)

**215.** వైకల్పికము : (సంజ్ఞ.14) (వికల్పేన ప్రాప్తిః. విధేరనిత్యత్వం వికల్పత్వమ్) వికల్పము అనగా అనిత్యముగా వర్తించుట వైకల్పికధర్మము. 'హ్రస్వమునిూఁదిఖండబిందువునకుఁబూర్ణబిందువు వైకల్పికంబుగా నగు'. అరఁటి, అరంటి భావ=అగుట, అభావ (కాకుండుట) అనురెండుపక్షములలో కార్యము వర్తించుట వైకల్పికము. (వికల్పము (విధి) వైకల్పికము (కార్యము) వైకల్పిక మనునది వికల్ప మనుఅర్థమునను గలదు.

**216.** వైకృతము : చూ. వికృతి.

**217. వైరిసమాసము :** (సమా.8) కేవలసంస్కృతశబ్దము వికృతిశబ్దముతోడ సమసింపదు. తత్సమముగా చేయని కేవలము సంస్కృతశబ్దముతో, వికృతి అనగా అచ్చతెనుగుశబ్దముతో సమాసము చేయరాదు. అనేకమారులు 'అనేక'- కేవలము సంస్కృతము. మారులు-వికృతి. లక్షణవిరుద్ధ మగు ఈసమాసము దుష్టము. ఇట్టిసమాసములనే కొందరు వైరిసమాసములు, అరిసమాసములు అందురు.

**218. వైషయికము :** (కార.17) (విషయతాసంబంధకృత ఆధారః వైషయికః) విషయమునకు సంబంధించినఆధారము వైషయికము. ఇది అధికరణములలో నొకటి. మోక్షమం దిచ్ఛ గలదు. ఇచ్ఛకు ఆధార మగుమోక్షము విషయ మగుటచే ఇది వైషయిక మగునధికరణము.

**219. వ్యంజనము :** హల్లులనె వ్యంజనము లనియు వ్యవహరింతురు. వ్యంజనం చార్ధమాత్రికమ్. అర్ధమాత్రాకాలమున నుచ్చరింపబడున వైనహల్లు లగుహల్లులు వ్యంజనములు. (అనుస్వారో వ్యంజనం చాక్షరాంగమ్) అచ్చు చేరనిదే హల్లు నుచ్చరించుట కష్టము. అన్యము(అచ్చు)ల సహాయముతో నుచ్చరింపబడునవి కావున హల్లులు వ్యంజనము లని కొందరు.

**220. వ్యతిరేకక్త్వార్థము :** (క్రియ.39) క్త్వా అనుసంస్కృత ప్రత్యయముయొక్క అర్థము క్త్వార్థము. ఏకాశ్రయము లగుక్రియల లోపల పూర్వకాలమునకు చెందినవ్యాపారమును బోధించునది క్త్వార్థము. అచట ధాత్వర్థ మగువ్యాపారము వ్యతిరేకార్థవిశిష్టమైనచో అది వ్యతిరేకక్త్వార్థ మగును. ఈఅర్థమున ధాతువునకు కక ప్రత్యయ మగును. వండక, తినక- మొ॥

**221. వ్యతిరేకతృవర్థకార్థము :** (క్రియ.47) 'తృచ్' అను సంస్కృతప్రత్యయముయొక్క అర్థము తృవర్థకార్థము. ధాతువునకు తద్ధర్మాదులందు కర్తను బోధించునపుడు 'తృ' ప్రత్యయమగును.

ఇట్టి ధాత్వర్థమగు వ్యాపారము వ్యతిరేకార్థవిశిష్టమయినచో నదివ్యతిరేకత్వవర్ణకార్థము. 'వ్యతిరేకత్వవర్ణకార్థంబున నికి యగు' చనునని వాఁడు.

**222. వ్యతిరేకభావము :** (క్రియ.37) భావం బనఁగా ధాత్వర్థంబు. ధాతువుయొక్క అర్థమైన వ్యాపారము వ్యతిరేకార్థవిశిష్టమైనచో అది వ్యతిరేకభావ మగును. వ్యతిరేకభావంబున నిజి యగు. వండ**మి**- (వండకుండుట) మొ॥

**223. వ్యధికరణ(సమాస)ము :** (సమా.2) 'ద్వితీయాదులకు మీఁదిపదంబుతోడ సమాసంబు వ్యధికరణంబు నాఁబడు'. ద్వితీయ మొదలగు విభక్తులు చివర గలిగిన శబ్దములకు పైపదముతో చేసిన సమాసమునకు వ్యధికరణ మని పేరు. ద్వితీయాతత్పురుషము ఇత్యాదిగా పేరి వ్యవహారము ప్రసిద్ధము. రామునియొక్క బాణము- రాముని బాణము. ఇందు రామత్వము రామునియందు, బాణత్వము బాణమునందును నుండును గావున సమాసములందలి పదముల అర్థమునకు అధికరణము సమానము గాకపోవుటచే ఇవి వ్యధికరణ సమాసము లగుచున్నవి.

**224. వ్యపేక్షాసామర్థ్యము :** (స్వార్థపర్యవసాయినాం పదానా మాకాంక్షాదివశా ద్యః పరస్పరాన్వయః తత్ వ్యపేక్షారూపం సామర్థ్యమ్) అర్థవంతము లగు పదములు పరస్పర మొకదానితో నొకటి ఆకాంక్షాదిరూప మయిన సంబంధముతో ప్రత్యేకము లై అన్వయము కలిగియుండుట వ్యపేక్షాసామర్థ్యము. ఇది వాక్యగత మై యుండును. రాముఁడు రావణుని చంపెను.

**225. వ్యవస్థితవిభాష :** (సంధి.17) (క్వచిద్భవతీత్యంశ ఏవ ప్రవర్తతే, క్వచిత్తు న భవతీత్యంశ ఏవ. క్వచి దుభయమ్. ఇత్యేవం లక్ష్యానుసారేణ వ్యవస్థయా ప్రవృత్తా విభాషా వ్యవస్థితవిభాషా.) వ్యవస్థ అనగా నియమము. వచ్చును, లేక రాదు అనుతీరుగా వ్యవస్థ

చేయబడినవిభాష వ్యవస్థితవిభాష. 'ఆదేశసరళములకు ముం దున్న-అనుసూత్రమునందలి విభాషకు ప్రాంతాదులలో లుప్తశేషమునకు వచ్చినద్రుతమునకు సంశ్లేషము 'రాదు' అను వ్యవస్థ చేయబడినది. కావున అది వ్యవస్థిత విభాష.

**226**. **వ్యవహితము** : వ్యవధానము కలిగినవి వ్యవహితము. వ్యవధాన మనగా ఎడము. అనగా కూడియుండవలసిన రెండుశబ్దములు నడుమ వేరొక(వర్ణ)శబ్దము చేరుటచే దూరము (ఎడము) చేయబడుట. విద్యాశాలి యుగపురుషుడు. నడుమ అగు అనుదానిచే విద్యాశాలి అనువిశేషణము పురుషు డనువిశేష్యము దూరము చేయబడినవి. వ్యవహితములు అయినవి.

**227**. **శత్రర్థము** : (క్రియ,43) శతృ అనుసంస్కృతప్రత్యయముయొక్క అర్థము శత్రర్థము. (లట శ్శతృశానచౌ) అది వర్తమానార్థము. తెలుగున ఆ అర్థమునందు 'చువర్ణకంబు ద్రుతాంతంబు క్రియాన్వయంబునశత్రర్థంబునం దగు' అని 'చును' ప్రత్యయము విధింపబడినది. చూచుచును పోయెను. క్రియాన్వయమునం దగుట సంస్కృతముకంటె తెలుగున విశేషము.

**228**. **శబ్దకర్మము** : (క్రియ.123) (శబ్దః కర్మ యేషాం తే శబ్దకర్మాణః) శబ్దరూపము (వేదము మొ॥) కర్మగా గలిగినధాతువులు శబ్దకర్మములు. విను. ఈధాతువునకు అర్థమైనఫలరూప మగువినబడు ధ్వన్యాత్మక శబ్దము కర్మ గావున 'విను' ధాతువు శబ్దకర్మము. ఇట్లె చెప్పు, చదువు మొ॥

**229**. **శబ్దపల్లవము** : (క్రియ.118) 'ధాత్వాదులకు ధాతువు లనుప్రయుక్తంబు లయి విలక్షణార్థాభిధాయకంబు లగునీయవి శబ్దపల్లవంబులు నాఁబడు'. ధాతువు మొద లగువానికి మీఁద ధాతువు చేరి వేరొకఅర్థమును బోధించుచట్టిశబ్దములకు శబ్దపల్లవములు అని సంజ్ఞ. కూరుచుండు, విజయంచేయు మొ॥

**230. శేషము :** (కార.15), **231. శేషషష్ఠి :** (కారక ప్రాతిపదికార్థవ్యతిరిక్తః స్వస్వామిభావాదిసంబంధః శేషః) కర్మ మొదలగు కారకములు, ప్రాతిపదికార్థము అనువానికంటె వేరైన, స్వస్వామిభావము, జన్యజనకభావము మొదలగువిధమైన సంబంధము శేషము. 'శేషషష్ఠికి యొక్కయు నగు' ఈఅర్థమునందు సంబంధి (స్వామి, జనక మొ॥)పదమునకు యొక్కషష్ఠి యగును. రాముని యొక్క భక్తుడు. శేషార్థమునందు వచ్చుయొక్క అనుషష్ఠి శేషషష్ఠి

**232. షష్ఠీసమాసము :** (సంధి.28) షష్ఠీవిభక్తి అంతమందు గలిగినపదమునకు మిాదిపదముతో డిసమాసము షష్ఠీ(తత్పురుష) సమాసము. రాజునాజ్ఞ. రాజుయొక్క అనుషష్ఠ్యంతమునకు మిాది (అజ్ఞ యను) పదముతో సమాసము. కావున ఇది షష్ఠీసమాసము.

**233. సంఖ్యాభిధానము :** (కార.23) (అభిదధతీత్యభిధానమ్ సంఖ్యాయాః అభిధానమ్ సంఖ్యాభిధానమ్) సంఖ్యను తెలియజేయు శబ్దము సంఖ్యాభిధానము. సంఖ్యావాచక మని యర్థము. తెలుగు సంఖ్యావాచకములు సర్వనామములుగూడ అగును. ఒకటి,లక్ష. మొ॥

**234. సంజ్ఞ :** చూ. పుట 33. (వ్యవహారార్థం శాస్త్రైః కృతస్సంకేతః సంజ్ఞా).

**235. సంధి :** (సంధి.1) పూర్వపరస్వరంబులకుం బరస్వరం బేకాదేశం బగుట సంధి యనంబడు' ముందరిశబ్దము చివరియచ్చు యొక్కయు దానికి తరువాత నున్నశబ్దము మొదటిఅచ్చుయొక్కయు రెండువర్ణములస్థానమున తరువాతిశబ్దముయొక్క మొదటిఅచ్చు ఆదేశముగా వచ్చుట సంధి యనబడును. రాముండు + అతండు రాముడతడు. సంహితయం దగునవియు సంధిపరిచ్ఛేదమున చెప్ప బడినవియు సంధికార్యములె యగును.

**236. సంప్రదానము :** (కర్మణా య మభిప్రైతి స సంప్రదానమ్. దానస్య కర్మణా య మభిప్రైతి స సంప్రదానసంజ్ఞః స్యాత్)

త్యాగోద్దేశ్యంబు సంప్రదానంబు నాఁబడు. త్యాగమున కుద్దేశింపబడిన దానికి సంప్రదానము అని సంజ్ఞ. ఎవ్వరికి ఈయదలచితిమో ఆతడు సంప్రదానము అగును. 'జనకుడు రామునికొఱకు కన్య నిచ్చెను' కన్యను రామున కీయదలచుటచే రాముడు సంప్రదానమగును. ఆశబ్దమునకు చతుర్థీవిభక్తి వచ్చును.

**237. సంప్రశ్నము :** (క్రియ.22) (తద్వా కర్తవ్య మిదం వేతి రూపః సంప్రశ్నః) కర్తవ్యముగా రెండు క్రియ లున్నపుడు ఇదియా కర్తవ్య మదియా యనురూప మైనసందేహస్థితి సంప్రశ్నము. ఈఅర్థమున ధాతువుపై లోట్టు వచ్చును. ఉండునా? పోదునా? ఉండుట, పోవుట అను రెండుక్రియలలో కర్తవ్య మేది యనువిధముగ సందిగ్ధస్థితితో గూడినప్రశ్నము కలదు గాన ఇది సంప్రశ్నము.

**238. సంప్రార్థనము :** సంప్రార్థనము అనగా వేడికొనుట. గొప్పవారిని, పనిచేయ గోరుట సంప్రార్థనము. ఇట్టిఅర్థముగల వ్యాపారమునందు వర్తించుధాతువునకు 'ఆశీశ్శాపసంప్రార్థన విధులందు లోట్టగు'ను. (రాము) రక్షింపుము.

**239. సంబంధము :** (కార.15) (విశిష్టధీహేతు స్సమ్బన్ధః) ప్రత్యేకతకలిగినట్టిఎఱుకకు కారణ మైనది సంబంధము. ఇదిస్వ-స్వామి, జన్య-జనక, అవయవ-అవయవి, ఇత్యాదిగా అనేకప్రకారము లై యున్నది. 'రామునియొక్క తమ్ముడు' తమ్మునిలోనివిశిష్టలక్షణము తెలియుటకు కారణ మైన అతనికి రామునికి నడుమ నున్నధర్మము సంబంధము.

**240. సంబుద్ధి డుజ్ఞు :** (తత్స.34) 'ఏకవచనం సంబుద్ధిః' అని సంబోధనమునం దున్నప్రథమావిభక్తి ఏకవచనమునకు సంబుద్ధి అని సంజ్ఞ. ఓరాముఁడ. ఇచట ఓరాముఁడు- అనుచోట నున్నడుజ్ఞు సంబోధనమునం దేకవచనముగా అయినది గావున ఇది సంబుద్ధి. సంబుద్ధి యనగా సంబోధన మనియు అర్థము.

**241.** సంబోధనము : (తత్స 32) (అన్యత్రాసక్తస్య కార్యాన్తరే నియోజనార్థ మాభిముఖ్యవిధానమ్ సంబోధనమ్) (వేరొకదానియందు ఆసక్తి కలవానిని (ఇష్టకార్యమునందు నియోగించుటకై) అభిముఖునిగా చేసికొనుట సంబోధనము. ఓరామ, వృక్షములార! మొ॥

**242.** సంబోధ్యవాచకము : (తత్స.14) సంబోధన మనగా అభిముఖము చేసికొనుట. సంబోధింపదగినది సంబోధ్యము. దానిని తెలుపుశబ్దము సంబోధ్యవాచకము. అనగా ఎవరిని పిలుతుమో వారిని బోధించుశబ్దము. ఓరామ! ఇట సంబోధింపబడువాడు రాముడు కావున అతనిని బోధించురామశబ్దము సంబోధ్యవాచకము.

**243.** సంభావన : (క్రియ. 32) ఇది యిట్లని నిశ్చయముగా చేసినఊహ సంభావన(ము.) ఈ అర్థము గలిగినవ్యాపారమునందు వర్తించు ధాతువునకు 'తద్ధర్మార్థములందు లా ట్టగు' అని లాట్టు వచ్చును. 'ఇపుడు వాడింట నుండును', ఉండుట అనునది నిశ్చయముగా నున్నయూహ. కావున ఇది సంభావనార్థకము.

**244.** సంశ్లేషము : (సంధి 17) 'సంశ్లేషం బనఁగా మీఁది హల్లుతోఁ గూడికొనుట' (పూచెను+గలువలు)- పూచె గ్గలువలు ద్రుతము స్వరలోపమును బొంది మిగిలినహల్లునకారము మీఁది హల్లుతో గూడికొనుటచే ఇది సంశ్లేషము. లిపిలో విడిగా వ్రాసినను స్వరలోపము నందుటచే ఉచ్చారణమున సంశ్లేషము స్పష్టము.

**245.** సంస్కృతభవము : (సంజ్ఞ.20) సంస్కృతప్రాకృతభవం బగుభాష తద్భవంబు' సంస్కృతమునుండి పుట్టిన తెలుగుశబ్దము తద్భవము. సంస్కృతప్రకృతియందు వర్ణవికారములను బొంది తెలుగువిభక్తులను పొందునట్టిశబ్దము సంస్కృతభవ మని గుర్తింపవచ్చును. ఆకాశ=ఆకస-అకసము.

**246.** సంస్కృతసమము : (సంజ్ఞ.19) 'సంస్కృతప్రాకృత

తుల్యం బగుభాష తత్సమంబు', సంస్కృతముతో సమ మైన తెలుగు శబ్దము సంస్కృతసమము. సంస్కృతప్రకృతి తెలుగువిభక్తులు, విభక్తినిమిత్తకవర్ణవికారములతోను తెలుగునచేరిన అది సంస్కృతసమమని స్థూలముగా గ్రహింపవచ్చును. దీనిని 'సమము' అనియు అందురు. ఆకాశ-ఆకాశము, రామ-రాముడు మొ॥

**247.** సంస్కృతసమేతరము : చూ. సమేతరము.

**248.** సంస్కృతీయము : (సంధి.4) సంస్కృతమునకు సంబంధించినది సంస్కృతీయము. 'గంగ'. గంగాశబ్దమునందలి(సంస్కృత) 'ఆ' కారము స్థానమున వచ్చినహ్రస్వము సంస్కృతమునకు సంబంధించినది సంస్కృతీయము. శౌరి, శ్రీ మొ॥

**249.** సంహిత : (పర స్సన్నికర్ష స్సంహితా)- వర్ణానామతిశయిత సన్నిధి స్సంహితా సంజ్ఞ స్స్యాత్) వర్ణములకు నడుమ ఉచ్చారణములో అర్ధమాత్రకంటె ఎక్కువ వ్యవధానము లేకుండుట సంహిత. రాముఁడు+అతడు- రాముడతడు. రెండుపదములనడుమ సంహితవలన సంధి. సంహితయె సంధి యనునర్థమున వ్యవహరింపబడుట కలదు.

**250.** సకర్మకము : (క్రియ.48) (కర్మణా సహ వర్తమానః సకర్మకః) సకర్మకంబు నాఁ గర్మాకాంక్షోత్థాపకంబు. కర్మనుగూర్చిన ఆకాంక్ష గలది, అనగా కర్మము కలిగినది అగుధాతువు సకర్మకము. తిను, చదువు మొ॥ వాఁడు అన్నమును తినెను. ఇచట దేనిని (అన్నమును)తినెను అనురీతిగా కర్మను గూర్చినఆకాంక్ష కల్గినదగుటచే 'తిను' ధాతువు సకర్మకము.

(ఫలవ్యాపారయో రేకనిష్ఠతాయా మకర్మకః ధాతు స్తయోర్ధర్మభేదే సకర్మక ఉదాహృతః. ధాతువుయొక్క అర్థము లైన ఫలము, వ్యాపారము అను రెండుధర్మములు భిన్నవస్తువులం దున్నచో సకర్మకము. రాముడు అన్నము తినెను. తినుధాతువున కర్థ మైన

నోటిలో పెట్టుకొను మొ॥ రూప మైనవ్యాపారము రాముని(కర్తను)' నముల బడుట మొద లగురూప మైనఫలము అన్నము (కర్మ)ను' భిన్నముల నాశ్రయించుటచే తినుధాతువు సకర్మకము).

**251.** సత్త్వము : (క్రియ.46) 'సుబంతవాచ్యంబు సత్త్వంబు నాఁబడు' నామవిభక్తులు (సుప్) అంతమందుగలది సుబంతము. దానిచే తెలుపబడునది- అనగా ద్రవ్యము- సత్త్వము. (వస్తువు) వ్యాపారమును గాక పదార్థమును బోధించునపుడే ధాతువుపై ఉన్న, కల, మొ॥ప్రత్యయము లగును. అనగా నామముల నాకాంక్షించుచు సుబంతములకు విశేషణము లగును. (వండుచున్నవాఁడు). వండు చున్నాడు ఉన్న ప్రత్యయ మైన ఇది వస్తుబోధకము. వండుచున్నాడు ఉన్న అనుబంధ మైనఇది క్రియాబోధకము.

**252.** సమాసము : చూ. పుట. 157

**253.** సమాసాంతకార్యము : (సమా.22)సమాసము తుదిని కలుగునట్టి, సమాసమునకు సంబంధించిన కార్యములు సమాసాంత కార్యములు. ఇవి సమాసముతుదిని ఆగమాదేశాదిరూపమున నుండును. తెలుగున ఇట్టిసమాసాంత కార్యములు బహువ్రీహియందు కన్పించుచున్నవి. ముక్కన్ను-ముక్కంటి-ంటి-సమాసాంత కార్యము. పూవిలు'తు'డు మొ॥

**254.** సమేతరము : చూ. అచ్చు.

**255.** సరళము : (సంజ్ఞ.5) 'కచటతపలు పరుషంబు లని గజడదబలు సరళంబు లని చెప్పంబడు' 'గజడదబ' అనుహల్లులకు సరళములు అని సంజ్ఞ. 'దంత్యతాలవ్యంబు లయినచజలు సవర్ణంబులు' అనుసూత్రము ననుసరించి ఇట తాలవ్యజకారముచే దంత్య జకారము గ్రహింపబడి అదియు సరళ మగును. గజజడదబ అను ఆఱుహల్లులు సరళములు.

**256.** సర్వనామము : (అచ్చి.24) 'అన్నిప్రభృతులు సర్వనామంబులు' అన్ని-ఇన్ని-ఎన్ని-కొన్ని-పెక్కు-పలు. ఆ, ఈ, ఏ-నీ-నా-మన-తా అనుశబ్దములకును, (తెలుగు)సంఖ్యావాచకములకును సర్వనామములు అని సంజ్ఞ. అందఱు-అన్ని- రెండు- ఇరువురు మొ॥

**257.** సవర్ణము : (సంజ్ఞ.8) 'తుల్యాస్య ప్రయత్నం సవర్ణమ్' అనులక్షణమునుబట్టి ఏ రెండువర్ణములు స్థానప్రయత్నములచే సామ్యము గలవో. అవి సవర్ణము లగును. దంత్యతాలవ్యచజలకు పరస్పరము దంత-తాలురూపమున స్థానభేద ముండుటచే తెలుగున విశేషముగా దంత్యతాలవ్యంబులయినచజలు సవర్ణంబులు అని సవర్ణత విధింపఁబడినది.

**258.** సాంస్కృతికపరుషము : (సంధి. 14) పరుషము లనగా 'కచటతప'లు. సంస్కృతమునకు సంబంధించినవి సాంస్కృతికములు. సాంస్కృతికము లయినపరుషములు అనఁగా సంస్కృత శబ్దమునకు సంబంధించియున్న పరుషములు సాంస్కృతికపరుషములు. కంసారి విశ్వకర్మ ఇందలికకారములు సాంస్కృతికపరుషములు.

**259.** సాంస్కృతిక సమాసము : (సమా. 2) చూ. సాంస్కృతికము. పుట. 158

**260.** సాతత్యము : (క్రియ.33) (సతతస్య భావః) నిరంతరముగా (ఎల్లప్పుడు)నుండుట సాతత్యము. ఈఅర్థమునం దున్న వ్యాపారమునందు వర్తించుధాతువునకు 'తద్ధర్మాదులందు లా ట్టగు' అని లాట్టు వచ్చును. 'సర్వం బీశ్వరునియం దుండును'- ఇట ఉండు అనునది సతతభావమును తెలుపుచున్నది కావున నీయర్థము సాతత్యము.

**261.** సాధ్యపూర్ణము : చూ. సాధ్యబిందువు.

**262.** సాధ్యబిందువు : సాధ్యము అనగా సంపాదింపబడినది.

బిందు వనగా అనుస్వారము (సున్న). వ్యాకరణసూత్రముచే సంపాదింపబడినబిందువు సాధ్యబిందువు. అట్లు సాధింపబడినది ఖండ మైన అది సాధ్యఖండము. 'రాముఁడు' 'ఙిత్తు బిందుపూర్వం బగు' శాస్త్రముచే సాధింపబడినది కాన ఈఖండము (అరసున్న) సాధ్యఖండము. 'రాముండు'. పైవిధముగా సాధింపబడిన ఈపూర్ణము- సాధ్య పూర్ణము.

**263.** సాధ్యసమాసము : (సమా.2) 'సంస్కృతసమంబుల సమాసంబు సాధ్యంబు నాఁబడు' సంస్కృతసమము లగుశబ్దములకు చేయబడినసమాసమునకు సాధ్య(సాంస్కృతిక)సమాసము అని పేరు. రాజునాజ్ఞ. రాజుయొక్క ఆజ్ఞ అనుసంస్కృతసమములకు గల్గిన సమాసము కావున ఇది సాధ్యసమాసము.

**264.** సామర్థ్యము : (సమా.1) 'పృథఖ్యాతంబు లగునర్థంబుల కేకార్థీభావంబు సామర్థ్యంబు' పృథక్ప్రసిద్ధార్థంబు లగుపదంబుల కేకార్థంబునందు వృత్తి సామర్థ్యము" ప్రత్యేకముగా ప్రసిద్ధ మైనఅర్థముతో నున్నశబ్దములు గలిసి ఒకే అర్థమును బోధించుచు కలియుట సామర్థ్యము. రామునియొక్క, బాణము= రాముని బాణము. సమాసములందలి యిసామర్థ్యమును ఏకార్థీభావసామర్థ్య మందురు.

**265.** సామాన్యవిధి : (బహూవో విషయా యస్య స సామాన్యవిధి ర్భవేత్) అధిక మైనలక్ష్యభాగము కలిగిన, ప్రవర్తించు అవకాశము ఎక్కువగా కలిగిన లక్షణము సామాన్యవిధి. 'ఉత్తున కచ్చు పరం బగునప్పుడు సంధి యగు' మొ॥

**266.** సిద్ధబిందువు : సహజముగా నిష్పన్నము సిద్ధము. బిందువు అనగా అనుస్వారము (సున్న). శబ్దముతో సహజముగా ఏర్పడియున్నబిందువు సిద్ధబిందువు. అట్టిది అరసున్న యైన సిద్ధ

ఖండము. చీకటి. సహజసిద్ధము పూర్ణ మైనచో అది సిద్ధపూర్ణము. బంతి.

**267.** సిద్ధసమాసము : (సమా. 2) "కేవలసంస్కృత శబ్దంబులసమాసంబు సిద్ధంబు నాఁబడు" సంస్కృతశబ్దములకు సంస్కృతవ్యాకరణము చొప్పునసంస్కృతముననే సమాసము సిద్ధ మైనసమాసప్రాతిపదికము తెలుగులోనికి వచ్చును. తెలుగులోనికి వచ్చునప్పటికే సమాసము సిద్ధ మైయుండుటచే ఇవి సిద్ధసమాసములు రాజ్ఞః, అజ్ఞా= రాజాజ్ఞ.

**268.** సుబంతము : (క్రియా.46) సుప్ అంతమందు కలది సుబంతము. సుప్పులు సంస్కృతనామవిభక్తులు, తెలుగున డుములుపులు మొదలుగా చెప్పబడినప్రథమాదివిభక్తులు (సుప్పులుగా)అంతమందు గలిగినవానిని సుబంతములుగా గ్రహింపదగును. సుబంతము లనగా నామవిభక్త్యంతములు. రాముడు, వనమునందు మొ॥

**269.** సూత్రము : చూ.పుట. 13.

**270.** స్త్రీవద్భావము (తత్స.53) స్త్రీవద్భావము అనగా స్త్రీలింగశబ్దములను బోలినధర్మము. సహజముగా స్త్రీలింగములు కాని ఋకారాంతశబ్దములకు స్త్రీలింగధర్మము అతిదేశింపబడినది. అట్టిస్త్రీవద్భావమువలన ఆశబ్దములకు ప్రథమైకవచనలోపము మున్నగుస్త్రీలింగ కార్యములు గల్గును. భ్రాత-విధాత.

**271.** స్త్రీసమము : స్త్రీలింగములు కానిఅచ్చిక శబ్దములు కొన్నింటికి స్త్రీసమత్వము అతిదేశింపబడినది. అట్టివానికి ప్రథమైకవచనలోపము మున్నగుస్త్రీలింగకార్యములు కల్గును. అన్న, అక్క, చిలుక, గోడ మొ॥ ప్రథమైకవచనము లోపించునట్టిఅచ్చ తెనుగుశబ్దము స్త్రీసమ మని స్థూలముగా గ్రహింపవచ్చును.

**272.** స్థిరము : (సంజ్ఞ-6) 'ఇతరము లగుహల్లులు స్థిరములు'

'కచటతపలు పరుషంబులు గజడదబలు సరళంబు లని చెప్పంబడు' అనుసూత్రము ననుసరించి పరుషములయిన కచటతపలును, సరళము లయిన గజడదబలును తప్ప మిగిలినహల్లులకు 'స్థిరము'లని సంజ్ఞ. ఖ_ఙ_మొ

273. స్వత్వము : (సంధి.17) స్వత్వం బనఁగా ద్రుతము నకు ప్రకృతిభావము. ద్రుతము స్వస్వరూపముతో అనగా సహజ రూపముతో నుండుట స్వత్వము. వచ్చెనుగోవులు.హరిని గాంచి మొ॥

474. స్వరము : (క్రియ.50) (అచః స్వరాః) అచ్చులకు స్వరము లని సంజ్ఞ. వేరొకవర్ణము సహాయము లేకుండ స్వయముగా ప్రకాశించునవి (స్వయం రాజన్తే ఇతి స్వరాః)= ఉచ్చరింపబడునవి కావున అచ్చులు స్వరములు. ఉదాత్త, అనుదాత్త, స్వరితము లను స్వరభేదము గలవి గావున అచ్చులు స్వరములు. అ,-ఇ,ఉ మొ॥

275. స్వార్థము : (తద్ధి.9) 276. స్వార్థికము : స్వ+అర్థ- అనఁగా స్వీయార్థము. స్వార్థ మనగా ప్రాతిపదికార్థ మనియు ధాతువులయెడ ధాతువర్థ మనియు గ్రహింపదగును. 'అరమరాదులకు స్వార్థం బునం దిక వర్ణకం బగు'. అరమరిక=అరమర యనియె దీనియర్థము. పండు అనుధాతువుపై ఆయర్థముననే 'కొను' చేరును. పండుకొను- 'పండు' అనియే దీనియర్థము స్వార్థమున విధింపబడినప్రత్యయాదులు స్వార్థికములు. పైనిచూపబడిన- ఇక మొ॥

277. హల్లు : (సంజ్ఞ.1) 'కకారాదులు హల్లులు' వర్ణమాలలో నిర్దేశింపబడినవానిలో కకారము మొదలుకొని తుదివర కున్న వర్ణములన్నింటికిని హల్లులు అని సంజ్ఞ. కఖ——సహళ. ఇందు ఉచ్చారణార్థము చేర్చిన అకారము తొలగగా క్, ఖ్-మున్నగా హల్లులకే హల్లు లని సంజ్ఞ. (హల్ అనునది సంస్కృత ప్రత్యాహారము.

**278.** హేతువు : (కార. 4) ఫలసాధనయోగ్యం బగు పదార్థంబు హేతువు. ఫలమును సాధించుటకు తగినవస్తువునకు హేతువు అని సంజ్ఞ. దీనికి చేత అను ప్రత్యయము వచ్చును. విద్య చేత యశము గలుగును. యశము అనుఫలము సాధించుటకు తగిన పదార్థము గావున 'విద్య' హేతువు.

**279.** హ్రస్వము : (ఊకాలో ఽజ్ఝ్రస్వదీర్ఘప్లుతః) 'ఏకమాత్రో భవే ద్ధ్రస్వో ద్విమాత్రో దీర్ఘ ఉచ్యతే త్రిమాత్ర స్తు ప్లుతో జ్ఞేయో వ్యంజనం చార్ధమాత్రకమ్) ఒకమాత్ర(సెకనులో 1/5 వంతు)కాలమున ఉచ్చరింపబడునచ్చునకు హ్రస్వము అని సంజ్ఞ. అ,ఇ,ఉ. మొ॥

**280.** హ్రస్వవక్రము : (సంజ్ఞ. 3) 'ఎఏఒఓలు వక్రములని ప్రాచీనులు వ్యవహరింతురు' వక్రము లయినఎ,ఏ,ఒ,ఓ అనువానిలో ఎ,ఒ,లు హ్రస్వములు. కావున ఎ,ఒ అనునవి హ్రస్వవక్రములు. ఏఓ అనువక్రములు దీర్ఘములు గాన అవి దీర్ఘవక్రములు.

## (....ప్రౌఢవ్యాకరణము)

**1.** అంతర్భావితప్రేరణము : (క్రియ. 34) అంతర్భవించిన ప్రేరణార్థము కలిగినది అంతర్భావితప్రేరణము. లోపల ప్రేరణార్థము కలది. ధాతువు స్వస్వరూపముననె తనలోపల ప్రేరణార్థము నైతము కలిగియున్నది. అనగా వినతునుబట్టి స్వార్థమునె కాక ధాతువు ప్రేరణార్థము నైత మిచ్చును.'కరఁగు, తలఁగు, మొఱయ్యాదు లంతర్భావితప్రేరణంబులు' దాహమున కరఁగి (ద్రవించి=స్వార్థము) బాణముల్ కరఁగి ఘటించిరి (కరఁగి-కరిగించి= ప్రేరణము) కరఁగు ధాతువు అంతర్భావితప్రేరణము. ఇట్లె ఆఁగు మొ॥

**2.** అంతస్థము : (యరలవా అంతస్థాః) 'య,ర,ల,వ'. అను నాలుగు వర్ణములకు అంతస్థము లని సంజ్ఞ. స్పర్శ (కకారము నుండి మకారము వరకు నున్న వర్ణము)లకును, ఊష్మములకును నడుమ (అంతః)నున్న (స్థ)వర్ణములు గావున వీనిని అంతస్థము లందురు. ఉచ్చారణమున గాలి నోటిలోపల నిలిచియుండుటచే అంతస్థములు.

**3.** అక్ప్రత్యయాంతావ్యయము : (సంజ్ఞ.8) అక్ అను ప్రత్యయము చివర గలిగినఅవ్యయము అక్ప్రత్యయాంతావ్యయము. 'కఙి వ్యతిరేకక్త్వార్థంబునం దగు' అని వచ్చిన క(ఙి)ప్రత్యయముతో 'ఙిత్తు పరం బగునపు డుత్వంబున కత్వం బగు' అని దానికి ముందు వచ్చు అత్వమును కూర్చి అక్ప్రత్యయముగా ప్రౌఢవ్యాకర్త గ్రహించెను. తినక, వినక - మొ॥ వ్యతిరేకక్త్వార్థక మని అర్థము.

**4.** అకర్మకకర్తరిప్రయోగము : (వాక్య.3) కర్త,(కర్మ), క్రియ కలిగినవాక్యము ప్రయోగము. క్రియచేత కర్త చెప్పబడు నేని అది కర్తరిప్రయోగము. కర్మ లేనిధాతువు (అకర్మకము) నుండి యేర్పడినక్రియతోడి కర్తరిప్రయోగము అకర్మకకర్తరిప్రయోగము. 'రాముఁడు వచ్చెను' ఇచట వచ్చుధాతువు అకర్మకము. 'వచ్చెను' అనుక్రియచే కర్త(రాముడు) చెప్పబడుటచే ఇది అకర్మకకర్తరి ప్రయోగము.

**5.** అక్షరము : (ఉభయే త్వక్షరాణి, అనుస్వారో వ్యంజనః చాక్షరాంగమ్) హ్రస్వము, దీర్ఘము (ప్లుతము) అనుభేదము గల అచ్చు అక్షరము. అనుస్వారము, (విసర్గ) పొల్లుహల్లు అక్షరమున కవయవములే కాని అక్షరములు కావు. కావున అచ్చును అచ్చుతో గూడినహల్లు(లు), అనుస్వారవిసర్గలు, 'అక్షరము' అనుసంజ్ఞ నందును. 1. అ, 2. క(క్య), 3. అం, 4. అః, మొ॥

**6.** అధికారము : చూ. పుట. 24.

7. అధ్యాహారము : 8. అధ్యాహార్యము : చూ. పుట.195.

9. అనిత్యము : చూ. పుట. 196.

10. అనుస్వారము : (అనుగతః స్వరాన్ ఇతి అనుస్వారః.) స్వరములను అనగా అచ్చులను (ఉచ్చారణమునందును లేఖనము నను) అనుసరించియుండునది కావున అనుస్వారము. ఇది పూర్ణాను స్వారము, (నిండుసున్న) అర్ధానుస్వారము (సగముసున్న) అని తెలుగున 2విధములు. అం,అఁ. అనుస్వారము గావున పూర్వమున స్వరము లేకుండ ఇది ఉండదు. పాలఁతి-పొత్తి.

11. అన్నంత(క్రియ)ము: 12. అన్ప్రత్యయాంత(క్రియ)ము : అన్ అను ప్రత్యయము చివర గలిగిన(క్రియ)ది. అన్ప్రత్యయాంత (క్రియ)ము. అన్+అంత=అన్నంతము. 'తుమర్థభావలక్షణంబు లందు నుఁజీ యగు' అని యైన- ను(జీ)ప్రత్యయముతో- (న్), 'జీత్తు పరం బగునపు డుత్వంబున కత్వం బగు' అని ముందు వచ్చుఅత్వ మును గూర్చి- (అను)'అన్' ప్రత్యయముగా ప్రౌఢవ్యాకర్త వ్యవ హరించెను. (నుబ్యంతము) తుమర్థక్రియ. వండు-వండన్. మొ॥

13. అన్వయము : చూ. పుట. 194.

14. అప్రధానము : (శబ్ద.6) 'విశేష్యంబు ప్రధానం బితరం బప్రధానంబు. విశేషణము అప్రధానము. కర్తృకర్మాదిరూపమున క్రియతో అన్వయించునది ప్రధానము. క్రియతో కాక, విశేష్య ముతో అన్వయము కలిగియుండును, కావున విశేషణము అప్ర ధానము. ఆర్తరక్షకు శ్రీరాము నభినుతింతు ఆర్తరక్షకున్- విశేష ణము అప్రధానము.

15. అప్రాణివాచకము : (సమా.30) చూ. జడము.పుట 214.

16. అవ్యయము : (సదృశం త్రిషు లింగేషు సర్వాసు చ

విభక్తిషు వచనేషు చ సర్వేషు యన్న వ్యేతి తదవ్యయమ్)అవ్యయము లనగా లింగ,విభక్తి,వచనశూన్యములు. అన్నివిషయములందును, అన్నివిభక్తులలోను, వచనములలోను మార్పు లేక ఒకేతీరుగ ఉండు శబ్దము అవ్యయము. అది ఎల్లన్, భూపతు లెల్లన్, మాకు నెల్లన్- ఎల్లను అవ్యయము.

**17.** అసంపూర్ణవాక్యము : చూ. పుట. 193.

**18.** అసమాపకక్రియ : (వాక్య.1) వ్యాపారావబోధకములు క్రియలు. అసమాపకము = ముగింపనిది. అట్టిక్రియ అసమాపక క్రియ. వాక్యమునందు ఆకాంక్ష పూర్తిగాకుండ- ఇంకను వేరొక క్రియను గూర్చిన ఆకాంక్ష కలుగునట్లు చెప్పబడినక్రియ, అసమాపక క్రియ. 'క్త్వా, తద్వ్యతిరేక, శతృ, తుమున్, చేత్, ఆనంతర్యార్థక ములు అసమాపకక్రియలు'- ఇవి ఆరు-'హంస లెల్ల పిండుగట్టి=ఏమి చేసె ననుతీరుగా ఆకాంక్ష ముగియకుండుటచే 'పిండుగట్టి' అను క్త్వార్థకము అసమాపకక్రియ.

**19.** ఆకాంక్ష : చూ. పుట. 193.

**20.** ఆసత్తి : చూ. పుట. 191.

**21.** ఇత్యర్థకము : (క్రియ.33) ఇతి అను(సంస్కృత)శబ్దము యొక్క అర్థము కలిగినది ఇత్యర్థకము. 'అని' అని యర్థము. 'అకా నిత్యర్థకం బగు' తెలుగున 'అకాన్' అనునది 'అని' (ఇతి)అనునర్థము నిచ్చునదై యున్నది. అపజయము కాన్ లక్షించి-అకాన్=అని.

**22.** ఇనన్నంతక్రియ : (వాక్య.18) ఇనన్ అనునది అంత మందు కలిగినక్రియ ఇనన్నంతక్రియ. 'చేదర్థంబునందును వృత్తం బగుభావలక్షణంబునందును నవర్ణకంబు ద్రుతాంతం బగు' అని యైన నన్(నను) అనుదానితో, 'భూతంబునం దిగాగమం బగు' అని పూర్వమున (ధాతువుచివర)చేరు 'ఇ'వర్ణమును గూర్చి 'ఇనన్' అని ప్రౌఢవ్యాకర్త వ్యవహరించును. (చేదర్థకము) వచ్చినన్- మొ॥

**23.** ఇప్రత్యయాంతావ్యయము : (సంధి.2) ఇ- అను ప్రత్యయము చివర కలిగినఅవ్యయము ఇప్రత్యయాంతావ్యయము. 'సమానాశ్రయంబులం బూర్వకాలంబునం దివర్ణకం బగు' అని ఇప్రత్యయము వచ్చును. ఇవి అవ్యయములు. వచ్చి, చూచి మొ॥ క్త్వార్థకమె ఇది.

**24.** ఉద్దేశార్థము : (ఉద్దేశ్యము) (కార.2) క్రియకు లక్ష్యభూత మగుట ఉద్దేశము. అట్లు లక్ష్యభూత మైనది ఉద్దేశ్యము. 'మముగుఱిచి అర్చన చేయగా' అర్చించుట అను క్రియకు 'మేము' లక్ష్యముగా చేసికొనుటచే=ఉద్దేశించుటచే ఇది ఉద్దేశార్థము. అట్లు ఉద్దేశింపబడినది కావున 'మేము'- ఉద్దేశ్యము.

**25.** ఉద్దేశ్యము : (వాక్య.6) ఉద్దేశించి చెప్పదగినది ఉద్దేశ్యము. ఇది చెప్పువానికిని, వినెడువానికిని ఇరువురకు తెలియును. క్రియలకంటె వేరగువిశేష్యము విశేషణము మొదలగునవి ఉద్దేశ్యములు. ఎవరిని గురించి (ఉద్దేశించి) చెప్పబడునో వారు ఉద్దేశ్యము. రాముడు వచ్చెను. ఇచట రాముని (గూర్చి) ఉద్దేశించి చెప్పుటచే 'రాముడు' ఉద్దేశ్యము.

**25.** ఏకార్థీభావసామర్థ్యము : (ఏకార్థీభావలక్షణ సామర్థ్యం తు ప్రక్రియాదశాయాం ప్రత్యేక మర్థవత్త్వేన పృథగ్గృహీతానాం పదానాం సముదాయశక్త్యా విశిష్టైకార్థప్రతిపాదకతారూపమ్) అర్థవంతము లై ప్రక్రియాదశలో వేర్వేరుగ నున్నపదములు సముదాయశక్తిచే విశిష్ట మగుఒక్కయర్థమును బోధించుట ఏకార్థీభావము. రామునిబాణము. రామునియొక్క బాణము అనురెండు వేర్వేరుగా అర్థము గలపదములు గలసి 'రామునికి సంబంధించిన దగుబాణము' అనుఏకార్థమును తెలుపును. కావున ఇచ్చటిది ఏకార్థీభావ సామర్థ్యము. (వృత్తి రేకార్థీభావః.) ఇట్టిచో సమాసము లగును.

**26.** ఒండె : (ప్రకీ. 6) ఒకపక్షమునందు అని అర్థము. లక్షణవిహిత మగుకార్య మొకపక్షమునం దగుట యనగా మరొక పక్షమునందు కాకుండుట అను రెండుస్థితులు. ఇట్టిది వైకల్పిక మను నర్థము నిచ్చును. 'ఊయేలాదులం దొలియచ్చునీదిహల్లునకు ద్విర్వచనం బొండె నగు' ద్విత్వము వచ్చిన పక్షమున- ఉయ్యేల. రానిచో- ఊయేల.

**27.** కర్తరి ప్రయోగము : (వాక్య. 5) కర్త, కర్మ, క్రియ కలిగినవాక్యము ప్రయోగము, అందు క్రియ (క్రియావిభక్తి) చే కర్త చెప్పబడు నేని అది కర్తరిప్రయోగము. 'రాముఁడు రావణుని చంపెను' ఇచట చంపెను. అనుక్రియ కర్త యగురాముని బోధించుచున్నది. కావున ఇది కర్తరిప్రయోగము.

**28.** కర్తృభూతక్రియ : (క్రియ. 27) కర్త అయినక్రియ కర్తృభూతక్రియ. వేరొకవ్యాపారమునకు కర్త అయినవ్యాపార మని అర్థము. "వలయ్వాదిక్రియలకుం గర్త యగుభావంబునందు నుశీ యగు' ను. 'వలయును' అనుక్రియకు కర్త యగుటచే 'వచ్చు' రాన్ అను (క్రియ)నది కర్తృభూతక్రియ.

**29.** కర్మణిప్రయోగము : (వాక్య.5) కర్త, కర్మ, క్రియ, కలిగినవాక్యము ప్రయోగము. అందు క్రియ (క్రియావిభక్తి)చేత కర్మము చెప్పబడె నేని అది కర్మణిప్రయోగము. 'రామునిచేత రావణుడు చంపబడెను. ఈప్రయోగమున చంపబడెను అనుక్రియ కర్మ అగు రావణుని బోధించుచున్నది. కావున ఇది కర్మణి ప్రయోగము.

**30.** కర్మప్రవచనీయము : క్రియామ్, ప్రోక్తవంతః కర్మప్రవచనీయాః. క్రియానిరూపిత మగుసంబంధవిశేషమును ద్యోతనము చేయునది, కర్మప్రవచనీయము. సంస్కృతమున అను మొ॥ వానికి

ఈసంజ్ఞ విధింపబడినది. తెలుగున గురించి కూర్చి ఇట్టివిగా కొందరందురు. 'పద్యమునుగూర్చి జపించెను. ఇట ఉద్దేశార్థమె కలదు. సంస్కృతమందలికర్మప్రవచనీయ మిందుకు భిన్నము.

**31.** కులకము : చూ.పుట. 195.

**32.** క్రియ : (వాక్య.3) క్రియ లనఁగా వ్యాపారావబోధకము లయినవి. క్రియ అనగా వ్యాపారము పని.శబ్దశాస్త్రమున పనిని బోధించునట్టిశబ్దమునకు క్రియ అని సంజ్ఞ. ఇట ధాతువు క్రియ. చదువు, పోవు మొ॥ క్రియ లనగా'వర్తమానాద్యర్థకము లైన సమాపకక్రియలు' లడాదిలకారములు అంతమందు గలది తిజంతము క్రియ. చదువుచున్నాడు. మొ॥

**33.** క్రియాజన్యవిశేషణము : క్రియనుండి యేర్పడిన విశేషణరూపము క్రియాజన్యవిశేషణము. ధాతువును క్రియ యని వ్యవహరించునపుడు క్రియాజన్యవిశేషణ మనునది ధాతుజవిశేషణమె. ఎడిప్రభృతివర్ణకాంతంబు లేమను ధాతుజవిశేషణంబులు. చదివెడు వాడు మొ॥ (చూ. పుట. 222)

**34.** క్రియాన్వయవాక్యము : చూ.పుట. 193

**35.** క్రియాప్రయుక్తవిశేషణము : చూ. పుట. 153

**36.** క్రియాఽభిన్నకర్తృకము : (వాక్య. 1) క్రియ లనగా తిజంతములు. క్రియాపదముతో భిన్నము కాని, అనగా సమానమైన కర్త కలిగినది. వాక్యమునందలిక్రియాపదమునకు ఏది కర్త యగునో అదే తనకును కర్తగా కలిగిన (అసమాపకక్రియ)ది. క్రియాఅభిన్నకర్తృకము. అసమాపకక్రియలలో క్త్వా తద్వ్యతిరేకములు తెలుచుగను, శతృ.తదర్థములునుఇట్టివి. 'హంసలు పిండుగట్టి తిరుగుచుండె' ఉండెను అనుక్రియకు కర్త యైనహంసలే కర్తగా కలిగిన కట్టి- క్త్వా, తిరుగున్ (శతృ)- క్రియాఽభిన్నకర్తృకములు.

**37.** క్రియావిభిన్నకర్తృకము : (వాక్య. 1) క్రియ

లనగా తిఙంతములు. క్రియాపదముకంటె వేరయినకర్త యేదో దాని కంటె భిన్నమైనది కర్తగా కలిగినది క్రియావిభిన్నకర్తృకము. అస మాపక్రియలలో (వృత్తంబగు) భావలక్షణము చేత్, అనంతరార్థక ములు ఇట్టివి. 'రాజ్యము తలఁగఁగ నలుఁడు నెలువడియె' వెలువడియె క్రియకు కర్త నలుఁడు. తలఁగఁగన్ కర్త రాజ్యము. కావున ఈభావ లక్షక అసమాపకక్రియ క్రియావిభిన్నకర్తృకము.

**38.** గుణప్రయుక్తవిశేషణము : చూ. పుట. 153

**39.** జాతిప్రయుక్తవిశేషణము: చూ. పుట. 153

**40.** తద్ధితము : (తద్ధి. 1) తద్ధితము లనగా విశేష్యవిశే షణము లగుశబ్దము లమీఁద భావాతద్యర్థములందు రాఁదగినప్రత్యయ విశేషము లని యర్థము. రామునితనము, పూజరి . తన- అరి మొ॥ తద్ధితములు (చూ.తద్ధితము పుట. 217)

**41.** తాదర్థ్యార్థకక్రియ : (సమా. 41) తస్మై కార్యాయ ఇదం తదర్థమ్, తదర్థస్య భావః తాదర్థ్యమ్) తదర్థము అనగా దాని కొఱకు, అది ప్రయోజనముగా అని యర్థము.అది ప్రయోజనముగా గలిగియుండుట తాదర్థ్యము .తుమర్థమే తాదర్థ్యము. ఆఅర్థమునం దున్నక్రియలు తాదర్థ్యార్థక(తుమర్థక)క్రియలు. 'తుమర్థభావలక్ష ణంబులందు నుజి యగు' చైత్రుండు వండఁ బోయెను. వండన్ = వండుటకొఱకు. అది (వండుట)ప్రయోజనముగా గలిగియుండుట (తాదర్థ్యము) అనుఅర్థముతో (నుజి యై) నున్న 'వండన్' అనునది తాదర్థ్యార్థకక్రియ.

**42.** ద్రవ్యప్రయుక్తవిశేషణము : చూ. పుట. 154.

**43.** ద్వికర్మకము : (క్రియ. 35) ధాత్వర్థఫలాశ్రయము కర్మ. కర్మలు రెండు కలిగినధాతువు ద్వికర్మకము. "అమగ్వాదులు ద్వికర్మకంబులు". చైత్రుడు మైత్రుని, పుస్తకమును

అడిగెను. మైత్రుఁడు, పుస్తకము అను రెండు కర్మలుగా కలిగియుండు టచే అడుగుధాతువు ద్వికర్మకము. (చూ. అముఖ్యకర్మ. పుట. 204)

**44.** ద్వ్యవయవక్రియ : (క్రియ. ౬౫) రెండు అవయవములు గలిగినక్రియ. క్రియ యనగా ఇచట ధాతువు. 'చననిచ్చు' ఇందు చను, ఇచ్చు అని రెండవయవములు గలవు. కావున ఇది ద్వ్యవయవక్రియ. ఇట్లె రావచ్చు. పోఁదగు మొ॥ అసమాపక క్రియలపై అగు మొ॥ చేరుటచే ఏర్పడినది ద్వ్యవయవక్రియ యని కొందరందురు.

**45.** ధాతువు : భూవాదయో ధాతవః క్రియావాచినః భ్వాదయః ధాతుసంజ్ఞాః స్యుః) క్రియను బోధించు భూ మొదలగు వానికి ధాతువులని సంజ్ఞ. తెలుగునను ఇట్లే క్రియను బోధించు. వ్యాపారావబోధక మైన ప్రకృతులకు ధాతువు లని సంజ్ఞ. తిను, చదువు మొ॥

**46.** నామ(పద)ములు : (వాక్య. 3) నామములు నా వస్తువాచకశబ్దములు. ద్రవ్య (లింగసంఖ్యాన్వయిపదార్థము) మును బోధించుశబ్దములు నామములు. ప్రథమ మొద లగునామవిభక్తులు చేరుటచే ఏర్పడిన పదము= నామవిభక్త్యంతము సుబంతము నామ (పద)మగును. ఇవే సందర్భవశమున కర్త లనియు, కర్మము లనియు చెప్పబడును. రాముఁడు, సింహమును వనమునందు మొ॥

**47.** నిత్యబహువచనాంతము ; చూ.పుట 135

**48.** నిత్యము : (నియమేన నియతం వా భవతి ఇతి నిత్యః) లక్షణముచే చెప్పబడినకార్యము లక్ష్యములందు నియతముగా తప్పక ప్రవర్తించుట నిత్యము. 'బహువచనశ్లిష్టంబు లై యద్విరుక్తంబు లయిన డకారలకారంబుల కలఘులకారంబు నిత్యంబగా నగు' ళకారము నియతముగావచ్చి-త్రాళ్లు.

**49.** **నిత్యైకవచనాంతము :** చూ. పుట. 134.

**50.** **నిర్దేశము :** (సంజ్ఞ.3) (నిర్దిశ్యతే అభిధీయతే అనేన ఇతి నిర్దేశః) నిశ్చయించి చెప్పుట నిర్దేశము. నిర్దేశవిధానోచ్చారణంబులం దఱచుగ అవర్ణామలు కారప్రత్యయాంతంబులును రవర్ణమిశ్రప్రత్యయాంతంబు నగు'. ఇచట ఉద్దేశించిచెప్పుట = దేనికి విధింపబడునో అది నిర్దేశము. 'అకారమునకు ఉకారము వచ్చును'. ఉకారము వచ్చుటకు నిశ్చయింపబడినది, ఉద్దేశింపబడినది కావున 'అ' నిర్దేశము.

**51.** **న్యూనవచనములు :** **52.** **న్యూనవచోవాక్యము :** (వాక్య.13). న్యూనవచనములు = ఐన, ఏని, ఏ, ఓ, మొ॥ ఐన మొద లగువానిని న్యూనవచనములుగా ప్రౌఢవ్యాకర్త వ్యవహరించెను. పరిమాణమున తక్కువ (అక్షరములుగల) మాట లని కావచ్చును. ఈన్యూనవచనములు ఉండనలసినవాక్యము న్యూనవచోవాక్యము. 'ఎవ్విధి నైన దక్కెనె' ఏని అనున్యూనవచనము గలది గావున ఈ వాక్యము న్యూనవచోవాక్యము.

**53.** **పదము :** (వాక్య.3) పద మనంగాఁ బ్రయోగార్హంబు ననన్వితంబు నేకంబు నర్థబోధకంబు నైనవర్ణము లేక వర్ణసము దాయము'. (వాక్యమునందు) ప్రయోగించుటకు తగిన దై, వేరొక శబ్దముతో సంబంధము లేకుండ, ఒక్కటిగా ఉన్నవర్ణము గాని లేదా వర్ణములసమూహము గాని పద మనబడును. మా.-రాముఁడు మొ॥

**54.** **పూర్వాగమము :** (శబ్ద.91) ఆగమం బనగా వర్ణాధిక్యంబు. అధికముగా వర్ణము(లు) వచ్చి చేరుట ఆగమము. విధింపబడుదానికి పూర్వమునందు అనగా మొదటగా వచ్చి చేరువర్ణము పూర్వాగమము, 'ఇరుగురు' ఇచట 'గు' రువర్ణమునకు పూర్వమందైనఆగమము, పూర్వాగమము.

**55.** ప్రతిపదోక్తావ్యయము : (చూ. పుట. 190)

**56.** ప్రధానము : (శబ్ద.6) 'విశేష్యంబు ప్రధానం బితరం బప్రధానంబు' విశేషణము అప్రధానమును విశేష్యము ప్రధానమును అగును. కర్తృకర్మాదిరూపమున క్రియతో అన్వయము కలిగి (యుండుట ప్రాధాన్యము) నది ప్రధానము. 'ఆర్తరక్షకు శ్రీరాము నభినుతింతు' (కర్మగా క్రియతో అన్వయము గలిగి) విశేష్య మగు శ్రీరాముడు ప్రధానము.

**57.** ప్రయోగము : (వాక్య.3) 'కర్తృకర్మక్రియలు గూడఁ బ్రయోగ మనంబడు' కర్త, కర్మ, క్రియ- గలిగినవాక్యమును ప్రయోగము అందురు. రాముఁడు రావణుని చంపెను. ఇట రాముడు- కర్త, రావణుని-కర్మ, చంపెను- క్రియ. కూడియున్నవి గావున ఇది 'ప్రయోగము'. క్రియ అకర్మక మైనపుడు అనగా అకర్మకకర్తరిప్రయోగమున కర్మ ముండదు. రాముడు వచ్చెను.

**58.** ప్రాచుర్యార్థము : (తద్ధి,18) ప్రచురముయొక్క- భావము ప్రాచుర్యము. ప్రచురము అనగా బహుళము, అధికముగా ఉపస్థితము. ప్రాచుర్య మనగా అధికముగా నుండుట. ఈఅర్థమునందు తెలుగున 'మయు' అనుతద్ధితప్రత్యయము వచ్చును. ప్రోవులమయము అధిక మైనప్రోవులు అనిఅర్థము. ఈప్రాచుర్యము 'నిండినంత' అగుట తెలుగున విశేషము. ప్రోవులమయము ప్రోవులతో నిండినది.

**59.** భావద్వంద్వము : (సమా.31) భావార్థకము లగు (కృదంత)శబ్దములకు చేసినద్వంద్వసమాసము భావద్వంద్వము. చెల్లుచెల్లములు, 'చెల్లుట', 'చెల్లము' యనుభావార్థకములకు ఏర్పడిన ఈ ద్వంద్వము భావద్వంద్వము భావద్వంద్వమున మొదటిది స్వార్థములో నున్నభావార్థకమును, రెండవది వ్యతిరేకార్థవిశిష్టభావార్థకము నగుట గమనింపవచ్చును.

**60. భూతకాలికాసమాపక్రియ :** (సంధి.2) క్త్వార్థకము మొ॥ అసమాపక్రియలు. భూతార్థమును తెలుపునట్టి, అసమాపక్రియ భూతకాలికాసమాపక్రియ. 'సమానాశ్రయంబులగు పూర్వకాలంబునం దివర్ణకం బగు' అని క్త్వార్థమున వచ్చునది పూర్వకాలమును తెలుపును గావున భూతార్థక మని ప్రౌఢవ్యాకర్త భావము. కావున క్త్వార్థకములె భూతకాలికాసమాపక్రియలు. వచ్చి, చదివి మొ॥

**61. మహద్ద్వంద్వము :** (సమా.38) మహత్తు లగుశబ్దముల కయినద్వంద్వసమాసము మహద్ద్వంద్వము మహత్తును, మహతియును. మహత్ అనుఏకశేషసమాసముచే గ్రహింపబడును. కావున స్త్రీ పురుష వాచకములకు ప్రత్యేకముగా గాని కలిపిగాని చేసినద్వంద్వము మహద్ద్వంద్వము. అన్నదమ్ములు (పురుష) అప్పచెల్లెండ్రు, (స్త్రీ) తల్లిదండ్రులు (స్త్రీపురుష).

**62. మహావాక్యము :** చూ.పుట.194

**63. యోగ్యత :** చూ.పుట.191.

**64. లాక్షణికావ్యయము :** చూ.పుట.190

**65. లుక్సమాసము :** (సమా,) (సమాసమనంగా సంయోగ దశయందుఁ గలిగెడువిభక్తిలోపాత్మకపదస్వరూపసంగ్రహము. ఇది లుక్సమాసవిషయము ) చూ.పుట.157

**66. లుగలుక్సమాసములు :** (సమా.38)విభక్తులు లోపించునట్టిసమాసము లుక్సమాసము. విభక్తులు లోపింపనిసమాసము అలుక్సమాసము. ఈరెండు అవస్థలును (భిన్నసందర్భములందు) గలవి లుగలుక్సమాసములు. అట్లు మొ॥ఇవార్థకములతోను,అట్టి మొ॥పదర్థకములతోను లుగలుక్సమాసము లేర్పడును. నారాయణునట్లు (నారాయణుని యొక్క+అట్లు) లుక్సమాసము. భూషణవిశేషణములంబలె (అలుక్సమాసము).

67. వర్ణకవ్యత్యయము : చూ. వ్యత్యయము.

68. వాక్యము : (వాక్య. 1,6) 'వాక్యము నా యోగ్యతాకాంక్షాసహితంబగునర్థము గలయాసత్తియుక్తపదసముదాయంబు' పదములఅర్థములకు పరస్పరసంబంధములో బాధ లేక (యోగ్యత) మీదిపదముయొక్క అర్థమును గూర్చినఆదరము ఆకాంక్ష)తో వెంటవెంటగా కలిసి (ఆసత్తి)యున్నపదముల సమూహము వాక్యము రాముడు రావణుని చంపెను. 'ఉద్దేశ్యవిధేయభిన్నంబు విషయంబు' విషయబోధకము వాక్యము' దేనిని గూర్చి చెప్పబడునో అది ఉద్దేశ్యము. ఏమి చెప్పబడునో అది విధేయము. రెండును గూడినది వాక్యము. పైని రాముడు ఉద్దేశ్యము, రావణుని చంపుట విధేయము. రెండు గూడిన అది వాక్యము.

69. వాక్యాంతరగర్భవాక్యము : (వాక్య. 21) వేరొక వాక్యమును తనలోపల కలిగినవాక్యము. కొన్నియెడల వాక్యంబు వాక్యాంతరగర్భంబు నగు' 'ఇందుల కెంతకాలం బయ్యె రాని కారణం బేమి' ఇట 'ఇందులకు రానికారణం బేమి' అనువాక్యము లోపల 'ఎంతకాలం బయ్యె' అను వేరొకవాక్య మున్నది. కావున పైవాక్యము వాక్యాంతరగర్భవాక్యము.

70. విధానము : (సంజ్ఞ. 2) (అప్రాప్తప్రాపణం విధానమ్) కార్యము కలుగజేయుట (విధానము). అట్లు కలుగఁజేయబడినది విధానము. 'అకారమునకు ఉకారము వచ్చును' ఇచట విధింపబడిన 'ఉ' అనునది విధానము, నిర్దేశవిధానోచ్చారణంబుల - అని కారప్రత్యయమై ఉకారము అని ఐనది.

71. విధేయము : (వాక్య. 6) (ఉద్దేశ్యమును గూర్చి) మీఁదఁ దెలియఁదగినది విధేయము ఇది వక్తకు (చెప్పువానికి) మాత్రమే(మొదట) తెలియును. క్రియ, విశేష్యము మొ॥ విధే

యములు. ఉద్దేశ్యమును గూర్చి ఏమి చెప్పబడునో అది విధేయము. 'రాముడు వచ్చెను' ఇట రామునిగూర్చి చెప్పబడిన- 'వచ్చెను' అను క్రియ విధేయము.

**72. విధేయవిశేషణము :** (కార. 14) దేని నైన (ఉద్దేశ్యమును) గురించి ఏమి చెప్పబడునో అది విధేయము. విశేష్యము. (కర్తకర్మల)నందలిజాతిగుణాదివిశేషము ను తెలుపునది విశేషణము. విధేయ మగువిశేషణము విధేయవిశేషణము. 'వాని నెఱుగు బ్రాహ్మణకులుగాన్' వానిని అనువిశేష్యము (కర్మ) ఉద్దేశ్యము. దానింగూర్చి అందలిజాతిరూప మైన విశేషమును విశేషముగా చెప్పుచున్నది గాన 'బ్రాహ్మణకులున్ అన్నది విధేయవిశేషణము.

**73. విభక్తిపరిణామము :** (కార. 26) విభక్తిపరిణామము అనగా విభక్తికి సంబంధించినమార్పు. లక్ష్యమునం దున్ననామ విభక్తి అన్వయానుగుణముగా వేరొక విభక్తిగా మార్పు చెందుట అని తాత్పర్యము. 'ఈతనితో సాటి యునంగ మే లన' -'ఈతనితో సాటి' అన్నపుడున్న తో అనుతృతీయావిభక్తి 'మేలు' తో అన్వయించునపుడు 'ఈతనికంటె మేలు' అనుతీరుగా పంచమీవిభక్తిగా పరిణమించుచున్నది.

**74. విశేష్యలక్షకము :** (శబ్ద. 12) లక్షణా (ముఖ్యార్థమునకు బాధకలుగగా కిరూఢి, లేదా ప్రయోజనమునుబట్టిఆ ముఖ్యార్థమునకు సంబంధించిన వేరొకఅర్థమును బోధించునట్టి శక్తిచే లక్ష్యార్థము నిచ్చుశబ్దము లక్షకము. అట్లు విశేష్యమును లక్ష్యార్థముగా తెలుపువిశేషణము విశేష్యలక్షకము. 'అప్రియంబులు కావించి' ఇచట అప్రియములు అను విశేషణము అప్రియము లైన'పనులు' అనుతీరుగా లక్ష్యముగా విశేష్యమును తెలుపుటచే అది విశేష్యలక్షకము.

**75.** విషయము : చూ, పుట, 193

**76.** వీప్స : (కార. 14) (క్రియాగుణద్రవ్యేషు యుగపద్ వ్యాప్తుమ్ ఇచ్ఛా వీప్సా) అనేకము లైనవస్తువులు మొ॥ వానియందు ఒక్కసారిగా వ్యాపించుకోరిక వీప్స. 'వీప్సయందును గాలపరిమితి యందును నామంబులకుఁ గుపర్ణకం బగు' గ్రామానికి గ్రామానికి- అనేకము లగు గ్రామములకు, ఇల్లిల్లు పోయిపోయి, పుల్లపుల్లగా, మొ॥

**77.** వ్యతిరేకార్థకభూతకాలికాసమాపకక్రియ : (సంజ్ఞ. 8) క్త్వా తద్వ్యతిరేకము మొ॥ అసమాపకక్రియలు. జరిగిపోయినదానిని తెలుపునది (పూర్వకాలికము) భూతకాలికము. వ్యతిరేకార్థముతో కూడిన భూతార్థమును దెలుపు అసమాపకక్రియ. వ్యతిరేకక్త్వార్థకము అని యర్థము. అదే అకప్రత్యయాంతావ్యయమునిఁకజీవ్యతిరేకక్త్వార్థంబునం దగు'- వండక- తినక -మొ॥

**78.** వ్యత్యయము : (శబ్ద. 51) **79** వ్యత్యస్తము : వ్యత్యయము (వ్యత్యాసము) అనగా విపర్యయము. తారుమారగుట. ముందరివర్ణము తరువాతగను, తరువాతివర్ణము ముందుగను అగుట. ఒక+అంత అనుచో 'ఒక'కు వర్ణవ్యత్యయమైన- కఒ, (అంత) కొ (అంత) కొంత అని యగును. ఇట్లు వర్ణములు ముందువెనుకలు తారుమారగుట వర్ణవ్యత్యయము. ఇట్లు వ్యత్యయ (వత్యాస)మును పొందినది వ్యత్యస్తము- క+ఒ=(కొ) అన్నది వ్యత్యస్తము.

**80.** వ్యస్తము : (శబ్ద. 4) వ్యస్త మనగా విడిగా, వేరుగా నున్నది. సమాసముగా వేరొకపదముతో గూడక ప్రత్యేకముగా నున్నపదము వ్యస్తము. 'రథములు డెబ్బదియొక్కటి, ఇందలి పదములు రెండును సమాసమును పొందక, వేరుగా నుండుటచే వ్యస్తములు.

**81.** వ్యాకృతి : **82.** వ్యాకరణము : (వ్యాక్రియన్తే వ్యుత్పాద్యన్తే అర్థవత్తయా ప్రతిపాద్యన్తే శబ్దాః ఇతి వ్యాకరణమ్-వ్యాక్రియన్తేవివిచ్య ప్రదర్శ్యన్తే ఇతి వ్యాకరణమ్) అర్థవంతముగా శబ్దముల నిష్పత్తిని గూర్చి చెప్పునది వ్యాకరణము. సాధు, అసాధుశబ్ద జ్ఞానమును కలిగించునది. ప్రకృతిప్రత్యయాదులుగా, వాక్యమును పదమును విభజించి చూపునది. కావున వ్యాకరణము. వ్యాకరణమె వ్యాకృతి ఉదా॥ రాము డున్నాడు, రాముడు+ఉన్నాడు, రామ-డు ఇత్యాదిగా నిరూపించునది గావున ఆశాస్త్రము వ్యాకరణము.

**83.** వ్యాసవాక్యము : (వాక్య.20) విస్తరించి చెప్పబడిన వాక్యము వ్యాసవాక్యము. 'ఇది యేమి?' ఎందులకుం బోయెదవని యడిగిన'- ఇచట 'ఇది యేమి' అనుదానిలోనిఅభిప్రాయమే విస్తరించి చెప్పున దగుటచే 'ఎందులకుం బోయెదవు' అనునది వ్యాస వాక్యము.

**84.** సంఖ్యాప్రయుక్తవిశేషణము : చూ.పుట.154

**85.** సంగ్రహవాక్యము : (వాక్య.20) వక్తవ్య మగువాక్యార్థమును సంక్షేపించి చెప్పువాక్యము సంగ్రహవాక్యము. 'ఇది యేమి? ఎందులకుం బోయెదవు?'- ఇచట ఎందులకు బోయెదవు అనువాక్యార్థమును సంగ్రహముగా చెప్పున దగుటచే 'ఇది యేమి' యనునది సంగ్రహవాక్యము.

**86.** సంజ్ఞాప్రయుక్తవిశేషణము : చూ.పుట.154

**87.** సంపూర్ణవాక్యము : చూ.పుట.193

**88.** సంయుక్తము, **89.** సంయోగము : సంయోగమును పొందినది సంయుక్తము. సంయోగ మనగా మేళనము- కలయిక. ఇచట (నడుమ అచ్చులు లేకుండ) అనేకము లయిన (ఒకటికంటె ఎక్కువ) హల్లులు కూడుట సంయోగము. 'క్ష'- క్ అనుహల్లు ష్

అనుహల్లుతో గూడుట సంయోగము. అట్లు గూడిన 'క్ష' అను వర్ణము సంయుక్తము. ఇట్లె త్మ్మ-మొ॥ (హల్లు అచ్చుతో గలిసిన అది సంయోగము గాదు. కాకి.)

**90.** సకర్మకకర్తరిప్రయోగము : (వాక్య.3) కర్త, కర్మ, క్రియ కలిగినవాక్యము. ప్రయోగము కర్మము కలిగినధాతువు సకర్మకము. అట్టి క్రియ(విభక్తి)చే కర్త తెలుపబడినచో ఆవాక్యము సకర్మకకర్తరిప్రయోగము. 'రాముడు రావణుని చంపెను' ఇచట చంపెను అను(రావణుని అనుకర్మ కలిగిన) సకర్మకక్రియ (విభక్తి) రాముడు అనుకర్తను బోధించుచున్నది. కావున ఈవాక్యము సకర్మకకర్తరిప్రయోగము.

**91.** సమస్తము : (శబ్ద.4) సమాసముగా కూడినది, సమాసగతము సమస్తము. 'డెబ్బదియొక్క రథములు' ఇచట డెబ్బదియొక్కటి, రథములు అనుపదములు సమాసముగా కలిసినవి. డెబ్బదియొక్క అనుపదమును రథములు అనుపదమును సమాసమునందున్నవి కావున సమస్తములు.

**92.** సమాపకక్రియ : (వాక్య 1)వాక్యార్థమున ఆకాంక్షా పరిసమాప్తిని కలిగించునట్టిక్రియ సమాపకక్రియ. క్రియ లనగా వర్తమానాద్యర్థకము లైనసమాపకక్రియలు. లట్- మొదలగు లకారములు =క్రియావిభక్తులు అంతమందు గలిగినది (తిఙంతము) సమాపకక్రియ. చదువుచున్నాఁడు సమాపకక్రియలనె క్రియాపదములు అందురు.

**93.** స్త్రీవాచకము : స్త్రీవ్యక్తిని బోధించుశబ్దము స్త్రీవాచకము. అమ్మ, సీత, ఈశబ్దములచే స్త్రీ వాచ్య మగుటచే ఇవి స్త్రీవాచకములు. వీనిని 'మహతి' (మహతీవాచకము) అనియు అందురు.

# రూపప్రక్రియామార్గము

**1.** ఆక్కడక్కడన్ : అక్కడన్+అక్కడన్ అని యుండగా (అత్తునకు సంధి బహుళముగా నగు' అను సూత్రముచే ప్రాప్తించుచున్న బహుళసంధిని బాధించి 'అచ్చున కామ్రేడితంబు పరంబగునపుడు సంధి తఱచుగ నగు' అను సూత్రముచే ప్రాయికసంధి వచ్చుచుండగా 'ఇకారాదులకుం దప్ప ద్రుతప్రకృతికములకు సంధి లేదు' అను నిషేధముచే సంధి రాదు.) 'ఆమ్రేడితంబు పరంబగునపుడు విభక్తిలోపంబు బహుళంబుగా నగు' అను సూత్రముచే విభక్తి(అన్) లోపించి- అక్కడ్+అక్కడన్-అక్కడక్కడన్. బహుళము గావున విభక్తి లోపింపనిపక్షమున సంధి లేదు గావున ద్రుతము మీఁది అచ్చుతో కలిసి 'అక్కడనక్కడన్ అని యగును.

**2.** ఇంచించుక : ఇంచుక+ఇంచుక అని యుండగా 'అత్తునకు సంధి బహుళముగా నగు' అనుసూత్రముచే బహుళసంధి ప్రాప్తించుచుండగా దానిని బాధించి. 'అచ్చున కామ్రేడితంబు పరంబగునపుడు సంధి తఱచుగ నగు' అనుసూత్రముచే వచ్చు ప్రాయికసంధిని బాధించి 'ఆమ్రేడితంబు పరంబగునపుడు విభక్తిలోపంబు బహుళంబుగా నగు' అనుసూత్రము నందలిబహుళశబ్దముచే 'ఇంచుక నాఁడిత్యాదులందు బహుళగ్రహణముచేత నంత్యాక్షరలోపంబు నగు' అనువివరణముచుబట్టి మొదటి శబ్దముచివరిఅక్షరము (క)లోపించి ఇంచు+ఇంచుక అని కాగా, 'ఉత్తున కచ్చు పరంబగునపుడు సంధి యగు' అనుసూత్రముచే సంధి అయి ఇంచించుక.' అంత్యాక్షరలోపంబును' అన్నచోటి సముచ్చయముచే లోపము రానిచో ఇంచుక+ఇంచుక అనియే యుండగా 'అత్తునకు సంధి' అనుసూత్రమును బాధించి 'అచ్చున కామ్రేడితంబు పరంబగునపుడు సంధి తఱచుగ నగు' అనుసూత్రము నందలి

తలుచుశబ్దముచే ఇచట సంధి వికల్పముగా వచ్చును. సంధి జరిగిన 'ఇంచుకించుక' లేని పక్షమున 'సంధి లేని చోట స్వరంబుకంటెం బరం బయిన స్వరంబునకు యడాగమం బగు' అనుసూత్రముచే యడాగమము వచ్చి 'ఇంచుక యించుక.'

**3.** కట్టెదురు : కడున్, ఎదురు అను శబ్దములకు సమాసము గలిగి కడున్+ఎదురు అని యుండగా 'సమాసంబునయందు ద్రుతంబునకు లోపంబగు' అనుసూత్రముచే ద్రుతము లోపించి కడు+ఎదురు అని యుండగా, 'ఉత్తున కచ్చు పరం బగునపుడు సంధి యగు' అను సూత్రముచే ప్రాప్తించుసంధిని బాధించి, 'కర్మధారయంబునం దుత్తున కచ్చు పరం బగునపుడు టుగాగమం బగు' అనుసూత్రముచే ప్రాప్తించుటుగాగమమును బాధించి 'కఱుచిఱుకడునడునిడు శబ్దములడల కచ్చు పరం బగునపుడు ద్విరుక్తటకారం బగు' అను సూత్రముచే డుస్థానమున 'ట్ట్' వచ్చి కట్ట్+ఎదురు- కట్టెదురు అని యగును.

**4.** నన్నడిగె : నన్నున్+అడిగె అని యుండగా 'ఉత్తున కచ్చు పరం బగునపుడుసంధి యగు' అనుసూత్రముచే సంధి రావలసి యుండగా, 'ఇఁకారములకుఁ దప్ప ద్రుతప్రకృతికములకు సంధి లేదు' అనుసూత్రముచే కలుగుసంధి నిషేధమును బాధించి 'ప్రథమేతర విభక్తిశత్రర్థచువర్ణంబులం దున్న యుకారమునకు సంధి వైకల్పికముగా నగు' అనుసూత్రముచే సంధి వికల్పముగా వచ్చును. సంధి వచ్చిన పక్షమున నన్నడిగె. వికల్పము కావున సంధి రాని పక్షమున ద్రుతము మీఁది అచ్చుతో కలిసి- నన్ను నడిగె.

**5.** దివి : దివ్- ప్రాతిపదికము. 'హలంతంబు ప్రథమైక వచనాంతతుల్యం బెందు నామం బగు' అనుసూత్రముచే స్వాః

